# శతకరత్నాకరము

ప్రథమ సంపుటము

ఇయ్యది

(శ్రీ తిరుపతి వేంకటకవుల)

శిష్యులగు

బ్రహ్మశ్రీ శతావధాని గుంటూరు వీరరాఘవశాస్త్రిగారిచే

పరిష్కరింపబడినది



ప్రకాశకులు:

గుండు సూర్యనారాయణ అండ్ సన్స్

శ్రీ వేంకటేశ్వర బుక్ డిపో, బెజవాడ

వెల రు 2—0—0

1930

రాజమండ్రి
1 వ పేజీ మొదలు 208 వ పేజీవరకు, రాజన్ ప్రెస్ నందున్ను
209 వ పేజీమొదలు 348 వ పేజీవరకు
శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయడుగారి
సరస్వతీ పవర్ ప్రెస్ నందు
ముద్రింపఁబడియె.

శ్రీరస్తు.

# పీఠిక

పాఠకమహాశయులారా !

1. ఈ శతకరత్నాకరమున ననేకమంది సుప్రసిద్ధ కవిశిఖామణులచే రచియింపబడిన భక్తిరసోద్బోధకములగు శతకరాజములు యిరువదియైదు యిందుగలవు. ఈ శతకముల రచియించిన అందరి కవులయొక్క కవితావిషయములు తెలియకపోయినను యీ గ్రంథమువలన బాగుగా గ్రహింపగల్గితిని. ఇందలి పద్యములు మృదుమధుర శైలిని పాఠకులకు నీతిని ప్రపంచప్రవర్తనమును భక్త్యుత్సాహములను నెలకొల్పి మోక్షలక్ష్మిని కరతలామలకముగ జేయుననుట నిస్సంశయము.

2. ఈ శతకములో నారాయణశతకమును భాగవతము రచించి జగద్విఖ్యాతి వడసిన బమ్మెరపోతనామాత్యుడని వాడుక గలదు. ఈ వాడుకకు ఆధారములగు పద్యములు యిందుగానరావు. గద్యమాత్రము పోతన రచించినటుల వ్రాయబడి యున్నది. కేవలమంతమాత్రమున నమ్మకము చిక్కకున్నది. పద్యములు పోలికబట్టి భాగవతపద్యముల సాదృశ్యముండుటచేత నే శతక కవులచరిత్రయందు పోతన రచితమేయని ప్రసంసించిరిగాని ప్రబలమైన ఆధారములు కనపడుటలేదు. దీనివిషయమై పెద్దలవలన తెలుసుకొనవలసి యున్నది. వ్రాతప్రతులలో అచ్చటచ్చట వున్నటుల జనశ్రుతివలన తెలియుచున్నది. ఏది యెటులున్నను యీ నారాయణశతకము భాగవతపద్యముల పోలికయుండుటచేత పోతన రచితమేయని నిర్ధారణచేయక తప్పినదికాదు. ఈ శతక కవులలో కాళహస్తీశ్వరమును రచించిన ధూర్జటి మనకు చిరపరిచితుడు! ఇందలిపద్యములత్యంతరమణీయకముగను భక్తిరసప్రపూరితముగను ద్రాక్షాపాకసమన్వితంబులై కాళహస్తి మహాత్మ్యమును స్ఫురణకు తెచ్చుచున్నవి.

3. ధూర్జటి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమున అష్టదిగ్గజంబులలో నొకడు. ఈతడు కడు వ్యభిచారిగా ప్రప్రథమమున సంచరించినట్లు, తదుపరిభక్తిమార్గమున శివునారాధించి ప్రపంచమును నిస్సారముగా నెంచినటుల యీ క్రింద నుదహరించిన పద్యము వలన తెలియనగును.

శా. రోసీరోయదు కామినీ జనుల తారుణ్యోరుసౌఖ్యంబులన్
బాసీపాయదు పుత్రమిత్ర జనసంపద్భ్రాంతి వాంఛాలతల్
కోసీకోయదు నా మనంబకటనీకున్ బ్రీతిగా సత్క్రియల్
చేసీ చేయదు దీనిత్రుళ్లణపవే శ్రీకాళహస్తీశ్వరా.

అని చెప్పియున్నాడు. యితరకవుల సందర్భము విపులముగా వ్రాయుటకు ప్రకాశకులు తగినంత యవకాశమివ్వక పోవుటచేతను స్వల్పకాలములో నిట్లు వ్రాయగల్గితిని. పునర్ముద్రణమున కవికాలనిర్ణయములతో సహా విశదీకరించెదను.

ఇట్లు,
శ్రీ రామలింగ వేంకటసుబ్రాయశాస్త్రి

# విషయసూచిక





శ్రీరస్తు.

# వేంకటేశశతకము.



దేవి యురమున శిరసునఁ దులసి భూ,
కాంతవీపునఁ బదాగ్రమున గంగ
కమలాసనుఁడు నాభిఁగాముండు మనసున
సవ్యవామాక్షుల శశియు రవియు
ధ్వజమున గరుడుండుభోపసులు కాంతుల,
సకలవాయువులు నాసాపుటముల
జగములు కుక్షిని జలధులు తరులందు,
ఘనరోమముల దేవగణము లెల్లఁ
గలిగి శోభిల్లు నీమూర్తిఁ దలఁచినీకు,
నీసశతకంబు చెప్పెదఁ జిత్తగింపు
కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ
విమల రవికోటిసంకాశ వేంకటేశ. 1

సీ. ధర్మంబుగలచోటఁ దలకొను జయమెల్ల, దయగలచో సుకృతంబు నిలుచు
సత్యంబుగలచోట సమకూరు శుభములు, నేమంబుగలచోట నిలుచు సిరులు
పాడిగల్గినచోటఁ బంతంబులీడేఱు, దాక్షిణ్యమున్నచోఁ దగులు మైత్రి
భక్తిచేసినచోట ఫలమిచ్చు దైవంబు, మనసునిల్చినచోట మలయు సుఖము
తే. లితరమగుచోట వెదకిన నేలయుండు, సారదినీదైనకృపగలచోటఁగాక, కలిత. 2

సీ. పరమనాస్తికునకు భక్తివాదము లేల, షండున కేటికి సతుల పొందు
పాపకర్మున కేల వరపురుషార్థంబు, ధనలోభి కేల బాంధవము చింత
మూర్ఖున కేటికి మొదలనే మొగమోట, మన్నృతవాడికిని మర్యాద యేల
వెట్టివానికి నేల విమలవిచారంబు, పరదూషకున కేల పరముచింత

తే. సరసునకుఁగాక వివరింపసద్గుణంబు, లెందుఁజూచినమందునకేలగలుగు,కలిత...3

సీ. తపసికి నేటికిఁ దలపోయ రోషంబు, బ్రాహ్మణునకు నేల పాపచింత
బుద్ధిమంతున కేల పొసఁగని సఖ్యంబు, పరమయోగికి నేల ప్రజలరచ్చ
మహారాజునకునేల బహుజనద్వేషంబుఁ కార్యవంతునకేల కడుఁ జలంబు
కీర్తికాముస కేల కెరలినలోభంబు, మంచివానికి నేల మంకుగుణము

తే. కీడుమేలునుమతివితర్కించిచూచి, భవ్యగుణములనినుఁగొల్చిబ్రతుకవలయు,కలిత

సీ. మరణంబు లేకుండ మందుచేఁ గలిగినఁ, గాలునకేటికిఁ గలఁగ బోఁటఁ
బాయంబు చెడనియుపాయంబు దొరకిన, నేయెడ ముదిమికి నేలతలఁకఁ
గామితార్థము లిచ్చుకామధేనువు గల్గఁ, గఱవున కేటికి వెఱచి యొదుఁగ
వజ్రదేహంబు గా వరము సిద్ధించిన, శస్త్రాస్త్రముల కేల జలదరింప

తే. శరణుసొచ్చినయటువంటి జనులకెల్లఁ,గావఁ బ్రోవఁగ దాతవు గలవునీవు, కలిత. 5

సీ. కులమువారల కియ్యకోలైన దిల్లాలు, వరుసతో రక్షించువాఁడు తండ్రి
ప్రియముతోఁ జన్నిచ్చి పెంచినయది తల్లి, తనకుఁ దోడగువాఁడు తమ్ముఁడరయ
నాపదం బెడఁబాపునాతండు బంధుండు, వంచన సేయనివాఁడె భటుఁడు
మోక్షమార్గముచూపుముఖ్యుండెయాచార్యుఁ, డాత్మనిష్టమానతఁడు సఖుఁడు

తే. ఎఱిఁగి వీరలతోఁ బొందు నెఱపవలయు, గుఱు తెఱింగినసద్వివేకులకునెల్ల, క...6

సీ. శౌర్యంబు గలుగుట జన్మసాఫల్యంబు, శాంత మాత్మవివేక సాధనంబు
మానంబు దనకును మహనీయ సంపద, సిగ్గుతో బ్రతుకు సంజీవనంబు
సవినయవచనంబు సర్వవశ్యకరంబు, వెలయునాచారంబు వెనుబలంబు
దానంబు సేయుట తన కది దాఁచుట, సజ్జనసంగతి సౌఖ్యమొసఁగుఁ

తే. గానబుధులీగుణంబులు మానకెపుడు, తగిలి మిమ్ముభజింతురుతలఁచితలఁచి,క. 7

సీ. ధర దేవతాలయ ద్రవ్యసక్తుఁడు గాక, తోడఁబడ బ్రాహ్మణద్రోహి గాక
చెనసి పతివ్రతాజనకాముకుఁడు గాక, వాఁడిమి నగరఁ గొండీఁడు గాక
గర్వముతోడ నొక్కట మదాంధుఁడు గాక, పరఁగ నవిశ్వాసపరుఁడు గాక
కుటిలవర్తనమునఁ గ్రూరచిత్తుఁడు గాక, సకలశాస్త్రములందు శఠుఁడుగాక

తే. మెలగనేర్చినయట్టిధార్మికునకెందుఁ,గలుగుశుభములుమీకటాక్షంబువలన, క. 8

సీ. గడుసరిఁ దాటోటుఁ గష్టు వేడుకకానిఁ, గలహప్రియుని ధూర్తుఁ గపటచిత్తు
సుంకరిఁ జూదరి జూటు ననాచారి, మునిముచ్చుఁ జలపాది ముడియవిడుపుఁ
గ్రుచ్చితు నపకారిఁ గుటిలాత్ము నవివేకిఁ, గైలాట కానిఁ టక్కరిం దుటారి
వేఁటకానిఁ బిసాళి వెట్టి నప్పులపోతు, మాయదారిని జారుమద్యపానిఁ

తే. జేరవలవదు మతిపొందుసేయఁ దగదుమానవున కర్థితోఁ గలలోననైన, కలిత,9

సీ. జలకంబు తగుపాటి జపము దేవార్చన బ్రాహ్మణసేవ పురాణగోష్ఠి
దానంబు చోరశాత్రవవినిగ్రహచింత; స్వజనగజాశ్వరక్షణము గణన
యాప్తమంత్రి పురోహితాలోచనంబులు, రాజ్యాదిధనవిచారంబు భుక్తి
సంగీతసాహిత్య సౌఖ్యానుభవములు, గూఢచారులకొల్వు గుప్తనిద్ర
తే. నలుపవలయును బ్రతిదినంబునందు, నయమెఱింగినయట్టి భూనాయకుండు కలిత. 1

సీ. అసలు విడచిన వలమటలే లేవు, నిర్ధనికుండైన నిర్భయుండు
పరహింస మానినం బాపంబు చెందదు భోగ మొల్లకయున్న బుద్ధి చెడదు
వెసం బరాధీనత విడిచిన ముడి గాదు, ధరం గోరకున్న బంధంబు లేదు.
మగువల రోసిన మరుబాధ లడరవు, మమత మానిన విచారములు లేవు
తే. గానసకలంబుం దలపోసి ఘనత మెఱసి, చెలంగు పురుషుండె మిగుల నిశ్చింతుండరయ క

సీ. వలపని వైర మెవ్వరితోడం గొఱగాదు, మెలంగి ధూర్తులయిండ్లు మెట్టజనదు
బుధుల నుదాసీనబుద్ధిం జూడంగరాదు, పాపంబు సొమ్మని పట్టంజనదు
బంధువిరోధంబు పాటింపం జెల్లదు, యేలిక కెదురాడ నెపుడు వలదు
ఆత్మ నమ్మినవారి నపహరించుట కీడె, యని మొననోడిన నదియ కొఱంత
తే. పదరం బనిలేదు నీతిసంపన్నునకును, బలిమినొయ్యన నానాంట బ్రబలవలయు క

సీ. పలుమాఱు శపథము ల్పలికెడు నాతండు, వూటలువడునట్టి పోటువాడు
కూటసాక్షులకును గురియైనయాతండు, నట నింటివారితో నలుగువాడు
విభుని రహస్యము ల్వెలిపుచ్చునాతండు, పరులచే లంచము ల్పట్టువాండు
కుడుచునింటికిం జేటు కోరెడునాతండు; మహి నుపకారంబు మఱచువాండు
తే. పడునధోగతి నిహమునం బరము లేక, కొఱుకునకుం బోయి బడిగంటం గూలుకరణి క

సీ. కోపంబు నడంచిన గురుతరాధ్వరఫల, మింద్రియజయము మహేంద్రపదవి
చలము వారించుట సామ్రాజ్యవిభవంబు, చాంచల్య ముడుగుట సకలసిద్ధి
వెస నహంకారంబు విడుచుట భాగ్యంబు, దైన్యవర్జనమె యుత్తమగుణంబు
నిందం బాసినయున్కి నిరుపమలాభంబు, ఋణవిముక్తుండౌనె హృదయసౌఖ్య
తే. మింతకంటెను మేలు లేదెంచిచూడ, మహితనీతిజ్ఞులైనట్టి మానవులకు కలిత

సీ. ఆచారవంతుం డౌనతండె విప్రోత్తముం డఖిలంబు రక్షించునతండు రాజు
వరుసతోం గార్యనిర్వాహకుండే మంత్రి, రుచిరవర్తనుండె పురోహితుండు
కడుం దిట్టదీవింపగలవాండె సత్కవి, యమృతహస్తుండు వైద్యుండఖిలదిశలం
బోటజ్జ మెఱింగిన పురుషుండు దళవాయి గణితజ్ఞుండగువాండు కరుణమరయ
తే. బురుషరత్నంబులనియందురు బుధులు వీరి, నితరు లెల్లను సామాన్యు లెంచిచూడ

సీ. తినఁదిన జిహ్వకు దీపైన మొగచాటు, సారెకుఁ బలుకుట చప్పదనము
కాంతలు చిక్కినఁ గడు వేసటైతోచు, నెంతసంపదగల్గె నంత చింత
కడువేడ జొచ్చిన గడగు లాఘవమెల్ల బాసలు దప్పిన బాటి చెనటు
ఇంటింటి కేఁగిన నెడయు బెద్దరికంబు, తనవాసి విడిచిన దఱుఁగు వన్నె
తే. మట్టుమీఱక లోకసమ్మతముగాఁగ, గట్టుతోఁ దుత మెలఁగిన గోటిసేయు కలిత
సీ. పరకాంతకై సింహబలుఁడట్లు మృతుఁడయ్యె రాజ్యలోభమునఁ గౌరవుఁడు డులిసె
బరుషోక్తులకు శిశుపాలుఁడు హతుఁడయ్యె, మహి నిజూదమున ధర్మజుఁడు నొగిలె
నలపాండురాజు వేటాడి శాపమునొందె, మునురావణుఁడు చలమునను సమసె
గ్రూరదండంబున గూలెను వేనుండు చదిసె బాణమున రాక్షసగురుండు
తే. ఘనవివేకులు వీరలగతులు దెలిసి, వ్యసనములు మాని నడువఁగవలయు నిలను
సీ. తనపురాకృతముచే దగులకపోరాదు బ్రహ్మవ్రాతకు మాఱు పలుకరాదు
పంచాస్త్రునస్త్రము ల్పట్టి చూడగరాదు, ప్రకృతిస్వభావ మాపంగరాదు
దైవికం బెల్లను దప్పింపగారాదు, కాలమెవ్వరికిని గడపరాదు
పోయినప్రాణంబు పొదపెట్టి తేరాదు, గతజలంబుల నడ్డకట్టరాదు
తే. ఏమిచేయఁగవచ్చు సర్వేశ్వరాజ్ఞ వరుస నెంతటివారికి వగవవలదు కలిత...18
సీ. కామాతురత్వంబు కడుసిగ్గుపడనీదు, భూతంబు సోకిన బుద్ధిలేదు
ఆకట నలగిన నచట నెక్కడిలావు, రోగంబు బలసిన రుచులు దలగు
గడగి శోకపువేళ గలుగదు హర్షంబు, రాజ్ఞ కెంతయును సౌఖ్యంబు దూర
మాఁకుబిడ్డలగన్నయపుడె పంతము వీడు, నుత్సాహ మెడలిన నుడుగుబలిమి
తే. యెందులకు నౌను సంసారి యేమి సేయు, గలిగెఁ దితొంటితనకర్మఫలముగాక కలిత
సీ. ఇల దొమ్మరిది జాతిహీనత యెంచదు, పూటకూళ్ళది పుణ్యమునకు జొరదు
జారకామిని తన చావు చింతింపదు నోరసిలంజియ మొగమాటపడదు
విరహిణి మదిలోన వెఱపువాటింపదు, చెలగి దూతిక క సిగ్గువడదు
పరగృహవాసిని పరనింద కోడదు, వడి సంతబసివి యెవ్వరిది గాదు
తే. ధర్మవిదు డిట్టివారల దగులకెప్పుడు, వెలయసన్మార్గవర్తియై మెలగవలయు కలిత.
సీ. కవితోడ నలిగిన గానిపద్యము జెప్పు, గడుముచ్చు దడవిన గన్నపెట్టు
ధనికునితో బోరిన దను జట్టిగాగొను, బశుకర్మ నోరసిన బదరిపోవుచు
బట్టుతో గినిసిన బలు తెఱంగుల దిట్టుమూర్ఖుని జెనకిన మురియగొట్టు
జేరి యమాత్యు మించిన భంగమందరించు మర్మజ్ఞు దొడరిన మదమడంచు
తే. నట్లు గావున నసమాన మైనవైర, మెట్టివారికి దగవుగా దెంచిచూడ, కలిత 21

సీ. ప్రాయంబు గలనాఁడె పంతంబు లీడేఱు, బలిమి గల్గిననాఁడె పరఁగు జయము
సంపదగలనాఁడె జరగు సౌఖ్యములెల్లఁ, దనువుగల్గిననాఁడె ధర్మ మెనఁగుఁ
బిలువుగల్గిననాఁడె ప్రియములు సిద్ధించుఁ, బోఁడిమిగలనాఁడె పొసఁగుమాట
మన్ననగలనాఁడె మనసు చేకూరును, జనవుగల్గిననాఁడె సరస మమరు
తే. మోసపోయినమతి రాదు మొదలిచంద, మెఱిఁగినడచినవాఁడెపో యెక్కుడెందు, కలిత.

సీ. ధరణిదారిద్ర్యంబు దైన్యంబు నొందించు, బహుభీతి కార్పణ్యపడఁగఁ జేయు
శంక యూరకమైన సరిదోడు వెదకించుఁ, బలులంపటుత్వము ల్భంగపఱచుఁ
దనసిగ్గు దనుదానె తలవంచికొనఁ జేయుఁ, జేసిననేరము చింతఁ గొలుపు
దడి నీచకృత్యంబు సహాయాన మొదవించుఁ, జెందివృద్ధత్వంబు శిథిలపఱచుఁ
తే. దనువిదారంబులివియుపోదర్పమణఁచు, నవ్విసట్లనే యెట్టిమానవునినైన, కలిత. 23

సీ. సంసారి కనుచరించకపోవ దధిపుల, నంగనాసహితుల కడఁగ రాదు
పుత్త్రవంతునకును బోదు యాచింపక, భువి గృహస్థున కాఁడి బొంకరాదు
క్షుధితున కేమేనిఁ గూడఁ బెట్టకపోదు, క్షేత్రవంతున కప్పు సేయరాదు
బంధుపోషకునకు భారమనకపోదు, దేహధారికిఁ గాంక్ష ద్రిప్పరాదు
తే. నరులకెల్లనైరాగ్యంబునడచుటెట్లు, రమణతోనినుగొల్చువారలకుఁగాక, కలిత...

సీ. సుముఖుఁ డౌటకు నవ్వుచూపులే యిక్కువ, మింపొంద మెచ్చుటకీవి గుఱుతు
కూడియుంట కోర్చుకొనుటయ సూచన, మన్నించుటకు మంచిమాట మెఱుక
వెస నమ్మటకుఁ జాడి వినకయుండుటె చిహ్నం, చేపట్టుటకుఁ బొరసినది సన్న
దయదలంచుటకును దప్పు మానుటెసాక్షి, లలినేలుటకు నింపు లక్షణంబు
తే. స్వామియగువాఁడు భటునకుఁజనవులొసగి, మనుపఁదలఁచినయట్టిసన్మార్గమిదియ క.

సీ. దయతోడదీనుని దైన్యంబు వాపుటఁ, జెడినమానవుని రక్షించికొనుట
పేదకునర్థంబు పిలిచి తానిచ్చుట, కడలేని యార్తుని గాచికొనుట
శరణుఁజొచ్చినవాని జనవిచ్చి మనుపుట, యెదుటఁ బడ్డయనాథు నేలికొనుట
చంపఁ దెచ్చినవాని చావుమాన్పించుట, యగతికుం డగురోగి నరసికొనుట
తే. లింతకంటెను బుణ్యంబులెందుఁగలవు, ధరణిపతులకునరియభూతలమునందు, కలిత.

సీ. చెఱుపరానిమనుష్యుఁ జెల్లదు కోపింప, వాఁడు చేఁజిక్కిన వదలఁజనదు
విశ్వాసి యగువాని విడుచుట యవినీతి, ద్రవ్యాపహారిని దగదు మనుపఁ
బాపాత్ముఁడైనట్టి బంటు నేలఁగరాదు, ధర్మాత్ము నలఁగింపఁ దగవుగాదు
బుద్ధిచెప్పినవాని బోలదు భర్జింప, నపరాధరహితుపై నలుక వలదు
తే. వరుసనాగస్థియధిపులువారివారి, గుణములెఱుఁగుచుఁగార్యంబుగొనఁగవలయు, క.

సీ. సముఁడైన శత్రుతో సంధిసేయుట కార్య, మెక్కుడైనను గప్పమిడఁగవలయుఁ
దఱి నల్పబలమైన దండెత్తఁగాఁదగుఁ, దొలఁగి దాఁగినను బోద్రోలవలయు
సిద్ధుఁడైనను భేద మొనఁగఁజేయుట యొప్పుఁ, గాకగర్వోలుగాఁ గడపవలయుఁ
జనకున్న శత్రువు సంహరించుటలెస్స, యొండె మూట్టడి చేసి యుండవలయు
తే. గమణ నీరీతిఁ దలపోయ రాజనీతి, యిట్లునడచిన విభుఁ డిల యెల్లనేలు, కలిత...

సీ. గరిమ నేలికలేనికయ్య మేడకు నెక్కు, నానాజ్ఞలేని రాజ్యంబు జడియు
బహుధనంబులు లేక బలమే పనికివచ్చు, బలములేని ధనంబు ప్రాఁతిగాఁదు
ధర్మంబు లేనియాస్థానమంతయు వృథ, సామునేరనిపోటు సరవిగాదు
సవరణలేని విశాలదుర్గంబేల, గట్టితాణెము లేనిగడి నశించు
తే. లంకెలొకటికినొకటికి లాగుదెలియ,వరుసదప్పక ధరయేలువాఁడెరాజు, కలిత....

సీ. చెఱయుఁగొల్లయు లూటి సీమలోలేకుండ, దండెత్తవలయు శాత్రవులమీఁద
గడ్డియు దవసంబుఁ గడు నీరు గల్గుచో, టరసి పొందుగ విడియంగవలయుఁ
గైకొన్నభూములఁ గాఁపుగాఁ దాణెంబు, లొసరించి మఱి యవ్వ లొత్తవలయు
గజము గుఱ్ఱము బంటు గాసి పొందకయుండ, లలిఁబోరఁబరగఁ గెల్వంగవలయు
తే. బుద్ధిఁబరరక యొప్పుఁడుభూమిభుండు, వెల్లనే బాహుశౌర్యంబు మెఱయుటొప్పు, క.

సీ. తనకుఁగా మును చెడ్డజనులను రక్షించి, యిల మేలు గోరినహితులఁ బ్రోచి
వడిఁ దోడు నవసినవారిని మన్నించి, బడిదిరిగినవారిఁ బ్రభులఁ జేసి
మిగుల దూఱులు పడ్డ మిత్రులఁ బోషించి, సరినర్థమిచ్చిన సఖుల మనిపి
యచటనుండి సహాయు లగువారి బ్రదికించి, ప్రీతివారలకు సంపద లొసంగి
తే. యెల్లవారలుజయవెట్టనేలుచుండి, వినుతి కెక్కిన యధిపుఁడు ఘనుఁడుదలఁప, క.

సీ. పతికి మాఱాడక పలుమాఱు నేడ్వక, యలుగక మిగుల నయ్యాళి గాక
తనుఁ దిట్టికొనక కాతాళించి కొంగక, మ్రిచ్చిలింపక పాపమునకుఁ జొరక
పొరుగింటికేఁగక పరు నాత్మఁ దలపక, కుపిత గాక పరానుకూల గాక
యదువదాఁచక మర్మ మవ్వలఁ జెప్పక, బొంకక నిద్దురపోతు గాక
తే. కాఁపురము నేయుకామిని గలిగెనేని, పలుకులేటికిపురుషుని భాగ్యమహిమ, కలిత.

సీ. ప్రాణంబుతో లంకెపాటిది తనసతి, ధనబుణంబులలంకె తనయుఁడరయ
సుఖదుఃఖముల లంకె సోదరిఁ దల్లియు దండ్రి, వారికిలంకెలు భ్రాంతిలెందు
భువి మానరక్షణంబునకు లంకె మఱంది, మెలత నొసగ లంకె మేనమామ
మేలు మీఁదటిలంకె మిత్రవర్గం బెల్ల, హర్షంబునకులంకె యల్లుఁడెపుడు
తే. వారివారికిదగినట్టివరుసదెలిసి, యరయవలయును యజమానుడైనవాఁడు, కలిత..

సీ. ఇహముసాధించుట యిలగీర్తివడయుట, సర్వంబుదెలియుట చదువుకొనుట
యనుభవించుటభోగముఖ్యపూజ్యుండౌట, నిధులుమెట్టుట కార్యనిపుణుడౌట
యర్థమార్జించుట యధికుతో సఖుఁడౌట, నుతికెక్క(బ్ర)కుట చతురుఁడౌట
పుత్త్రులఁగాంచుట పుణ్యంబుసేయుట, మురహరుఁ గొలుచుట ముక్తిఁగనుట
తే. యిట్లుమెరయనినరజన్మమేమి(బ్రాఁతి, సజ్జనులనేర్తురీయంచివిసరవిఁదియుగఁ, గలిత. 34
సీ. శక్తికిఁ దగనిదుర్జనము సేయఁగ రాదు, చదువక తర్కింపఁ జనదు సభల
నేరుఁగుతో వల దేలాట మాడంగ, నెనయని బాంధవం బెపుడు వలవ
దాదాయంబులేనివ్యయము చేయగను రాదు, సోపద్రవపుభూమి నుండఁజనదు
గడుసరి లోభిని నడుగుట కష్టంబు, దైవంబుమీఁద (గ్రోధంబు చెల్ల
తే. దెంతమాత్రింబుతనశక్తియంతమాత్రి, మరసియొనరించునాతండె యర్హుడెందు క.
సీ. ఇలనేటిదరి(మాని కెప్పుడు చలనంబు, నరనాథుపొరుగిల్లు నమ్మరాదు
పాముతో నడుపొందు పాటింపఁగా రాదు, దుర్జనసంగతి మాఱు ముట్టు
కడఁగి దయ్యముతోడి కాఁపురంబదికీడుఁ మహిదొంగతోఁ గొల్వుమరణమొదవుఁ
బరికింప నోడపై (బతుకు సందేహంబు, ఘనునితో సరసంబుగాదు జరప
తే. నరసికానివి వర్జించిమైనపనుల, నరుఁడు వర్ధిల్లవలయు నున్నతివహించి
సీ ఏలికతోడిపా టేమియైనను మేయి, తనయంతనున్న వచ్చినదిమేలు
సజ్జనగోష్ఠి నెచ్చట నిల్చినను మేలు, పరఁగ నందఱతోడి (బతుకుమేలు
నిజమాడ నెవ్వరు నిందించినను మేలు, వినయంబు గలుగుజీవనము మేలు
ధరమీఁద నిహపరార్థము చరించినమేలు, చిరపుణ్య మెంతచేసినను మేలు
తే. దుష్టబుద్ధులు మెలఁగెడిత్రోవవలదు, నియతివర్తన మెలఁగెడి నేర్పరులకు, క.
సీ. మానటీనికిని మై మఱవరా దెప్పుడు, నలయంగఁ గూడదు యాచకునకు
వేగులవానికి వేసటచెల్లదు, జోగికిఁ గాణాచి చోటువలదు
వెలిజాతివానికి వీరు వా రనలేదు, వెట్టివానికిఁ గూలి వేఁడఁ దగదు
జాజరకానికి సంకోచపడరాదు, మొగమోట దూతకు దగవుగాదు
తే. తగిన తమతమవర్తనఁదగినపాటి, నేర్చినట్లన (బతుకుటనీతి యెపుడు క... 38
తీనభక్తిపిజమైన దైవంబు మెచ్చును, మన సొక్కటైనను మలయు సుఖము
మాట మంచిదియైన మగువలు వలతురు, సాహసియైన నుత్సాహ మొనరు
బుద్ధిశాశ్వతమైన భువి యెల్లి నేలును, (బతుకనేర్చినను శుభంబు లొదవు
సరి నీవి గలిగిన జగమెల్లి వశమౌను, నుద్యోగపరుడైన నొదవు ధనము
చతురుఁడగువాని కెప్పుడు జగములోనఁ, జంజరింపక మెలఁగిన సకలజయము, క.

సీ. నడుమంత్రమా యిది నరుల యీకర్మంబు, నేఁటిదా జగము వర్ణించి చూడ
నెంచఁగవశములా యెండ్లెవ్వరికినైన, నడిగెనా జన్మంబు లొల్లమనిన
సాలీనిపోఁగులా సంసార పాశంబు, లల్పమా బ్రహ్మాండ మరసి తెలియ
నీటిపై వ్రాతలా నీరజాసను వ్రాత, లెఱిఁగె నాతత్వంబు లింతలోన
తే. నెంతవారికిఁ దెలియంగ నెట్లువచ్చు, నీప్రభావంబు లన్నియు నీక కాక, గలిత 40
సీ. మాంధాతకొనిపోఁడు మహిచేరెడైనను, గొనిపోఁడు రారాజు గొలుచుగొన్ని
నరుఁడు గొంపోవఁడు నవరత్నమొకటైన, శిబి గొనిపోఁడొక్క చిన్నమైనఁ
గొనిపోఁడు ఖచరుండు గోవునొక్కటియైన, వస్త్రంబుగొనుచుఁ బోవఁడు యయాతి
గుఱ్ఱమొక్కటినైనఁ గొనిపోఁడు నహుషుండు, గజముగొంపోవఁడొక్కటిని సగరుఁ
తే. డింక నేరికి సతములో నేలసిరులు, తా నొనర్చిన ధర్మంబె దక్కుఁగాక కలిత.
సీ. సుఖదుఃఖములనుబ్బి స్రుక్కులఁబొరయక, వనధికైవడినుండు వాఁడు యోగి
పంచేంద్రియముల పాల్పడి చలియింపక, గగనంబువలెనుండు ఘనుఁడు యోగి
యజ్ఞానరహితుఁడై యంధకారముఁ బాసి, యాదిత్యువలెనుండు నతఁడు యోగి
పరిపూర్ణుఁడై యుండి భావింపఁ జోద్యమై, పవనునివలెనుండు బలుఁడు యోగి
తే. బహువిధంబుల నీపాదభక్తి గలిగి, నెదరకుండిన యతఁడపో సిద్ధయోగి
సీ. అత్యాలసతయెందుకు నంటనీయఁడు శీలి, గుణములన్నిటిఁ బాపు గోపబుద్ధి
పిసిడితనం బిది పిమ్మటఁ దిట్టించు, గడునహంకారంబు కష్టపఱుచు
ముదిమియెవ్వరికైన ముందుదోపగనీదు, బాల్యముద్దండతఁ బ్రబలజేయుఁ
ధనకాంత మిక్కిలిదయతోడఁ బెడఁబాపుఁ, జలము కార్యవిచారసరణిఁ జెఱచు
తే. ఘనులుదలపోసియిటువంటిగతులుమాని, బ్రతుకుదురుదామునన్మార్గపదమునందు
సీ. తగిలి తాఁ జేసినధర్మంబు తలఁగాఁచు, దైవంబుగొలిచినఁ దన్నుమనుచు
జితకాముని తపంబు శీఘ్రమె ఫలియించు, సత్యమొక్కడనైనజయముఁజూపు
బ్రియవాక్యమందఱఁ బెనచిచుట్టముసేయు, మరితన్నుఁబొగడించు మంచితనము
కడిగండమణఁగించుఁ గలితాన్నదానంబు, జపముపాతకములసడలఁ జేయు
తే. నెఱిఁగినడచినసిద్ధించునిహముఁబరము,సులభమిన్నింటనినుగొల్చు సుజనులకును,క.
సీ. బహుపుణ్యుఁ డగువానిబ్రదుకది మంచిది, మనసుగెల్చినవాని మహిమమేలు
జ్ఞానంబుగలవాని జన్మంబు సఫలంబు, తప్పఁజెప్పని వాని తగవులెస్స
సమబుద్ధిగలవాని చరితంబు సమ్మతి, యుపమరి యగువానియునికి బాగు
వావిగల్గినవాని వర్తన శుభమిచ్చు, మేలెఱింగిన మెచ్చు వచ్చు
తే. భువికినిటువంటిమనుజుండు భూషణంబు, గలుగునీకృప నీరీతిఘనుల కెపుడు, క.

సీ. చాడికాఁడగువాఁడు సటలెల్లబోధించు,నందున కొఱలపై నలుగవలదు
పాతకుండగువాఁడు పరులనుదూషించు,శత్రువై తానవి వినఁగ వలదు
వెడదొంగయగువాఁడు విత్తంబు లీవచ్చు,బ్రమసి యాసల నివి పట్టఁ దగదు
మాయావియగువాఁడుమందుమంత్రము నేర్పు,మఱచి తప్పియు నవి మరగవలదు
తే. కర్తయగువాఁడుకపటులగతులు దెలిసి, యేమఱక రాజ్యమెప్పుడు నేలవలయు,కలిత
సీ. మోపరియెంతైన మోవ వేసారఁడు,సారది నాదాయమే చూచుఁ గాని
మహిగృహస్థుం డలమటలకు నోడఁడు,సాలవ కేపనికైనఁ జొచ్చుఁ గాని
కాలరినరుఁడు సుఖంబులఁ గోరఁడు,పరువుచే మే నలవఱచుఁ గాని
యటమటీఁ డెప్పుడు నప్పులఁ దెగితీయు,నుస రాన దిద్దక జుణుఁగుఁ గాని
తే. కడఁగి పీరల కీయోజఁ గర్మవశము,కర్మములునిన్నుఁగొలిచినఁ గాని తెగవు,కలిత
సీ. ఒకఁడు దాఁచినయర్థ మొక్కండు భుజయించు,నొకసతిమగఁడు వేఱొకతె కగును
గాయంబు నిలువదు కడుబ్రహ్మకైనను,జాయగొన్నాళ్ళది జవ్వనంబు
చదివినచదువులు సరి శరీరముతోనె,తలఁపులు మఱచినందనుక నుండుఁ
గులముదారిద్ర్యంబుఁ గొంచెంబుగాఁ జేయు వలపు వేసట యైన వదలివిఱుగు
తే. నేలబ్రమయంగ నెవ్వరి కేద నిజము చెలఁగి మిముఁ గొల్చువారిదచెడనిపదవి, కలిత
సీ. శత్రులమాటలు సతమని నమ్మక కాంతలకును గుట్టుఁ గాననీక
సమయమ్ముగాండ్రకుఁ జనవు చెలింపక తోడుఁబోతుల నిల్లు ద్రొక్కనీక
ఘనతంత్రదోహఁ గొల్వునకు రానీయక మొదలువంచకునకు మొగముగాక
పఱకఁ బోటూలకుఁ బెనపెట్టి కొని తెక దొరయనిహీనునితోడ నగక
తే. వదల కెచ్చరి యుండెడువాఁడు రాజు, జగతి వర్థిలునట్టి విచారపరుఁడు, కలిత.
సీ. మానంబెయెక్కుడు మఱియుఁ బ్రాణముకంటెఁ, దనక రియెక్కుడు ధనముకంటె
సాహసం బెక్కుడు సాముసేయుటకంటెఁ, బంతి మెక్కుడు ప్రతాపంబుకంటె,
నిలలోను దరత్వ మెక్కుడు సిరికంటె, బిర మెక్కుడు తనబిరుదు కంటె
సమరంబె యెక్కుడు సంధిమాటలకంటె, ధైర్య మెక్కుడు దొరతనముకంటె,
తే. వెలయనటువంటిగుణములు పీరవరుఁడు, కలఁడు వేయింటికొక్కండుకడమ లేఁడు,కలిత
సీ. నయశోపదులు తప్పు నడచు రేసియు వారి, వరుసగా దది కర్మవశముగాని
ధనికులు భోగింపఁ దలఁపఁ జాలమి వారి, బాగు గా దది జన్మఫలముగాని
పుణ్యులు పాపంబుపొంతఁ బోయిన వారి, గతులు గా వవి దైవికములుగాని
సుజనులు లోకనిష్ఠురు లైన నది వారి, జాడ గా దుత్పాతసరణిగాని
తే. రొఱేఁగి నడువంగ పొరలయిచ్చగాదు, ధర్మదేవత మెలఁగుచందంబు గాని, కలిత

సీ. చెలులసంగడి నున్నఁ జిత్తంబు చలియించుఁ, గనకంబుఁ బొడఁగన్నఁ గడఁగునాస
నురియ చేపట్టిన శూరత్వములు రేఁగు, నీచవర్తనుఁ బొందు నిందకొలుపు
నేలికతో మేల మెప్పుడు విషమించుఁ, బడుచుతో నవ్విన భంగపఱుచు
సభలోనఁ జొచ్చిన సడిమెల్లఁ బైకొను, నిటులఁ గూడినను వివేక మెడయు
తే. నెఱిఁగి యన్నియువర్జించి యేకతమున, నిన్నుఁదలపోయునాతండునిపుణుఁడండ్రు, క.

సీ. కొన్నిభూముల నెండ కొన్నిభూములఁ జలి, యొక్కనిమేలు వేఱొకనికీడు
వెలయుఁజుక్కలు రేయి వేగుఁబ్రొద్దునమాయుఁ, గొంతకాలముకల్మి కొంతలేమి
కప్పుమేఘము మింటఁ గడపట బయలౌను, జవ్వనంబగుమేను జదిసి ముదియుఁ
గాయలై యున్నవే కడపటఁ బండ్లౌను, గడుహీను లధికులై కానిపింతు
తే. రెంచిచూచినవెనుకముందెటులునుండుఁ, గలగవలవదుసహజంబుకాలగతులు, కలిత

సీ. భుజియించి నప్పుడే పోవు నాహారము, ల్వాసినగందంబు పొళ్ళురాలుఁ
గట్టినప్పుడెమాయు ఘనవస్త్రచయములు, ముడిచినప్పుడె వాడు ముడిఁగివిరులు
కలసినప్పుడె విడుఁ గాంతలతోఁ దమి, తొడిగినఁ ప్రేఁగులై తోఁచు సొమ్ము
లెక్కినఁ గడ నలయించు వాహనములు, వసము గానిధనంబు వడ్డి తొడుగు
తే. కలుగనేర్చునె నిత్యసౌఖ్యంబులిందు, నిన్నుఁగొలిచిన సుఖములు నిలుచుగాక, కలిత

సీ. తనకాప్తులగువారి దండ నుంపఁగఁ దగు, నధికశూరులదండు లంపదగును
మఱి ధనాఢ్యులకును మణివంబు లీఁదగు, హితుల వాకిలి గావ నిడఁగఁదగును
ఘనకార్యపరుల దుర్గములఁ బెట్టఁగఁ దగు, నిపుణుల నుడిగల నిలుపఁదగును
సముచితజ్ఞులవ్రాయసము వ్రాయుఁడనఁదగు, మాయావులఁదలార్లఁ జేయఁదగును
తే. మఱచి యల్పులఁదానమ్మి మనుపవలదు, గరిమధరలెల్ల నేలెడుఘనునకెపుడు, కలిత.

సీ. ఏనుఁగులా వెంత యిల మావటీఁడెంత, తిమిరంబుబల మెంత దీప మెంత
ఘనసముద్రం బెంత కర్ణధారకుఁ డెంత, బహుకాననం బెంత పరశు వెంత
పాఱెడునీ రెంత పర్వతంబది యెంత, హరుఁడెంత మృదులపుష్పాస్త్ర మెంత
భీకరఫణి యెంత వాకట్టువే రెంత, బహురాజ్య మెంత భూపాలుఁ డెంత
తే. యెవ్వరికి దొడ్డుకొంచెంబు లెంచరాదు, నడచు నిటువంటి వెల్ల నీనాటకములు, క

సీ. సరసులు పంతము ల్సభలోన నాడరు, వీఁగరు రణమున వీరవరులు
కలఁగ రేపట్టున ఘనవివేకులు మదిఁ, దప్పరు నీతి యుక్తములు పనులఁ
దలఁపరు పాపము ల్ధన్యులు గలనైన, నలయ రాచారంబునందు బుధులు
నిందింప రొరులును నిపుణులు వాక్రుచ్చి, తలఁపరు పరులకాంతల సుజనులు
తే. వదల రెప్పుడుఁ దమయిలువరుస గుణము, వసుధ వీరలు నీప్రభావంబుకతన, క.

సీ. వేలెన్ని పుట్టినఁ బెద్దగా బ్రదుకవు; చీమలు పొడమి నశించిపోవుఁ
చెదలు పుట్టలు వెట్టి శీఘ్రమె యడఁగును మిడుతలు వైళమె మించి మఱియు
నీఁగలు వడి మూఁగు నీడేఱ వెతైఁ, నల్లులు జనియించి నలిసిపోవు
దోమ లుద్భవ మది తోడనే పొలియును, గణుఁదుర్లు తుట్టలుగట్టి సమయుఁ
తే. బరఁగ నీరీతి దుర్జను ల్ప్రబలు లైనఁ, బరులఁ బీడించి చెడుదురు పాపములను, క.
సీ. మలసి యేఁటేఁటఁ బల్మఱును గూనలఁ బెట్టుఁ, గంటిమా ధరఁబిల్లికడుపునొకటిఁ
బాము గ్రుడ్లనుబెట్టుఁ బదియు నిర్వదియును, బ్రదికెనా భూమిపైఁ బాఁజులగుచు
బులులు పిల్లల నీనుఁ బొనఁగనాల్గును నైదు, నున్నవా మందలై యుర్వియందు
మకరంబు లెన్నైన మడుగులలోఁ బుట్టు, నెగడెనా గుంపు లై నేలమీఁదఁ
తే. గ్రూరసంతతి వెలయునే కొంచెపడక, విరివిగా ధర్మసంతతి వెలసినట్లు, కలిత. 59
సీ. పెంచంగఁ బెరిఁగెనా పృథివిపైఁ గొండలు, విత్తిరా యడవుల వివిధగతులఁ
గాలువ ల్వెట్టిరా ఘనసముద్రములకు, నేతంబు లెత్తిరా యేఱులకును
మేఁతలు వెట్టిరా మృగముల కెందైన మఱి యీఁత నేర్పిరా మత్స్యములకుఁ
బెండ్లిండ్లు సేసిరా బెరయంగఁ బక్షులఁ బూసిరా వాసనఁ బుష్పములకుఁ
తే. నెవ్వరెవ్వరిఁ బోషించి రెంచి చూడఁ, దలప నీదైన రక్షకత్వమునఁగాక, కలిత.
సీ. అధముని మొఱయైన నాలకించుట యొప్పు వినకున్న నానాజ్ఞ విఫలమగును
మెట్టి చూచుట యొప్పు మితిలేని రాజ్యంబుఁ బోకున్న నలజడిఁ బొందుచుండుఁ
దనసొమ్ము పలుమాఱుఁదలఁచి కన్గొనుటొప్పుఁ, గాకున్నఁ దెలియదు కలిమిలేమి
కలయు టొప్పును గు కాంతల వరుసతో మానినఁ బాపంబు తోన కలుగు
తే. మత్తుఁడై యున్నఁగార్యంబు మట్టుపడదు, వలసియొల్లమి సేయఁగవలదుపతికి, క.
సీ. పతిసేయుకార్యంబు భటులచేఁ గూడదు, భటులకృత్యంబు భూపతికిఁ దగదు
మగనిస్వతంత్రంబు మగువకుఁ జెల్లదు, మెలఁతవిధంబు పెన్మిటికి వలదు
మంత్రియెన్నంటు సామాన్యుఁడుండఁగరాదు, సామాన్యగతి నుండజనదు మంత్రి
కరణంబుతోఁ బగ కాఁపువానికిఁ గాదు, కాఁపుతోఁ బగ గాదు కరణమునకు
తే. నధికకృత్యంబు లధమునకమరవెందు, నధమకృత్యంబు లధికున కమరవెందు, క.
సీ. పదుగు రాడినమాట పాటియై ధరఁ జెల్లు, నొక్కఁ డాడినమాట యెక్కదెందు
నుఱక యుండినవాని కూరెల్ల నోపదు, నిజముముందఱఁ గల్ల నిలువ దెపుడు
చేసినచేఁత దాఁచినను బుట్టకపోదు, దేవతలకు నైనఁ దీఱ దాన
రాజు చేసినది ధర్మంబై ప్రవర్తిల్లుఁ, గపటాత్ముతోఁ బొందు కడకుఁ గీడు
తే. పుడమిలోకులు మెచ్చంగ నడవవలయుఁ జలముసాధింపఁ జెల్లదు సభలలోన క

సీ. పరువంబు మీఱిన బహుపుష్పజాతులు, పదను దీసినయట్టి పరిమళంబు
నలువదియేండ్లపై నరసినవనితలు, పాతఁ జల్లాఱిన భోజనంబు
మిగులఁ జెక్కుదుకూలమీఁదిటివస్త్రంబు, వెలయఁ దొంబదియేండ్ల వృద్ధగజము
ప్రాఁతపంచారమై పరఁగెడుగుఱ్ఱంబు, వెసఁ గార మెడలిన వీడెములును
తే. ఘనునకివియెల్ల భోగయోగ్యములు గావు, ... ... ... ... 64

సీ. నిర్మలు నొకధూర్తు నిందించుఁ గాకేమి, త్రోవలఁ గూయదే తొఱ్ఱఁ బులుఁగు
అధముండు సత్కవియండ నుఁడిననేమి, దొరలదే విరులలోఁ దుంగపోఁచ
కడఁగి యల్పుఁడు ఘనుఁ గారించుఁ గాకేమి, కలవదే యొకదోమ గంధగజము
దొరతోడ నీచుండు దొడరఁ జూచిననేమి, ప్రాఁకదే బలుమేడ బల్లిపిల్ల
తే. యీడుగాకున్నపనులవి యేలయెంచ, నందునకు నేమి తారతమ్యములు లేవె,క.

సీ. దుష్టు సూర్యునిదెస దుమ్మెత్తి చల్లినఁ, దనపైనె పడుఁగాక దాని కేమి
కొండతోఁ దగరు ఢీకొని యెంతతాఁకినఁ, దలవ్రక్కలగుఁ గాక దాని కేమి
మిడుతలు చిచ్చుపై వడి నెంతయెగసినఁ, దామె పొక్కడుఁగాక దాని కేమి
వలఁ బడ్డమీ నెంతవడిదాఁక బొరలినఁ, దనుఁ జుట్టుకొనుఁగాక దాని కేమి
తే. యెదిరిసత్త్వంబు తనసత్త్వమెఱుఁగలేక, పోరువాఁడెందునవివేకబుద్ధియంద్రు, క.

సీ. చెలఁగి యొక్కనిఁ జెఱచినవానిబ్రతుకును, గ్రూరుడై బలిమిఁ జేకొన్న పెండ్లి
కల్లలు పచరించి గడియించిన ధనంబు, దూఱుఁ బడునట్టి దొరతనంబుఁ
గపటవృత్తికిఁ జొచ్చి కైకొన్న రాజ్యంబు, దయలేక యుండెడుతపసితపము
నానతోఁ గైకొన్నయట్టిసన్న్యాసంబుఁ, గపటాత్ముదేవాధికారవృత్తి
తే. మనుపనెంతైననేరదుమరలిమరలి, తొలఁగనీయక దుర్గతిఁద్రోచుఁగాని, కలిత...

సీ. ఎలమిఁ బతివ్రత నెవ్వండుగోరినఁ, జెదలంటునే నిప్పుసీమలోన
ఘనజితేంద్రియుని నేకాంత డగ్గఱినను, గలుఁగునే జలరాశి కప్పచేత
ధర్మవర్తనుని బాతకు లేమఱించిన, నేఱునిద్రించునే యెందునైన
ధీరాత్ము నితరుండు తెమలింపఁగడఁగిన, గాలియొక్కనిచేతఁ గట్టువడునె
తే. యెందుననుధార్మికులకుఁగీడేలకలుగు,నిజగుణంబులుబలిమిమైనిలుచుఁగాక, కలిత.

సీ. పుచ్చకాయలు దిన్నఁబోమెడిమంత్రంబు, లిచ్చునే ఫలము లెందేరికైనఁ
గడప దాఁటఁగ లేనిబడుగైనగుఱ్ఱంబు, లెక్కునే పోఁజుపై నెందునైన
నాఁకలి యుడుపనియట్టి యాహారంబు బలియించునే మేను పటువుగాను
దగ విరజానది దాఁటనిదేవర, లొసఁగుదురే మోక్ష మూరకైన
తే. ధరణినన్నిటిసామర్థ్యమరసిచూచి, బలువుగల వెల్లఁజేపట్టి వెలయవలయు, కలిత,

సీ. జీలువు పెరిఁగిన మాలెకంబము గాదు, గొడ్డుఁ బెంచినఁ బాఁడిగోవు గాదు
ధరఁ బంచితం బెంత ద్రచ్చిన నేయిగా, దెండమావులును నీళ్ళైపుష్కు గావు
పరఁగ నల్కలు నూఱు బండిమోకిలఁ గాదు, కూరయెంతైనను గూర్మిగాదు
ఎనుపోతు ఘనమైన నెద్దులో సరి గాదు, కడు నశుద్ధపువాఁగు గంగ గాదు
తొండంబు గలిగిన దోమ యేనుఁగు గాదు, కోడి కోయిల గాదు కూత లిడినఁ
తే. ప్రబలి చూపట్టెనవి యెల్లఁ బనికిరావు, ధీరుఁడగు నాతఁడొక్కఁడే వీరుఁడరయ. క.
సీ. గోడపై సున్నంబు గోఁకినఁ బనికి రా, దొడలిపై వాసన యూర్చ రాదు
చేతఁ బట్టినయట్టిజిడ్డు లెక్కకు రాదు, కోకఁ బెట్టినగంజి కూర్చ రాదు
విసనకఱ్ఱలవన్నె విడిచిన నిల్వదు, బచ్చెనగచ్చు చొప్పడదు తివియ
ముగ్గు వెట్టినపిండి మొనని యట్లకు రాదు, మీసలపైఁ దేనె ప్రమింగ రాదు
తే. చూడఁ జూపట్టుసిరులెల్ల జూబులగుచుఁ, గొలఁదివెట్టినఁ దొంటిబాగులకు రావు, క.
సీ. కనకంబుపెం పొక్కగతి గానె భావించి, కామంబు క్రోధంబు గట్టిపెట్టి
తిట్టినతిట్టులు దీవనల్గా వినీ, యలశత్రు మిత్రుఁ గా నాత్మఁ దలఁచి
యట భూమి హేమపర్యంకంబుగాఁ బండి, భిక్షాన్నతృప్తిమైఁ బెంపు మిగిలి
కాషాయవస్త్రంబు కౌశేయముఁగఁ గట్టి, నిరతబ్రహ్మధ్యాననిరతుఁ డగుచు
తే. నేకతంబునమౌనిమై యిలఁ జరించు, నతఁడు సన్న్యాసియనియెంచ నర్హుఁడగును, క.
సీ. బలుమాలవాడలో బాఁపనిల్లుండునే, నిర్దయులో నేల నిలుచుఁ గరుణ
కప్పకా పెందును గల దని వింటిమే, పిఱికివానికి నేల బిరుదు గలుగు
బొగ్గునం దైలంబు పుట్టంగ నేర్చునే, యిలమీఁద మోడు సిగ్గేల తలఁచుఁ
గరలింప గాతికి గిలిగింత గలుగునే, కఠినచిత్తుం డేల కరఁగ నేర్చుఁ
తే. గలరు మఱి యిట్టివారలు కష్టజనులు, సరవిఁ దప్పింపవచ్చునే జన్మఫలము, కలిత
సీ. గాడిద యెఱుఁగదు గందంబువాసన, లే దూరఁబందికి లీల రోఁత
వాడకోడికి నాదివారంబు వలవదు, గ్రోఁతికి మఱి తాళిగోణమేల
చిఱుతని కేటికి శీలవంతులయుక్కి, యెద్దుకులచవి యెఱుఁగలేదు
వరుసతోఁ గుక్క దేవరబోన మెఱుఁగదు, మొసలికిఁ బడిసెంబు మొదల లేదు
తే. సహజమూఢులు నిటువంటిజాడవారె, వానిగుణములు దిద్దంగ వలవ దెపుడు క.
సీ. పోలించి దయ్యఁబు పుణ్యంబు లెంచునే, భయపడ్డవారలఁ బట్టుగాఁక
పాఱునే జేతచేఁ బడి దంచనపుగుండు, తనసూటిఁ దప్పక తాఁకుఁగాక
చిచ్చెంతఁ బోయిన సింగార మెంచునే, తనగాలివైపున దాఁటుఁగాక
తొలుకరివానలు దొరతనం బెంచునే, తగిలి బయట నున్నఁ దడుపుఁ గాక
తే. నీవు నెఱపిన మహిమలే నిఖిలమెల్ల, నట్లు గావలె నప్పటి కట్లయుండు, కలిత 75

సీ. మచ్చరించినవాఁడు మంచి మాటాడిన, వెంగె మైతోఁచును వెగటుపోవ
దపనమ్మి కైనవాఁ డటు దుడ్డు వట్టిన, మందుఁడందుదుగాని మనసు గొల్ప
దొడఁబాటు గానివాఁ డూరక మ్రొక్కిన, సందేహపడుఁ గాని సహజమెంచఁ
డనుమాన మైనవాఁ డర్థంబు లిచ్చిన, వళుకుఁగా నెంచు విశ్వాసపడఁడు
తే. ఏమి చేసినఁ గపటికి హితవుగాదు, మాఱు మలసినఁ బనులెల్ల మట్టుబడును, క.

సీ. అపవాది యగువాని నటుచంప వలవదు, తా నాడుకల్లలే తన్నుఁ జెఱుచు
సర్వకంటకు నేఁడు సాధింప వలవదు, వసుధవారలగోడు వానిఁ జెఱుచు
నతిమూర్ఖుఁ డగువాని నదలింప వలవదు, తనలోనికోపమే తన్నుఁ జెఱుచుఁ
గడునహంకారిని గా దనవలవదు, మేనిపై గర్వంబె మిగులఁ జెఱుచుఁ
తే. జెప్పవలవదు బుద్ధు లీచెనఁటులకును, సత్యవిదులకు ధర్మమే జయముగాన, కలి.

సీ. కామినీరతుల లోకమువారు నమ్మరు, పతితుల విడుతురు బంధుజనులు
గుణవిహీనుని వివేకులు మెచ్చ రింతైన, వేడబో రర్థులు విగతయశుల
హింసాపరులతోడ నెనయరు సాధువు ల్పురుషాధములపొంత బోరు బుధులు
విద్యారహితులను విద్వాంసు లోరయరు నృపులు చేపట్టరు చపలమతుల
తే. నుర్విమీఁదట నుత్తము లొక్క రాశి,యధములొక రాశియాగాదెయరసిచూడ,క.

సీ. కోరి దవ్వుల జూడ గొండలు నున్నన, చేరి డగ్గఱినను జెట్లు రాళ్ళు
బూరుగు ఫలవేళఁ బుట్టించు నాసల, నెక్కి కోసినఁ బండ్లనెగయుదూది
మిడుగుఱుఁబురువులు మెఱుఁగులైయుండును, గరఁచిచూచినను బంగారుగాదు
కప్పచిప్పలు వెండికరణిఁ గాంతులు మించుఁ, బుటము వెట్టించిన బూది చిక్కు
తే. నెదుటివారలసంపద లెన్నియైన, నడుగఁ బోయిన ఫలియింప వధములకును, క.

సీ. అపవిత్రమగునట్టి యన్నంబు గొనుకంటె, నడవిలోఁ దినుబలుసాకు లెస్స
హితశత్రువై యలయించుచుట్టముకంటెఁ, గైవసం బగుశునకంబు లెస్స
బహుదుర్గతులఁ ద్రోచు పరధనంబులకంటె, న్యాయార్జితము తారమైన లెస్స
యపకీర్తిభాజనం బగుభోగములకంటెఁ, జిత్తంబులో నాత్మచింత లెస్స
తే. సజ్జనులు మెత్తు రిటువంటిసరవు లెల్లఁ, దక్కినవియెల్లరుచులగుఁ దామసులకు, క.

సీ. భూమియే దేహంబు పోలించిచూచిన, రాజుప్రాణంబు శౌర్యంబు శిరము
గడియించినధనంబు ఘనతరాయుష్యంబు, మతి సత్ప్రధాని ధర్మంబు జోడు
కరచరణాదులు కరితురంగంబులు, ఘనవిచారమునీతి కరుణదేవి
బలు పైనదుర్గము ల్పంచేంద్రియంబులు, సరవిఁ జైతన్యంబు సర్వబలము
తే. కాలపురుషుండవై నీవుఘటన మెఱసి, చేయుచుండుదు రాజ్యంబుచెలగిచెలగి, క.

సీ. ఇచ్చకం బాడిన హిత మాను విభునికి; మఱి దిసంతడచిన మనసు విఱుగు
నోదిగివర్తించిన నోడబడి దయపుట్టు, బంతంబు మెఱసిన బగలు రేగు
నోర్పుతో గొలిచిన నొసగజూచు ధనంబు, లడుగగోరిన వేసటగును మిగుల
దలపుతో మెలగిన వెలయు సంతోషంబు, లెరవెరవైయున్న నెడయుభక్తి
తే. మంత్రియగువాడు కార్యక్రమమునని ట్లు, తెలిసినడచినశుభములు తేటపడును, క.
సీ. అడుసు చేతుల దివియగవచ్చు నొకవేళ, బలిసి యెండిన గడ్డపాఱ వలయు
నాకటివేళనే యన్నంబు రుచి యగు, దనిసిన నోకిలింతలు గడంగు
డలితోడ విత్తిన దఱుమగా బండు జే, నెపుడైన విత్తిన నీచబోవు
బంటు నాయావేళఁ బనిగొనవలె గాని యలవాటు దప్పిన నడిచిపడును
తే. వేళవేళల గార్యము ల్వేలయజేయ, వలయు నొకయింత దప్పిన వశము గావు, క.
సీ. అడవిలోపలిరాజ్య మదియెల్ల మనరాదు, బలువుఁడు పైకొన్న బాధసేయుఁ
గ్రూరవర్తనునైన గూర్చియేలుటదగుఁ, బగఱగూడిన వాడుభయమొనర్చు
గడినున్న వానితోఁ దొడరుచుండుట యొప్పు, నూరకుండిన నతండొత్త జూచు
బలుమాఱు బంటుల బౌజు జూచుట మేలు గర్వింతురిటువలె గాకయున్న
తే. నృపుల కేమఱి యుండుట నీతిగాదు, బహువిధంబుల నెచ్చరి బ్రతుకవలయు, క.
సీ. దానపాత్రుల కిచ్చుద్రవ్యంబు ఫలియించు, విటుల కొసంగిన విఫలమగును
మంత్రపూతాగ్నిహోమము తన్ను రక్షించు, బూడిదలో వేల్మి పున్నె మీదు
కాలోచితం బగుకర్మ మీడేఱించు, వేళదప్పినసంధ్య విధికి వెలితి
యొరులకునుపకార మొనరింప శుభమిచ్చు, బరపీడ చేసిన నరక మొదవు
తే. నెఱిగిచేసినధర్మంబు లెపుడు మనుపు, నెఱుక మాలినకృత్యంబు లేమి బ్రాతి, క.
సీ. హితబుద్ధి నడుగుమహీశుండు గల్గిన, దెలివి బోధించుమంత్రియును గలుగు
వెఱ పేమియును లేనివీరుండు గలిగిన, దగుపరివారంబు దానె కలుగు
బొందుసేయగ నేర్చుపురుషుండు గలిగిన ఘనుడైన చెలికాడు గలిగియుండు
ఘనరసస్థితి యెఱిగినవాడు గలిగిన, గడు మెచ్చ జెప్పెడు కవియు గలుగు
తే. వేసరక మంచివారిని వేడవలయు, దలచి చూచిన నివియెల్ల దైవఘటన, కలిత.
సీ. తొల్లి పెట్టనిమేలు తొరలి యిప్పుడు రాదు, కావలసినపను ల్గాక పోవు
చేసినకర్మంబు చెందక మానదు, రాగలయర్థంబు రాకపోదు
దైవసంకల్పంబు తప్ప దెంతైనను, దనువికారంబులు తగులు నెపుడు
లోకధర్మమునకు లోనుగా మనగాదు, తగినభోగంబులు తామె కలుగు
తే. వేగిరింపఁగ వలవదు విమలమతికి, సకలమున కోర్చియుండిన సౌఖ్యమొదవు, క.

సీ. నిక్కంబువలెనుండు నిండుసంసారంబు, మొలచినయట్లుండు మంచిసిరులు
కాయంబుదక్కనగతి నుండు దలపోయ, దనది యైనట్లుండు నొనరిగృహము
సతములైనట్లుండు సరసాన్న పానము, ల్వాయనియట్లుండు బాంధవంబు
లమరినట్లుండుదు రట బుత్త్రిపౌత్రిలు చేజిక్కినట్లుండుఁ జిత్తమెపుడు
దే. నింద్రజాలంబొ స్వప్నంబొ యిదియునొక్క, సిద్ధవిద్యయొ కంటి నీ చేతలెల్ల, క.
సీ. ధరలోన నావులు తమదూడలకునెల్ల, బెట్టినా వాములు ప్రియముతోడ
బొక్కలు త్రవ్విచ్చి పోయెనా నక్కలు, తమపిల్లలకు నిరంతరము నుండ
దలచి దప్పిక నీళ్ళుత్రావ గూనలకును గట్టినా చెఱువులు కప్పలెల్ల
బ్రియముతో రతి సల్పి బిడ్డల గనుమని చెప్పినా సింహంబు శిశువులకును
తే. వట్టిభ్రమతల దమపుత్త్రివర్గమునకు, దల్లిదండ్రులు దలతురు ధనము గూర్ప, కలిత
సీ. ముదిమి తీగెలువాఱి ముంచినకైవడి గడు మేన నరములు గానిపించు
దనమేను గనుగొని తానె నవ్వెడుక్రియ, మీసలు గడ్డంబు మిగుల నరయుఁ
బంచేంద్రియములకు బరగనోడితి నని వెన్నుచూపినరీతి వీపు వంగు
నుప్పతిల్లినమద ముబ్బు దీసినరీతి నేర్పెడు బుఱుపులై యెముకలెల్ల
తే. నిట్టిజరచేత జిక్కియు నెడ్డెనరుడు మనసుదనియక భోగించు మనసువెట్టి, కలిత...
సీ. కల్పవృక్షమునెంచి కలివెచె ట్టెంచుట తర మెఱుంగనివారి తగవుగాక
కావేరినది నెంచి కాలువ లెంచుట, పురుషుల యవివేక బుద్ధి గాక
కౌస్తుభమణి నెంచి కాచంబు నెంచుట, జడుల యజ్ఞానంపుసరవి గాక
మందరాచల మెంచి మఱితిప్ప లెంచుట, తప్పు దెల్పినవారి తగవుగాక
తే. ఘనుల నల్పుల నీరీతి గలయ గూర్చి, పలుకుచుండెడి వారల భ్రాంతిగాక, కలిత
సీ. సత్సంప్రదాయుడై శాస్త్రపారీణుడై యాగమజ్ఞుండై నయతడు గురుడు
పరమదయాళుడై పాపనిర్ముక్తుడై, యాచారవంతు డౌనతడు గురుడు
భూరిసుజ్ఞానియై బోధింపశక్తుడై, యతిశాంత చిత్తుడౌనతడు గురుడు
కడు దపోనిష్ఠుడై ఘనమంత్రసిద్ధుడై, యధ్యాత్మవేత్తయౌనతడు గురుడు
తే. తెలిసియిటువంటిగురు జేరివెలయవలయు, సుజనులగువార లీడేఱ జూచిరేని, క.
సీ. అర్థంబు దేహంబు నాచార్యసామ్మని, యా నాజ్ఞ దప్పక యాస్థ గలిగి
తగిన శుశ్రూషకు దను వలవడజేసి, మతి గల్గి యేప్రొద్దు మఱపు విడిచి
యుపదేశ మిచ్చి నట్లూహలం దలపోసి, యాహారనిద్రల కాసపడక
వేసర కాత్మలో విశ్వాస మెడలక, హరిభక్తి గురుభక్తినధికు డగుచు
తే. నున్న యాతండె శిష్యుడి ట్లుర్విమీద, బరగుశుభమూర్తియతిలోకపావనుండు, క.

సీ. దైవంబు గురుఁడును ధరఁ గల రని నమ్మి, తలపోసి మనుట యుత్తమమతంబు
కలుగు వేదము ముక్తిగలదు పుణ్యుల కని, మఱి భక్తిసేయుట మంచిమతము
యజ్ఞాదికర్మంబు లఖిలప్రపంచంబు, సత్యంబు లనుట నిశ్చలమతంబు
హరి మాయచేఁ జిక్కఁ డాతఁడే సర్వజ్ఞుఁ, డని భజియించుట యాదిమతము
తే. చదివి తెలిసిన పెద్దలసమ్ముఖమున, నెఱుఁగువారికి సఫల మా నీమతంబు, కలిత.

సీ. ఆఁకలివహిఁ పానిదై యుండనిచ్చునే, పిండిదైనను దినిపించుఁ గాక
శీతోష్ణములు కడుసిగ్గుతో నిల్పునే, ప్రేమఁ గంబళముఁ గప్పించుఁగాక
సరసకామము బ్రహ్మచర్యంబు నిల్పునే, పొంచి యొక్కతెఁ దగిలించుఁగాక
కోరి యాసలు మంచిగుణములు నేర్పునే, పాపచర్యకు నొడఁబఱుచుఁగాక
తే. యెంతవారికిఁ బంతంబు లెట్లు జరగు, మీకు శరణని బ్రతుకుటే మిగుల నేర్పు, క.

సీ. కుశలుఁడై ప్రతిమఁ జేకొని తీర్పవగుఁ గాని, తనరూపు చక్క దిద్దంగరాదు
మగువల వలపింప మందు గలదు గాని, మఱి దుర్గుణము మాన్ప మందు లేదు
క్రొత్తగా నొకజన్మ మెత్తఁగ దగుఁగాని, మహిఁ బూర్వదేహంబు మగిడిరాదు
కొలుచులు కృషిసేసి కూర్పఁబన్నదుఁ గాని, భుజియించినవి గాదెఁ బోయరాదు
తే. దైవకృత్యంబు లివియేల తప్పనిచ్చుఁ, నుఱకలోకులు భ్రాంతి సేయుదురుగాక, క.

సీ. సరకులు గొనవచ్చు సాధించి తేవచ్చుఁ, గోరి సుజ్ఞానంబు గొనఁగరాదు
తపము సేయఁగవచ్చు ధనముఁ జేకొనవచ్చు, భువి నగ్రజన్ముఁడై పుట్టరాదు
కాశికిఁ బోవచ్చుఁ గ్రమ్మఱి రావచ్చుఁ, దెలిసి సుషుమ్న భేదింపరాదు
మౌని గావచ్చు నేమములు చూపఁగవచ్చుఁ, జాటుమనసు నిల్పంగరాదు
తే. నేర్పు లేగతి నెవ్వరు నేర్చిరైన, సరవితో బ్రహ్మవేత్తల సరికి రారు, కలిత.

సీ. కాంచనపాదము గ్గజ్జెలు నందియ, గ్గడు మించుమొలఁ జంద్రకావిదట్టి
పీతాంబరముమీఁదఁ బిల్లలమొలనూలు, బిగియించి కట్టినపెనుకటారి
వరదానకరము నుజ్జ్వలకటిహస్తంబు, పటుశంఖచక్రోరుబాహుయుగము
నొఱప్పైననాభియు నుదరబంధ మురంబు, నలమేలుమంగతో హారములును
తే. శిరసుమకుటంబు తిరుమణి చిత్రమకర, కుండలమ్ములుఁగలమిమ్ముఁ గోరితలఁతు, క.

సీ. మాధవ గోవింద మధుసూదనాచ్యుత, వామన ప్రద్యుమ్న వాసుదేవ
కృష్ణ దామోదర కేశవ శ్రీధర, హరి విష్ణు పురుషోత్తమా నిరుద్ధ,
సంకర్ష ణాధోక్షజ త్రివిక్రమ పద్మ, నాభ జనార్దన నారసింహ
శౌరి హృషీకేశ నారాయ ణోపేంద్ర, తాలాంకముఖనామ తాళ్ళపాక
తే. యన్నయాచార్యసుతతిమ్మయాహ్వయుండఁ, బ్రణుతిఁ జేసితి రహిఁ గొమ్మపద్యశతము
కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ, విమలరవికోటిసంకాశ వేంకటేశ! 100

వేంకటేశశతకము, సంపూర్ణము.



శ్రీ ర స్తు.

# ఒంటిమిట్ట రఘువీర శతకము



కళ్యాణగుణాభిరామ విబుధశ్రేణీ కిరీటద్యుతి
వ్యాకీర్ణాంఘ్రి సరోరుహద్వయ సహస్రాక్షస్తుతా! యచ్యుతా
నాకుం బ్రాపును దాపు నీవెయగుచున్ నన్నేలుమీ రామభ
ద్రా కారుణ్యసముద్ర ధీర రఘువీరా జానకీ నాయకా! 1

శా. ఆకర్ణాటకమండలాధిపతిచే నాస్థానమధ్యంబులో
నాకావ్యంబులు మెచ్చఁ జేసితివి నానారాజులుం జూడఁగా
నీకుం బద్యము లిచ్చుచో నిపుడు వాణీదేవి నాజిహ్వకున్
రాకుం డెట్లు వసించుఁ గాక రఘువీర జానకీనాయకా! 2

శా. నీకేలన్ దృఢ మందివైన నదియున్ నిర్ఘాతపాతక్రియన్
గాకాకారవికారదానవుని లోకాలోకపర్యంత మీ
లోకంబుల్ పదునాల్గు ద్రిప్పినది కాలు నోర్వఁగానీక యా
రా కాకుత్స్థకులాగ్రగణ్య రఘువీరా జానకీనాయకా! 3

మ. సకృపాలోకన నందగోపుని తనూజుండవై గొల్లవై
సకలక్షోణులు నేలినాఁడ వట మించం గశ్యపబ్రహ్మకుఁ గ
న్నకుమారుండన మిన్నుముట్టి కురుచై నాఁడేలయాలీల నే
రక దానంబులు వేఁడుకొంటి రఘువీరా జానకీనాయకా. 4

మ. సకలామ్నాయములన్ బఠించుఫల మజ్ఞాతాత్మ నామంబులం
దొక టేదైనఁ బఠింపఁ గల్గు నటువంటుత్కృష్టపుణ్యప్రవ
ర్తననామంబులు చక్రపాణికి సహస్రంబుల్ సహస్రాభ మ
ర్కకులా నీశుభనామ మహార రఘు... 5

శా. కొంకన్ గారణ మేమి ధర్మములు పెక్కుల్ చేసి మర్త్యుండు నీ
వంకన్ జిత్తము నిల్పలేక పెరత్రోవల్ ద్రొక్కినన్ సర్వమున్

బొంకై (పోవు)తూలు కురంగనేత్రి తగునోముల్ వేయుచున్ నోచి తా
ఱంకాడంగఁ దొడంగినట్లు రఘు... 6

శా. ఆగారీశ్వర కీర్తనీయుఁడగు నిన్నర్చింపఁగా లేనివా
రో గుల్లాక నిజాలయోగు లయినన్ యోగ్యానుసంధానులే
మాగుర్వాన యథార్థ మాడితిని నీమంత్రంబె మంత్రంబురా
రాగద్వేషవిదూర ధీర రఘు... 7

మ. జగముల్ మూఁడు సృజింపఁ బ్రోవఁ బిదపన్ సంహారమున్ జేయఁగా
త్రిగుణాకారముఁ దాల్చినట్టివరమూర్తీ వాసుదేవాచ్యుతా
నిగమస్తుత్య పవిత్రగాత్ర నృహరీ నీలాభ్రవర్ణా మహా
రగతల్పా జనకల్పభూజ రఘు... 8

శా. నీచారిత్రము చెప్ప నద్భుత మగున్ నీనామసంకీర్తనం
బాచండాలునకైన మోక్ష మొసఁగున్ హత్యాదిదోషంబులన్
వేచించున్ విదళించుఁ ద్రుంచుఁ దునుమున్ వేఁటాడు నంటంబడున్
రాచుం ద్రోచు నడంచు నొంచు రఘు... 9

శా. తేజం బొప్పఁగ నీవె కావె మొదలన్ త్రేతాయుగాంత్యంబునన్
రాజైపుట్టితి వింక నీకలియుగాంత్యంబునన్ కాతవై
వాజిం దోలి విరోధులం దునుమ దేవా నీవ యొండెవ్వఁ డా
రాజున్ కాతును నీవె కావె రఘు... 10

శా. గాజుంబూస సురేంద్రనీలమణిఁగాఁ గల్పించుచందంబునన్
బాజుం జన్మముమీఁది(బే)జేగడపొరల్ బంగారు చేసేగతిన్
నాజన్మంబుఁ బవిత్రభాజనముగా నన్నేలరా యేలరా
రాజీవాక్ష కృపాకటాక్ష రఘు... 11

శా. నాజన్మాంతరవాశ నావశమునన్ నాపాలిభాగ్యంబునన్
నాజాడ్యంబులు పోవుకాలముతఱిన్ నాపుణ్యపాకంబునన్
ఈజన్మంబున నిన్నుఁ గొల్వఁ గలిగెన్ హీనుండఁ గా నింక నే
రాజన్ నాకెదు రెవ్వ రుర్వి రఘు... 12

శా. నేటం దీరె ననేకజన్మములనుండేనన్ను వెంటాడుచున్
వాటంబై చనుదెంచుపాపములు శ్రీవత్సాంక నీపంక నీ
పాటల్ పాఠము సేయువారికి మఱిన్ బాపంబులం బాపుఁ గ
ర్ణాటాధీశ్వర యొంటిమిట్టరఘు... 13

మ. పటునిర్ఘాతకఠోరనాదము ఘనబ్రహ్మాండభాండంబు బి
క్కటిలం జేయుచు వచ్చునప్పు డితరుల్ గాండీవినామంబు లె
న్నుట మే లందురు వైష్ణవుల్ తలఁప రన్యం గోరి యెంతెంతదు
ర్ఘటముల్ వచ్చిన నిన్నె కాక రఘు... 14

మ. కొడుకుల్ బ్రహ్మలు కూఁతు రీశ్వరశిరఃకూటంబుపైఁ గాపురం
బుడురాజుం దినరాజుఁ గన్ను లహిరా జుయ్యాలమంచంబు నీ
పడతుల్ శ్రీయు ధరిత్రియున్ సవతు చెప్పంగ పేరు? నీ కన్య లా
రడిమర్త్యు ల్గనలేరు కాక రఘు... 15

మ. వడిమీఱంగ నమోఘమై నిగుడు నీవాలమ్ము వాలమ్ముఁ దా
కెడునంచున్ మెడయొడ్డినన్ జమరిపైఁ గీల్కొన్నకారుణ్య మే
ర్పడ మున్నేసినయమ్ము వేఱెయొక నారాచమ్మునం ద్రుంచి పే
ర్పడి తౌరా విలుకాండ్రలోన రఘు... 16

మ. చెడుగన్ గష్టుఁడ దుష్టచిత్తుఁడఁ బర స్త్రీలోలుఁడన్ బాలుఁడన్
జడుఁడన్ మూఢుఁడఁ గొండెకాడను దురాచారి న్నిషేధాత్ముఁడన్
గడుసన్ గాకరి గల్లగుల్లఁ గపటిన్ గర్వి న్ననుం గావు మూ
రడి యున్నాఁడను నీవె దిక్కు రఘు... 17

మ. అడిగేవిద్యకు లోను చేసితివి నన్నావంతయున్ వంతలే
కడియాసల్ గొనుచుం దురాత్మకుల నే నర్థింపుచున్నాఁడ నె
న్నఁడు రక్షించెదు నీవు నన్ను బలె నెన్నం జేదవా యూద వా
రడిఁ బెట్టేవు రమావిహార రఘు... 18

మ. ప్రణుతింపన్ మృతదేహుఁ జూచి బ్రతికింపన్ బ్రహ్మరుద్రుల్ మరు
ద్గణనాథాదులు నోప రద్భుతము గాఁగ న్నీదుభృత్యుండు ల
క్ష్మణుప్రాణంబులు దెచ్చెఁ జచ్చినతఱిన్ సంజీవనీప్రక్రియన్
రణభూభాగములోనఁ దాన రఘు... 19

శా. ఏతాత్పర్యము గల్గి కొల్చెదవురా యేనేలనిన్నెంతురా
నీతో నాకుఁ బనేమిరా యనక మన్నింపందగున్ నన్ను నీ
చేతన్ మోక్షముగన్నవారి వినరా చిత్రంబుగా నిర్జరా
రాతిన్ నాతిని రాతిఁ దొల్లి ర... 20

శా. దాతల్ త్రాతలు తల్లిదండ్రులు మఱిన్ దైవంబు లాప్తుల్ చెలుల్
భ్రాత ల్దక్కినవారు చుట్టములు మీపాదాలమీఁద నా

దాతల్ భ్రాతలు తల్లిదండ్రులు మఱిన్ దైవంబు లాప్తుల్ చెలుల్
భ్రాతల్ సర్వము నీవె కావె ర... 21

మ. శ్రుతిపాథోధి మథించి శాస్త్రసుహిమ లోన్వేధించి యష్టాదశ
స్మృతు లాలించి మహేతిహాసకథలుం జింతించి తా రౌక్కస
మ్మతమై సన్మను లాచరించినమహామార్గంబు నీసేవ దు
ర్మతు లీమార్గముఁ గానలేరు ర... 22

మ. మతి నూహింపరు కొందఱీసుకృత మేమార్గంబు నందున్న ను
గ్రతపోధ్యానము సామగానమును దీర్ఘస్నానముల్ దానముల్
గ్రతుసంధానము నేల నేలఁ దులసిం గర్వమ్మెనో యూర నీ
ప్రతిమ ల్లేవా నమస్కరింప రఘు... 23

మ. సుతు లంచున్ హితులంచు బంధుజనులంచు న్దల్లుల న్దండ్రులున్
సతులున్ వారలు నంచు నెంచుకొనుచున్ సంసారమోహాబ్ధిలో
గతజన్మంబులఁ దేలుచున్ మునుఁగుచున్ గర్వించిరే నిన్ననా
రతముం గొల్వని మోసగల్లె రఘు... 24

మ. క్షితిలోఁ దామును బ్రహ్మసృష్టికిఁ బునసృష్టికిన్ వినిర్మించియున్
గ్రతువిఘ్నం బొనరించు దానవుల వీఁగం దోలఁగాలేక నాఁ
డతిబాలున్ నినుఁదోడు తోడుకొని పోఁడా గాధిసూనుండు నీ
ప్రతి వీరాగ్రణి యెవ్వఁ డింక రఘు... 25

మ. క్షితిలో నల్పులమీఁదఁ జెప్పిన కృతుల్ ఛీ! ఛీ! నిరర్థకంబులై
నుతికిం బాత్రము గావు మేఁకమెడచన్నుల్ నేతి బీఱాకులున్
వితతప్రౌఢిమ నీకుఁ జెప్పినకృతుల్ వేదాలు శాస్త్రాలు భా
రత రామాయణముల్ తలంప రఘు... 26

శా. సంతానంబును బారిజాతక మహీజాతంబు మందారమున్
జింతారత్నముఁ గామధేనువు సుధాసింధూత్తమంబున్ మదిన్
జింతింపన్ సరిగావు నీకు విజయశ్రీధామ యోరామ య
శ్రాంతత్యాగవివేకపాక రఘు... 27

శా. ఏదైవాల వరాల కంటె సులభం బెవ్వానికైనన్ దుదిన్
నీదాతృత్వము చెప్పఁ గొ్రత్తశరణంబేఁ గాతు వింతేల నీ
పాదాంభోజ రజంబు తాఁకియునన్ బాషాణంబు లీఁజాలు నా
రా దిక్పూరిత కీర్తిపూర రఘు... 28

శా. విందున్ వేదపురాణశాస్త్రముల గోవిందున్ ముకుందున్ హరిన్
విందున్ వేల్పునునైన భక్తసులభున్ విశ్వంభరున్ సచ్చిదా
నందున్ నందుఁడు కన్న చిన్ని శిశువున్ నాపాలిపాపాలిఁ బా
రందోలె నరసింహ నిన్ను రఘు... 29

శా. సందిన్ బూసలలోన నీకవిచరత్నా మంత్రరాజంబుఁ బెం
పొందన్ వ్రాసి ధరించి నాతఁడు రిపువ్యూహంబులో నైన నే
కందుం బొందక వజ్రపంజరములోఁ గాఁపున్న చందానఁ బా
యందోలున్ బగవారినోర రఘు... 30

మ. వృథగా దెవ్వఁడు నిన్నుఁ గొల్చినఁ గృపన్ వీక్షించి వాఁ డేమనో
రథముల్ వేఁడిన నట్లె సేయుదువుగా రఘూదిధేయుండవై
కథ గా దీవచనంబు నిక్కమటులం గాదేని మున్నేల సా
రథి వై తర్జును తేరుఁ దోల రఘు... 31

మ. ఘనసారంబును లోనికిం గొనిన శ్రీగంధంబుఁ బైఁబూసినన్
దినమున్ మర్దన జేసినన్ గడిగినన్ దృష్టంబులోనన్ దొలం
గనిదుర్గంధము నైజ మీామునికి డొక్కల్ నమ్మి నిన్గొల్వనే
రనిమూఢాత్ముల నేమి చెప్ప రఘు... 32

మ. ఇనుమా రాశ్రితు నిల్ప వాడ వినుమా రేమాటయున్ సాయకం
బినుమారాహవభూమిఁ బూన నిదిగా కింకొండు మేలంచు నీ
వినుమా రీదురితాంధకారపటలం బేరీతి వీక్షింతు వు
గ్రనిశాటాంతక రామభద్ర రఘు... 33

మ. మును నాకెన్నఁడు వేదశాస్త్రపఠనంబుల్ రిత్త తీర్థాటనం
బును దానంబును జేయఁబోను సతతంబున్ నిన్ను సేవించి కీ
ర్తన చేసేమతి లేదు దానమున కర్థస్వల్ప మింకెట్లు బో
రణ నాదుష్కృతముల్ తొలంగు రఘు... 34

మ. మును నాకెన్నఁడు దోసముల్ గలవు నొప్పింబొందకే
మనిన్ గాలునిపోటుబంటు లిఁక నన్నా బేరు నాపేరు పె
ట్టినవానిన్ బరలోకదూరుఁడని పట్టేదెట్లు పొండంచు బో
రన రమ్మా యిపు డడ్డగింప రఘు... 35

మ. అనఘం బైన దశాశ్వమేధకృత పుణ్యస్ఫూర్తి నీ కొక్కమా
టు నమస్కారము సేయఁ గల్గునని విందున్ యోగధర్మంబులున్

గానసాగుం జననంబు లొక్కమరి నీకుఁ బ్రమొక్కనేనిన్ బున
ర్జననం బేది తలంచిచూడ రఘు... 36

మ. దనుజారిజ్వాల నాంత కాసుర సముద్ర స్వామి వాయుత్రిలో
చనమిత్రాభవసూర్య సోమధరణీజాతాంబుజాతద్విష
జ్జనాంగిరసశుక్ర భానుతనయస్వర్భాను కేతు ప్రకీ
ర్తనముల్ నీవిభవంబు లౌర రఘు... 37

మ. కనుఁగొన్నప్పుడె గుప్పఁడే కుజనులన్ గాలుండు కాలుండు పొం
డనుచున్ రౌరవనారకాగ్నులఁ బడన్ హత్తించి యయ్యగ్నులన్
మునుఁగంజాలఁ బరేతరాజునకు నన్నొప్పింపఁగాఁబోకు ము
గ్రనిశాటాంతక రామభద్ర! రఘు... 38

మ. నిను సేవించెదనంచుఁ గోరుకొని యుండేవానికిన్ బూర్వక
ర్మనిమిత్తంబు..................నీవద్దమా
దని చెప్పంబడు ద్రౌపదిం గరిని బ్రహ్లాదున్ ధ్రువున్ మున్ను బో
రన రక్షించుట కల్లొ లేవొ రఘు... 39

మ. అనిశంబున్ నినుఁ గొల్చు మానవులు ప్రాణాంతంబునన్ రోగబా
ధనిమిత్తంబున రామరామ యనుచున్ వాక్రువ్వ లేకుండినన్
జననాథాగ్రణి నీవు వారి రసనాస్థానంబున న్నిల్చి భో
రన రామా యనిపింతు వౌర రఘు... 40

మ. ఇనవంశోత్తమ వేదశాస్త్రములలో నేవింటి నేవింటివాఁ
డును నీకుం బ్రతిగాఁడు నీకుఁ గలబంట న్నన్ను రక్షింపు కా
లుని బంట్లన్ విదళింపఁగావలయు నాలోనుండుమీ మెండుమీ
ఱ నమోఘాస్త్రమువిల్లుఁ బూని రఘు... 41

మ. జననాథాగ్రణి నిన్నుఁ గొల్చునతఁ డాచండాలుఁడైనన్ బున
ర్జననం బొందక ముక్తిఁ గాంచు నౌనరన్ సద్భక్తుఁడైనన్ దుర్
జనుఁ జండాల కులంబులోన నుదయించం గోరి నీనామకీ
ర్తన సేయన్ నిరసించెనేని రఘు... 42

మ. జనకుం డెవ్వఁడు నీకు నీకడుపులో సర్వంబు నుండంగ నీ
యునికిస్థానము దుగ్ధవార్ధి నడుమన్ యోగీంద్ర హృద్గేహ మే
మని వర్ణింపుదు నీమహాత్త్వముల సర్వాశ్చర్యముల్ పుణ్యావ
ర్తన రాజన్య యశోవిహార రఘు... 43

మ. జనకుండా జనకుండు నీసతికిఁ గౌసల్యా! యహల్యాఘమో
చననిన్ గాంచినతల్లి పంక్తిరథుఁడా సర్వేశ మీతండ్రి యే
మినిమిత్తంబున నుద్భవించితి[1]వో నమ్మేనెట్లు నీపుట్టు వు
గ్రనిశాటాంతక రామభద్ర! రఘు... 44

మ. హనుమంతుం డొకయబ్ధి దాఁటు నని యేలా ప్రస్తుతుల్ సేయఁగా
దనుజారాతి భవత్పదాబ్జములు హృత్పద్మంబున న్నిల్పినా
ఘనపుణ్యుండు భవాంబురాసులు తృణీకారంబుగా దాఁటు భో
రన దానింతయుఁ గొంకులేక ర ... 45

శా. నీపాదోదక మత్తులం దదుముకొంటిన్ గొంటి నాలోనికిన్
నీపళ్లెంబు ప్రసాదముం గుడిచితిన్ నీపేరునుం బెట్టితిన్
నీపెన్ముద్రలు దాల్చితిన్ భుజములన్ నీవింక నన్నేగతిన్
బ్రాపై ప్రోచెదొ కాని పూని రఘు... 46

మ. తపముల్ చేసినఁ బోనిపాపములు మంత్రంబుల్ సమర్థంబుగా
జపముల్ చేసినఁ బోనిదోషము నదీస్నానంబునం బోని ఘో
రపుకర్మంబులు వాయు నొక్కమరి శ్రీరామా యనేమాట క
ర్ణపుటం బించుక సోఁకనేని రఘు... 47

శా. కంపింతున్ మును దండధారికిని మత్కాయంబు వీక్షించి శం
కింపన్ గారణ మేమి నాకిఁక నినున్ గీర్తింపుచున్నాఁడ బల్
దుంపల్ గట్టినఘోరపాపముల సంధు ల్గోసివేసేతటిన్
అంపం బైనది నీచరిత్ర రఘు... 48

శా. నీమంత్రంబు సదా సదాశివుఁడు పత్నీయుక్తుఁడై కాశిలో
నేమంబొప్ప జపించునంచు[2] శ్రుతులన్నిన్ నిన్నె వర్ణింపఁగా
నేమా నిన్ను నుతించువార మయినన్ నేనేర్చిన ట్లెన్నెదన్
రామా రాఘవ రామభద్ర రఘు... 49

శా. నీమంత్రంబు జపించుమానవులకున్ నిశ్శ్రేయమా నర్థముల్
హేమంబు ల్గొడుగుల్ తురంగములు మత్తేభంబు లాందోళికల్
గ్రామంబుల్ నగరంబులున్ విభవమున్ రాజ్యంబులున్ రత్నముల్
రామా రత్నము లేమి తేక రఘు... 50

---

1 వి నెమ్మిన్నిట్టు లీపుట్టువు
2 శృతులు న్ని న్నెన్ని.

శా. గోమేధాధ్వర యశ్వమేధశతముల్ గోదానభూదానముల్
హేమాద్రుల్ తిలపర్వతంబులు సువర్ణాభాశ్వదానంబులున్
నీమంత్రం బగు నక్షరద్వయమునే నీపుణ్యముం బోలవో
రామా రాఘవ రామభద్ర రఘు... 51

శా. గోమాంసాశని మద్యపాని సగరిన్ గొండీఁడు చండాలుఁడున్
హేమస్తేయుఁడు సోదరీరతుఁడుఁ గూడేకాదశిన్ భుక్తిఁ గాం
చేమూఢాత్ముఁడు లోనుగాఁ గలుగు దుశ్శీలాత్ముఁ డైనన్ దుదిన్
రామా యన్నను ముక్తిఁ గాంచు రఘు... 52

శా. ఏమీ పాతకులార మాపురికి రా రీపుట్టునం దున్నత
శ్రీమైఁ బోయెద రెందుకన్న జమునిన్ గ్రేగన్నులన్ జూచుచున్
రామయ్యా యిఁక నంచు పల్కి యపవర్గస్వర్గముం జొత్తురో
రామయ్యా! నినుఁ గొల్చువారు రఘు... 53

శా. స్వామిద్రోహిని తమ్ముఁడెట్లు ఘనరాజ్యంబెల్ల నీవిచ్చు టె
ట్లామాటల్ విని కాదె నిన్ను నడిగేయాసక్తి నాకున్న దొం
డేమిన్ పల్మరు వేసరింప కిఁక నీ వీరాదె నీ సీమలో
గ్రామం బొక్కటి చాలు నాకు రఘు... 54

శా. మామాయంచును మామయంచు నెపుడున్ మాయల్లుఁ డుద్యద్గతిన్
హేమాద్రిప్రతిమాన మైన హరువిల్లేవిల్లు మోపెట్టఁగా
సామర్థ్యంబున మేటి యీతఁ డనుచున్ సత్వంబె వర్ణింపుదున్
రామా రాఘవ రామభద్ర రఘు... 55

మ. కమఠం గ్రాఁగినలోభివానితల పున్కన్ గుక్కమాంసంబు మ
ద్యముతో వండుకతిన్నమాలఁ డయినన్ దత్పాపకర్మంబులన్
యమకూపంబుల లోపలం బడఁడు జిహ్వాగ్రంబునన్ రామమం
త్రము, బేర్కొన్నను నౌర ధీర ర... 56

మ. యమకూపంబులలోపలం బడి మహాదైన్యంబునన్ బొందకుం
డ ముదంబారఁగ నన్నుఁ బ్రోచి కరుణన్ సాయుజ్య మిమ్మా తుదిన్
క్రిమిరూపుం దనరూపుగాఁ బెనిచి రక్షింపన్ విచారించున
భ్రమరంబుంబలెఁ బాపదూర రఘు... 57

మ. మమకారంబున సర్వకాలమును నీమంత్రంబు వాక్రుచ్చు చం
దము నాకుం గలుగంగని మ్మటులనైనన్ మృత్యువక్త్రమ్ము దూ

అము నిన్నుౝ మతి దూఱ మంత నపవర్గస్వర్గమార్గంబు దూ
రము గాకుండును మాకుఁ జేర రఘు... 58

మ. తమగర్వంబున వారు మూఢులగుచుౝ దైవంబు మంత్రంబు తం
త్రములన్ వీడఁగ నాడుచుౝ దిరుగు నిర్భాగ్యుల్ మహారాజులై
మము నూరింపఁగ నేము నిన్నెఱఁగి నీ మంత్రం బెఱింగిౝ దరి
ద్రమతిన్ వేడఁగఁబోవు టెట్లు రఘు... 59

మ. హిమధామప్రతిమాన కాంతియుతులై యింద్రాది దిక్పాలకుల్
తములౝ స్తోత్రముజేయ నుండుదురు నీదాసానుదాసుల్ సుర
ప్రమదాపల్లవ పాటలాధర సుధాపానాది కేళీవిహా
రములౝ మీఱుచు మీరుచూడ రఘు... 60

శా. మిమ్ముం గొల్వఁదలంచి పాపముల నెమ్మిం జూఁపినా నింక నే
నెమ్మిౝ సౌఖ్యముఁ బొందువాఁడ నగుచుౝ నీమూర్తి భావించెదన్
రమ్మా వీని తలంపు మేలని కృపౝ రక్షింప నాలోనికిన్
రమ్మా నన్నుఁ గృతార్థుఁజేయ రఘు... 61

మ. ప్రమదారత్న మహల్య గౌతముని శాపప్రాప్తిఁ బాషాణరూ
పముతోఁ బెక్కుయుగంబు లుండఁగ హర బ్రహ్మాదులుం బాపలే
నిమహాపాపముఁ బాపనోపినది కా నీపాదరేణుప్రకా
రము నేనేమని సన్నుతింతు రఘు... 62

శా. నాయజ్ఞానముఁ బాపుమంచు మదిలో నానాప్రకారంబులౝ
గూయం గూయ నదేమిరా యనవు నీకుౝ మ్రొక్కనా కుక్కనా
ఛీ యం చేటికి రోతగించెదవు నీచిత్తంబు రాకుండినౝ
బ్రాయశ్చిత్తము నాకు నెద్ది రఘు... 63

మ. నియమం బొప్ప ననేక జన్మములనుండిౝ దాఁచుకొన్నట్టి సం
చయదోషంబులు మాటమాత్రమునఁ గొంచుం బోవు చోరత్వ మె
న్నియుపాయంబుల నభ్యసించినదియో నీనామముల్ వేయు నా
రయలీల న్వివరించు టెట్లు రఘు... 64

శా. తారుణ్యోదయ యొంటిమిట్ట రఘునాథా నీకు నేఁ బద్యముల్
నూఱున్ జెప్పెద నూరఁ బేరువెలయన్ నూత్నంబుగా నంత నా
నోరుం బావన మౌను నీకరుణఁ గాంతున్ భక్తి నన్నందఱుౝ
రారమ్మందురు గారవించి రఘు... 65

శా. చీరల్ దీయకు చన్నుగుబ్బలపయిన్ జీకాకుగాఁ గాకుగా
జేరన్ దీయకు మందబోయఁ డిదె వచ్చెఁ బొద్దు రావద్దురా
జారల్ మేరుల జారలం గవయు కష్టా ఏకపత్నీ వ్రతా
ప్రారంభం బిపు డేల నీకు రఘు... 66

మ. తిరునామంబు ధరింపఁడేని నొసలన్ దిక్పూరితం బైననీ
వరనామంబుఁ దలంపఁడేని మదిలో వాంఛించి నీపాద వం
కరుహ శ్రీతులసీదళోదకముఁ ద్రాగఁడేని వాఁ డేటినే
ర్పరి వైకుంఠపురంబుఁ జేర రఘు... 67

మ. శరణం బన్నను మాటమాత్రమున విశ్వద్రోహితోఁ బుట్టుకున్
గరుణాపూర్ణవిలోకనం బొదవ లంకారాజ్య సింహాసన
స్థిరపట్టం బొనరించినాఁడ వట యేదేవుండు నీ సాటి యు
ర్వరలోనన్ భవరోగదూర రఘు... 68

మ. పరనారీ కుచకుంభ పాలికలపై బాదాబ్జ యుగ్మంబుపై
గరమూలంబులపై గపోలతటిపై కంఠంబుపై గొప్పుపై
బరువుల్ వారెడు నాతలంపులు మిమున్ భావింపఁగాఁ జేసిన
ర్వరసాధీశ్వర నన్నుఁ బ్రోవు రఘు... 69

మ. నరకుల్ గ్రాఁగిన యిన్పకంబముల నంటం గట్టఁగాఁ గొట్టఁగాఁ
జొరలం బొర్లఁగఁ గక్కు జాలఁ గొని వీఁపు ల్గోయఁగా వ్రేయఁగా
నరకావాసులలోన నుండుదురు నీనామంబు వర్జించి దు
ర్మరణంబు ల్గని చన్నవారు రఘు... 70

మ. పురసంహారునిచాపమున్ జివుకుదంబున్ ద్రుంచి పోవైచినన్
పరశూదగ్రభుజుండు పోవికుచునే భజించుఁ గాకంచు ని
ష్ఠురముల్ పల్కిన భార్గవున్ నిజబలాటోపంబు వారించి ని
ర్భరశాంతంబునఁ గాచితౌర రఘు... 71

మ. స్మరసంహారుఁడు గోరి పొత్తున భుజింపన్ బిల్వ నే రాను శ్రీ
హరినామంబులు వేయు నెన్నతనె నిత్యంబైననో మన్న నో
యరవిందానన వేయునేమిటికి రామా యన్ననుం జాలు మం
త్రరహస్యంబుఁ దలంతు నేను రఘు... 72

శా. బాలత్వంబునఁ గొంతకాలము వృథా పాపంబు దుర్బుద్ధినై
చాలం జవ్వనమందు గర్వమతినై సంసారినై దుష్క్రియా

జాలభ్రాంతిఁ జరింతుగాని నినుఁ గాంక్షం గొల్వలే దయ్యో హే
రాళం బైనది చింత వంత రఘు...

శా. సాలగ్రామశిలాశిలోచ్చయగయాస్థానప్రయాగస్థలుల్
పోలన్ జూచెద నంచుఁ బోవఁ దలఁతున్ బోలేను మీదాసులన్
బోలే నన్నను బుద్ధిపుట్ట దిఁక నేఁబుణ్యాత్ముఁడౌ టెట్లు హే
రాళం బైనది చింత వంత రఘు...

మ. కొలువంజాలక మాన నీ నుతులు పెక్కుల్ సేయుటల్ మాన నీ
దలఁపన్ జాలక మాన నీ కలసి నీదాసాదివర్గంబుతో
నిలువంజాలక మాన నీ కడపటన్ నీనామముల్ విన్నవా
రలకున్ గల్గును మోక్షలక్ష్మి రఘు...

మ. తలపన్ జిత్రము మీమహత్త్వములు మీదాసుల్ మహాభాగ్యవం
తులు త్రైలోక్యమునన్ బదస్థులు ధ్రువుం డుండున్ నభోమండలిన్
బలి పాతాళమునన్ విభీషణుఁడు భూభాగంబునన్ బద్మజ
ప్రలయం బైనను బోవ రౌర రఘు...

మ. చెలఁగన్ మర్త్యులు వేగి లేచి తమచేసే వెల్లఁ బాపంబు లీ
కలుషంబుల్ బెడబాయు టేదిగతి యింకన్ దోవయొం డెద్ది పు
ర్వ్యాలగుంటంబడఁబోక యుండ దయనేర్పన్ బుద్ధియున్ గల్గువా
రలు నీసేవకు లౌట లెస్స రఘు...

మ. కలకాలంబు వ్రతంబులున్ దపములున్ గావించి యన్యు ల్తుదిన్
గలకాలంబును బోలె నిర్జరపురీకాంతాకుచాలింగనం
బులఁ గొన్నాళ్లు సుఖించి క్రమ్మర నిలం బుట్టేది నేమెచ్చ ని
ర్మలముక్తుల్ నినుఁ గొల్చి కాంతు రఘు...

మ. నిలువెల్లన్ బులకాంకురంబు లొదవన్ నీపాదతీర్థంబుతోఁ
దులసీపర్ణ మొకించుకంతఁ గొనినన్ దోషాలు ఖండింపఁగా
పొలపాకుల్ దినఁ గాననంబులబడిన్ బోనేల మోక్షంబు కూ
రలనున్నారల నేల గల్గు రఘు...

మ. చెలువం బొప్ప సువర్ణముద్రలితరుల్ చెల్లించు టేక్రొత్త కా
కలనీముద్రలు చూడఁ జెల్లుబడి చక్రాలంచు వేయించుమం
డలనాథాగ్రణి క్రొత్త నీబలిమి నానావర్ణపుం దోలుము
ద్రలు చెల్లించితి విందు నందు రఘు...

# ఒంటిమిట్ట రఘువీర శతకము

మ. ప్రళయాపాదితకాలమృత్యునిభ యీరాకాసి రాఁగా శివా
దులు వారింపఁగ నోప రింక నెటుచొత్తున్ నొత్తుఁ గాకున్న సం
చలితున్ గౌశికుఁ గాచి తాటకను శస్త్రజ్వాలచేఁ ద్రుంచి దో
ర్బలశక్తిన్ విలసిల్లి తౌర రఘు...

మ. చిలుకల్ ముద్దులు చిల్కఁ బల్కుతఱి రాజీవాక్షి యొక్కర్తు ని
చ్చలు నోరాఘవరామరామ యనినన్ సాలోక్యసామీప్యముల్
కొలఁదు లిమ్మఱఁగ నిచ్చినాఁడవట నీకున్ బిడ్డవే రిడ్డవా
రలపుణ్యంబున కెద్ది మేర రఘు...

మ. ఇల నిన్నున్ దొలిబామునం దలఁపనైతీజన్మమందైన నా
తలఁపు లిమ్మపదపంకజంబులపయిన్ దాపింతు నేనింక బి
డ్డలలోఁ జెట్టులలోన నంబువులఁ బుట్టం బుట్టఁగా నోపఁగ
ర్మలతాబంధముఁ బాపుమయ్య రఘు...

మ. ఇల నీమీఁదను జాల భక్తిగలవాఁ డేచెట్టవాఁడైన నే
ఖలుఁడైనన్ మది నుత్తమోత్తముఁడగున్ గాదన్నఁ గొంగీడ్చెదన్
దెలుప న్నిల్చిన నాఁడుకొన్న పరవాదిన్ గెల్చెదన్ వేదశా
స్త్రలసద్వాక్యసుతప్రతాప రఘు...

శా. దేవా! నాదోఃవిన్నపంబు గల దేదీ యంటివా వింటివా
త్రోవం దండధరుండు దుర్గతులకై త్రోవన్ విచారించునో
యేవిఘ్నంబొనరించునో యెఱుఁగరా దేముక్తికిన్ బోవుచో
రావే వెంబడి నింత నంత రఘు...

శా. గోవం దొల్లిటిజన్మకాలముల నీకుం బంట గానైతి నం
చీవక్రంబులె కాక నాకు నివి లక్షింపంగ జన్మంబులా
చావుం బుట్టువు మాన్పుకోవలయు నీజన్మాన నీవాఁడనై
రావా నామది కింకనైన రఘు...

శా. చావు ల్మర్త్యులకెల్లఁ గల్గుటలు నిస్సందేహముల్ దేహముల్
చేవ ల్గల్గిననాఁడె శ్రీగిరి గయా శ్రీవేంకటాహోబిలా
గ్రావప్రాంతములందుఁ జేరవలెఁ జేరఁబోవ కేలబ్బు నా
ర్యావాణీస్తుత మోక్షలక్ష్మి రఘు...

శా. త్రోవన్ మానవుఁ డొంటి బోవుతఱి నీస్తోత్రంబు వాక్రుచ్చినన్
నీవుం దమ్ముఁడుఁ దోడువత్తురటె కా నెయ్యంబు తియ్యంబుగా

నీవంటాప్తుఁడు నిన్నుఁ బోలుహితుఁడున్ నీవంటి భక్తిప్రియ
ప్రావీణ్యుండును లేడు చూడ రఘు... 88

మ. నవనీతంబుల కేల పాఱెదవురా నాయన్న రా యన్నరా
యివి దూష్యంబులు గాఁగ గోపికలు నీయింటన్ బదార్థంబు లె
య్యవి లే వంచు వచించునమ్మకడ కొయ్యం జేరు నీ
రవినోదంబులు నేఁ దలంతు రఘు... 89

మ. వివిధబ్రహ్మలయంత్యకాలముల నేవీనిల్వ వావేళలన్
ధ్రువుఁడొం డుండువిభీషణుండు బలియొండుర్ వారు నీదాసులై
నవిశేషంబునఁ గాక తక్కొరుల కుండంబోలునే యింద్రరు
ద్రవిరించిస్తుతశౌర్యసార రఘు .. 90

మ. చెవి నీనామము విందునో యని కడున్ శంకించి కర్ణంబులన్
రవము ల్మ్రోయినఘంట లంట నిడి ఘంటాకర్ణుఁ డే తేరఁగా
నవి చూచే వర మిచ్చినాఁడవట నీయంఘ్రిద్వయీసేవక
ప్రవరున్ గాఁచుట యేమిలెక్క రఘు... 91

మ. రవిసూనుం బరిమార్చి యింద్రసుతునిన్ రక్షించినాఁ డందునో
రవిసూనుం గృప నేలి యింద్రసుతుఁ బోరం ద్రుంచినాఁ డందునో
యివినీయందును రెండునుంగలవు నీకేదిష్టమానోకదా
రవివంశాగ్రణి తెల్పవయ్య రఘు 92

శా. దోషంబు ల్కులపర్వతంబులకొలందుల్ గల్గినం గల్గనీ
మీసంకీర్తనశబ్దమాత్రమున భస్మీభూతముం జేయఁగా
త్రాసు ల్కోటిసహస్రముల్ గలిగి యెత్తంరాని కార్పాసపుం
రాసు ల్సోఁకిన నిప్పువోలె రఘు... 93

మ. కసుమాలం బగుదేహి పుట్టువుల నీకష్టంబులం బాసి దీ
వ్యసుకాయం బొనరింతు వెవ్వఁడు నినుం వాక్రుచ్చినన్ యోగిమా
నసగేహంబులనుండి లోహము సువర్ణచ్ఛాయగాఁ జేయఁగా
రసవాదంబులు నేర్చి తౌర రఘు... 94

మ. పసులం గాచినగొల్లవాఁడ వనుచుం భావింతు నెంతున్ మదిన్
ముసలిప్రాయము వాఁడ వైతి వనుచున్ మూర్తిత్రయాకారునిన్
వసుధాధీశ్వరు నెంతు నిక్క మెఱుఁగన్ సర్వాపరాధిం గృపా
రసపాథోనిధి కావుమయ్య రఘు... 95

ఒంటిమిట్ట రఘువీర శతకము

మ. పిసిడిం జూచి మహాప్రదాత యనుచున్ భీభత్సకుత్సాంద్రునిన్
ప్రసవాస్త్రప్రతిమానరూపుఁ డనుచున్ బందీ బ్రియంబార శ
త్రుసమూహాంతకుఁ డంచు నెప్పుడు నరస్తోత్రంబుఁ గావించు వా
రసుఁడన్ నిన్ను నుతింప నేర రఘు ..

మ. బహురూపాలు ధరించుకొంచును గ్రియాభాషాంగము ల్మార్చుచున్
బహుకాలంబునుండి యాచితి నికన్ బ్రాల్మాలి నట్లయ్యెడిన్
దహలం బెట్టక చాల్పరే యనుము నీత్యాగంబు నే నొల్ల నా
గ్రహదైతేయమదాపహార రఘు ...

శా. మోక్షాపేక్ష జనించె నాకు నిది యేదో కాని యీజన్మమం
దక్షీణోదయ ముక్తి కెవ్వఁడొడయం డాపుణ్యునిం జెప్పెదో
దక్షాదిస్తుత నీవె కర్తవయినన్ దక్కొల నీవే నను
రక్షింతో యెఱుగంగఁ జెప్పు రఘు...

మ. అక్షీణప్రతిమానదానవిభవాహంకారహారీణ యో
రక్షోదైత్యమదాపహారవిబుధత్రైలోక్యసంరక్షకా
రక్షుధ్వంసవధూటికావినుత నీదాసానుదాసుండ నన్
రక్షింపంగదవయ్య నీవు రఘు...

మ. చదువు ల్బ్రాంగిలి సోమకాసురుఁడు భాషాభర్త కూపెట్టఁగా
నుదధుల్ సొచ్చిన వానిఁబట్టుటకు నుద్యోగించి మత్స్యంబవై
యదరంటన్ రిపుఁద్రుంచి వేదములు దేవా దేవ శాండిల్య నా
రదకౌండిన్యనుతప్రతాప రఘు...

మ. దనుజాధీశుల నిర్జరాధిపతులున్ దామందరుల్ మందరున్
ఘనసత్వంబుననెత్తివెచి జలధిన్ గర్వంబుతోఁ ద్రిచ్చుచో
మునుగం బారకయుండఁ గచ్ఛపమవై మున్నీటిలో నుండు వ
ర్తనమే నాత్మఁ దలంచుచుండ రఘు...

మ. ధర కల్పాంతమునన్ గరంగఁబడి పాతాళంబులో నంటినన్
దొరయన్ దొల్లిటియట్లకా నిలుప నుద్యోగించి క్రోడంబవై
పొరి న బ్భాతల మెత్తినట్టిఘనదర్పున్ నిన్ను భావింతు ని
ర్భరకారుణ్య నిరూఢచిత్త రఘు...

మ. వడుగా నీవడుగ న్నెఱుంగ విట నల్పంబైనవాసంబు న
న్నడుగన్వచ్చితి వన్నఁ గన్గొని బలీంద్రా నాకు నీవిచ్చు మూఁ
డడుగు ల్మూఁడుజగంబు లంచుఁ గొనవా యాద్యంతముల్ మాట మా
ర్పడ వాడే మతికాఁడ వౌర రఘు... 103

శా. ఏతాఁగాక మురాంతకుండు గలఁడా యెందైన నిందైన నీ
చేఁత ల్మానుమటంచుఁ దండ్రిసుతునిన్ స్తంభంబులోఁ జూపరా
చూతా మన్న నృసింహరూపమున నచ్చో నుండవా చెండవా
రాతిం బోలిన దైత్యు మేను రఘు... 104

మ. సమరక్షోణులఁ బాఱఁబాఱఁగ జరాసంధాదులన్ ద్రుంచి చం
డమదాభీలుని ధేనుకాసురుని చట్టల్చీరి ముష్టిప్రహా
రములన్ ముష్టికు నాప్రలంబదనుజున్ మ్రందించి తౌ రేవతీ
రమణాకారముఁ దాల్చి యౌర రఘు... 105

మ. నిను నారాయణమూర్తిఁ గాఁ దలఁచుచున్ నీదండ నాదండకా
వనవాచంయము లెల్లఁ జేరి కొలువన్ వారిం గృపన్ జూచుటల్
వనధిం గట్టుట రావణుం దునుముటల్ వర్ణింతు రామావతా
రనిరూఢాకృతి నిన్నుఁ నోర రఘు... 106

మ. అమరారాతి వధూటికాలమణుల న్నశ్వత్థనారాయణ
ద్రుమముం గౌఁగిట చేర్పఁ జేసి వ్రతము ల్తూలించి బుద్ధావతా
రమునన్ రుద్రసహాయమై త్రిపురముల్ స్రుగ్గించి తౌరౌర ధీ
రమునిస్తుత్య యశోవిహార రఘు... 107

మ. కలికాలాంతమునన్ గిరాతజనముల్ గర్వించి చంచత్కిరా
తులనెల్లన్ విదళింపుచున్ గృతయుగద్యోతంబుఁ గావింప నిం
పలరన్ గల్కివి గాఁగ నున్న హరిని న్నశ్రాంతముంగొల్చువా
రలు పుణ్యాత్ము లగణ్యశూద్ర రఘువీరా జానకీనాయకా. 108

ఒంటిమిట్ట రఘువీర శతకము

సంపూర్ణము.



శ్రీ ర స్తు.



# భద్రగిరిశతకము.

జానకీమనోరాజీవ షట్పద పంకజాశ్రిత పదపద్మగర్భ
గర్భనిర్భేద సంగరబాణతూణీర నీరజబాణ సన్నిభ శుభాంగ
అంగజవైరి శరాసనభేదన దనుజవిద్వేషి సుందరపదాబ్జ
అబ్జబాంధవ కులాధ్యక్ష నీరదవర్ణ వర్ణితామర మానివరకలాప
తే. పవననందన సన్ముఖభక్తపాల పాలకడలిని విహరించు పద్మనాథ
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. 1

సీ. పద్మభవస్తోత్ర పావనచారిత్ర పంకజదళనేత్ర బహుపరాకు
దైతేయశిక్షణ ధర్మవిచక్షణ భక్తసంరక్షణ బహుపరాకు
వారిధిబంధన వరభక్తచందన ఖరతాడివందన బహుపరాకు
తాటకభంజన తాపసరంజన పరమనిరంజన బహుపరాకు
తే. భద్రగిరినాఁడె వచ్చు నీపౌరుషంబు విశ్వవిఖ్యాతిసేయక విడువ నింక, భ... 2

సీ. పదియు రెండేడులు ప్రాయంపువాఁడవై మించి తాటక నెట్లు ద్రుంచినావొ
రణశూరు లగు దైత్యగణములఁ బరిమార్చి కౌశికసవ మెట్లు గాచినావొ
తరములఁబట్టి యెత్తఁగరాని హరువిల్లు చెఱకుకైవడి నెట్లు విఱిచినావొ
సంగరరంగవిశారదుం డైన భార్గవరాము నేరీతి గడపినావొ
తే. కాని తెలియద యప్పటిక్రమము దెలుప తురకదొరలన్నభీతిని నురుకుదొరవు, భ

సీ. కాకంబుగాదు వేగమ బాణ మెక్కించి కావు కా వనిపించి కాచివిడువ
ఉదధిగా దవనిపై నుష్ణాంగఁగాఁ జూచి బాణాగ్రమున నిల్పి భక్తిబ్రోవ
చిత్రమృగముగాదు సీత మెప్పులకునై వెంటాడి వనవీధి నంటితఱుమ
పుడమి నెన్నఁగఁ గబంధుఁడుగాఁడు భుజలతల్ నఱకి పాఱఁగ వైవ సరకుగొనక
తే. అవని తురకల కెదురుగాదని తలంచి, వలసబోతివి నీసరివారు నవ్వ, భద్రి ...4

సీ. ఖరదూషణాదుల ఖండించితి నటన్న, యహమిక మదిలోన నణఁచివైచి
మాయామృగంబును మర్దించితి నటన్న, గర్వంబు మనసులోఁ గట్టిపెట్టి
వాలి నొక్కమ్మునఁ గూలనేసితి నన్న, సాహసోక్తులు మదిఁ జక్కవిడిచి
రావణకుంభకర్ణ నిశాచరులఁబట్టి, పరిమార్చితి నటన్న ప్రజ్ఞ మఱచి
తే. ఓడపై నెక్కి తురకలజాడ గాంచి, యురకదగునయ్య నీవంటివారలకెందు. భ...5
సీ. సున్నతీ లొంగఁజేయఁ జూతురో యనివేగ, మేలుకొంటివి యింత మేలుగలదె
గుడిగుడీపొగలు పైకొనఁజూతురో యని, వలసబోతివి సరివారు నవ్వ
మును పులావును దినుమని యందురో యని, పాఱిపోతివి యింతపాటి గలదె
లుడికీయఫీమాదు లిడఁజూతురో యని, యోడ నెక్కితిరి మీ రొగి ధరిత్రి
తే. కులముగలిగినవెంద్రైన స్థలముగలుగు, ననుచుభక్తులఁ దిగనాడి చనగనౌనె. భ 6
సీ. చెప్పినట్టుల వినఁజేయ నోపిక కొండ, చరియలయందుండు చరియదుంప
దోడులు తినుశక్తివాఁడికోఱలుగల, తులువమృగాలలో మెలఁగుయుక్తి
జడలదాలుచు నేర్పు జడదారులనుఁగూడి, యిడుములఁ బడు తాల్మివడుకులందుఁ
బండుకష్టతరంబు పర్ణశాలలయందుఁ, గాపురంబులు సేయుక్రమము తొల్లి
తే. తల్లికోరిక చెల్లించ ధరణిలోన, నేర్చితినటన్నఁ బలునూఱునెఱపనగునె. భ. 7
సీ. రఘువంశమున కెంత రట్టడి దెచ్చితి, వరుస పోలవరంబు వలసబోయి
పోకుమూకల కెంత చులుకన నైతివి, వరుస పోలవరంబు వలసబోయి
భక్తకోటికి నెంత భయము బుట్టించితి, వరుస పోలవరంబు వలసబోయి
... ... ... ...
తే. దశరథునిగర్భమునఁ బుట్టి దశశిరస్కుఁ దునిమినటువంటి దొరకిది దొడ్డశనమె భ
సీ. కైకవరము జ్ఞాపకముువచ్చెనో మళ్ళి వనములోఁ జరియింప వసుధలోన
నీలాద్రిపతిఁ జూచి నేరుచుకొంటివో వలసఁబోవంగ నీవసుధలోన
పట్టిన సతికిఁ జెప్పఁ దలంచి పోతివో వలస పేరడికొని వసుధలోన
రామలదేవు కారణజన్ముఁ డని తోఁచి వరమియ్యఁ బోతివో వసుధలోన
తే. లేక యిదియేమివింత ముల్లోకములను జడిసి వేంచేసితిరటన్న జడుపుగాదె, భ
సీ. సౌమిత్రికైనఁ దోచకపోయెనా యిట్లు పోవరాదని నీకు బుద్ధిదెలుప
సీతయైనను మీకు జెప్పలేదాయెనా యిలువెడలుట మహాహీన మనుచు
హనుమంతుఁ డిపుడు మీయాజ్ఞకు వెఱచెనా యేను గాదని మిమ్మునడ్డగింప
శిష్టరాజగు మీవసిష్టు లేఁడాయెనా యిది బుద్ధిగాదని యెఱుఁగఁ జెప్ప
తే. భద్రగిరినుండి శ్రీవీరభద్రగిరికి వలసవోవుట యిదియేమి వాంఛలయ్య, భ...

సీ. హనుమంతు నెచ్చోటి కనిపితిరో మీకు జడుపుబుట్టిన యట్టి సమయమునను
సుగ్రీవుఁ డేగుహఁ జొచ్చియుండెనో మీకు జడుపుబుట్టిన యట్టి సమయమందు
అంగదుఁ డేవంక కల్గిపోయెనో మీకు జడుపుబుట్టిన యట్టి సమయమందు
జాంబవదాదు లెచ్చటనుండిరో మీకు జడుపుబుట్టిన యట్టి సమయమందు
తే. కపులు మీయొద్దనుండిన రిపుల కేల యోండి వేఁచేతురయ్య మీరోడమీఁద,భ
సీ. పట్టాభిషేకసంభవవియోగము జటావల్కలంబులు వనవాసములును
యతిపూజ గొనుటలు సతితోడఁ దరుగుట లాలి గోల్పోవుట లడవులందు
సంచరించుటలు నిశాచరబాధలు చెంచుమిద్దియ విందు లెంచ మొండె
మునఁ గూల్చుటలు దాని విని ముక్కుగోయుట కోతినేయుటబ్రహ్మకులజుఁజంపు
తే. టిల్లు వెళ్ళుట లాదిగా నినకులమున ననయ మీ, నాడె ధరగల్గెననియె జనము,భ
సీ. భరతశత్రుఘ్నులు వరశంఖచక్రముల్ సౌమిత్రి శేషుఁడు జనకతనయ
యిందిర కపులెల్ల బృందారకులటంచు స్మృతులెల్లఁ గొనియాడ నతివినోద
లీలలు గల్పించి బేలవై కేవల మానుషచర్యలు బూనె దకట
వలసలు మీకేల వనవాసము లవేల, వైకుంఠవాసివి వరుసతోడ
తే. మీబలపరాక్రమములెల్ల మీరె మఱచి, తొలఁగి పోవచ్చునే తురకలకుజడిసి, భ
సీ. ముసలిమానులతోడ ముచ్చటాడఁగలేక, తురకల కెదురుగా నరుగలేక
మ్లేచ్ఛుల మన్నించ మెప్పు లీయఁగలేక, పారసీకులబాధ పడఁగలేక
అచ్ఛద్రకర్ముల యాజ్ఞ నుండఁగలేక, యపసవ్యరిపులతె న్నరయలేక
చేరి ఖానులకుఁ దజీము లియ్యఁగలేక, ముసు నమాజుధ్వనుల్ వినఁగలేక
తే. పాఱిపోవుట యిదియేమిప్రజ్ఞ గొడుగు, నెఱిఁగి యేయెండ కాయెండ నిడఁగవలయుఁ
సీ. తెలివిదెచ్చుకయుండఁ దెన్ను పీక్షింపక, వాహనంబులమీఁది వాంఛలిడక
ద్వారపాలకులకు దారి జెప్పక భక్త, గణములకెల్లను గనుఁబడక
సొమ్ములచందుకల్ చూడనొల్లక కపి, బలములనెల్లను బిలువనీక
సౌమిత్రి కరిగెడి జాడఁ జెప్పఁగలేక, సీత నెత్తుక యతిశీఘ్రముగను
తే. కలముపై నెక్కి మీవంటిఘనులు తొలఁగి,పోవఁగా నొనెపలసగోఁబోలవరము భ
సీ. సొమ్ములు బీబీల సొగసు కర్పణజేసి, వాహనంబుల నశ్వవాహకులకు
పంచపాత్రలు సురాపానవర్తనులకుఁ, బళ్లెరంబులు మాంసభక్షకులకు
శఠగోపములు విప్రశతులకు బంగారు, తబుకులు బలుదునేదారులకును
గిన్నెలు వరుస ముంగీముచ్చులకుఁ బట్టు, పీతాంబరంబులు పింగళొత్తు
తే. లకు నొసంగి యుభయమునసుఖము దక్కి, పాఱిపోతిరిమీరున్నయూరువిడిచి, భ.

సీ. సంచరించిరిగదా సమదాసపవ్యులు, విమలబృందావనవేదికలను
వీటిబుచ్చిరిగదా విరులచేఁ జెన్నొందు, ఘనమల్లికా పుష్పవనచయంబు
గాళుచేసిరిగదా కళ్యాణమందిర, గరవాహనగృహాంగణము లెల్ల
కొల్లలాడిరిగదా కోమలనవవీచి, కల నొప్పు దివ్యగంగాఝురములు
తే. చూరపట్టిరి పురమెల్లఁ జొచ్చి విప్ర, మదిరంబులన్ని తురకలు మత్తులగుచు, భ
సీ. సంస్కృతాంధ్రోక్తులసారంబు లుడివోయి, నవనవ్యభాషల నమరె జగము
పౌండరీకాదులపశుబంధనము దప్పి, కటికి మేకలజవాల్గుఁగె సూళ్లు
కర్పూరచందనాగరుధూపములఁ బాసి, గంజాయి పొగలచేఁ గప్పె గుళ్లు
వేదశాస్త్రంబు వెలయు బాఁపలపట్లు, మొల్లాఖురానులు మ్రోఁగె నహహ
తే. యేమిచెప్పుదు మీమాయలెవ్వ రెఱుఁగఁ, గలరు బ్రహ్మాదులకునెల్లనలవిగాదు. భ.
సీ. ధర్మపేటనివాసి ధైర్యంబు విడనాడె, వేఁటగోపాలుండు మాట లుడిగె
పాలవంచపురీశు బలహీనత వహించె, గృష్ణసాగరపయ్య క్రిందుఁ జూచె
రామానుజపరపు రాము లూఁటకయుండె, సిరివేడిస్వామి యబ్బురము గదిరె
పర్ణశాలేశుండు బహుభంగులఁ దపించె, శ్రీరామగిరివాసి చింత నొందె
తే. భద్రకడనుండి శ్రీవీరభద్రుకడకు, వలస వేంచేయువలసినవార్తవినియు భ... 19
సీ. తురకలతో మైత్రి నెఱప లేవైతివి, లోకత్రయం బెట్లు సాకఁగలవు
గర్నెలుగుండ్లడాకా కోర్వ లేవైతి, వసులబలంబు లెట్లణచఁగలవు
నీస్థలంబున నీవు నిలువ లేవైతివి, భక్తుల నెట్లు గాపాడఁగలవు
మానవాధీశ్వరు మరుగుఁజొచ్చినవాఁడఁ వమరారులకు నెట్టు లభయ మొసఁగి
తే. తకట నిను మనమున నమ్మినట్టిజనులఁ, దొలగి వేంచేసితిరి తురకలకు జడిసి భ. 20
సీ. శ్రీరామముద్ర లీక్షితిని నీరసమందె, నగ్బర్ బకైరను నచ్చు లమరె
గోవిందశబ్దముల్ గురిమాల యాహసన్, బావుసేననుపల్కు లావహిల్లె
గరుడాశ్వగజరథవరవాహనములచేఁ, బరగు నిండ్లను పీర్ల ప్రభలు చెందె
సత్రశాలాంగణల్ చలువపందిరుల్లు, బర్బరభిఖాసాల చప్పరములయ్యె
తే. మత్స్యమాంసాదికముల నమరెను గోద, రేవులెచ్చట గన్న గోరీలనమరె భ.21
సీ. హనుమంతు ముట్టి సర్వాంగవేణిలిచేత, నెమరి పెట్టెలమాయ జమరె నొకఁడు
గరుడాళువారతెక్కలు చెక్కుముక్కలు, నొక్కి మట్టసముగాఁ జెక్కె నొకఁడు
ఎంబెరు మానారు నింటిలోన నమాజు చదివియుఁ దసిబిసి సలిపె నొకఁడు
వరుసఁ బన్నిద్ద ఱాళ్వారి నొక్కుమ్మడి డేఁడిక్కులాడినిచి పీడె నొకఁడు
తే. మిగిలినజనంబు చింత లేమిటికిఁ దలఁప పరగ మీరలు తిరువళ్ళైపట్టునెడల భ.

సీ. అతిసరంబులుగావు ఆరగించి వయారి కోఁజమీనంబులకొనలు పలుప
తిరుపణ్ణారములుగా వురువుగా భుజియించి ఘోరలియాడుచుఁ జిన్నిబొజ్జ నిమురఁ
దధ్యోదనము గాదు తగినంత భక్షించి గుఱ్ఱున దేన్చుచుఁ గూరుచుండ
వడలు గావు యయోధ్యవాసులతోఁ గూడి ముచ్చట దెలుపుచు మొనసి మెసవ
తే. చేరి భక్ష్యంబులా గావు చిత్తగింప కివియు జాల్దంగు మేటి జంగీబలములు, భ 23

సీ. పుల్లాది పొంగలి పులిహోరలను మెక్కు వారికి రణముపై వాంఛ గలదె
శర్కర పొంగళ్ళ చవిగొన్న వారికిఁ బ్రాణంబుపైఁ దీపి బర్వకున్నె
వైష్ణవసద్గోష్ఠి వర్తించువారలు తురకలమ్కరులపై దుముకఁ గలరె
ఉభయ వేదాంత సదూహ నుండెడివారు మంత్రాంగశక్తులు మలపఁ గలరె
తే. దేవమానవశక్తుల తెఱఁగు వదలి తురకదొరలన్న భీతిలి యురుకు దొరవు, భ.

సీ. సొగసుగా శంఖచక్రగదల్ ధరించుట తడబాటు చతురహస్తమున వెలయు
ఘనతకా......సనములు దాల్చుట పురజనంబులకు నద్భుతముగాఁగ
అపుడు కామార్యపుత్రా సేన... ...నేలుటలు సూర్యకులములోన
ప్రజ్ఞకా పతితపావన బిరుదాంకంబు చూపుటెల్లను బలుచోద్యముగను
తే. యవనబలములు నల్గడల్ కవిసి మిమ్ము దోఁచుకొను వేళ శౌర్యంబు దాఁచితకట

సీ. శంఖంబు కడుబీజ జంగంబుచే నున్న పూవెదైయైనను బొట్టవోసికొనును
చక్రంబు కుమ్మరి సరసనుండిన వేడ్క కుండలైనను జేసికొనుఁ రయమున
గద సుకాలీవానికడనున్న వేవేగ గోనెపైనము నెత్తుకొనుముదమున
తగనాల్గు చేతులు ధంసాకుఁ గల్గిన నిక నింతరాజ్యంబు నేలుకొనును
తే. స్వామి నీకేల యివి వృథా సరసముగను, వారివారికి దయసేయు వరుసతోడ, భ.

సీ. సరసప్రబంధానుసంధానములు గావు, మొల్లాఖురానులమోంతగాని
మహిమహీసురల నమస్కారములు గావు, మక్కలు సేయు నమాజుగాని
తగ నర్చకులు సేయు తళిహాలుగావు లా, వుపొలావుదీకి బల్పొల్పుగాని
చందనాగురుధూపసమితిగాదు గుడాకు, గంజాయి పొగలసంఘంబుగాని
తే. బలిసి తిరునాళ్ళకే తెంచు ప్రజలుగారు, ఘనతరంబైన తురకళమ్కరులు తెలియ, భ.

సీ. పన్నీరు నించిన పసిఁడికొప్పెల మీకు, సారాలు నింపుసీసాలబారు
దాసులు దెచ్చు తీర్థపుబిందెలే మీకు, పారసీకులమధ్యభాండవితతి
భువి భక్తు లొనరించు భోగంబులే మీకు, తురకలు చేయుకఁ దూరిచయము
కల్యాణవేదికాగ్రము నందుహోమగుం, డంబులే పీర్లగుండములు నీకు
తే. కాకయుండిన యిళ్లేల కాకపుట్ట, దవని తురకలు చిందుచెండాడునపుడు, భ. 28

సీ. గజరథఘీంకారఘంటారవంబులు, తగవిన్నఁ జెవులు చిందరలు గొనెనొ
కంచుఫిరంగీల ఘననాదములు విన్న, ఘెల్లున గుండియల్ ఝల్లుమనెనొ
యవనాశ్వఖురపుటజవమున దెసలెల్ల, గదిసిన పెంధూళి గప్పుకొనెనొ
అరబు సిద్దీల పెటాహాతులోపలఁ జొచ్చి, తొలుదొల్త పసములు తొట్రువడెనొ
తే. కలముపై నెక్కితిరి మీరు ఘనత విడిచి, క్రమముచే నంగరక్షైఁ గట్టుకొమ్ము, భ

సీ. భరతాదిసహజన్మవరులకు నీపాటి, ఫారసీ చెప్పించు పంత ముడిగి
వ్యాసాదిమునిగణప్రతతికెల్లను ఖురా, నులు జదివింపఁగాఁ దలఁపుసేయు
పరగ నింద్రాదిదిక్పాలకశ్రేణికి, నెరి నమూజులు సేయ నేర్పు నేర్పు
వారింపఁజాల వాళ్వారామలకు వేగ, సున్నతీలప్రయత్న మెన్నఁజేయు
తే. చేయకుండిన తురకలు చెనకువాండ్రు, హద్దు విడివచ్చి రింక మీ రాగఁగలరె, భ.

సీ. సర్వాంగితురకలు సవరించినారింతె, సీలికూసంబైన నెరి ధరించు
మణికిరీటము మ్లేచ్ఛులులకిచ్చితి వింతె, టోపీయైనను డాల్చు మేపుమీఱ
పావాలు యవనుల పాలుజేసితి వింతె, ముచ్చెలైనను గాళ్ల కిచ్చగించు
ఢిల్లీశ్వరునికూఁతు నిల్లాలిగాముందు, నేలితి వింక నీకెక్క లేల
తే. మతమువిడుచుటలెల్ల సమ్మతముమీకు, గామకులకును బ్రజ్ఞలుగలవెతలప, భ.

సీ. గరుడధ్వజము లన్న గాంక్షతో నుంటిరో, డాలైన తగటుజండాలు జూచి
తమనిత్యసేవవాద్యము లనుకొంటిరో, యరయ బాజాల నెయ్యంబుఁ జూచి
తిరునాళ్ళయంగళ్ళతీ రనుకొంటిరో, సరిలేనిదండు బాజార్లు జూచి
వరుసతోడుత భక్తవరు లనుకొంటిరో, దరిలేని బలుసుబేదార్ల జూచి
తే. కాక భువి విభవాహిముఖాసుఁ డెంత, మేటిదానవులను గెల్చు మేటికరయ, భ.

సీ. ఆవు బైటో యని యాదరింతురుగదా, తురకలతో మైత్రి నెరప వైతి
రాము రా మనుచుఁ దాజీము లిత్తురుగదా, యూరకుండిన మిమ్ము నూఱడించి
కదిదిమిల్నా యని కౌఁగిలింతురుగదా, యెదురుగా నేఁగిన బెదురులేక
కర్పూరవిడెముల ఘనత నిత్తురుగదా, నజరు పట్టినమద్దె నజరుగలిగి
తే. కానిపని జేసితివి పోటుకానివలెనె, వరుస తురకలపై నల్గి వలసబోయి. భ...33

సీ. అరబు సిద్దీల దివ్యాజ్ఞలో వర్తించి, చేరి మేఁకలజబా సేయలేక
వరుసతో ధరియించు వరభూషణములిచ్చి, యుదుకునూనియలఁ జేయుంచలేక
సెట్టిపల్లియవారు చేయునిర్బంధంబు, సారిది మీఱఁగఁ గండ్లఁ జూడలేక
తగుగుమాస్తా యనఁదగు నశ్వరాయని, కరుణ నిండారఁగాఁ గాంచలేక
తే. తొలఁగిపోతిరి మీవంటిదొరల నమ్మి, కొలువఁ దగునయ్య దీక్షులుకొలదిమీఱి, భ.

సీ. విల్లునమ్ములఁబట్టి వెల్లులో జొన్పనా, వెడలిపోయెడి దొరబిడ్డలకును
చేతిచక్రము కొల్మిఁ జేర్పనా వెన్నిచ్చి, పాఱిపోయెడి దొరబాలురకును
క్షాత్రధర్మములెల్ల సరసిలోఁ ద్రొక్కనా, తొలఁగిపోయెడి యినకులజులకును
బంటుతనంబెల్ల పాథోధి గలుపనా వాసిదప్పిన రఘువంశజులకు
తే. అనుచు ఖేచరులెల్ల మిమ్మనఁగఁ దొల్లి చెలఁగి సింహాసనంబున స్థిరుఁడవగుము, భ
సీ. శంఖంబుకోసము చక్కిలు నిల్చితే నే నీయనని పోవ నీతరంబె
చక్రంబుఁ దెమ్మని స్వారిలఁ బంపితే యమ్మునుకొనుట నీయబ్బతరమె
గద తెమ్మనుచు వేగఁ గడెదీలఁ బంపితే తప్పించుకొనఁగ నీతాతతరమె
ఖడ్గంబుకోసమై ఖానుండు మళ్ళితే తిరిగి పోవంగ నీ దేవ్రతరమె
తే. వరుస తురకలగతి నెంచి వలసబోయి నిల్చితివి క్షాత్ర మీ పాటి నీకె చెల్లు, భద్ర.
సీ. ఈపాటి దొర వాట యెఱిఁగి యామందర కైకకు నుపదేశ గఱపె వేడ్క
ఈ పాటి దొరవాట యెఱిఁగి మీ పినతల్లి వెఱవక నిను నిలు వెళ్ళఁగొట్టె
ఈపాటి దొరవాట యెఱిఁగి వేగ సుమిత్ర కొడుకుసహాయంబు గూర్చి పంపె
ఈపాటి దొరవాట యెఱిఁగి శూర్పణఖ రావణుతోడ నీ స్థితి వరుసఁ జెప్పె
తే. ఎఱుఁగ కవనిజ నీవెంట నేఁగుదెంచె చెఱను బడియుండవే దైత్యవరునియింట, భ
సీ. శంఖంబులోఁ గీర్తిచంద్రిక లిమిడెనో కనుపట్టదాయె సంగరమునందు
చక్రంబులో భూమిచక్రంబు దాఁగెనో బలమీయదాయె నిబ్బరము గదుర
గదలోపలను క్షాత్ర మొదిగెనో యరులపై రాణింపదాయె గర్వంబుదక్కి
కత్తిలోఁ గోపంబు నొత్తిలియుండెనో తురకలపై చుర నుఱుకదాయె
తే. స్వామి యిదియేమి యింత మీసాహసంబు లెందు వెంచేసియరులపై మందగించె, భ.
సీ. ఈపాటి దొరవాట యెఱుఁగక మిము నమ్మి దేశస్థులెల్లను దిగులువడిరి
ఈపాటి దొరవాట యెఱుఁగక మిము నమ్మి భక్తులెల్లను మ్లేచ్ఛబాధపడిరి
ఈపాటి దొరవాట యెఱుఁగక మిము నమ్మి సెట్టిపల్లియవారు మట్టుమెరి
ఈపాటి దొరవాట యెఱుఁగక మిము నమ్మి యశ్వరాయఁడు భూపలాయనంబు
తే. నొందె నీపాటి దొరవాట ముందెఱిఁగి కదనమునకుఁదురుష్కుఁడుగదిసెనహహా.
సీ. భుక్తాన్న శేషంబె పొసఁగ దాసుల కిమ్మి దినములు గడుపు జగ్గనఘనుండు
తను గానకుండ గంధము మేన నలఁదించు కొని నిష్ట సల్పు నప్పనఘనుండు
భీరసాదలదోఁచి పృథ్విని వంచించి పన్నిచ్చు వేంకటపతినృపాలుఁ
డొడయఁడై మణిదెచ్చి మడుగులోపలఁ జొచ్చి దాఁగియుండిన వరధనఘనుండు
తే. వారలెల్లను నీవంటివారు గారె యొదిగి యుండిరి యుగచర్య లూహఁజేసి, భ. 40

సీ. శబరి విందయ్యెనే సరభసంబున మీకు భావింప రాముల దేవుభక్తి
హనుమంతు డయ్యెనే యతిసాహసుండైన జోగిపంతులయుక్తి చూడమీకు
సుగ్రీవుడయ్యెనే పోరిది గోరుం దొర కపి తాను ఘనుఁడు మీకార్యమునకు
ఘనఋష్యమూకమయ్యెనె రాజమహేంద్ర వరమెన్న మీమనోవాంఛదీర్ప
తే. కాకయుండిన యిచ్చటి రాక కేమి కారణం బెన్న మీవంటి ఘనుని కరయ, భ
సీ. జోగిపంతులకు మెచ్చులు గూర్పఁబోతివో యింగిరీజుల ప్రాపు నిచ్చగించి
తురకరూపము దాల్పుతఁజివచ్చెనో మ్లేచ్ఛ సంహార మొనరింప జగమెఱుంగ
శాఖామృగంబుల జతగూర్ప ఋష్యమూకము జేరఁబోవుటో క్రమముతోడ
నన్ను ధన్యునిజేయ నాచేత పద్యముల్ చెప్పింపఁ బూనుటో యొప్పమీఱ
తే. గాక యిదియేమివింత మ ల్లోకములను వలసవేంచేసితిరటన్న యలుసుగాదె, భ.
సీ. అరయంగ మీకు భద్రాచలం బయ్యెనే పాలుఁపుమీఱగఁ రాజు పోలవరము
కోవెల ప్రాకారగోపురా లయ్యెనే తలుపులు లేని కఱదడికయిండ్లు
కళ్యాణమంటపాగారంబు లయ్యెనే సంతమామిళ్ళలోఁ జప్పరములు
భువినెన్నఁగా రథోత్సవమయ్యెనే మీకు వాహనరహిత ప్రవర్తనంబు
తే. మేలురాజ్యంబు తురకలపాలుఁజేసి హర వృషభమధ్యముననుండుటర్హమగునె భ
సీ. గోవిందరాజులు గురులఘుత్వము మది దలఁపక మీవెంటఁ దగిలె నెట్లు
రంగనాయకులు శ్రీరంగాధికారంబు నెఱుఁగక యేరీతి నేఁగు దెంచె
నరసింహుఁ దుర్గంబు నట్టేటిలోఁ గల్పి, వెడఁగుమై యెటుల మీవెంటవచ్చె
క్షేత్రపాలకుఁడైన శ్రీరామలింగంబు, పరిమధులతో నెట్లు పాఱిపోయె
తే. అహహ సహవాసగుణము వీరందరకును,సంభవించెను గాఁబోలుజగమెఱుంగ, భ
సీ. బిబ్బీలసిబ్బెంపు బిగువుగుబ్బల సీదు, వజ్రాలపతకముల్ వరలవలెనో
పారసీకాంతల పాపట్లయందు నీ, ముత్యాలపేరులు మురియవలెనో
తురకబిత్తరులపెందురుములలో వేడ్కఁ, మొగలిపూరేకులు మునువవలెనో
యవనాబ్జవదనవకంపు మేనులఁ బీతాంబరము గేషు బెనఁగవలెనో
తే. కాకయిదియేమి నీసొమ్ము లోకమెఱుఁగ,మానవులు వేగహరియించి మనగలారె,
సీ. తూర్పునాఁటి తెనుంగు దొరతనంబులుగావు, తోమాలలంది సంతోషపడను
దక్షిణదేశంపు ద్రావిడసాములుగారు, వినియోగములు గొని వేడ్కఁ జెందఁ
బశ్చిమమహారాష్ట్రపరిభువరేణ్యులుగారు, పాదతీర్థంబున మోదమొంద
ఉత్తరదేశంపు టోఢ్రరాజులుగారు, దర్శనమాత్రానఁ దనివినొంద
తే. యనను లభ్యాతురు లటన్నవవి యెఱింగి,నస్తువాహానవిభవముల్ వదలితహహ,భ

సీ. ధీమంతు లెల్లను దెప్పించుకోక రా, రో మీస్థలానికి హూఢిమెఱియఁ
గవులు పంపింపక కదలరో మీమొఖా, సాలకెల్లను గడుశాశ్వతముగ
సనదులు పుట్టక సనుదెంచరో యగ్రి, హారికులకును మహాదరముల
వరుసతోడుత పరవానాలు లేక వేం, చేయరో భూసురశ్రేణి కెల్ల
తే. తురకలెల్లను మీత్రోవఁ దొక్కకుండ, ధరణి తాఖీదు లియ్యక తర్లినారొ, భ
సీ. ద్వాత్రింశదాయుధోద్ధరణంబు గావించి, నెరి తుపాకులఁబట్ట నేరవైతి
సకలదానవులను సంహరించు టెరింగి, తురకలతోఁ బోర నెఱుఁగవైతి
కుక్షిలో లోకముల్ కుదురుసేయుట నేర్చి, మీఱి సొమ్ములవాంఛ నేరవైతి
పదునాల్గు లోకముల్ పాలించుట యెరింగి, నీదు రాజ్యము కావ నేరవైతి
తే. వవని తెల్లనివెల్లఁ బాలనుచు నమ్మి, మోసపోతిరి గర్వంబు మొదలదొట్టి, భ
సీ. అగ్నివర్ణాది వీరాగ్రేసరుల కంటె, మిక్కిలె సార్దాదు లక్కజముగ
వృశ్చిక రోమాది వీరుల కినుమడే, సిఫిరు షెంషేరుల సిద్ధఫలము
ఇంద్రజిత్త్రాదుల కెక్కుడే తలపోయ, ధరణిలోఁ బలుగుముందాను లరయ
యవనరాక్షసమూయ కధిక మే లెక్కింప, మొగలాయి మర్మంబు మొగిదలంప
తే. పాసగఁద్రేతాయుగంబురక్కసులకంటెఁ, గలియుగమునాటితుర్కలుఘనమెమీకు, భ
సీ. కపులచేఁ గఱపింప చపలదైత్యులుగారు, జెంజెరి హుకాల్ల చెడుగుదొరలు
రాళ్ళచే నడపింప రాక్షసావళిగాదు, వడినెన్న బారుజవానుగములు
లగ్గలుపట్టింప లంకాపురము గాదు, మహిని జాఫరగడిమహాలు గాదు
పిలిచి కొల్వీయ విభీషణుం డిలగాఁడు, బిగిగల్గు నలయూరుబేగుగాని
తే. చేసితివిమ్లేచ్ఛజనముతోఁ జెలిమి వెఱపు, గఱపఁబూనియు వెరచినక్రమము దోప, భ.
సీ. పితృవాక్యమునకునై పినతల్లి కోరిక, గడుపఁగా నేరీతి గడగినావొ
కడగినవాఁడవై ఖరదూషణాదిరా, క్షస సమూహాము నెట్లు చదిమినావొ
చదిపినవాఁడవై శాఖామృగశ్రేష్ఠు, నేగతి బంటుగా నేలినావొ
యేలినవాఁడవై యెటువలెఁ గపులచే, ఘనవార్ధి నేత్రియఁ గట్టినావొ
తే. కట్టి లంకాధిపుని నెట్లు గొట్టినావొ, యిట్టిధైర్యము గలదొరపట్టి వరయ, భ...
సీ. సోమకాసురునితోఁ జొచ్చి పాథోరాశి, మత్స్యమై సుఖలీల మరగినావొ
కూర్మరూపముచేతఁ గుంభిని జొరఁబాఱి, వ్రేగుచే బయలికి వెళ్ళలేదొ
వరహావతారమై వసుధ వర్తించిన, సిగ్గుచే మూలలఁ జేరినావొ
బాలునిపల్కువెంబడి వేగరా నుక్కు, కంబములో దాఁగఁ గడగినావొ
తే. కాకనిజరూపమునసున్న ఖిలులు జేయు, చేతలకు నూరకుందువే చేయమఱచి, భ.

సీ. బలిచేతదానంబుఁ బ్రార్థింపఁబోతివో, కుబ్జరూపముచేతఁ గుటిలబుద్ధి
పరశుహస్తుండవై పార్థివావళిద్రుంచి, ధరయేలఁ బోతివో ధర్మనిరతి
మునుపటివనవాసమున జెందునాయాస, ముడుపుకోఁ బోతివో యుత్సుకమున
తడయక గొల్లబిత్తరుల నిత్తఱిఁ జేసి, కరుణింపబోయితో కాముకేళి
తే. అహహ బౌద్ధుండవై ఖానులాగడమునఁ, జేయుపనులన్ని జూచెదు సిగ్గెఱుగక, భ...
సీ. అవనిలోపలఁ గాలయవనునినాఁడె నీ, పాఱుబోతుగుణంబు బాయదయ్యె
కొంచెబాఁపఁడవయి కోరినబలినాఁటి, మంకుబిచ్చపుబుద్ధి మానదయ్యె
పరగఁగఁ బితృవాక్యపరిపాలనమునాఁటి, దుడుకుకష్టతరంబు తొలఁగదయ్యె
పండాలచేత దుర్భాషలఁబడునట్టి, పుడమి మొండితనంబు పోవదయ్యె
తే. నేటికైనను నెన్నన్నమాట వినక, తొలఁగి యిట్టుండుటకు నేమి తోఁచదకట, భ.
సీ. తాటిపండులు దిని తనిసినవారికి, శాల్యన్నమన్న ముచ్చటయుఁ గాదె
దుంపతోడులు దిని దొరకొన్నవారికిఁ, బరమాన్నమన్న సంబరముగాదె
తౌడుదొంట్టెలతోడఁ దపము జేసినవారి, కతిరసాలన్న నెయ్యంబు గాదె
నారచీరలుగట్టినట్టివారికి బట్టు, పీతాంబరములన్నఁ బ్రియముగాదె
తే. చెంచుముద్దియపందారగించునట్టి, దొంతు రాజుల పందన్న దొడ్డగాదె, భ...
సీ. క్రూరదానవులను జీరనచక్రంబు, మొఱపలు బోయెనో మోటువడెనో
పగతులశిరములు బద్దలుగాఁజేయు, గద తుప్పుబట్టెనో కలికెనొక్కొ
రావణాదులమీద రవణించు పెనువిల్లు, నడుముక విఱిగెనో నారి తెగెనో
శత్రువర్గము నెల్ల సమయించు పెనుతూపు, కాకంబు మ్రింగెనో కాడువడెనో
తే. కాక యిదయేమి యపనులు కాకు జేసి, ముండవాగారములుమట్టుమసలి రహహ, భ.
సీ. తాటకపై నుగ్రతరముగ వెడలిన, బాణంబు లెక్కడఁ బడియె నొక్కొ
ఘనసుబాహుని బట్టి ఖండించ వైచిన, శరము లెచ్చోటికి నరిగె నొక్కొ
చిత్రమృగముమీఁదఁ జిందుచెండాడిన, మార్గణం బెచ్చోట మడిసె నొక్కొ
వాలిపై నవలీల వ్రాలి జీవముగొన్న, యాశుగం బెచ్చట నణఁగె నొక్కొ
తే. అవనియవనులు మీరాజ్య మాక్రమించి, యేలుకొనుచున్న తటి బ్రాలుమాలెదకట,.
సీ. అంగదసుగ్రీవహనుమదాదులకు లా, ల్కుడతాలు దొడిగించు గుఱుతుమీఱ
జాంబవత్కుముదాది శాఖామృగంబుల, గాండీ యాడింపగాఁ దలంచు
ముసలముద్గరశూలముల మార్చి చెకుముకి, బందూకలు ధరింపఁ బాటిసేయు
వరుస గీర్వాణముల్ వదలించి వేవేగ, తురకమాటలు నేర్పు కఱకుమీఱ
తే. మీరు దేవత్వము వహించి మేటినంచు, మీఱి వేఱొకరీతిని మెలఁగరాదు, భ.

సీ. సూకరరూపంబు సూచన వనిగదా, విడిచిపెట్టిరి నిన్ను వెర వెఱింగి
బలి బిచ్చమెత్తినబాఁపఁడ వనిగదా, విడిచిపెట్టిరి నిన్ను వెర వెఱింగి
ఢిల్లీశ్వరునకైన యల్లుఁడ వనిగదా, విడిచిపెట్టిరి నిన్ను వెర వెఱింగి
పాఱిపోయినవానిఁ బట్టరాదనికదా, విడిచిపెట్టిరి నిన్ను వెర వెఱింగి
తే. కాకయుంచిన తునకల గడచిపోవ, గలరె మీవంటివారలు క్రమముతోడ, భ.

సీ. శేషావతారవిశేష మెక్కడఁ బోయె, లక్ష్మణాఖ్యునకు సలక్షణముగ
శంఖచక్రాన్వయసంజ్ఞ యెచ్చటఁ జెల్లె, భరతశత్రుఘ్నుల కరయ భువిని
లోకమాతాఖ్య యేలోకంబునకుఁ జేరె, భూమిపుత్రికి నెన్న భూమిలోన
ఆదినారాయణాహ్వాయ మెందులకు నేఁగె, రామాఖ్యముగలమీకు రమణతోడ
తే. తురకలెల్లను దొరవని సరకుగొనక, మంటపాగారముల మట్టుమసలి రహహా, భ.

సీ. చెక్కులు నిమురక సీతొర్మిళాదులఁ, గని యూరకుందురే మనసు నిల్పి
పాఱిపోవఁగనైనఁ బట్టలు నాకక, విడుతురే వైష్ణవ వితతినెల్ల
బిరుసుగడ్డంబులఁ బెఱుకక రిత్తగా, నాదరింతురె వసిష్ఠాదిమునుల
ముక్కులు గఱువక మును మొనకట్టి పో, నిత్తురే కపినాయకోత్తములను
తే. మొగలుబచ్చాల కగుపడ దగదటంచుఁ, తొలఁగిపోతి రిఁకేటికి దొరతనంబు, భ.

సీ. పురలక్ష్మి నురువడి చెఱపట్టి కీడులో. వనలక్ష్మికరపల్లవములు నులిమి
గంగను గదిసి వేగమె ధైర్యలక్ష్మిని, జేకొని ధనలక్ష్మిఁ జెట్టపట్టి
రాజ్యలక్ష్మిని సంగరమునఁ బెండిలియాడి, ధాన్యలక్ష్మిని సరదార్లకిచ్చి
ఘనగజాంతర్లక్ష్మి గైకొని వేవేగఁ, గీర్తికాంతకుఁ గులగిరు లొసంగి
తే. నట్టిధంసాను శిక్షింప నలవిగాక,యడుగుకొంటివి నృపతుల కడుపుకొఱకు, భ...

సీ. 'హరువిల్లువిఱువక వరపుత్రినీయంగ, జనకరా జేమి విచారపడెనొ
పరశురాముని భంగపఱుపఁగా నెంచిన, దశరథుం డేరీతి తల్లడిలెనొ
మిముఁ గాపుఁజేసి యాగముఁ బూర్తిచేసిన, కౌశికుం డేమి వ్యగ్రతఁగొనియెనొ
వనరాశి గట్టి రావణుఁ ద్రుంచఁ గనిన వి, భీషణుం డేరీతిఁ బెగడుపడెనొ
తే. తురకబలకోటివలని యాతురతపోల, వరము వేంచేసినట్టి దుర్వార్తవిని, భ...

సీ. వరుసఁ గోడలిదురవస్థలు విన సారె, కౌసల్య యేగతిఁ గాంచెనొక్కొ
మీశ్రమమెల్ల సుమిత్ర యాలించి గా, సిలి దుఃఖవారాశిఁ జేరె నొక్కొ
కలకాల మీరీతిగడువంగఁ గాలఁబు, కని విందు లేమని వెఱచి రొక్కొ
గతకాలమునఁ బండ్లు కానుక యిచ్చిన, శబరి యేగతిఁ జింతసలిపె నొక్కొ
తే. అహహ భద్రాద్రినుండి మీరరిగి పోల,వరము వేంచేసినట్టిదుర్వార్తవినియు, భ.

సీ. ఆదిభిక్షునిఁ బెండ్లియాడిన పార్వతి, కన్నవస్త్రములకే మాపదయ్యె
కోరి బ్రాఁపనిఁ జేసికొన్న సరస్వతి, కిడుములు వచ్చెనే యిల్లులేక
కాళ్లులేని ఫణీంద్రుఁ గట్టుకొనినయుర్వి, కూరులేదా యెనే యుండుటకును
తనువులేనివయ్యారిఁ దగిలి రతీదేవి, సుఖపడదాయెనే సురలు మెచ్చ
తే. భళిరమీావంటిప్రభుఁ జెట్టవట్టి సీత, సకలవెతలకు లోనయ్యె సరవితోడ, భ... 65
సీ. పొరుగూళ్ళవెంబడి తిరుగుచునుండు ల, క్ష్మీదేవి కేయపకీర్తివచ్చె
సభలలో నేప్రొద్దు సంచరించుచునుండు, వాణి కేమపకీర్తివచ్చె జగతి
వేలారుమనువుల కాలయమైయున్న, భూదేవి కేమి తప్పుఘటిల్లె
శివునిఁ బాసి సముద్రుఁ జెందినపార్వతి, సవతి కే మాడికల్ సంభవించె
తే. తోడునీడయి మీావెంటఁ గూడియున్న, సీతదురవస్థ లేమని చెప్పతరము, భ. 66
సీ. జనకుఁ డిచ్చెను బన్నసరమంచును సురూప, తెలుపు సీతామహాదేవి యిష్ట
జనలతో నూర్మిళ తనతల్లి యొసఁగిన, పచ్చలకళలని బల్కు ప్రాణ
సఖులతో మాండవి సరవి కెంపులనత్తు, పొలుపును గనఁగొని మరియు బంధు
వర్గంబులో జాళువావల్వ శ్రుతకీర్తి, మేనమామ యొసంగె మిథిలయందు
తే. అనుచుఁగొనియాడు పుట్టింటిఘనత మెఱయ, వారినేరీతినోదార్చ వశమునీకు, భ.
సీ. గుజరాతికెంపులకుం లేళ్లు చెవుల ధ, రించదాయెఁగదయ్య వాంఛదీర
వరుణదేవుఁ డొసంగు వజ్రాలకమ్మలు, పెట్టదాయెఁగదయ్య ప్రేమదీర
అలకుబేరుఁ డొసంగు నద్దాలరవికెపైఁ, దొడుగదాయెఁగదయ్య యొడలునిండ
కట్న మింద్రుఁ డొసంగు గంటలమొలనూలు, గట్టదాయెఁగదయ్య కాంక్షదీర
తే. వేడ్కదినములు నడవుల వెంటవెంటఁ, ద్రిప్పితీరి సీత నూఁక తప్పులేక, భ. 68
సీ. తెచ్చితికీర్తి కీర్తివిశారదు లగుని, క్ష్వాకువంశోద్భవఘనులకెల్ల
యేలితి వవనిలో నెలమి శంకరగిరి, హాసనుబాదాలు మహాద్భుతముగఁ
దోలితి వరుల హద్దులు తప్పి రాకుండ, భక్తకోటికి ముద్దుభావమలర
... ... ... ... ... ...
తే. నేమివర్ణింతు మీామాత్రమేమనెంతు, లోకులెఱుఁగంగ నీమూఁడులోకములను, భ
సీ. అల పాకశాసనునైనను యాచించి, చేయించు ముత్యాలచేరుచుక్క
రమణతోడుత ధర్మరాజుకుదయబుట్ట, నడిగి చేయించు ముత్యాలనత్తు
వరుణదేవునినైన వరుసతోఁ బ్రార్థించు, కలకొద్ది జేయించు కమ్మజోడు
రాజరాజును గోరి తేజంబుతో ముందు, నిప్పించు నవరంపుఁ గొప్పె ముందు
తే. పేద ఫోడుము లివియైనఁ బెట్టనున్నఁ, జూపరులకెల్ల మిక్కిలి చులకదనము, భ.



సీ. ఇల్లు నప్పులగంప యిల్లాలు చలచిత్త, పొన్ను నాగులపుట్ట వదినె జ్యేష్ఠ
గొల్ల పెంపుడుతల్లి కోడలు రాఁగ కూఁ, తురు పాఱుఁబోతు ఆత్మజుఁడు సఖుఁడు
మానమఁడు తండ్రి కాముకుఁడు కుమారుండు, క్షయరోగి మఱఁది వంచకుఁడు తండ్రి
అన్న పాసఘనుండు నరయ నిష్టుఁడు పేఁడి, వేసదారివి నీవు వేయునేల
తే. ఇన్నియును నాదు నెమ్మది నెఱిఁగియుండి, కొలిచితిని మిమ్ము విశ్వాసగుణముద్రేల(?) భ.
సీ. పన్నీరు సీసాల పరగనించినభాతి, నెనయంగఁ బ్రమధు మారెత్తురీతి
వరుస ముత్యాలుకోవలు నించినక్రమంబు, మల్లెపూసరములు మలుపుమాడ్కి
విరిజాజిపై సుధావృష్టి దోఁగినరీతి, కస్తూరివీణియల్ గలుపుపోల్కి
పరగ నౌదాతుగంపఁలు పంపినక్రమంబు, తేనెబానల తెరల్ దీసినట్లు
తే. నీదునామామృతంబు నానేర్చినంత, కొల్లలాడెన భక్తులు నల్లసిల్ల, భ .. 72
సీ. సర్వమొఖాసాలు చాలని మీకేల, కట్టడి నేరీతి గడచెనయ్య
బహ్వావసరములు భక్షించు మీరెట్లు, నొక్కప్రొద్దున కోర్చి యుంటిరయ్య
సంగీతసాహిత్యసద్గోష్ఠి గలవార, లొంటి మీరెట్లొదిగుంటిరయ్య
తిరువీథు లెడపక తిరిగెడి మీరెట్లు, గడపదాఁటక ప్రొద్దు గడపితి రహ
తే. వాహనంబులపై నుండువారి కహహ యోడపై నెక్కఁగా నెట్లు గూడెనయ్య, భ.
సీ పదియురెండేఁడుల ప్రాయంబు వాఁడవై, మించి తాటకను శిక్షించు టెఱిఁగి
రణశూరులగు దైత్యగణములఁ బరిమార్చి, కౌశికుజన్నంబుఁ గాచు టెఱిఁగి
తరములఁబట్టి యెత్తఁగరాని హరువిల్లు, చెఱకుకైవడి చేత విఱచు టెఱిఁగి
సంగరరంగవిశారదుఁడైన భా, ర్గవరాము నవలీల గడపు టెఱిఁగి
తే. దూరితిని మిమ్ము రోషంబు దొట్టి రిపుల, మదమణంగించునట్టి సమ్మద మెలర్ప, భ.
సీ ప్రారబ్ధ మనుభవింపని భక్తజనముల, యాతనలను దుంప మీతరంబె
కారణహేతువికారముల్ దప్పింప, నధికులఁ జేయ మీయయ్యతరమె
మిము తొల్లి పూజించి మీవరంబులు గొన్న, ధంసానుగల్వ మీతాతతరమె
గతజన్మమునఁ బెట్ట గతిలేక పుట్టిన, దీనులఁ బ్రోవ నీదేవుతరమె
తే అనుచుజనులెల్లఁగొనియాడవినఁగలేక, దూరితిని నాదు దోషముల్ తొలఁగఁజేయు, భ.
సీ. ఈతఁడా ధంసాను నెదిరిపోరఁగలేక, పాఱిపోయిన రామపార్థివుండు
ఈతఁడాయరికి వెన్నిచ్చి పోలవరంబు, దరికిఁ జేరిన సుమిత్రాత్మజుఁడు
డీపె కాకల సొమ్ములిచ్చి మ్లేచ్ఛులబాధ, పతికిఁ దప్పించిన భాగ్యమూర్తి
ఈతఁడా పగదళం బిదె వచ్చెనని చూపి, భయము బుట్టించిన పావనియని
తే. పల్కుదురు సామి మిముఁ జూచి ప్రజలు కార్య, భారమెఱుఁగక కోపింపవలదు తండ్రి, భ

సీ. పిఱికివాఁ డంటేఁగా యురుదానవాదుల, గర్వమడంచిన ఘనుని నిన్ను
లోభివాఁ డంటేఁగా లోకంబు లెఱుఁగంగ, లంకదానము జేయు రాజు నిన్ను
బలహీనుఁ డంటేఁగా బలిమి సముద్రుని, బాణాగ్రమున నిల్పు జాణ నిన్ను
వెఱ్ఱివాఁ డంటేఁగా వెర వెఱుంగక కోఁతి, గములచే వారధిగట్టినట్టి
తే. మిమ్ము లోకోపకారినైనెమ్మిఁబూని, దూరితిని గాక మీవంటిదొర గలండె, భ.
సీ. అల కుచేలుని చేరెఁ డటుకుల భక్షించిఁ స.పదలొసఁగిన సరసగుణుఁడ
గజరాజు మొసలిచే గాసిలి మొఱవెట్ట, కాచి రక్షించిన కమలనాభ
కలఁ డనఁ బెన్నుక్కకంబంబులో నుండి, వెడలి బాలునిఁ గాచు వీరవర్య
తలఁచిన ద్రౌపది తలఁపువెంబడి మాన, భంగంబుఁ గాచిన ప్రభువరేణ్య
తే. లోభివంటిని పగఱకులొంగితంటి, పిఱికివంటిని నేరక యుఱికితంటి, భ... 78
సీ. పగతుఁడై బహుఫణార్భటిఁ జేరవచ్చిన, కాళియఫణివర్యుఁ గావలేదె
సీతను జెఱఁగొన్న పాతకాగ్రేసరు, ననుజుని శరణన్న మనుపలేదె
మీశరణార్థియై మెలఁగి కావు మటన్న, కాకాసురునితప్పు గడుపలేదె

... ... ... ... ... ...

తే. పృథివిశరణాగతత్రాణబిరుదుగలుగు,దొరవనుచుమిమ్ముఁబలునూఱుదూరినాఁడ,భ.
సీ. పితృకార్యమునకునై పినతల్లికోరిక, వెఱువకతీర్చిన వేల్పు నిన్నుఁ
బాదరేణు వహల్యపాపంబు లెడఁబాపి, ధవుని గూర్చిన పుణ్యధనుని నిన్నుఁ
దగఁ గన్న పగవానితమ్ముని లంకలోఁ, బట్టంబుగట్టిన ప్రభుని నిన్ను
ఘనసుబాహునిఁ బట్టి ఖండించి కౌశికు, సవముఁ గాచిన సర్వసముని నిన్ను
తే. భక్తలోకోపకారార్థపరుఁడ నగుచు,దూరితిని నాదులోపంబుఁ దొలఁగఁజేయు,భ.
సీ. చిలుకకు మాటలు చెప్పి రామా యను, చేడియ మోక్షంబు చెందలేదె
వరుస దారులు దోఁచి వాల్మీకి రామరా, మా యని మీకృపం బ్రబలలేదె
పతిశాపగతినుండి పాదరేణువు సోఁకి, పాషాణ మింతియై పరగలేదె

... ... ... ... ... ...

తే. పృథివి శరణాగతత్రాణబిరుదు నీకుఁ, గాక యితరుల కెందైనఁ గలుగఁగలదె, భ
సీ. కంటినేమో నాదుకఠినచిత్తమునందు, నిలిపిన నీపదనీరజములు
అంటినేమో నాదునఘవంశ మార్గంబో, సంచరించఁగ మేనఁ జెమటలూరి
సోఁకెనేమో నాదుచుఱుకు లోఁజూపులు చూచుచుండఁగ ముఖసుందరంబు

... ... ... ... ... ...

తే. సామి యిఁక నేరములు నీరసంబుఁజేసి,కాచి రక్షించు సత్కృప గడలుకొనఁగ,భ.

# భద్రగిరిశతకము.

సీ. కొల్లలాడితినని కోపింపఁబోకుఁడీ, యవని మీదివ్యనామామృతంబు
పీటేఁబుచ్చితినని వింతగాఁ గనకుఁడీ, కృతులందు మీగుణకీర్తనలు
కాకుఁ జేసితినని కటకటపడకుఁడీ, ధరణి మీ దివ్యకథారసంబు
ఎఱుఁగఁ బల్కితినని యెగ్గుగాఁ గనకుఁడీ, మహిని మీమర్మకర్మంబు లెల్ల
తే. పంచిపెట్టితినని కోపగించవద్దు, సరస మీ పద్యముల్ చెప్ప సంతతంబు, భ ...
సీ. వేయికన్నులుగల వేల్పురాయనికైనఁ, గనుఁగొనరాని శృంగారరూప
వేయినోళులుగల వీనులకంటికైన, వచింపరాని యనంతనామ
వేయిచేతులు గల్గు వేఁడివేల్పునకైన, పూజింపఁగారాని పుణ్యమూర్తి
నాలుగుమోముల నలువొందునుతుకైన, వర్ణింపఁగాఁగాని వరచరిత్ర
తే. తగదు తగదని మూఢచిత్తమున నిన్ను, నిల్పశక్యంబె నావంటి యల్పునకును, భ
సీ. పనుపట్టితే యొక్కపనసుండు చనుదెంచి, యరిబలంబులను జక్కాడలేఁడె
సెలవిచ్చితే యొక్కబలిమిని నీలుండు, నని విరోధులఁ దెగటార్పలేఁడె
ఆనతిచ్చిన యొక్కయంగదుఁ డెదురేఁగి, పగతులయుసురులఁ బాపలేఁడె
... ... ... ... ... ...
తే. స్వామి సాత్త్వికరూపవిచక్షువరుల, యోర్చితిరిగాక తురకలయొదటికెల్ల, భ. 85
సీ. నలనిలకుముదసేనానాయకోత్తముల్, బలసి ముంగల బరాబరులు సేయ
హనుమయు జాంబవదంగదాదులు నిల్చి, యంచలంచలను జోహారు లిడఁగ
వరుస సుగ్రీవ గవయ గవాక్షాదులు, నొంసి మిన్నంటి చామరలు వీవ
పరమభాగవత ఖేచరసిద్ధచారణుల్, జయజయ శబ్దసంచయము నుడువ
తే. సురలు విరులుగురియఁ బోలవరమునుండ, భద్రగిరి జేరువేడ్కలు బ్రస్తుతింతు, భ.
సీ. అంగ వంగ కళింగ బంగాళ నేపాళ, రాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
ఘూర్జర కొంకణ కుకుర కుంకణ చోళ, రాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
చోళ సింధు మరాట లాట మత్స్య విదర్భ, రాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
పాంచాల సౌరాష్ట్ర బర్బర మగధాంధ్ర, రాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
తే. దివ్యతిరునాళ్ళకు సమస్త దేవవరులు, రావలయునంచుఁ జాటింపఁగావలయును, భ.
సీ. శ్రీరామచంద్రులు సీతాసమేతులై, వచ్చిరి భద్రాద్రివాసమునకు
జయనామవత్సర చైత్రశుద్ధాష్టమి, తరువాతదినమందుఁ దగ వివాహ
మరయ మార్గమునందు నోయి సత్రములు బల్, చలువపందిరులు వెచ్చనిజలములు
శీతోదకంబులు చిక్కనిమజ్జిగల్, నిమ్మపండ్లరసంపునీరు చల్ల
తే. లాదిగాఁగల్గుద్రవ్యంబులమరఁజేయ, వలయునని వేగఁబంపుఁడీ వాయుసుతుని, భ...

సీ. తిరిగి రాముఁడు భద్రగిరి కేఁగువార్తలా, లించెనా వజ్రి తాలిలోనంగు
అవనిజాధిపుఁడు భద్రాద్రిఁ జేరుట వినఁ, గల్గెనా జముఁడు చౌకట్లోనంగు
దశరథాత్మజుఁడు స్వస్థానంబు కరుగుట, వినియెనా వరుణుండు మఱు లోనంగు
భరతాగ్రజుఁడు నిజపురము కేతెంచుట, విన్నచో ధనము కుబేరుఁ డోనఁగు
తే నచుచునలనీలజాంబవదంగదాదు, లమరియున్నారుశుభవార్తలరసి చెప్ప, భ...
సీ. కలిమచే బుధులను గానకేనని వారి, వారించెఁ గరుణచే వదినె గారు
నెరిపేదనైనను నిల్చిచేపట్టియు, ధీరునిఁ జేయు పత్నీలలామ
పతితాత్ముఁనైనను బావనుగాఁ జేయు,గుణవతి ముద్దులకూఁతు రరయ
యవివేకినైన విద్యావంతునిగఁజేసి, గురురూప మొనరించుఁ గోడలెన్న
తే. యిట్టిసంపత్తినీకుంటయెఱిఁగియెఱిఁగి, కొలిచితిని వేగ నాకేమికొదువయింక, భ ..
సీ. దయశాలి తల్లి యుదారసాహసుఁ డప్ప, భూభారకుఁడు శయ్యపుష్పబాణుఁ
డరయ పుత్రుఁడు శీతకరుఁడు మఱంది వా, సవసూను విష్ణుఁ డైశ్వర్యయుతుఁడు
నెచ్చెలి దేవయోని దలంప మనుమఁడు, రత్నాకరం బిల్లు రమణిదెన్న
రణశూరుఁ డన్న సారసనేత్ర వర్ణింప, నవతారమూర్తి వీ వవనిలోన
తే. ఇట్టిమిముఁగొల్చు నామది కెటుబుద్ధు, లమర నేర్చునె యెన్నిజన్మములకైన, భ.
సీ. వరుస విద్యలు చెప్ప వదినె సరస్వతి, యాయువుదయ సేయ నన్న యజుఁడు
ముదమీయ నక్షత్రములు మేనయత్తలు, మాకష్టపడఁ జందమామ యరసి
పాపముల్ బాప యప్ప దివిజగంగ తా, నైశ్వర్యమొసఁగ శ్రీహరుఁడు బావ
మాతల్లి ముల్లోకమాత కమ్మనిదీవ, పోషకుఁడవు తండ్రి పొసఁగ నీవ
తే. యిన్నియును నింటఁ గల్గుట యెఱిఁగియితర, దైవముల వేఁడ నాకేల దైవ రాయ, భ.
సీ. బలుసాకు మెక్కి ద్రౌపదిచేత వనములోఁ, బాండవావళిని గాపాడినట్లు
సరవి తెచ్చిన పండ్లసారం బనుభవించు, చెంచుముద్దియను రక్షించినట్లు
అడిగి తెచ్చిన ముక్కయటుకులు భక్షించి, చెలఁగి బాపని ధన్యుఁ జేసినట్లు
పెట్టగానని తౌటిరొట్టెను బ్రతిమాలి, ముసలియవ్వకుఁ గీర్తి యొసఁగినట్లు
తే. పూసపాటినృపాలురఁ బ్రోవఁ దలఁచి, తెచ్చుకొంటిరొ మీఖర్చు వెచ్చమునకు, భ.
సీ. గోత్రికులని పాలుగొట్టి పోలేక మీ, యంశభూతులటంచు నడిగినావొ
పేరుమోసినకట్నె మారసికొంటివో, శూరులనుచు నండఁ జేరినావొ
మీనౌకరులలోన మీఱి మమ్మిట దెచ్చి, ననఁ జూపి వ్యయముల కడిగినావొ
స్థలము వంశజమీరొరునిపోలిక (!) బలుకష్టసుఖములు దెలిపినావొ
తే. యెట్టు దయచేసిరయ్య మీపట్టు మీకుఁ, బూసపాటికులోద్భవు బాస యెఱిఁగి, భ.

సీ. రవికులోత్తమ దశరథ రాజనందన, తాటకమదవిమర్దన మునీంద్ర
మఖపరిపాలన మారీచహార యహ, ల్యాశాపమోచన హరశరాస
నవిభంగనిపుణ జానకినాథ దుర్వార, భార్గవరామగర్వప్రనాశ
పితృవాక్య పాలన ప్రీతచతుర్దశ, లోకదుష్టనిశాటభేకసర్ప
తే. దైత్యమర్దన సుకలాప సత్యదీప, మౌనిమానససారసనుత్తమధుప, భ...
సీ. రణభీమదైత్యమారణహరోమ పుణ్యాకా, రణనామ వినుతచారణలలామ
వనచార పతితపావనసార మౌనిభా, వనపూర వీర రావణకుఠార
జనరక్షకృతపుణ్యాజనదూర వరభక్త, జనపక్షసత్ప్రయోజననిరీక్ష
జితదోష మౌనిపూజిత శేషశయన వా, రిధిశోష పార్థసారథ్యవేష
తే. సరసగుణధామరవికులసార్వభౌమ,దశరథసుపుత్ర దేవకీతాకళత్ర, భ... 96
సీ. వరరూపలావణ్య వైభవా శ్రితశరణ్య, దేవాగ్రగణ్య పార్థివవరేణ్య
ఘనసీరదనిభాంగ ఖగనాయకతురంగ, విజితహేమతురంగ కుజనభంగ
మౌనిమానసభృంగ మథితఘోరభుజంగ, పరిపాలనప్లవంగ ప్రణుతగంగ
భక్తజనమిత్ర పావనచారిత్ర, శతముఖస్తోత్ర కౌసల్యపుత్ర
తే. ధన్యగుణసాంద్ర రఘుకులతారకేంద్ర, సవనసంరక్ష యాశ్రితజనకలాప, భ. 97
సీ. జలజాక్ష ఘనరాక్షసవిపక్ష మునిపక్ష, రణశూర వరచారరఘుకుమార
అరిశోష మునివేష సురపోష మృదుభాష, రఘుపుంగవ భుజంగరాజభంగ
శరచాపధర పాపహర భూపకులదీప, రతిరాజజయతేజ హితసమాజ
మురభీమ సురసోమ వరనామ గిరిధామ, సురపుంగవశుభాంగ సుప్రసంగ
తే. భక్తపరిపాల గుణలోల భవ్యశీల, దివ్యమంగళవిగ్రహ దీనరక్ష, భ. 98
సీ. శరణు త్రిలోకరక్షణ మౌనిసన్నుత శరణు సద్భక్తరంజనచరిత్ర
శరణు విశ్వామిత్రసవనసంరక్షణ, శరణు గౌతమపత్ని శాపహరణ
శరణు మారీచభంజన వార్ధిబంధన, శరణు ప్లవంగపోషణ ముకుంద
శరణు వైకుంఠవాస విశాలలోచన, శరణ మిక్ష్వాకువంశజ మహాత్మ
తే. శరణు వాసవసుత శేషశయన శరణు, శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గహస్త, భ. 99
సీ. రామదాసాదుల రక్షించినట్టుల, నెలమితోడఁ గుచేలు నేలినట్లు
ప్రహ్లాదనారదప్రభృతిఁ బ్రోచినయట్లు, సరవితో ముచికుందు సాఁకినట్లు
అల ద్రౌపదికి వల్వలాదుకొన్నట్టుల, గజరాజు నవనిలోఁ గాచినట్లు
శబరివిందుకు సంతసంబు నొందినయట్లు, మహిని ఘంటాకర్ణు మనిచినట్లు
తే. నన్ను దయనేలు నేరము లెన్న కవనిఁ మూఢచిత్తుఁడ నవివేకములు హరించి, భ.

సీ. మొదలఁ గావ్యము లేశమును బఠింపఁగలేదు, శబ్దజాలములవాసన యెఱుంగ
ధర విభక్తి జ్ఞానసరణి యేమియులేదు, లక్షణశక్తిచాలదు తలంప
గ్రంథశోధకుఁడను గాను వ్యాకరణసూ, త్రములవలేశమాత్రము నెఱుంగ
అవని మీదివ్యనామామృతశక్తిచేఁ బూనితి నీకావ్యబూటకంబు
తే. మున్ను నన్నయ నాపు రాయన్న ఘనుని, పగిదిదయజూడవలయునాపదలుదోలి, భ.
సీ. నదులు తీరద్వయం బదలించి పాఱుచో, నెదురేఁగు మీనముల్ గుదులుగూడి
వనవసంతాగమదినములఁ గోయిలల్, మొగమిచ్చి పలుకును వగలు గులుక
సరవి మేఘోత్పత్తి సమయంబునను శిఖి, పరికించి యాడు నంబరము గాంచి
సిరిగల్గువేళలఁ బొమదయాళుర్రై, పురబంధుజనములు పూజసేతు
తే. రితరకాలంబులను వార లెగ్గుసేతు, రేమి వివరింతు మాయలసామి నేఁడు, భ.
సీ. రమణతోఁడుత విభరాహీముఖానుని, యేల పుట్టించెనో యిలను బ్రహ్మ
పుట్టించెఁ గాక యీపుడమిలోపల నేల, ఫాజీలు బేగని పలుకఁ జేసె
పల్కు జేసినవాఁడు పదవి చాల యొసంగి, ధర జాల్దుంగు... పేరయేల
తెచ్చెఁ దెచ్చినవాఁడు దృఢచిత్తుగాఁ జేసి, ధంసాయను కితాబు ధరణి నొసఁగె
తే. యొసఁగి మిము గెల్చుసాహసమొనరయేల, జేసెనోయని మదిచింతచేయవలదు, భ.
సీ. రమణకౌడిన్యగోత్రపవిత్రుఁడను లింగ, నకుఁ బౌత్రుఁడను బెద్దనకును బుత్ర
వరుఁడఁ బేరయనామధరుఁడ భల్లావంశ, వనధిసోముఁడ బుధవర్గ మురర
వలస వేంచేసిన వరుస యాస్పదము నా, మదిలోన భావించి ముదమొప్ప
ఘనత వ్యాజస్తుతిగా నొనర్చితి సీస,శతక మష్టోత్తరశతము గాఁగ
తే. చిత్తగింపుముహంసంబుక్షీరములను,గ్రాహ్యమొనరించుచందంబుగడలుకొనగ, భ.
సీ. కేశవ మాధవ కృష్ణ హృషీకేశ, నారాయణ ముకుంద నారదనుత
పద్మనాభాచ్యుత ప్రద్యుమ్న శ్రీధర, వామన గోవింద వాసుదేవ
విష్ణ్వనిరుద్ధ త్రివిక్రమాధోక్షజ, నారసింహ జనార్దన మధుసూద
న యుపేంద్ర సంకర్షణ పురుషోత్తమ హరి, దామోదరానంత దానవారి
తే. అఖిలలోకాధినాథదవ్యాంఘ్రిపద్మ, ములకుఁబ్రణమిల్లెదను ముదమలరనేలు, భ.
సీ. జయ రఘుకులదీప జయ దశరథపుత్ర, జయ భరతాగ్రజ జయ ముకుంద
జయ తాటకాంతక జయ దుఃఖపరిపాల, జయ యహల్యాపోష జయ యుపేంద్ర
జయ హరధనుఖండ జయ జానకీనాథ, జయ భృగుసుతభంగ జయకృపాబ్ధి
జయ వనసంచార జయ వాలిమర్దన, జయ వార్ధిబంధన జయ మురారి
తే. రావణాంతక సాకేతరమణ నీదు, వలస శతకము వినువారివలస లుఘుగు
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస, పోషబిసుకాంక రఘుకులాంబుధిశశాంక.

భద్రగిరిశతకము సంపూర్ణము.



శ్రీరస్తు

# భక్తచింతామణిశతకము



మద్భూమిధరాధిరాజ తనయా చిత్తాంబుజద్యోమణీ,
వ్యామోహార్ణవతారణైకతరణీ బాలేందు చూడామణీ
ప్రేమాభ్యంచితకంకణీకృతఫణీ బృందారకగ్రామణీ
స్వామీ నామదిఁ బాయకుండు శివసాంబా భక్తచింతామణీ. 1

మ. నతగీర్వాణ మురారిబాణ కృతనానాలోకనిర్మాణ సం
తతసర్వోపనిషత్ప్రమాణ త్రిజగత్కల్యాణ సద్భక్త సం
తతి సంత్రాణధురీణ పుంగవల సత్కంఖాణ భాస్వన్మహా
పతితోద్ధార కళాప్రవీణ శివసాంబా భక్తచింతామణీ. 2

శా. రాజద్దివ్యధునీకుటుంబ మునిహృద్రాజీవరోలంబనా
నాజీవాత్మభిదావిడంబ పరమామ్నాయస్తవాలంబ నీ
రేజాతాక్షమహాకదంబ దురితాద్రిప్రచ్ఛిదాశంబ వి
భ్రాజద్భక్తజనావలంబ శివసాంబా భక్తచింతామణీ. 3

మ. ఘనవైశ్వానరదృగ్లలాట విలసద్గంగా జటాజూట పా
వనరౌప్యాచలకూట వేదచయభాస్వద్ఘోట లోకప్రజా
వనలీలాధృతకాలకూట హతగర్వగ్రస్తదోషాట శో
భనచంద్రార్ధకళాకిరీట శివసాంబా ను... 4

మ. నలినీబాంధవకోటిధామ రిపుసేనాభీమనిష్కామ ని
ర్మలధామా హతకామవిద్వదభిరామారామ సుత్రామ గీ
తలసన్నామ విపద్విరామ నిజభక్తస్తోమ సుక్షేమ ప
ల్వలసద్గ్రామ లలామధామ శివ... 5

మ. విలసద్భద్రతురంగ రంగదజహృద్విజ్ఞానయోగాతి ని
ర్మలయోగప్రియసంగ సంగరరిపుప్రాణానిలాహారకృ
ద్బలవద్బాణభుజంగ జంగమపురీదాహక్రియాచంగ ప
ల్వలపుర్యంబుజ సంగి భృంగ శివ... 6

మ. స్వపశోద్యజ్జగదండ దండధరగర్వధ్వాంత మార్తాండ తాం
డవలీలాధృతకాండ కాండచయ దీర్ణక్రూరవేదండ జ్ఞే
యవిధానంవిదఖండ ఖండ శశిచూడాలంకృియాభోగ వై
భవవిఖ్యాత సురప్రకాండ శివ...

మ. అలఘుశ్రీకరసుందరాంగ కరుణోదారాంచితాపాంగని
స్తులకారుణ్యయుతాంతరంగ హిమవత్పుత్రీపరిష్వంగ మ
త్తలతాంతాశుగగర్వభంగ మునిహృత్పంకేజసారంగ ని
ర్మల గంగాకలితోత్తమాంగ శివ...

మ. నిలయీభూత బుధాంతరంగ త్రిజగన్నిర్మాణ రక్షాదిని
స్తులకార్యాభినయప్రశస్తవిచలద్భ్రూభృంగ భక్తవ్రజో
జ్జ్వలచిత్తాంబుజమత్తభృంగ సముదంచత్కోటి కందర్పకో
మలరేఖాయుత మంగళాంగ శివ...

మ. జలజాత ప్రభవాచ్యుతాది సుమనస్సందోహ సంస్తూయమా,
నలసన్మంగళ దివ్యవేష గిరికన్యాచిత్తసంతోష యు
జ్జ్వలబాలేందు కళావిభూష కరుణాసంపోషితాశేష ని
ర్మలకారుణ్య సుధీవిశేష శివ...

మ. కలశీసంభవ గౌతమాత్రిశుక మార్కండేయ భృగ్వాదిమా
నిలలామావళి గీయమానమహిమోన్మీలత్సుధామాధురీ
లలితాత్మీయకథాప్రసంగ శ్రిత కైలాసాంచలోత్సంగ భూ
వలయాభంగ శతాంగ లింగ శివ...

మ. స్వవిభానిర్జితకోటిసూర్య పరతత్త్వజ్ఞానదాచార్య లో
కవితానావనకార్య దీనజనరక్షావిశ్రుతౌదార్య వి
ష్ణువిధీంద్రాద్యనివార్య వీర్య సకలస్తోత్రార్హ చాతుర్య భ
వ్యవిమోక్ష ప్రదకీర్తిధుర్య శివ...

మ. కలిదోషఘ్న నిజప్రసంగ త్రిజగత్కాండాయమానాంగ దు
ష్కలుషాదభ్రతమఃపతంగ బుధహృత్కాసారచక్రాంగని
శ్చలసుధ్యానపరాయణార్యభవపాశప్రచ్ఛిదాచంగ కే
వలవిజ్ఞానమయాత్మసంగ శివ...

మ. కృతనానాజగదింద్రజాల త్రిజగద్గీతాభిధాజాల సం
తతభక్తావనలీల ఘోరభవసంతాపార్తి నిర్మూల వ

శ్రితసత్కీర్తి విశాల శైలవరపుత్రీలోల దీనావనా
వ్రతిమోద్యత్కరుణాలవాల శివ...

మ. పరతత్త్వోపనిషద్విహార వినమద్భక్తౌఘమందారదు
స్తరసంసారభయాపహార జగదాధారా గుణోదార భా
సురనామామృతసార నిర్మలపరంజ్యోతిర్మయాకార స
త్త్వరజోముఖ్యవికారదూర శివ...

మ. నిజమాయాకృతసర్వలోక వినమన్నిత్యామృతాలోక వి
శ్వజగత్పాలన జాగరూక దివిషద్వంద్యాంఘ్రినాళీక భ
క్తజనాస్తోకతమోవిమోక పరిధూతస్వాశ్రితానేక జ
న్మజరామృత్యుభయైకశోక శివ...

మ. పరసంత్రాసకరప్రతాప శమిత బ్రహ్మాదిసంతాప దు
ర్భరమోహాంధమతఃప్రదీప విలసద్భర్మాద్రిరాట్చాపశ్రీ
కరసత్కీర్తికలాపనిత్య నిజభక్తవ్రాతనిక్షేపచి
త్పరమానంద మయస్వరూప శివ...

మ నతభక్తవ్రతకల్పభూజ విలసన్నానాజగద్బీజ ర
క్షితగీర్వాణసమాజ పావనతర శ్రీమత్పదాంభోజ
వర్ణితకోటి గ్రహరాజతేజ కరుణానిర్వ్యాజ దీనావన
వ్రతపారీణ సురారి రాజ శివ...

మ. సవిలాసాగతదక్షయాగ భవమోక్షప్రాభవాభోగ హై
మవతీ సంగతవామభాగ సకలామర్త్యావనోద్యోగ సా
ధువరానందకరాత్మయోగ దృఢచేతోభావపుర్దాహసం
భవభస్మోల్లసితాంగరాగ శివ...

మ. అవనీభృత్తనయాకళత్ర సమరజ్యాఖండితామిత్ర దు
ర్భవదుఃఖాంబుధియానపాత్ర సితభాస్వద్గాత్ర పంకేజబాం
ధవచంద్రానలనేత్ర నిర్మల జగత్కళ్యాణచారిత్ర స
త్ప్రవిమరస్తోత్ర జగత్పవిత్ర శివ...

మ. అమిత శ్రీకరసుప్రసాద నిజభక్తాభీష్టదాహ్లాద యా
గమసంచారవినోద దీనజనరక్షాసంతతామోద దు
ష్టమహాపాపవిభేద ఘోరభవపాశచ్ఛేద బ్రహ్మాచ్యుత
ప్రముఖాభ్యర్చితపాద శ్రీద శివ...

మ. పదపద్మార్చక కల్పవృక్ష త్రిజగత్పాపచ్ఛిదాదక్ష దు
ర్మదదైతేయవిపక్ష విశ్వలయనిర్మాణావనాధ్యక్ష చం
ద్రదినేంద్రజ్వలనాక్ష భక్తనివహోద్యద్భూరిసన్మంగళ
ప్రదరాజత్కరుణాకటాక్ష శివ... 22

మ. ధవళాంచద్దరహాస మౌనిహృదయాంతర్వాస నిస్సీమవై
భవకైలాసనివాస భూరినిజసద్భక్తావనోల్లాస స
త్ప్రవరస్వాంతవికాస భాస్వదఖిల బ్రహ్మాండభాండావళీ
భవరక్షాలయ కృద్విలాస శివ... 23

శా. మున్నా ఘోరహాలాహలాగ్ని త్రిజగంబుల్గాల్ప నీవంతట
న్వెన్నుండాదిగ వేలుపుల్మొఱలిడ న్వేవచ్చి నీవావిషం
బన్నాఁడాని జగంబుఁ గాచి తటయన్నా యెన్న నీకన్న నా
పన్నత్రాణపరా యణుల్గలరె సాంబా భ... 24

శా. సారోదారసుభక్తి బాణుఁడు నమస్కారంబు గావించి యిం
పారన్వేఁడిన వానియింట సకుటుంబారూఢిగానుంటివి
ల్లైరీ భక్తమనోరథంబు లిటువా రీవిశ్వమం దెంతయు
న్బారంజూచిన నీవకాక శివ... 25

మ. క్షితిలోఁ బల్మఱు బోయకన్నఁ డిడునుచ్ఛిష్టోప హారంబుల
ప్రతిమప్రీతిఁ బరిగ్రహించి యపవర్గప్రాప్తిఁ గావించితా
పతితోద్ధారకళానిరూఢబిరుదప్రఖ్యాతికిం జూడ నీ
ప్రతిలేఁ డెవ్వఁడు దైవకోటి శివ... 26

శా. రిక్తాచారుఁ డొకండు పేర్మి శివరాత్రి న్వేశ్యతోఁ గూడి సం
సక్తిం దత్కుచసీమ నీకు నొకపుష్పంబుంచి యర్పించినన్
రక్తిం బ్రోచితి వౌర భక్తసులభప్రఖ్యాతి నీయందె సు
వ్యక్తంబైనది గాని లే దెచట సాంబా భ... 27

మ. అరుదార న్శివరాత్రియందొకఁడు చౌర్యాసక్తి యుష్మద్గృహాం
తరదివ్యస్థలి జాగరాప్తి గనుమాత్రన్ముక్తుఁడై యేగని
న్నిరతాసక్తి భజించువారికరుదా నిర్వాణలక్ష్మీవిని
ర్భరసంశ్లేషసుఖాబ్ధిఁ దేలుటకు సాంబా భ... 28

మ. సురలాస న్సురగ్రోలువేళ గముతాచు న్వచ్చి రేగాని వా
రరయన్ లోకహితార్థ మాగరళ మింతైనం దినంజాలరె

వ్వరు లోకేశ్వర నీవుదక్క నిఁక విశ్వత్రాణ సామర్థ్యమె
వ్వరికైన న్గలదా త్వదన్యులకు సాంబా భ... 29

శా. భక్తింబాయక ఫల్గునుండు భజియింపన్మెచ్చి దేవీసమా
యుక్తిన్నీవు కిరాతవేషమున రా నుద్వృత్తిఁ బోరాడి య
వ్యక్తుండై ప్రహరించియంత వరలాభంబిచ్చినావయ్య నీ
భక్తానుగ్రహ మేమిచెప్ప శివ... 30

మ. గరిమ న్నీశరణంబుసొచ్చినయు మార్కండేయు రక్షించి దు
ర్భరవైవస్వత భీతిమాన్పి తఁట నీ వాత్సల్య మెన్నంగ నా
తరమా నీచరణానతార్థి జనసంత్రాణైకదీక్షావని
ర్భరభాస్వద్బిరుదంబు నీకతగు సాంబా భ... 31

మ. అలకాధీశునకిచ్చినావు నవసంఖ్యాకాక్షయశ్రీనిధుల్
జలజాక్షునకిచ్చినావు నిజభాస్వద్దివ్య చక్రంబుఁ బెం
పలర న్వజ్రికొసంగినావతులదివ్యప్రాభవం బాభళీ
బళి నీసాటివదాన్యుడేఁడి శివ... 32

శా. బాతామర్షత బ్రహ్మమూర్ధముఁ దృణప్రాయంబుగాఁ ద్రుంచియు
న్నాథంబౌకృప సాలెపుర్వునకు మోక్షంబిచ్చియున్ మించితో
రూఢిం జెప్పఁగనేల తక్కినసుపర్వుల్నిగ్రహానుగ్రహ
ప్రౌఢి న్నీకు సమానమెవ్వరిఁక సాంబా భ.... 33

మ. గురుపత్నీగమనోగ్రపాతకకళంకుండైన చంద్రుండు నీ
శరణన్నంతనె నెత్తిఁబెట్టుకొని వాత్సల్యంబు సంధిల్లఁగాఁ
బరిరక్షించితి విట్టియాశ్రితకృపాపారీణు లింకెందు నుం
బరికింప న్మఱిలేరిఁ కెవ్వరును సాంబా భ... 34

శా. లేరే వేలుపులెందఱేని మిగుల న్లెక్కింప వారెవ్వరుం
గారుణ్యంబున భక్తవత్సలత మోక్షప్రాభవారూఢి నిం
పారం దావకదివ్య సన్మహిమ లక్షాంశంబునంబోలలే
రారా మ్రొక్కిన నీకె మ్రొక్కవలె సాంబా భ... 35

మ. గ్రహరాజుం గని నీవు పండులురులంగా గొట్టునవ్వేళ నే
గ్రహచారంబులుఁ జాలకుండె మఱి యాబ్రహ్మోత్తమాంగంబు బల్
రహి నీచేఁ దెగనేవిధాతనొసటన్ వ్రాసె న్భవద్దివ్య స
న్మహిమ ప్రాభవ మింతె కాక శివ... 36

శా. నీచారిత్రము బల్విచిత్రముగదా నీసేవకశ్రేణికిం
పౌచిత్రాంబరరత్నభూషణ సుధాహారాదికం బిచ్చి నీ
వాచర్మాంబర మస్థిమాలయు విషాహారంబుఁ గైకొంటి వా
హా చాతుర్యము చెప్పఁగా, దరమె సాంబా భ .. 37

మ. అనుమానంబుఁ దలంప వాద్విజవధాద్యత్యంత ఘోరాఘముల్
కనమైనం బరికింపఁబోవు ఘన రాగద్వేషలోభాదులన్
గణనంజేయవు జాతిధర్మవిధి భంగంబుల్ రవంతేనియుం
బ్రణతాభీష్టవరంబు లిచ్చుతటి సాంబా భ... 38

మ. గరువ న్విప్రుఁ డొకండు చేత శివలింగంబుంచి పూజింప నం
తనుమం దజ్జనకుండు గాంచి పడఁదన్న న్వాఁడు క్రోధాప్తిఁ ద
చ్చరణంబు ల్దెగఁ ద్రుంచి తత్క్షణమ యస్వప్నాకృతిం జెందె నీ
పరిచర్యామహిమ ల్విచిత్రములు సాంబా భ .. 39

మ. బలభిన్ముఖ్య మహత్కిరీటమణి దీపశ్రేణి నీరాజితో
జ్జ్వల పాదాబ్జుఁడవైన నీకు సరిపోల్పన్ దైవముల్లేరు శ్రీ
వెలయం గన్గొన నీకుసాటి సతినీవే గాని విశ్వంబులోఁ
బలుకు ల్వేయునిఁకేల చాల శివ... 40

శా. శ్రీరాముండు కపిస్వరూప దివిషత్సేనాసహాయాదినం
భారుండై శతయోజనాయుతముగా బంధించియున్నట్టి యా
వారాశిం దమి నొక్కగుక్కగను ద్రావం గుంభజుం డొప్పుటే
పార న్నీపద భక్తిసన్మహిమ సాంబా భ... 41

మ. తనర న్సర్వసుపర్వులం దుఁ బరతత్త్వం బెవ్వరో సత్యభా
వనతోఁ దెల్పుమటన్న వ్యాసుఁడు "నదైవం వాసుదేవాత్పరం"
బని చేయెత్తి వచింప నంత నిజబాహాస్తంభనంబైన స
ర్వనిరూఢిం బరతత్త్వమీవనఁడె సాంబా భ... 42

మ. పురసంహారమఖాపహార నలినోద్భూతోత్తమాంగచ్ఛిదా
స్మరదాహాంతకనాశ మృత్యుజయభీమ క్ష్వేళపానాదిదు,
ష్కరకృత్యంబులు నీవొనర్చు కతనన్ సర్వేశ్వరుండంచు నని
న్బరమామ్నాయము లెంతయుం బొగడు సాంబా భ... 43

మ. తలఁదావంచుకొనె న్ఫణీందుఁ డతిచింతన్వాగ్వరారోహ వె
ల్వెలఁబాఱెన్ విధియేమిటోఁ పశయె నిర్విణ్ణాత్ముఁడై నద్దెస

ల్గలయం గన్గొనుచుండె గీష్పతియు శంకన్మాధ్యముం బూనె ని
న్వలనొప్ప న్నినుతింపఁజాలమిని సాంబా భ... 44

మ. అలవిత్తేశుఁడు మిత్రుఁడై విమల రౌప్యాహార్య మావాసమై
బలు మేల్బంగరు కొండ మేటిధనువై భాసిల్లు నా సర్వమం
గళ భార్యామణియైన నిన్ గొలుచు భాగ్యం బబ్బునే యీ జగ
ద్వలయం బందును నెంతవారికిని సాంబా భ... 45

శా. కళ్యాణాత్మక మైనచాప మురుభోగశ్రేష్ఠమా నారి సా
కల్యానూన రమానివాస మగు సత్కాండంబు భద్రప్రదా
మూల్యంబై తగువాహనంబు గల ని న్బూజించిన న్భాగ్య సా
ఫల్యంబా టరుదే ప్రసన్నులకు సాంబా భ... 46

శా. సత్యజ్ఞానసుఖస్వరూప మగుని శశ్వన్మహత్త్వంబు దా
నత్యంతాద్భుతమై పవిత్రకరమై యజ్ఞానవిధ్వంసియై
నిత్యశ్రీకరమై చెలంగు నిదిగో నిక్కంబు సర్వశ్రుతుల్
ప్రత్యక్షంబుగఁ జాటుచుండు శివ... 47

మ. వెలయ న్సర్వసుపర్వరూప మగు నీవిశ్వరూపంబు కే
వలరూఢి న్భజియింపలేక బహుదైవభ్రాంతిఁ బెక్కండ్రు మూ
ర్తుల సేవింపఁగ వారికిం దదుచదోృగాను రూపంబుగా
ఫలదానంబిడు మేటి వీవగద సాంబా భ... 48

మ. అరయ న్భూజలవహ్ని వాయుఖరవింద్వాత్మాష్టకం బెన్న నీ
పరమూర్త్యష్టకమై యొసంగ నఖిల బ్రహ్మాండ భాండోత్కరం
బుదహం బ్దజలబుద్బుదోపమమునై పుట్టు న్మనుం గిట్టు నీ
పరమానందమయ స్వరూపమున సాంబా భ... 49

శా. లీలానిర్మితనైకకోటి ఘననాళీకోద్భవాండచ్ఛటా
మాలాజాలపరాత్పరస్వరూపమగు నీ మాహాత్మ్య మింతైన నా
నాళీకాక్ష చతుర్ముఖాద్యమరు లెన్నంజాల రన్నాళ్ళకుం
బ్రాలేయాచలకన్యకారమణ సాంబా భ... 50

మ. తనియ న్మేటిమనోరథార్థములఁ బొందన్వచ్చు నుద్యద్విప
ద్వనధుల్దాఁటఁగవచ్చు నశ్రమత విశ్వంబుల్లఁ దెల్లంబుగాఁ
గనఁగావచ్చు సకృజ్జపంబున నె వీఁకన్ శైవపంచాక్షరీ
మనురాజం బఖిలార్థసాధనము సాంబా భ... 51

శా. చేతోవీథిభవత్పదాంబుజముఁ దాఁ జింతించి యెందేగినన్
భూతప్రేతపిశాచరాక్షసగణంబుల్ వోవుసవ్యై యసం
ఖ్యాతాపన్నిచయంబడంగు నిరపాయాత్యంతసన్మంగళ
వ్రాతంబుల్ ఘనకూడు నిక్కమిది సాంబా భ... 52

మ. నుదుట న్భస్మ మలంకరించి యఱుతన్ రుద్రాక్షముల్దాల్చి శ్రీ
లదలిర్ప న్భవదీయ దివ్యచరితల్ గానంబు గావించుచు
న్మదమొప్ప న్విహరించు వానిఁ గని తా మోహాతిరేకంబుచే,
వదలంజాలదు ముక్తికాంత శివ... 53

శా. నీలీలాచరితావళుల్ వ్రాగఁనువానిం జూచి భీతాత్ములై
జాలింబొందుచుఁ గాలకింకరులు తత్స్వామిప్యమందుండకే
చాలంగాఁ బఱువెత్తిపోదురఁట మించన్ దవ్వుగా నోజగ
త్పాలారాధిత పాదపద్మ శివ... 54

శా. నీదాక్షిణ్యము నీకృపాతిశయము న్నీభక్తవాత్సల్యము
న్నీదీనార్థికనైకపోషణము నీ నిర్వాణసంధాన మిం
కేదైవంబులయందుఁ గాన మిఁక వేయేలా గణింపంగ నీ
పాదాబ్జంబులఁ గొల్చి ముక్తుఁడగు సాంబా భ... 55

శా. నీకర్పించిన పత్రపుష్పఫలపానీయంబు లుద్యన్మణాస్తోకే
భేంద్రమనోజవాశ్వ విలసత్పూర్ణేందు బింబాననా
ద్యాకారంబులఁ బుట్టి పూర్వభవవిద్యాయుక్తిఁ బ్రాకమ్రాజిక
ప్రాకారంబులఁ బాయకుండునఁట సాంబా భ... 56

మ. పరుసం బాపులితోల్కు పైనిడి చితాభస్మంబు మైఁబూసి య
ప్పురమాపున్కసరు ల్ధరించి జగము ల్పుట్టించుచుం ద్రుంచుచుం
బరమాయాకలితేంద్రజాల మనుదొప్పంజేయఁగాఁ గాటికా
పరివై యుండితివౌ బళీబళిర సాంబా భ... 57

మ. ధరణి న్రాజశిఖామణి న్గొలిచి వేదండాశ్వరత్నాంగనా
స్థిరభాగ్యంబులఁ గాంచునందు రది యెంతేవింతగాదా దిగం
బరు నాయాదిమభిక్షుని న్గొలిచి శశ్వత్పాపిభవప్రోల్లస
త్పరమైశ్వర్యముఁ గాంచుచుండ శివ... 58

మ. వివిధామ్నాయపురాణశాస్త్ర మనుసద్విద్యారహస్యంబులన్
హవనాదిక్రియల న్ప్రియాగముఖ దివ్యక్షేత్రరాజ్యంబుల

న్వివరింప న్సకలప్రపంచమును నీవే కాని విశ్వంబులో
భవదన్యం బిసుమంత లేదుగద సాంబా భ... 59

మ. జలజాతాక్ష చతుర్ముఖ త్రిదశభాషా శేషవాచస్పతుల్
పలుక న్నేరరు నీప్రభావలవముం భావింపలే రట్టిచో
నిల నేనెంతటివాఁడ నీదుమహిమం బెన్నంగ నోలింగ భ
వ్యలసద్భూరిదయాంతరంగ శివ... 60

మ. ఫలపర్ణాంబుసుమంబు లిచ్చిన ననల్పశ్రీత్రిలోకీ సము
జ్జ్వలసామ్రాజ్య మొసంగి నీవు తుదమోక్షం బిచ్చుచుండంగ నీ
సులభోపాయ మెఱుంగలేక మనుజుల్ క్షోభింతు రేమొక్కొ యు
త్పలినీ బంధుకళావతంస శివ... 61

మ. చెనకన్వచ్చి మనోజుఁ డంతటనె భస్మీభూతుఁడై పోయె నీ
మన దక్షుండు నిరాకరించి చటులాస్తోకార్తిపాలయ్యెఁగా
న నిఁకెవ్వండు శివాపరాధమణువైనం జేసి చేటొంద కే
మనఁగా నేర్చు జగంబులోన శివ... 62

మ. క్షితి నానావిధమర్త్యకోటిఁ దమవాసిం బ్రోవఁగాఁ బూని దై
వతముఖ్యు ల్దగుపాళ్ళు వెట్టికొని రిబ్భంగిన్; యతుల్విష్ణుపా
ల్క్రతుకర్త ల్నతమన్యుపాలు శ్రుతిధర్మజ్ఞుల్ చతుర్వక్త్రుపా
ల్పతితానీకము నీదు పాలు శివ... 63

మ. అలఘోదారతఁ బూను నాయెడను నీ కర్పించినిన్ మ్మేను నీ
చుల యాచింపఁగ లేను నీవెగతియంచు న్నమ్మియున్నాను దీ
నులతోఁ బంతముమాను నీకిపుడు నన్బ్రోవ న్వశంబౌను న
న్వాలదన్నన్నిను మానఁబోను శివ... 64

శా. ఏదైవంబులవంకఁ జూడ నిఁక నేనెట్లైన నిన్వీడ
వేదిక్కంచిటు లున్నవాఁడఁ బలుకు ల్వేయేల నీవాఁడ నీ
వాదేలా ననుఁగన్నవాఁడ వెపుడున్బల్మాఱు నాతోడ నీ
పాదంబు ల్నెరనమ్మినాఁడ శివ... 65

శా. ప్రారబ్ధంబను బల్నెపం బొకటి నాపై వేసి యాపై మహా
దారాపత్యధనాదిపాశముల చేతంగట్టి దుర్వార సం
సారాబ్ధిం బడఁద్రోసి నీవటు తటస్థప్రౌఢితో నుండ్రి యు
య్యారే చిత్రము చూతువౌర శివ... 66

మ. చెలిమిన్ గుబ్బలిరాచకూఁతు రజుహ్మైఁ జెన్నొప్ప లేనవ్వు వె
న్నెలనిగ్గు ల్దిశలెల్లఁ గప్పఁ జెలువౌ నీరూపు బాగొప్పనా
కలలోనైన నను జూపుమప్ప యడుగంగారానిదే తప్ప న
న్నలఁతం బెట్టిన నేమిగొప్ప శివ... 67

మ. శివనామం బొకసారె భక్తివిభవ శ్రీమీఱఁగాఁ బల్కిన
న్వివిధాపన్నిచయంబడంగుఁ దతదుర్విఘ్నౌఘము ల్గ్రుంగు ను
త్సవము ల్పెక్కుచెలంగు నిత్యపరతత్త్వశ్రేయ ముప్పొంగుఁ ద
ద్భవబంధంబులు ద్రుంగు నిక్కమిది సాంబా భ... 68

మ. సవనవ్రాత మొనర్ప నేల పశుహింసల్సేయఁగా నేల యో
గవిధానంబులు పూననేల తనువింకం జేయఁగా నేల తా
వివిధాభీష్టములొందవచ్చు సుఖమై విశ్వేశ సద్భక్తితో
భవదంఘ్రిస్మరణంబుఁ జేసి శివ... 69

మ. ఖలసాంగత్యము గాదు చేసినను దుఃఖంబీకనే పోదు పె
ద్దలసాంగత్యము మానరాదు మతభేదంబుల్ వృథావాదు ని
శ్చలసారం బగు నీదు భక్తి వరమోక్షప్రాప్తికిం బాఁదు మో
హాలతల్ ద్రుంపక ముక్తిలేదు శివ... 70

మ. పరుల న్బాధలొనర్చి బల్ధనముసంపాదించి విఖ్యాతికై
ధరలోఁ జేసిన యట్టిధర్మములు వ్యర్థంబై చనుఁగాక సు
స్థిరతం బొందునె సర్వభూతపరితృప్తుం జేయుటే నీమహా
పరిచర్యాకరణంబుగాదె శివ... 71

మ. క్షితిలోఁ గొందఱు వారివారిమతముల్ శ్రేష్ఠంబు లన్యంబులౌ
మతముల్గావని చెప్పుచుందు రిది నీమాయావృతభ్రాంతి సం
తతనానావిధజంతు సంతతిహృదంతర్యామివౌ నీకు స
మ్మతి గానట్టిమతంబునుం గలదె సాంబా భ... 72

మ. అరయ న్నీవపరోక్షత న్నిఖిలభూతాత్మస్వరూపుండవై
పరిపూర్ణస్థితినుండఁ గన్గొనక నిన్భావింతు రెందో జనుల్
పరమేశా భవదీయమాయఁ దెలియం బద్మోద్భవాదిత్యగో
పరమేశాదులకైనఁ బోలదట సాంబా భ.. 73

మ. విపరీతార్థకుతర్కవాదములచే విజ్ఞాన మొప్పారునే
కపటాచారవిడంబనక్రియలచేఁ గైవల్య మేతెంచునే

చపలాశావిషయోపభోగములచేఁ జల్లారునే తృష్ణ నీ
యపరోక్షానుభవంబులేక శివ... 74

మ. కలివేళ న్విధిచోదితక్రియలొగింగావింపఁగా లేక తా
రలసుల్లాండఱు తత్త్వవేదులము మేమంచు న్స్వకర్మంబులి
మ్ములఁగావింపరుగాని భోగ్యవిషయంబు ల్మానఁగాలేరు ని
ష్ఫలదంభోక్తుల ముక్తి చేకుఱునె సాంబా భ... 75

మ. నరులన్మోసముపుచ్చి పొమ్మ్ముగొన నానాశాస్త్రవాదంబులుం
స్వరవేదాంతవిశిష్టయుక్తులును దంభప్రాప్తవేషంబులు
గరమొప్పారునుగాని సద్గురుకటాక్షంబింతలేకున్న నీ
పరతత్త్వం బెఱుఁగంగరాదు గద సాంబా భ... 76

శా. మీనంబెప్పుడు నీటనేమునుఁగుఁ దా మేషంబు వర్ణాశనం
బే నిత్యంబొనరించుఁ బాము పవనంబే గ్రోలు నేప్రొద్దు న
ద్దాన న్వానికి నేమిపుణ్యఫలమొందంగల్గె నజ్ఞాను నీ
ధ్యానం బించుకలేని సత్క్రియలు సాంబా భ... 77

శా. దేవా తావకభక్తిలేనినరుఁ డేతీర్థంబులం గ్రుంకినన్
గ్రావాగ్రంబులపై వసించినను యోగశ్రేణిసాధించినన్
గైవల్యార్హుఁడు గాఁడతం డితరకాంక్షల్మాని నిన్నాత్మలో
భావింపంగలవాఁడు ముక్తుఁడగు సాంబా భ... 78

మ. తనవారొక్కరుఁగూడ రారు యమబాధల్మాన్పఁగాలేరు మున్
ధనకాంక్షం దనుగూడినారు తుదఁ జెంతన్నిల్వఁగాఁబోరు గా
వున వైరాగ్యముమీఱు ధీరులతిధన్యుల్ వారు నీభక్తిభా
వనచే ముక్తికి జేరువారు శివసాంబా భ... 79

మ. ధరణిం గోరకయున్నఁ బోవు సుఖముల్ తాఁగోరిన న్రావు గాఁ,
పురముల్నిత్యముగావు సంతప్రజ గుంపుంబోక లేపోవు నీ
శరణన్న న్విడనాడలేవిదియె మోక్షప్రాప్తికిందావు ద
బ్బఱవేసంబులు మెచ్చవీవు శివసాంబా భ... 80

మ. తిరమైదేహమునిల్చునా శమనుండిందే నిల్వఁగా నోర్చునా
సిరిదానిల్కడ సేయునా యెపుడువాసి న్వెన్నెలల్గాయునా
ధరసంసారము నిత్యమా తెలివినొందన్లేక మున్నెన్నఁడో
పరమార్థంబొనరింతు నేననిన సాంబా భ... 81

మ. చెదరున్ దృష్టిమనీషయుం జెదరు బల్జీర్ణంబులై యంగము
ల్వదలున్ దంతము లెంతయుంగదలు శీలంబంతమున్నేచను
న్మదిమింజిక్కిన వేళఁ జిత్రమిదియే మోతృష్ణ దానొక్కఁడే
వదలంజాలదు గాని మానవుని సాంబా భ... 82

శా. జ్ఞాతిద్రోహులు బంధుఘాతకులు హింసాసత్యశూన్యుల్ దయా
వీతస్వాంతులు సాధుబాధకులునై వేధించుచున్నాఁడు ని
ర్భీతిం దాఁ గలిపూరుషుండిపుడు ధాత్రిన్నీవు పేక్షించిన
న్మాతంద్రీ బ్రతుకెట్లు సాధులకు సాంబా భ... 83

మ. ధనమే సాధనమెల్లకార్యములకుం దర్కింప సత్కీర్తి జీ
వనమే పావనమెల్లలోకములకు న్వర్ణింప నీపాదపూ
జనమే భాజన మెల్లభద్రములకుం జర్చింపఁగా నేరికి
న్మనమే కా ఘనమోక్షకారణము సాంబా భ... 84

మ. ధర సత్కీర్తికి దానమే మిగుల సద్యస్తృప్తికిం బోనమే
సరసత్వాప్తికి గానమే కలహనాశస్ఫూర్తికి న్మౌనమే
గరిమావాప్తికి మానమే నిరతమోక్షప్రాప్తికిన్ జ్ఞానమే
పరఁగుంగా కిఁకఁగానమే క్రియల సాంబా భ... 85

మ. నిను మెచ్చించుట భక్తినేజనులకు న్మేలౌట సత్యోక్తినే
తనకు న్బంధము రిక్తినే పరమభద్రస్ఫూర్తి సద్యుక్తినే
కననిశ్చింత విరక్తినే సకలదుఃఖప్రాప్తి సంసక్తినే
మనముం బట్టుటయుక్తినే యగును సాంబా భ... 86

శా. ఆయుర్దాయము సెల్లి మర్త్యులు సదా యామ్యాలయం బొందుటల్
శ్రేయస్సంపద నొక్కెడ న్నరులు నిశ్శ్రేయస్కులై యొక్కెడం
గాయక్లేశము నొందుటల్గనియు రాగద్వేషము ల్మానరీ
మాయాపాటవ మేమిచెప్ప శివ... 87

మ. జగతిం జూడ నియోగియై మొదలఁ దా జన్మింపనేరాదు క
ర్మగతిం జన్మము గాంచెనేని బ్రదుకన్రాదట్లు జీవించిన
న్వగతో నిర్ధనుఁడౌట కూడ దటులైనన్వేగ మిల్వాసిగో
ప్యగతిం దాపసియై చరింపఁదగు సాంబా భ... 88

మ. నినుసేవింపక పొట్టకూటికి జనుల్నిత్యంబు మూఢాత్ములై
ధనికద్వారములందుఁ గొల్చెదరు తత్కర్మంబునేమందు గా

ననమందుండెడు కొండచిల్వకు శిలాంతర్వర్తి యౌకప్పకు
న్నననాహారముఁ దెచ్చి నీవిడవె సాంబా భ... 89

మ. పుడమిం బెక్కువనంబుల న్మధుఫలంబుల్ స్వాదుపానీయము
ల్గడునొప్పారు లతావితానములు యోగ్యంబౌగుహావాసముల్
గడిమిం బ్రోచెడి దాతవీవు గలుగంగాఁ గూటికై దీనతం
బడి యాచింపఁగ నేల దుర్మదుల సాంబా భ... 90

మ. ఇరవందం జడలందు గంగగల నీకీభూజలస్థానము న్నిరతిం
జాబిలిపువ్వుఁదాల్చు దొరతా నీకీధరా పుష్పముల్
గురులోకత్రయదీపకుండవగు నీకుం దీపము ల్మెచ్చగా
వరయన్ భక్తియొకండుగాని శివ... 91

మ. పరగ న్మన్మథదేహదాహ విలసద్భస్మాంగరాగంబున
బ్బురమా బ్రహ్మకపాలమాలికలు సద్భోగీంద్రభూషాచయం
బిరవొందం ధరియించు మేటివగు నీకీగంధమాల్యాదులం
బరితోషంబొనరించువాఁడెవఁడు? సాంబా భ.. 92

శా. శంకాతంకములేక శంకరున కీషత్సామ్యమొందంగలే
రింకే వేల్పులటంచు దివ్యకరిపై హేమధ్వజంబెత్తి యీ
పంకేజప్రభవాండమెల్ల వినిపింపన్ భూరిభేరీమహా
ఝాంకారంబులు నిండఁ జాటెదను సాంబా భ... 93

మ. బలువింతౌ బరువింత యౌ ననక యౌబంగారపుంగట్టుచి
ల్వలజేసి న్వలజేసితండ్రి నొక కేలన్విల్గొనం బమ్ముగా
బలిమిం బూనిన మేటివివు ననుఁ జేపట్టంగ వేఁగానెయౌ
బలిపుత్రాంగణ పారిజాత శివ... 94

మ. సకలస్థావర జంగమాత్మవని యశ్రాంతంబు నిన్వేడ నీ
వకటా నాదు మొఱాలకింప విపు డాహా కేవల స్థాణుమూ
ర్తికి నే మ్రొక్కిన చందమయ్యె శివుఁ డెంతేసుప్రసన్నాత్ముఁడన్
ప్రకటఖ్యాతిక సంశయంబాదవె సాంబా భ... 95

మ. వ్రతనిష్ఠల్ సురభూసురార్చనలు దివ్యక్షేత్ర యాత్రల్ శ్రుతి
స్మృతి ధర్మంబు లొకింత యేనెఱుఁగ మీశ్రీపాదపద్మంబులే
మతిలో నమ్మితి నేననన్యరతినో మాతండ్రి శంభూ సతీ,
పతి నీవే గతి కావవే నిరతి సాంబా భ... 96

శా. తుంగాబ్ధాంబుకణంబు లెన్నఁదగు భూధూళిం గణింపందగు
న్నింగిం జుక్కలు లెక్కపెట్టఁ దగు నింతేగాని నా తప్పు లె
న్నంగా రా విఁక నీవుగా కొకరు న న్రక్షించు వారేరిఁ కె
బ్భంగిం బ్రోచెదొ నీవ దిక్కసుము సాంబా భ... 97

మ. పరఁగన్ శంభుఁడు దీనబాంధుఁడని చెప్ప న్నమ్మి యాస న్నిరం
తరము న్నే మొఱలిడ్డఁ బల్క విదియెన్న న్మోసమా లేక మున్
దరనేఁ జేసిన దోసమో కరఁగ దన్నా నీమనం బింతయో
వర కారుణ్యసముద్ర రుద్ర శివ... 98

మ. పరదైవంబవు నీ వటంచు మది నీ పాదాబ్జము ల్నమ్మి నేఁ
బరదైవంబుల వేఁడలే దెపుడు నాపై నీ వుపేక్షించినం
బరఁగంగా ననుఁ బ్రోచువా రెవరిఁకన్ భక్తావనాంచద్దయా
పరమూర్తీ శరణాగతార్తిహర సాంబా భ... 99

శా. నీవే తల్లియుఁ దండ్రియు న్విభుఁడు సన్మిత్రుండుఁ జుట్టంబులు
న్నీవే దాతవు దైవమున్ గురుఁడు నా నిర్వాణనిక్షేపము
న్నీవే నాదగు తోడునీడ మఱియు న్నీవే సమస్తంబు గా
భావింతు న్భవధన్య మే మెఱుఁగ సాంబా భ... 100

శా. నీ పాలంబడితి న్నిరంతరము నే నీపాదము ల్నమ్మితి
న్నీ పద్యావళిఁ బాడుచుంటి నెపుడు న్నీకంటె న న్నెవ్వగుం
గాపాడం దొరలేఁ డటంటి నిది నిక్కంబింక నీచిత్తమో
పాపగ్రావ విభేదశంబ శివ... 101

శా. నీ విఖ్యాత చరిత్రము ల్వినుచెవుల్ నీపూజకౌ హస్తముల్
నీవాసంబుల కేగు పాదయుగము న్నిన్గాంచు మేల్చూపు నిక్
గ్గైవారం బొనరించు జిహ్వయును నీకై మ్రొక్కు మూర్థంబు ని
న్భావింపంగల బుద్ధినా కొసఁగు సాంబా భ... 102

శా. నీకీర్తిశ్రుతి నీకథాశ్రవణము న్నీపాదసంసేవయు
న్నీకళ్యాణగుణానువర్తనము నీ నిత్యానుసంధానము
న్నాకుం బాయకయుండునట్లొసఁగుమన్నా జన్మజన్మంబుల
న్నాకారిస్తుతపాదపద్మ శివ... 103

మ. పరుల న్వేఁడకయుండ వేఱొకఁడు నన్బ్రార్థించిన న్వానికిం
బరఁగన్ లేదనకుండ నామనము నీ పాదారవిందైకసం

స్మరణం బేనుటకుండ నీవరము లిమ్మా నాకు శశ్వత్కృప
స్వరదా శంకర సుప్రసాద శివ... 104

మ. సమదార్తైకశరణ్య నీవు వెలయన్మత్తేభ శార్దూల చ
ర్మములం బ్రీతివహింతు గాన నిపుడే మత్తేభ శార్దూల వృ
త్తముల న్నీ కుపహార మిచ్చితిని భక్తవ్రాత మేమిచ్చినం
బ్రమదం బొప్పఁ బరిగ్రహింతుగద సాంబా భ... 105

మ. తనయు ల్మాటలు సూటి నేరక తమిం దప్పొప్పు లెల్లాసినన్
జనకు ల్మోదముతోడఁ జూతురటులే సర్వేశ నీవిజ్ఞగ
జ్జనకుండౌట మదుక్తిలోపముల నెంచంబోక వాత్సల్యభా
వనిరూఢిం గరుణించు కైకొనుము సాంబా భ... 106

మ. పితత్రీశకరసత్ప్రదార్థగరిమ స్ప్రఖ్యాతి శోభిలు ని
శితశం బప్పరు ప్రాసనం జదువన స్స భక్తి నాలించిన
న్నత తాభీష్టసము స్సభోగపరిమైశ్వర్యంబులం బొంద శా
శ్వత కైలాసపదంబుఁ గాంతురు గదా సాంబా భ... 107

మ. చెలువౌ సిక్కృతుఁగూర్చి నిరోసంగితన్ శ్రీకూచి మంచాఖ్యస
త్కులసంజాతుఁడ సోమసుండం వరాఖ్యుండ న్మహాగౌతమా
విలసత్త్రీతలస్థపల్లవలపురీ విఖ్యాతవాసుండ ను
జ్జ్వలలీలం దయ దీనిఁ జేకొనవె సాంబా భక్తచింతామణీ. 108

భక్తచింతామణిశతకము సంపూర్ణము.





శ్రీరస్తు.



# శ్రీ కాళహస్తీశ్వరశతకము.

విద్యుత్కలితాజవంజవమహాజీమూతపాపాంబుధా
రావేగంబున మన్మనోబ్జసముదీర్ణత్వంబుఁ గోల్పోయితిన్
దేవా మీ కరుణాశరత్సమయ మింతే జాలుఁ జిద్భావనా
సేవం దామరతంపరై మనియెదన్ శ్రీ కాళహస్తీశ్వరా. 1

శా. వాణీవల్లభ దుర్లభంబగు భవద్వారంబున న్నిల్చి ని
ర్వాణశ్రీఁ జెఱపట్టఁ జూచిన విచారద్రోహమో నిత్యక
ల్యాణక్రీడలఁ బాసి దుర్దశలపాలై రాజలోకాధమ
శ్రేణీద్వారము దూఱఁ జేసె దెపుడో శ్రీ... 2

శా. అంతా మిథ్య తలంచిచూచిన నరుం డట్లౌ టెఱింగిన్ సదా
కాంతల్ పుత్త్రులు నర్థమున్ తనువు నిక్కంబంచు మోహార్ణవ
భ్రాంతిం జెంది చరించుఁగాని పరమార్థంబైన నీయందుఁ దాఁ
జింతాకంతయుఁ జింత నిల్పఁడుగదా శ్రీ... 3

శా. నీనా సందొడఁబాటుమాట వినుమా నీచేత జీతంబు నేఁ
గానిం బట్టక సంతతంబు మదివేడ్కల్ గొల్తు నంతస్సప
త్నానీకంబున కొప్పగింపకుము నన్నాపాటియే చాలుఁ దే
జీనొల్లం గరినొల్ల నొల్ల సిరులన్ శ్రీ... 4

మ. భవకేళీమదిరామదంబున మహాపాపాత్ముఁడై వీఁడు న
న్ను వివేకింపఁ డటంచు నేను నరకార్ణోరాశిపాలైనఁ బ
ట్టువ బాలుం డొకచోట నాటతమితోడ న్నూతఁ గూలంగఁ దం
డ్రి విచారింపక యుండునా కటకటా శ్రీ... 5

శా. స్వామిద్రోహముఁజేసి యేనొకని గొల్వంబోతినో కాక నే
నీమాట న్విననొల్లకుండితినో నిన్నేదిక్కుగాఁ జూడనో

యేమీ యిట్టివ్యధాపయోధి నగున న్నీదుఃఖవారాశివీ
చీమధ్యంబున ముంచి యుంపదగునా శ్రీ... 6

మ. దివిజక్ష్మారుహధేనురత్నఘనభూతిప్రస్ఫురద్రత్నసా
నువు నీవిల్లు నిధీశ్వరుండు సఖుఁ డర్ణోరాశి కన్యావిభుం
డు విశేషార్చకుఁ డింక నీ కెనఘనుండుం గల్గునే నీవు చూ
చి విచారింపవు లేమి నెవ్వఁ డుడుపున్ శ్రీ... 7

శా. నీతో యుద్ధముఁ జేయ నోపఁ గవితానిర్మాణశక్తి న్నినుం
బ్రీతుం జేయఁగలేను నీకొఱకుఁ దండ్రిం జంపఁగాఁ జాల నా
చేత గ్రోఁకట నిన్ను మొత్త వెఱతుం జీకాకు నాభక్తి యే
రీతి న్నాకిఁక నిన్నుఁ జూడఁ గలుగున్ శ్రీ... 8

శా. ఆలుంబిడ్డలుఁ దల్లిదండ్రులు ధనం బంచు న్మహాబంధనం
బేలా నామెడ, గట్టినాఁడ విఁక నిన్నే వేళఁ జింతింతు ని
ర్మూలంబైన మనంబులోనఁ గడు దుర్మోహాబ్ధిలోఁ గ్రుంకి యీ
సీలామాలపుఁ జింత నెట్లుడిపెదో శ్రీ... 9

శా. నిప్పై పాతకతూలశైల మడఁచు న్నీనామము న్మానవుల్
తప్పన్ దవ్వుల విన్న నంతకభుజాదర్పోద్ధతక్లేశముల్
తప్పుం దారును ముక్తులౌదురని శాస్త్రంబు ల్మహాపండితుల్
చెప్పంగాఁ దమకింక శంక వలెనా శ్రీ... 10

శా. వీడెం బబ్బిన యప్పుడుం దమనుతు ల్విన్నప్పుడుం బొట్టలోఁ
గూడున్నప్పుడు శ్రీవిలాసములు పైకొన్నప్పుడుం గాయకుల్
పాడంగా వినునప్పుడున్ జెలఁగు దంభప్రాయవిశ్రాణన
క్రీడాసక్తుల నేమి చెప్పవలెనో శ్రీ... 11

మ. నిను సేవింపఁగ నాపద ల్పొడమనీ నిత్యోత్సవం బబ్బనీ
జనమాత్రుం డననీ మహాత్ముఁ డననీ సంసారమోహంబు పై
కొననీ జ్ఞానము గల్గనీ గ్రహగతుల్ కుందింపనీ మేలువ
చ్చిన రానీ యవి నాకు భూషణములే శ్రీ... 12

శా. ఏవేదంబుఁ బఠించె లూత భుజగం బేశాస్త్రముల్ చూచెఁ దా
నేవిద్యాభ్యసనం బొనర్చెఁ గరి చెంచేమంత్ర మూహించె బో
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా! కావు! మీ పాద సం
సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీ... 13

శా. కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్
రాయ న్రాపడె ఱొమ్ము మన్మథ విహారక్లేశవిభ్రాంతిచేఁ
బ్రాయం బాయెను బట్టఁ గట్టెఁ దల చెప్పన్ రోఁత సంసార
మేఁ జేయంజాల విరక్తుఁ జేయఁగదవే శ్రీ... 14

శా. ని న్నేరూపముగా భజింతు మదిలో నీరూపు మోకాలొ స్త్రీ
చన్నో కుంచమొ మేఁకపెంటికయొ యీసందేహము ల్మాన్పి నా
కన్నార న్భవదీయమూర్తి సగుణాకారంబుగాఁ జూపవే
చిన్నీరేజవిహారమత్తమధుపా శ్రీ... 15

మ. నిను నావాఁకిలి గావుమంటినొ మరున్నీలాలకభ్రాంతిఁ గుం
టెన పొమ్మంటినొ యెంగిలిచ్చి తిను తింటేఁ గాని కాదంటినో
నిను నెమ్మిం దగ విశ్వసించు సుజనానీకంబు రక్షింపఁ జే
సిన నావిన్నపమేల కైకొనవయా శ్రీ... 16

శా. ఊాలన్ ఉవ్వఁగఁ జేతులాడవు కుమారా రమ్ము రమ్మంచు నేఁ
జాలన్ జంపఁగ నేత్రము ల్దివియఁగా శక్తుండ నేఁగాను నా
శీలం బేమని చెప్పనున్న దిఁక నీచిత్తంబు నాభాగ్యమో
శ్రీలక్ష్మీపతిసేవితాంఘ్రియుగళా శ్రీ... 17

శా. రాజుల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు వారిచ్చు నం
భోజాక్షీచతురంతయానతురగీభూషాదు లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలుఁ బరితృప్తిం బొందితిన్ జ్ఞానల
క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీ... 18

శా. నీరూపంబు దలంపఁగాఁ దుద మొదల్ నేఁ గాన నీవైనచో
రారా రమ్మనియంచుఁ జెప్పవు వృథారంభంబు లింకేటికిన్
నీరన్ముంపుము పాల ముంపు మిఁక నిన్నే నమ్మినాఁడం జుమీ
శ్రీరామార్చిత పాదపద్మయుగళా శ్రీ... 19

శా. నీకు న్మాంసము వాంఛయేని కఱవా నీచేత లేఁడుండఁగాఁ
జోకై నట్టి కుఠార ముండ ననలజ్యోత్యుండ నీరుండఁగాఁ
బాకం బొప్ప ఘటించి చేతిపునుకన్ భక్షింప కాబోయచేఁ
జేకొం టెంగిలి మాంస మిట్లు దగునా శ్రీ... 20

శా. రాజై దుష్కృతిఁ జెందెఁ జందురుఁడు రారాజై కుబేరుండు దృ
గ్రాజీవంబునఁ గాంచె దుఃఖము కురుక్ష్మాపాలుఁ డామాటనే

యాజిం గూలె సమస్తబంధువులతో నా రాజశబ్దంబు చీ
చీ జన్మాంతరమందు నొల్లనుజుమీ శ్రీ... 21

శా. రాజ్యాతురుఁడైనచో నెచట ధర్మంబుండు నేరీతినా
నాజాతిక్రియ లేర్పడున్ సుఖముమాన్యశ్రేణి కెట్లబ్బు రూ
పాజీవాళికి నేది దిక్కు ధృతి నీభక్తుల్ భవత్పాదనీ
రేజంబుల్ భజియింతు రేతెఱఁగునన్ శ్రీ... 22

మ. తరగల్ పిప్పలపత్త్రముల్ మెఱుఁగుటద్దంబుల్ మరుద్దీపముల్
కరికర్ణాంతము లెండమావులతతుల్ ఖద్యోతకీటప్రభల్
సురవీథీలిఖితాక్షరంబు లసువుల్ జ్యోత్స్నాపయఃపిండముల్
సిరులం దేల మదాంధు లౌదురు జనుల్ శ్రీ... 23

శా. నిన్నున్ నమ్మినరీతి నమ్మ నొరులన్ నీకన్న నాకెన్న లే
రన్నల్దమ్ములు తల్లిదండ్రులు గురుం డాపత్సహాయుండు నా
యన్నా! యెన్నఁడు నన్ను సంసృతివిషాదాంభోధి దాఁటించి య
చ్ఛిన్నానందసుఖాబ్ధిఁ దేల్చెదొ కదే శ్రీ... 24

శా. నీపంచం బడియుండఁగాఁ గలిగినన్ భిక్షాన్నమే చాలు ని
క్షేపం బబ్బిన రాజకీటములనే సేవింపఁగా నోప నా
శాపాశంబులఁ జుట్టి త్రిప్పకుము సంసారార్థమై బంటుగాఁ
జేపట్టం దయ గల్గెనేని మదిలో శ్రీ... 25

శా. నీపేరున్ భవదంఘ్రితీర్థము భవన్నిష్ఠ్యూతతాంబూలముల్
నీపళ్లెంబు ప్రసాదముం గొనికదా నేబిడ్డఁడై నాఁడ న
న్నీపాటిం గరుణింపు మోపనిఁక నే నెవ్వారికిం బిడ్డఁగా
జేపట్టం దగుఁ బట్టి మానఁదగ దో శ్రీ... 26

శా. అమ్మా యయ్య యటంచు నెవ్వరిని నే నన్నన్ శివా నిన్ను నే
సుమ్మీ నీమదిఁ దల్లిదండ్రుల నటంచుం జూడఁగాఁబోకు నా,
కిమ్మేఁ దల్లియుఁ దండ్రియున్ గురుఁడు నీవే కాక సంసారపుం,
జిమ్మంజీఁకటిఁ గప్పి సన్ గడుపు నన్ శ్రీ ... 27

మ. కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రునకనేకుల్ వారిచే నేగతుల్
వడసెం బుత్త్రులు లేనియాశుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్
చెడునే మోక్షపదం బపుత్త్రకునకున్ శ్రీ... 28

మ. గ్రహదోషంబులు దుర్నిమిత్తములు నీకళ్యాణ నామంబు ప్ర
త్యహముం బేర్కొను నుత్తమోత్తముల బాధంబెట్టఁగానోపునే,
దహనుం గప్పఁగఁజాలునే శలభసంతానంబు నీసేవఁ జే
సి హతక్లేశులు గారుగాక మనుజుల్ శ్రీ ... 29

మ. అడుగంబోనిక నన్యమార్గరతులం బ్రాణావనోత్సాహినై
యడుగంబోయినఁ బోదు నీదుపదపద్మారాధకశ్రేణియు
న్నెడకు న్నిన్ను భజింపఁగాఁ గనియు నాకేలా పరాపేక్ష కో
రెడి దింకేమి భవత్ప్రసాదమె తగున్ శ్రీ ... 30

మ. మదమాతంగము లందలంబులు హరుల్మాణిక్యము ల్పల్లకుల్
ముదితల్ చిత్రదుకూలము ల్పరిమళంబు ల్మోక్ష మీఁజాలునే
మదిలో వీని నపేక్ష సేసి నృపధామద్వారదేశంబుఁ గా
చి దినంబుల్ వృథపుత్తు రజ్ఞు లకటా శ్రీ... 31

శా. రోసీరో యదు కామినీజనుల తారుణ్యోరు సౌఖ్యంబులన్
బాసీపోయదు పుత్రమిత్రజనసంపద్భ్రాంతివాంఛాలతల్
గోసీకోయదు నామనం బకట నీకుం బ్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీని త్రుళ్ళణఁపవే శ్రీ ... 32

శా. ఎన్నే ళ్లుండితి నేమిగంటి నిఁక నే నెవ్వారి రక్షించెదన్
నిన్నే నిష్ఠ భజించెద న్నిరుపమోన్నిద్ర ప్రమోదంబు నా
కెన్నం డబ్బెడు నెంతకాల మిఁక నే నిట్లున్న నేమయ్యెడిన్,
జిన్నంబుచ్చక నన్ను నేలుకొనవే శ్రీ... 33

శా. చావం గాలము చేరువౌ టెఱిఁగియుం జాలింపఁగా లేక త
న్నే వైద్యుండు చికిత్సఁ బ్రోవఁగలఁడో యే మందు రక్షించునో
యే వేల్పుల్ కృపఁజూతురో యనుచు నిన్నింతైనఁ జింతింపఁడా
జీవశ్రాద్ధముఁ జేసికొన్నయతియున్ శ్రీ... 34

మ. దినముం జిత్తములో సువర్ణముఖరీతీరప్రదేశాగ్రహా
వనమధ్యోపలవేదికాగ్రమున నానందంబునం బంకజా
సనవిష్ణు న్నినుఁజూడఁ గన్న నదివో సౌఖ్యంబు లక్ష్మీవిలా
సిని మాయానటనల్ సుఖంబులగునే శ్రీ... 35

శా. ఆలంచు న్మెడఁగట్టి దానికి నపత్యశ్రేణిఁ గల్పించి త
ద్బాలవ్రాతము నిచ్చిపుచ్చుకొనుసంబంధంబు గావించి ధ్యా

మాలర్కంబున బాంధవంబనెడి ప్రేమం గొందఱం ద్రిప్పఁగా
స్త్రీలం జీలయమర్చి నట్లాసఁగితో శ్రీ... 36

మ. తనువే నిత్యముగా నొనర్చు మదిలేదా చచ్చి జన్మింపకుం
డ నుపాయంబు ఘటింపు మీగతుల రెంటన్నేర్పు లేకున్న లే
దని నా కిప్పుడె చెప్పు చేయఁగలకార్యంబున్న సంసేవఁ జే
సి నినుం గాంచెదఁగాక కాలమున నో శ్రీ... 37

మ. పదునాల్గేలె మహాయుగంబు లొక భూపాలుండు చెల్లించెన
య్యుదయాస్తాచలసంధి నాజ్ఞ నొకఁ డాయుష్మంతుఁడై వీరియ
భ్యుదయం బెవ్వరు చెప్పఁగా వినరొ యల్పుల్మత్తులై యేల చ
చ్చెదరో రాజుల మంచు నక్కటకటా శ్రీ... 38

శా. రాజన్నంతనె పోవునా కృపయు ధర్మం బాభిజాత్యంబు వి
ద్యాజాతిక్షమ సత్యభాషణము విద్వన్మిత్రసంరక్షయున్
సౌజన్యంబు కృతం బెఱుంగుటయు విశ్వాసంబు గాకున్న దు
ర్బీజశ్రేష్ఠులుగాఁ గతంబుగలదే శ్రీ... 39

మ. మును నీచే నపవర్గరాజ్యపదవీమూర్ధాభిషేకంబు గాం
చినపుణ్యాత్ములు నేను నొక్కసరివో చింతించి చూడంగ న
ట్లనసంగీటఫణీంద్రపోతమద వేదండోగ్రహింసావిచా
రినిఁ గాఁగా నినుఁగానఁగాక మదిలో శ్రీ... 40

మ. పవమానాశన భూషణప్రకరము ల్భద్రేభచర్మంబు నా
ట్యవికత్వంబు ప్రియంబులై భుజగశుండాలాటవీచారులన్
భవదుఃఖంబులఁ బాపుటొప్పుఁగొలఁదిం బాటించి కైవల్య మి
చ్చి వినోదించుట కేమికారణమయా శ్రీ... 41

మ. అమరస్త్రీల రమించినం జెడదు మోహం బింతయున్ బ్రహ్మప
ట్టము సిద్ధించిన నాసదీఱదు నిరూఢక్రోధమున్ సర్వలో
కముల న్మ్రింగిన మానదందుఁగల సౌఖ్యంబొల్ల నీసేవఁ జే
సి మహాపాతక వారిరాశిఁ గడతున్ శ్రీ... 42

మ. చనువారిం గని యేడ్చువారు జముఁడా సత్యంబుగా వత్తుమే
మనుమానం బిఁక లేదు నమ్ముమని తా రావేళ నారేవునన్
మునుఁగంబోవుచు బాసచేయుటసుమీ మున్ముంటికిన్ జూడఁగాఁ
జెవిటుల్గానరు దీనిభావ మిదియో శ్రీ... 43

మ. భవదుఃఖంబులు రాజకీటముల నేఁ బ్రార్థించినం బాయునే
భవదంఘ్రిస్తుతిచేతఁగాక విలసద్బాల క్షుధాక్లేశదు
ష్టవిధు ల్మానునె చూడ మేఁకమెడచంటం దల్లి కారుణ్యదృ
ష్టివిశేషంబున నిచ్చుచంటబలె నో శ్రీ... 44

మ. పవి పుష్పంబగు నగ్ని మంచగు నకూపారంబు భూమీస్థలం
బవు శత్రుం డతిమిత్రుఁడౌ విషము దివ్యాహారమౌ నెన్నఁగా
నవనీమండలిలోపలన్ శివశివేత్యాభాషణోల్లాసికిన్
శివ నీనామము సర్వవశ్యకరమౌ శ్రీ... 45

శా. లేవో కానలఁ గందమూలఫలముల్ లేవో గుహల్ తోయముల్
లేవో యేఱులఁ బల్లవాస్తరణముల్ లేవో సదాయాత్మలో
లేవో నీవు విరక్తుల న్మనుప జాలిఁబొంది భూపాలురన్
సేవల్సేయఁగఁ బోదు రేలొకొ జనుల్ శ్రీ... 46

మ. మునునేఁబుట్టినపుట్టులెన్ని గలవో మోహంబుచే నందుఁ జే
సినకర్మంబులప్రోవు లెన్ని గలవో చింతించినం గాన నీ
జననంబే యని యున్నవాఁడ నిదియే చాలింపవే నిన్నుఁ గో
ల్చినపుణ్యంబునకుం గృపాంతుఁడవై శ్రీ... 47

మ. తను వెందాఁక ధరిత్రినుండు నను నందాఁక న్మహారోగదీ
పనదుఃఖాదులఁ బొందకుండ నను కంపాదృష్టి వీక్షించి యా
వెనుక న్నీపదపద్మముల్ దలఁచుచు న్విశ్వప్రపంచంబుఁ బా
సినచిత్తంబున నుండఁజేయఁగదవే శ్రీ... 48

మ. మలభూయిష్ఠమనోజధామము సుషుమ్నాద్వారమో యారు కుం
డలియో వాదకరాక్షియుగ్మములు షట్కంజంబులో మోముదా
జలజంబో నిటలంబు చంద్రకళయో సంగంబు యోగంబుగా
సిలి సేవింతురు కాంతలన్ భువిజనుల్ శ్రీ... 49

మ. జలకంబుల్ రసముల్ ప్రసూనములు వాచాబంధముల్ వాద్యము
ల్కలశబ్దధ్వను లంచితాంబర మలంకారంబు దీప్తుల్మెఱుం
గులు నైవేద్యము మాధురీమహిమగాఁ గొల్తున్నిను భక్తిరం
జిలదివ్యార్చన గూర్చినేర్చినక్రియల్ శ్రీ ... 50

శా. ఏలీల న్నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షాధ్వని వ్యంగ్యశ
బ్దాలంకారవిశేషభాషల కలభ్యంబైన నీరూపము

జాలుంజాలుఁ గవిత్వము న్నిలుచునే సత్యంబు వర్ణించుచోఁ
చీ లజ్జింపరుగాక మాదృశకవుల్ శ్రీ ... 51

శా. పాలుం బువ్వయుఁ బెట్టెదం గుడువరా పాపన్న రాయన్న లే
లే లెమ్మన్న నరంటిపండ్లుఁ గొని తేలేకున్న నే నొల్లనం
చే లాలింపరె తల్లిదండ్రులపు డక్లేశమ్ము వాత్సల్య ల
క్ష్మీలీలావచనంబులం గుడుపరా శ్రీ... 52

మ. కలలంచు న్శకునంబులంచు గ్రహయోగంబంచు సాముద్రికం
బులటంచుం దెవులంచు దృష్టియనుచు న్భూతంబులంచు న్విషా
దులటంచు న్నిమిషార్ధ జీవనములందుం బ్రీతిఁ బుట్టించి యీ
సిలుగుల్ ప్రాణుల కెన్ని చేసితివయా శ్రీ .. 53

మ. తలమీఁదం గుసుమప్రసాద మలికస్థానంబుపై భూతియున్
గళసీమంబున దండ నాసికతుద న్గంధప్రసారంబు లో
పల నైవేద్యముఁ జేర్చునే మనుజుఁ డాభక్తుండు నీ కెప్పుడుం
జెలికాఁడై విహరించు రౌప్యగిరిపై శ్రీ... 54

శా. ఆలుం బిడ్డలు మిత్రులున్ హితులు నిష్టార్థంబు లీనేర్తు రే
వేళ న్వారి భజింపఁ జాలిపడ కావిర్భూతమోదంబునం
గాలం బెల్ల సుఖంబు నీకు నిఁక భక్తశ్రేణి రక్షింప కే
శ్రీ లెవ్వారికిఁ గూడఁబెట్టెదవయా శ్రీ... 55

మ. సులభుల్మూర్ఖులు నుత్తమోత్తములు రాజుల్గల్గి యేవేళ న
న్నలఁతం బెట్టిన నీ పదాబ్జములఁ బాయంజాల నేమిచ్చినం
గలధౌతాచల మేరు కుంబునిధి లోఁ గాపుండు టబ్జంబుపైఁ,
జెలువొప్ప న్సుఖియింపఁ గాంచుట సుమీ శ్రీ... 56

మ. కలధౌతాద్రియు నస్థిమాలికయు గోగంధర్వము న్పున్కయుం
బులితోలు న్భసితంబుఁ బాఁపతొడవు ల్పోకుండఁ దోబుట్లకై
తొలి నేవారలతోడఁ బుట్టఁగఁ గళాదుల్గల్గె మేలయ్యె నా
సిలువు ల్దూరము చేసికొం టెఱిఁగియే శ్రీ... 57

మ. శ్రుతు లభ్యాసముచేసి శాస్త్రగరిమ ల్శోధించి తత్త్వంబులన్
మతి నూహించి శరీర మస్థిరము బ్రహ్మంబెన్న సత్యంబుఁ గాం
చితి మంచున్ సభలన్ వృథావచనము ల్చెప్పంగనే కాని ని
ర్జితచిత్తస్థిర సౌఖ్యముల్ దెలియరో శ్రీ... 58

మ. గతి నీ వంచు భజించువార లపవర్గం బొందఁగా నేల సం
తతముం గూటికినై చరింప వినలేదా 'యాయురన్నం ప్రయచ్ఛతి'
యంచు న్మొఱవెట్టఁగా శ్రుతులు సంసారాంధకారాభి దూ
షితదుర్మార్గులు గానఁ గానఁబడవో శ్రీ... 59

మ. రతిరాజుద్ధతిమీఱ నొక్క మఱిగోరాజాశ్వ నిన్నొక్కఁబో
నతఁ డాదర్పకు వేగ నొత్తఁ గవయం బాఁబోతునుం దాఁకియు
గ్రతఁ బోరాడఁగనున్న యన్నడిమిలేఁగ ల్బోలె శోకానల
స్థితిపాలై మొఱవెట్టినన్ మనుపవే శ్రీ... 60

శా. అంతా సంశయమే శరీరఘటనం బంతా విచారంబె లో
నంతా దుఃఖపరంపరార్జితమె మేనంతా భయభ్రాంతమే
యంతానంతశరీరశోషణమె దుర్వ్యాపారమే దేహికిం
జింత న్నిన్నుఁ దలంచి పొందరు నరుల్ శ్రీ... 61

శా. సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ జాలుఁజాలు బహురాజద్వారసౌఖ్యంబులన్
శాంతింబొందెదఁ జూపు బ్రహ్మపదరాజద్వారసౌఖ్యంబు ని
శ్చింత న్శాంతుఁడ నౌదు నీకరుణచే శ్రీ... 62

శా. స్తోత్రం బన్యులఁ జేయనొల్లని వ్రతస్థుల్వోలె వేసంబుతోఁ
బుత్రీపుత్రకళత్రరక్షణకళాబుద్ధిన్ నృపాలాధమున్
బాత్రంబంచు భజింపఁబోదు రిదియు న్భావ్యంబె యెవ్వారి చా
రిత్రం బెన్నఁడు మెచ్చ నెంచ మదిలో శ్రీ... 63

మ. అకలంకస్థితి నిల్పి నాదమనుఘంటారావమున్ బిందుదీ
పకళాశ్రేణి వివేకసాధనము లొప్పన్బూని యానందతా
రకదుర్గాటవిలో మనోమృగము గర్వస్ఫూర్తి వారించు వా
రికిఁ గా వీవు భవోగ్రబంధలతికల్ శ్రీ... 64

మ. ఒకయర్థంబును నిన్ను నే నడుగఁగా నూహింపనెట్లైనఁ బొ
మ్ము కవిత్వంబులు నాకుఁ జెందనివి యేమోయంటివా నాదుజి
హ్వకు నైసర్గికకృత్య మింతయనుమీ ప్రార్థించుటే కాదు కో
రికల న్నిన్నును గాన నాకు వశమా శ్రీ... 65

మ. శుకము ల్కింశుకపుష్పము ల్గని ఫలస్తోమంబటంచు న్సము
త్సుకతం జేరఁగఁ బోవ నచ్చట మహాదుఃఖంబు సిద్ధించుఁ గ

ర్మకళాభాషల కెల్లఁ బ్రాపులగు శాస్త్రంబు ల్విలోకించువా
రికి నిత్యత్వమనీష దూరమగుచుం శ్రీ... 66

మ. ఒకరింజంపి పదస్థులై బ్రతుకఁ దా మొక్కొక్క రూహింతురే
లొకో తా మెన్నఁడుఁ జావరో తమకుఁ బోవో సంపదల్ పుత్రమి
త్రకళత్రాదులతోడ నిత్యసుఖమందం గందురో యున్నవా
రికిలేదో మృతి యెన్నఁడుం గటకటా శ్రీ... 67

శా. నీకారుణ్యముఁ గల్గినట్టినరుఁ డేనీచాలయంబు జొరం
డేకార్పణ్యపుమాట లాడ నరుగం డెవ్వారితో వేమముల్
గైకోఁ డేమతము ల్భజింపఁ డిల నేకష్టప్రకారంబులన్
జీకాకై చెడిపోఁడు జీవనదశన్ శ్రీ... 68

శా. జ్ఞాతు ల్ద్రోహులు వాండ్రు సేయునపకృత్యాది క్రియాదోషముల్
మాతండ్రాన సహింపరాదు ప్రతికర్మం బించు కేఁ జేయఁగాఁ
బోతే దోషముగాన మాని యతినై పోఁగోరినన్ సర్వదా
చేతఃక్రోధము మానదెట్లు నడుతున్ శ్రీ... 69

మ. చదువు ల్నేర్చినపండితాధములు స్వేచ్ఛాభాషణక్రీడలన్
వదరన్ సంశయభీకరాటవులఁ ద్రోవల్దప్పి వర్తింపఁగా
మదనక్రోధకిరాతు లందుఁ గని భీమప్రౌఢిచేఁ దాఁకినం
బెదరుం జిత్తము చిత్తగింపఁగదవే శ్రీ... 70

శా. రోసిం దేఁటిది రోఁత లేఁటివి మనోరోగస్థుఁడై దేహి తాఁ
బూసిందేఁటిది పూఁత లేఁటివి మహాపూతంబు లీదేహముల్
మూసిం దేఁటిది మూఁత లేఁటివి సదా మూఢత్వమే కాని తాఁ
జేసిం దేఁటిది చేఁత లేఁటివి వృథా శ్రీ... 71

శా. శ్రీశైలేశు భజింతునో యభవుఁ గాంచీనాథు సేవింతునో
కాశీవల్లభుఁ గొల్వఁబోదునో మహాకాళేశుఁ బూజింతునో
నాశీలం బణువైన మేరువగుచున్ రక్షింపవే నీకృపా
శ్రీశృంగార విలాసహాసములచే శ్రీ... 72

మ. అయవార్లై చరియింపవచ్చుఁ దనపాదాంభోజ తీర్థంబులన్
దయతోఁ గొమ్మనవచ్చు సేవకుని నర్థప్రాణ దేహాదు ల
న్నియు నాసొమ్మనవచ్చుఁగాని సిరుల న్నిందించి నిన్నాత్మ ని
ష్క్రియతం గానఁగరాదు పండితులకున్ శ్రీ... 73

శా. మాయాజాండకరండకోటిఁ బొడిగా మర్దించిరో విక్రమా
జేయుం గాయజుఁ జంపిరో కపటలక్ష్మీమోహముం బాసిరో
యాయుర్దాయ భుజంగమృత్యువున నాయాసంబునన్ గెల్చిరో
శ్రేయోదాయకు లౌదు రెట్టు లితరుల్ శ్రీ... 74

మ. చవిగాఁ జూడ వినంగ మూర్కొనఁ దనూసంఘర్షణాస్వాదమొం
దవినిర్మించెద వేల జంతువుల నేత్రత్రిక్కడలే పాతక
వ్యవహారంబులు సేయునేమిటికి మాయావిద్యచేఁ బ్రొద్దు పు
చ్చి వినోదింపఁగ దీన నేమి ఫలమో శ్రీ... 75

మ. వెనకం జేసిన ఘోరదుర్దశలు భావింపంగ రోఁతయ్యెడున్
వెనుక న్ముందట వచ్చుదుర్మరణము ల్వీక్షింప భీతయ్యెడున్
నను నేఁ జూచియు నావిధుల్దలఁచియు న్నాకే భయం బయ్యెడుం
జెనకుం జీఁకటి నాయెఁ గాలమునకున్ శ్రీ... 7

మ. పరిశీలించితి మంత్రతంత్రములు చెప్ప న్వింటి సాంఖ్యాదియో
గరహస్యంబులు వేదశాస్త్రములు వక్కాణించితిన్ శంకవో
దరయం గుమ్మడికాయలోని యవగింజంతైన నమ్మించి సు
స్థిర విజ్ఞానము త్రోవఁ జెప్పఁగదవే శ్రీ... 7

మ. మొదలం జేసినవారి ధర్మములు నిర్మూలంబుగాఁ జేసి దు
ర్మదులై యిప్పుడు వారె ధర్మము లొనర్పం దమ్ము దైవంబు న
వ్వదె రానున్న దురాత్ములెల్ల దమత్రోవం బోవరే యేలచే
సెదరో మీఁదు దలంచి చూడ కధముల్ శ్రీ...

శా. కాసంతైనసుఖం బొనర్చునొ మనఃకామంబు లీడేర్చునో
వీసం బైనను వెంట వచ్చునొ జగద్విఖ్యాతి గావించునో
దోసంబు ల్వెడఁబాపునో వలసినందోడ్తో మిముం జూపునో
ఛీ! సంసార దురాశ యేలుడుపవో శ్రీ...

మ. ఒకపూఁ టించుకకూడు తక్కువగునే నోర్వంగలేఁ డెండకో
పక నీడ న్వెదకుం జలిం జడిసి కుంపట్లెత్తుకోఁ జూచు వా
నకు నిండ్లిండ్లును దూఱు నీతనువు దీనన్వచ్చు సౌఖ్యంబు రో
సి కడాసింపరు గాక మర్త్యులకటా శ్రీ...

శా. కేదారాది సమస్తతీర్థములు కోర్కిం జూడఁబో నేఁటికిన్
గాదా ముంగిలి వారణాసి కడుపే కైలాసశైలంబు మీ

పాదధ్యానము సంభవించునపుడే భావింప నజ్ఞాన ల
క్ష్మీదారిద్ర్యులు గారె లోకు లకటా శ్రీ... 81
మ. తమకొంబొప్పఁ బరాంగనాజన పరద్రవ్యంబులన్ ముచ్చిలం
గమహోద్యోగము సేయు నెమ్మనము దొంగం బట్టి వైరాగ్య పా
శములం జుట్టి బిగించి నీదు చరణ స్తంభంబునం గట్టివై
చి ముదం బెప్పుడుఁ గల్గఁ జేయఁగదవే శ్రీ... 82
శా. వేధం దిట్టఁగ రాదు గాని భువిలో విద్వాంసులం జేయునే
లా ధీచాతురిఁ జేసెఁ జేసినఁగులామూపాటనే పోక క్షు
ద్బాధాదుల్ కలిగింప నేల యది కృత్యంబైన దుర్మార్గులం
జీ! ధాత్రీశులఁ జేయనేటి కకటా శ్రీ... 83
మ. పుడమి న్నిన్నొక బిల్వ పత్రమున నేఁ బూజించి పుణ్యంబునం
బడయన్నేరక పెక్కు దైవములకుం బప్పుల్ ప్రసాదంబులుం
గుడుముల్ దోసెలు సారెసత్తులుడుకుల్ గుగ్గిళ్లునుం బెట్టుచుం
జెడి యెందుం గొఱగాకపోదు రకటా శ్రీ... 84
శా. విత్తజ్ఞానము పాదు చిత్తము భవావేశ బు రహాంబువుల్
మత్తత్వంబు తదంకురం బనృతముల్ మాఱాకు లత్యంత దు
ర్వృత్తుల్ పువ్వులు పండ్లు మన్మథముఖావిర్భూత దోషంబులుం
జిత్తాభ్యున్నత నింబభూజమునకున్ శ్రీ... 85
శా. నీపైఁ గావ్యము చెప్పుచున్న యతఁడు న్నీపద్యముల్ వ్రాసి యి
మ్మా పాఠం బొనరింతు నన్నయతఁడున్ మంజు ప్రబంధంబు ని
ష్టాపూర్తిం బఠియించుచున్న యతఁడున్ సద్బాంధవుల్ గాక చీ
చీ పృష్ఠాగతబాంధవ బు నిజమా శ్రీ .. 86
శా. సంపద్గర్వముఁ బాఱఁదోలి రిపులన్ జంకించి యాకాంక్షలన్
దంపుల్వెట్టి కళంకము ల్నఱికి బంధక్లేశదోషంబులం
జింపుల్చేసి వయోవిలాసములు సంక్షేపించి భూతంబులం
జెంపల్వేయక నిన్నుఁ గాన నగునా శ్రీ... 87
శా. రాజశ్రేణికి దాసులై సిరులఁ గోరం జేరఁగా సౌఖ్యమో
యీజన్మంబు తరింపఁ జేయఁగల మిమ్మేపొద్దు సేవించు ని
ర్వ్యాజాచారము సౌఖ్యమో తెలియలేకా నూనవు ల్పాపరా
జీజాత్రాత్రిమదాంధబుద్ధు లగుచు శ్రీ... 88

శా. నిన్నం జూడరొ మొన్నఁ జూడరొ జనుల్ నిత్యంబుఁ జావంగ నా
పన్ను ల్గన్ననిధాన మయ్యెడి ధనభ్రాంతి న్విసర్జింపలే
కున్నా రెన్నఁడు నిన్నుఁ గందు రిఁక మర్త్యుల్ గొల్వరేమో నిను
న్విన్నం బోవక ప్రోవకుండు నెడలన్ శ్రీ... 89

శా. వన్నె ల్మేనఁ గుతోలు దుప్పటము బువ్వా కాలకూటంబు చే
గిన్నె బ్రహ్మకపాల ముగ్ర మగు భోగీ కంఠహారంబు మే
ల్లి న్నీలాగున నుంటయుం దెలిసియు న్నీ పాదపద్మంబు చే
ర్చె న్నారాయణుఁ డెట్లు మానసముఁ దా శ్రీ... 90

శా. ద్వారద్వారములందుఁ గంచుకిజనవ్రాతంబు దండంబులన్
దోరంతస్థలి బగ్గనం బొడుచుచున్ దుర్భాషలాడ న్మఱిన్
వారిం బ్రార్థనచేసి రాజులకు సేవ ల్సేయఁగాఁ బోరు ల
క్ష్మీరాజ్యంబును గోరి నీపరిజనుల్ శ్రీ... 91

శా. ఊరూరం జనులెల్ల భిక్ష మిడరో యుండం గుహల్గల్గవో
చీరానీకము వీధులం దొరకదో శీతామృతస్వచ్ఛవాః
పూరం బేరులఁ బాఱదో తపసులం బ్రోవంగ నీవోపవో
చేరం బోవుదు రేల రాజుల జనుల్ శ్రీ... 92

మ. దయ సేయుం డని గొంద ఱాడుదురు నిత్యంబు న్నినుం గొల్చుచున్
నియమం బెంతొ ఫలంబు నంతియగదా నీవీయకుండేటి తో యం
తియకా యెప్పటికిం దళం బళనబుద్ధిం జూడనే లబ్బ స
త్క్రియల న్నిన్ను భజింప కిష్టసుఖముల్ శ్రీ... 93

శా. ఆరావం బుదయించెఁ దారకముగా నాత్మాభ్రవీథి న్మహా
కారోకారమకారయుక్త మగునోంకారాభిధానంబు చె
న్నారు న్విశ్వ మనంగఁ దన్మహిమచే నానాదబిందుల్ సుఖ
శ్రీరంజిల్లఁ గడంగు నీ వదె సుమీ శ్రీ... 94

శా. నీభక్తు ల్పదివేలభంగుల నినున్ సేవింపుచున్ వేడఁగా
లోభం బేటికి వారికోర్కులు కృపాళుత్వంబునం దీర్పరా
దా భవ్యంబుఁ దలంచి చూడు పరమార్థం బిచ్చి పొమ్మన్న నీ
శ్రీభాండారములోఁ గొఱంతపడునా శ్రీ... 95

మ. మొదల న్భక్తుల కిచ్చినాఁడవుగదా మోక్షంబు నేఁడేమయా
ముదియంగా ముదియంగఁ బుట్టె ఘనమా మోహంబు లోభంబు న

న్నది సత్యంబు కృపం దలంప వొకపుణ్యాత్ముండు ని న్నాత్మ గొ
ల్చిన దినంబు నొమ్ముఁబెట్టఁగాఁ గటకటా శ్రీ... 96

శా. కాలద్వార కవాటబంధనము దుష్కాలప్రమాణక్రియా
లీలాజాలక చిత్రగుప్తముఖవల్మీకోగ్ర జిహ్వాద్భుత
వ్యాళవ్యాళవిరోధి మృత్యుముఖ దంష్ట్రాహార్యవజ్రంబు ది
క్చేలాలంకృత నీదు నామ మరయన్ శ్రీ... 97

మ. పదివేలైనను లోకకంటకులచేఁ బ్రాపించు సౌఖ్యంబు నా
మదికిం బథ్యముగాదు సర్వమునకున్ మధ్యస్థుఁడై సత్యదా
నదయాదు ల్గలరాజు నాకొసఁగు మేప న్నావి నీయట్ల చూ
చి దినంబు న్మదయొందుదుం గడపటిన్ శ్రీ... 98

శా. తాతల్ తల్లియుఁ దండ్రియున్ మఱియుఁ బెద్దల్ చావఁగాఁ జూడరో
భీతిం బొందఁగనేల చావునకుఁగాఁ బెండ్లాము బిడ్డ ల్హితో
వ్రాతంబు న్బలవింప జంతువులకు న్వాలాయ మైయుండఁగాఁ
జేతోవీధి నరుండు ని న్గొలువఁడో శ్రీ... 99

శా. జాతు ల్చెప్పుట సేవసేయుట మృషల్ సంధించుట న్యాయ వి
ఖ్యాతిం బొందుట కొండెకాఁడవుట హింసారంభకుం డౌట మి
థ్యా తాత్పర్యము లాడుటన్నియుఁ బరద్రవ్యంబు నాశించి యీ
శ్రీతా నెన్నియుగంబు లుండఁగలదో శ్రీ... 100

మ. చెడుగుల్ కొందఱు కూడి చేయఁగఁ బలుల్ చీఁకట్లు దూఱంగఁ బా
ల్పడితిం గాని చరింపరాని నిను నొల్లం జాలుఁ బొమ్మంచు ని
ల్వడలం ద్రోచినఁ జూరువట్టుకొని నే వ్రేలాడుదుం గోర్కెఁ గో
రెడి యర్థంబులు నాకు వేఁగలుగవో శ్రీ... 101

మ. భసితోద్ధూళనధూసరాంగులు జటాభారోత్తమాంగుల్ తపో
వ్యసనుల్ సాధితపంచవర్ణరసనుల్ వైరాగ్యవంతుల్ నితాం
తసుఖస్వాంతులు సత్యభాషణసముద్యద్రత్నరుద్రాక్షరా
జిసమేతుల్ తుద నెవ్వరైనఁ గొలుతుర్ శ్రీ... 102

మ. జలజశ్రీ గల మంచినీళ్ళు గలవా చట్రాతిలో బావురే
వెలివాడ న్మఱి బాఁపనిల్లు గలదా వేసాలుగా నక్కటా
నలినా రెండుగుణంబు లెంచి మదిలో నన్నేమి రోయంగ నీ
చెలువంబైన గుణంబు లెంచుకొనవే శ్రీ... 103

మ. గడియల్ రెంటికొ మూఁటికో గడియకో కాదేని నేఁ డెల్లియో
కడ నేఁడాదికొ యెన్నఁడో యెఱుఁగ మీకాయంబు లీభూమిపైఁ,
బడఁగా నున్నవి ధర్మమార్గ మొకటిం బాటింప రీమానవుల్
చెడుగుల్ నీపదభక్తియుం దెలియరో శ్రీ... 104

మ. క్షితిలో దొడ్డ తురంగసామజము లేచిత్రాంబరాందోళికా
తతు లేలెక్క విలాసినీ జనసువస్త్రవ్రాతభూషాకలా
పతనూజాదిక మేమిదుర్లభము నీ పాదమ్ము లర్చించుచో
జితపంకేరుహ పాదపద్మయుగళా శ్రీ... 105

మ. సలిలమ్ముల్ జుళుకప్రమాణ మొకపుష్పమ్ముల్ భవన్మౌళిని
శ్చలభక్తిప్రతిపత్తిచే నరుఁడు పూజల్సేయఁగా ధన్యుఁడౌ
నిల గంగానది, జంద్రఖండమును దా నిందుం దుదిం గాంచునీ
చెలువం బంతయు నీ మహత్త్వ మిదిగా శ్రీ... 106

మ. తమనేత్రద్యుతిఁ దామె చూడ సుఖమై తాదాత్మ్యము న్గూర్పఁగా
విమలమ్ముల్ కమలాభము ల్జితలసద్విద్యుల్లతాలాస్యముల్
సుమనోబాణజయప్రదమ్ము లనుచు న్జూచున్ జనం బూని హా
రి మృగాక్షీనివహమ్ము కన్నుఁగవలన్ శ్రీ... 107

మ. పటవద్రజ్జుభుజంగవద్రజతవిభ్రాంతిస్ఫురచ్ఛుక్తివ
ద్ఘటవచ్చంద్రశిలాజపాకుసుమరుక్సాంగత్యవర్తించు వా
క్పటిమ ల్నేర్తురు చిత్సుఖంబనుభవింపన్ లేక దుర్మేధసుల్
చిటు కన్నం దలపోయఁజూతు రథముల్ శ్రీ... 108

మ. నిను నిందించిన దక్షుపైఁ దెగవొ వాణీనాథు శాసింపవో
చనునా నీపదపద్మసేవకులఁ దుచ్ఛం బాడు దుర్మార్గునిం
బెనుప న్నీకును నీదుభక్తతతికిన్ భేదంబు గానంగ వ
చ్చెనొ లేకుండిన నూఱకుండఁగలవా శ్రీ... 109

మ. కరిదైత్యు న్బొరిగొన్న శూలము కరగ్రస్తంబుగాదో రతీ
శ్వరుని న్గాల్చిన ఫాలలోచన శిఖావర్గంబు చల్లాఱెనో
పరనిందాపరుల న్వధింప విదియున్ భావ్యంబె వా రేమిచే
సిరి నీకు న్బరమోపకార మరయన్ శ్రీ... 110

మ. దరము న్దుర్గము రాయబారము మఱిన్ దొంగర్కము న్వైద్యమున్
నరనాథాశ్రమ మోడబేరమును బెన్మంత్రంబు సిద్ధించినన్

అరయన్ దొడ్డఫలంబు గల్గు నదిగా కా కార్యమేతప్పినన్
సిరియుంబోవును ప్రాణహానియును నౌన్ శ్రీ... 111

మ. తనయుం గాంచి ధనంబుఁ బాతి దివిజస్థానంబు గట్టించి వి
ప్రున కుద్వాహము జేసి సత్కృతికిఁ బాత్రుండై తటాకంబు నే
ర్పునఁ ద్రవ్వించి వనంబువెట్టి మననీ పోలేఁడు నీసేవజే
సినపుణ్యాత్ముఁడు పోవులోకమునకున్ శ్రీ... 112

మ. క్షితినాథోత్తమ సత్కవీశ్వరుఁడు వచ్చెన్ మిమ్ములంజూడఁగా
నతఁ డేమేటి కవిత్వవైఖరిని సద్యఃకావ్యనిర్మాతి త
త్ప్రతిభ ల్మంచివి తిట్టుపద్యములు చెప్పం జాతఁడైనన్ మముం
గ్రతిమెచూచెను బొమ్మలందు రథముల శ్రీ... 113

శా. నీకుంగాక కవిత్వ మెవ్వరికి నే నీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిన్ బిరుదంబు కంకణము ముంజేఁగట్టితిం బట్టితిన్
లోకుల మెచ్చ వ్రతంబు నాతనువుకేలున నెవ్వలుంగావు ఛీ
ఛీ కాలంబులరీతి దప్పెడుఁ జుమీ శ్రీ... 114

శా. నిచ్చల్ నిన్ను భజించు చిన్మయమహానిర్వాణ పీఠంబుపై
రచ్చల్సేయక యార్జవంబు కుజనవ్రాతంబుచేఁ గ్రాఁగి భూ
భృచ్చండాలురఁ గొల్చువారు దనుఁ గోపింపన్ బుధుం డార్తుఁడై
చచ్చుం బుట్టు రల్లఁ జల్లుకొనునో శ్రీ... 115

శా. దంతంబుల్పడనప్పుడే తనువునం దారూఢి యున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు గానప్పుడే
వింత ల్మేన జరించనప్పుడె కురుల్ వెల్వెల్ల గానప్పుడే
చింతింపన్వలె నీపదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా. 116

శ్రీ కాళహస్తీశ్వరశతకము
సంపూర్ణము.



శ్రీరస్తు.

# జ్ఞానప్రసూనాంబికాశతకము.



సద్గానురవేంకటక్షితిపతి శ్రేయస్కరప్రక్రియో
ద్యామాత్మీయయశఃప్రసరసిద్ధ్యన్మంజులాపాంగవీ
క్షామందస్మితసుందరాస్య మెలమిన్నప్పట్టఁ బ్రత్యక్షమై
సామంజస్యమెసంగఁ బ్రోవుము నను న్ జ్ఞానప్రసూనాంబికా. 1

శా. శ్రీమాన్యం బగు కాళహస్తినగరీసీమం బటుండ న్సజ్జన
క్షేమప్రక్రియఁ గూర్చుచు న్సకలశక్తిస్తోమ ముల్గొల్వఁగా
లైవామాన్యస్థితి నున్న నిన్విడిచి నే నన్యాశ్రయం బొల్ల నా
సామాన్యంబుగఁ జూడకమ్మ పుడమి న్ జ్ఞాన... 2

మ. దిగధీశుల్ నినుఁ గొల్చి రక్కసుల ద్రోదం దోలి యాత్మప్రభా
నగతిం గాంచి సుభాగ్యముల సన్మానంబులం బొంది రె
న్నఁగ వేమాటలఁ కేల యెంతయును నానావాంఛితార్థాప్తికై
జగతి న్సంతతి నిన్భజించెదనుగదా జ్ఞాన... 3

మ. పరమానందమయుండ సన్ను మదిలో భావించి సేవించి స
ద్వరము ల్గాంచి యగస్త్యముఖ్యులహహా వారాశ్యపస్పర్శన
స్ఫురణాదం బ్రథఁ జెంది రివ్వ గరుణం జూడంగ దుస్సాధదు 4
స్తరదుష్పాపములెల్లగల్గు జగతి న్ జ్ఞాన...

మ. ధరణిం గల్గినగొప్పగొప్పపదము ల్తద్విశేషములుం
బరికింప న్మదిఁ దోఁచె నేఁటికి నిను న్భావించి సేవింప నే
పురుషార్థంబును గల్గు నంచును మనస్స్ఫూర్తి న్విచింతు న్సదా
నరమాత్రాయుః సత్కటాక్షకలితా జ్ఞాన... 5

మ. తరమే నీమహిమంబు లెన్నఁగ ననద్భావంబు లేకుండ న
ప్పరమామ్నాయములైనం గని తలంపన్దుస్తరప్రక్రియ న్
దరమై మించుపథంబునం దగు నశీతిన్యాసము ల్సేయు భా
స్వర మంత్రజ్ఞులఁ బ్రోచితీవ కదవే జ్ఞాన... 6

మ. కలుము ల్నిత్యము లంచు నమ్మినమదిలో గర్వించి యుద్ధారుణిం
గలమూఢాత్ములు నిన్నుఁ గొందఱు గనంగారాక నీసేనలం
ద్రోలఁగింపం దలపోసి దుర్గతులఁ బొందుం జెందువారేక దా
జలజాత ప్రతిమానమాననకళా జ్ఞాన... 7

మ. అకలంకంబగు నీకు సేవకయి మాన్యాప్రసూనమాణిక్యమౌ
క్తికపంకేరుహరాగ విద్రుమముఖాగ్రీయోజ్జ్వలద్రత్నయు
క్తకరాంభోరుహపాత్రికాకలన నిత్యంబు న్నినుం గొల్వరా
సకలామర్త్య సతీశతిం దనుపవే జ్ఞాన... 8

మ. చెలువ ల్నిన్నొకసారి చేరి యెలమి న్సేవింప సౌభాగ్యముం
దెలివి న్సంతతి నిత్యసంపదయుఁ బాతివ్రత్యమున్ గల్గఁజే
సి లసద్దివ్యదయాకటాక్షముల వాసిం గూర్తు వంతంతకున్
జలజాతానన ముఖ్యదైవతనుతా! జ్ఞాన... 9

శా. ధైర్యశ్రీ మది నూలుకొల్పి సతతోద్యద్భక్తియుక్తి న్జనా
శ్చర్యప్రక్రమ మొప్ప మెప్పుగను బూజాప్రక్రియం గాంచి యై
శ్వర్యప్రాప్తి మనంబుఁ జెందక సదాసక్తి న్సముద్యత్తప
శ్చర్యం బూనినవానిఁ బ్రోతువెగదా జ్ఞాన... 10

మ. లలితంబై తగునీమహామహిమ వాలాయంబు వర్ణింపఁగాఁ
గలనా నేనని యూరకుండ కిపుడీకావ్యంబు సేయంగ ని
మ్ముల నేనెంచితి నీధరం బడగు పెంపుం జెంది యిందీవర
స్థలనాపాదనలోచనద్వయకళా జ్ఞాన... 11

మ. చకితాత్మీయజనాంతరంగ భయసంసర్గాపనోదక్రియా
ధికమందస్మిత సుందరాస్య హిమరుగ్దీప్తి ప్రసారాంచిత
ప్రకటానర్గళసుప్రభావవిలసద్భవ్యాకృతి శ్రీయుతా
సకలామర్త్యచయావనక్రమహితా జ్ఞాన... 12

మ. జయలక్ష్మీకరమైన నీమహిమచే సంప్రాప్యము ల్సంపదల్
భయము ల్దూరము లౌనటంచు మదిలో భావించి నీసద్దయా
శ్రియముంగాంచి ప్రియార్థము ల్గను టవశ్యం బేరికిం జూడ భా
చయసద్ధూతనభోంబుభృత్పటలికా జ్ఞాన... 13

శా. అత్యాలస్యముఁ జెంది నీభజనమం దాసక్తి యింతైన స
ద్వృత్తానందముఁ గల్గఁజెంద కెప్పుడు న్సత్సంగతిం గాంచకే

నిత్యం బంచును సంసృతిం దలఁచి మానిత్వంబుతో నుంటి నా
సత్యాదిత్యనుతా దయ న్దనుపుమా జ్ఞాన... 14

మ. కలరా నీసరివేల్పు లీజగతిలోఁ గల్యాణకల్యాత్మతన్
వెలయింపం దగువా రటంచు సరిగా విజ్ఞానముం జెంది నే
వలనొప్ప న్భవదీయపాదయుగళీవర్తిష్ణుధీవృత్తి నై
చలనంబంకయుంటిఁ బ్రోవఁగదవే జ్ఞాన... 15

శా. మార్గంబు ల్పదివేలు లోకమున సన్మార్గస్థితిం జెందఁ ద
ద్దుర్గాధ్వప్రతిపత్తిమాని విగళద్దోషాళినై మించి స
ద్వర్గస్తుత్యతఁ గన్న నీ భజన సల్పం బూనితి న్నిత్యమున్
స్వర్గాధ్యక్షనుతాంఘ్రి ప్రోవఁగదవే జ్ఞా... 16

మ. స్థిరకీర్తి న్వెలయంగఁ జేయు నియతశ్రేయోనివాసిత్వముం
బరగంజేయు సువర్ణరత్నసుఖసంల్లీలలం గూర్చు దు
స్తరదుఃఖంబులఁ బాఱఁదోలి మఱి సంతానాది సౌఖ్యంబులున్
సరవిన్నించుచు మించు నీ భజనమో జ్ఞాన... 17

శా. చిత్తాయత్తములైన కోరుకుల వాసిం గూర్చి భక్తాళికిం
దత్తాన్యగ్విభవంబుఁ జేర్చి రిపుల న్దండింపఁగా నేర్చి దు
ర్వృత్తంబు ల్దొలఁగింపఁ జేర్చి ఘనసంవిన్మార్గము న్దాల్చి నీ
సత్తం దెల్లము సేసి ప్రోవఁగదవే జ్ఞాన... 18

శా. జంబాలంబును బోని పాపముల నోజం దాఁకకుండంగ దూ
రంబై పోవఁగజేయ మెట్టునెడఁ దీర్ఘంబై తగం జేయ శా
పంబు న్స్వస్తియుఁ దక్షణంబుననె చూపు న్నీదు శ్రీచక్రరా
జంబర్చించు మహాత్ముఁ డోపునుగదా జ్ఞాన... 19

మ. ననవిల్తుం గనుమంటలో మిడుతకూనం బోలె మండింపఁ జూ
చిన జేజేగమి గచ్చువిచ్చయి కడల్సేరంగఁ జెంత న్వసిం
చిన నీ వంతనవంతలోఁ గొనక వాసిం బూచి రామేన ని
చ్చనఅన్వాత్తితి నిన్నుతింపఁ దరమే జ్ఞా... 20

మ. అలశ్రీ పట్టనసీమలో బహుళసాలాం స్థలోద్యానపం
క్తులలో మందమరుత్కిశోరకసముద్ధూతాగ్రకాదంబ వా
టిలలిం గేళిక సల్పు నిన్నుఁ గని పాటింపంగ రాలేమి ని
చ్చలు నిం దెల్లరు గొల్వవచ్చిరి గదా! జ్ఞాన... 21

శా. చింతారత్నగృహాంతరాళమున వాసిన్ బ్రహ్మవిష్ణ్వాది మం
చాంతస్థాయనిశై జగంబుల సముద్యల్లీల రక్షింప న
ట్లంతం బొందఁగఁ జేయు నీ వొకతెవే యాధారశక్త్యాత్మతా
సాంతత్యంబున నున్నదానవు గదా జ్ఞాన... 22

మ. మనసా చంచల మింద్రియప్రతతి దుర్మార్గప్రవృత్తంబు ని
త్యనిరాబాధత మించు నీ పదసపర్యం జేయు పర్యాయ మె
ట్లు నయం బంది గ్రహించువాఁడ నమరాలోకాభినంద్య ప్రభాం
చనవత్కాంచనరత్నభూషణయుతా జ్ఞాన... 23

మ. చలువ ల్లల్లడఁ జిల్కుగట్టునకు నైచం గూఁతురై మించు నీ
వెలమి న్బత్తుల యుత్తలంబులను మాయింప న్సమస్తావనీ
తలవంద్యోజ్జ్వలభోగభాగ్యములు నందం జేయు మేల్ చూపులం
జలువల్గల్గఁగఁ జేయు టబ్బురమొకో జ్ఞాన... 24

శా. కైలాసాచలసీమ సంగతులసత్కల్పద్రుమాకల్ప నీ
పాళీపాళి విహారకృన్మధుకరీ వ్యాహారవీణాకళా
లోలీభూతవితంద్రమంద్రరవ వల్లోలంబ కేళీవనీ
జాలా క్రీడితకౌతుకాంచితమతీ జ్ఞాన... 25

మ. సరళం బైనమతంబుఁ జెంది నియమాసక్తాత్ములై సంతతాం
తరపూజాపరమాదరంబుఁ గనియుద్యద్భావుకజ్ఞానులై
స్థిరయోగంబున నిన్నె కొల్చు సుజనుల్ శ్రేయోవిశేషాప్తి హె
చ్చ రమావాప్త నివాసులై వెలయరే జ్ఞాన... 26

శా. నీవే సిద్ధివి నీవే బుద్ధి వనుచు న్నిర్వ్యాజభక్తిక్రియా
ప్రావీణ్యంబున సంతతంబు నిను సంప్రార్థించు ధీరుల్ సమ
స్తావశ్యుత్తమసిద్ధిబుద్ధికల నావాప్తిన్రమావశ్యయో
షావశ్యాదికలీలల న్వెలయరే జ్ఞాన... 27

మ. నినుఁ జిత్తంబున సంస్మరించుచు నరణ్యానీసరణ్యాంతరం
బున నైనం జను వేళ వ్యాఘ్రచయముం బోత్రివ్రజంబుం దర
క్షునికాయంబును సింహసంతతియు ముచ్చుల్బోవఁగాఁ జేసి దా
సనితాంతోన్నతిఁ జేయు దీవకదవే జ్ఞాన... 28

శా. పారావారము నీదశక్య మని చెప్ప న్వచ్చు ధాత్రీధరో
ద్ధారం బౌనని యెంచవచ్చు నటులన్ ధాత్రీస్థలీరేణువుల్

తారాహారము లెక్కపెట్టఁదగు లోఁ దర్కింప నీసత్కళా
స్ఫారశ్రీగరిమల్ గణింపఁ దరమా జ్ఞాన... 29

మ. భవదీయాంఘ్రిసరోరుహద్వయమునం బ్రవ్యక్తభంగి న్విహా
రవిలాసస్థితినుండి యెల్లెడల సర్వప్రక్రియ ల్మాని యే
కవశం బయ్యె మదీయసత్కృతిని నింకం బ్రోవుమమ్మా జన
స్తవనీయోన్నతిఁ గల్గఁజేసి యెపుడున్ జ్ఞాన... 30

శా. నీవే దిక్కని నీదుసన్నిధిని నే నిత్యంబు సేవార్థినై
భావం బన్యగతంబు గానక వసింపం బెంపు దీపింప సం
భావింపం దగునమ్మ భవ్యమతి సత్పాత్రాదుల న్మించి వాం
ఛావిశ్రాంతి నొసర్ప నెవ్వరిక శ్రీజ్ఞాన... 31

మ. నయమార్గంబున భూప్రజం దనుపఁగా న్యాయక్రియాసంగతిం
బ్రియసామంత మహాప్రధాన హృదయప్రేమాతిరేకంబు సే
య యశోలక్ష్మి దనర్పఁ జేయదగు నీయర్చల్ ప్రభుశ్రేణికు
చ్ఛ్రియసంధానసమేధమానకరుణా జ్ఞాన... 32

మ. వెనకయ్యన్వలచేత డాపలికయి న్వెన్కయ్య వెన్కయ్య లా
లనలం బుజ్జవ మొప్ప నివ్రిచు మహాలస్యంబున న్నిల్చు నీ
వెనుకై యామర సుందరు ల్నిలిచి రీవిం గన్గొనం గంటి ని
చ్చనము న్బాదృశరీతిఁ బ్రోవగదవే జ్ఞాన... 33

శా. నీనామం బొకసారి నెమ్మనమున న్నెక్కొల్పిన న్రాజన
న్మానంబు న్నిగమాగమోక్తిపదవీ నానార్థనిశ్చాయకఁ
త్వానూనప్రతిభావిశేషమును నిత్యంబేకదా భక్తదుర్
జ్ఞానోచ్చాటనపాటవస్ఫుటకథా జ్ఞాన... 34

శా. సారంబైన భవద్దయారసమున న్సాధింపఁగావచ్చు దు
ర్వారారాతినికాయము న్సకల సంపల్లీలలు న్మున్నుగాఁ
జేరన్ హెచ్చఁగవచ్చు నేరికయినన్ శ్రీకాళహస్తీశయో
షారత్నంబ మదంబ శాంభవినుతా జ్ఞాన... 35

మ. ప్రసరచ్ఛీతలతావిశేషముల సంపాదించు మిన్నేఱు రా
త్రిసతీశాంశము నాదల న్నిలిపియుం దెంపేదు తాపంబునన్
విసపున్మ్రింతరి నీదు మోవిరసము న్వేమాఱుఁ గ్రోలంగఁ దా
నసిగా నిల్చెను సర్వలోకవినుతా జ్ఞాన...

శా. లీనప్రజ్ఞలకుం బ్రకృష్టధిషణాలీలావిశేషాప్తియున్,
న్యూనోక్తిప్రథమానశాస్త్రపదవీ ప్రోజ్జృంభమాణప్రథా
ధీనశ్లాఘ్యవదావదత్వమును సంధిల్లంగదా తావకా
ర్చానిష్ఠాగరిమంబు గల్గునటన్ జ్ఞాన .. 37

మ. నిరతిన్ నీపదపద్మపూజనవిధానిష్ఠాగరిష్ఠుండై నతతం
బరసాన్యాదరనేర నాదరములో నల్పంబుగా నైనఁ జో
న్న రహిం జూడక యేకభక్తిని భజింపన్ నిల్చువారీడేచరా
చరసంపూర్ణ జగత్త్రితి న్నిగుడు నో జ్ఞాన... 38

శా. పంచాస్త్రుండు త్వదీయ సన్నిధిని పేర్వర్తం బ్రయత్నంబుతో
బంచాస్త్రంబు బెదరింపఁబోయి త్రుటిలో భస్మంబు దానయ్యె న
న్నుంచే యింతలుపుట్టె నంచు దయఁ దద్యోగంబునం గన్గొనం
జంచద్దర్పకకోటి నించితి వపున్ జ్ఞాన... 39

శా. పారావారసుతాదిలేఖసుదతీ పారంపరీగీతికా
పారానంద పురంధ్రివర్గనియుత ప్రాంచద్వివాహాంగణో
దారామోదయుతాత్మబాంధవసతీతత్యాశ్రితస్వాంతిక
స్ఫారాచారకృతిప్రమోద భరితా జ్ఞాన... 40

శా. ఆనా ముక్కలిగల్గి యున్నది మహాహంకారమా మెంతు వి
శ్వాసం బెందును లేదు పూర్వము నృశంసత్వంబు సత్యార్థవి,
న్యాసం బన్నది వాసె సట్టిజడుని న్నన్ బ్రోవఁగాఁదవ్వత్కృపా
శ్వాసం బొక్కటిదక్క వేఱుగలదే జ్ఞాన... 41

శా. విశ్వాతీత పరాక్రమక్రమ సమావిఖ్యాతనిత్యప్రభా
వైశ్వంభ్యాహము కాప శృంఖల విహారాత్యంత భీతద్యుష
ద్విశ్వస్యతుం చండిఖండనదశా పశ్రాంతజన్య ప్రథా
శశ్వచ్ఛ్రుతిశక్తి వివకిదవే జ్ఞాన... 42

మ. ఫల ముక్కంతియు నిసవేల్పుల భజింపన్ దాన నేమౌ నటం
చెలమి న్నన్న సమగ్రభక్తిపథ సౌహార్ద్యంబుతోఁ గొల్వ ని
చ్చలు నన్నుం గనకున్న నెవ్వరిఁక శశ్వల్లీలఁ బోషింప ని
శ్చలకారుణ్య కటాక్షవైభవయుతా జ్ఞాన... 43

శా. శోణాంభోరుహ జైత్ర పాదయుగళీ శోభాకృదుద్యన్మణి
శ్రేణీహంసకమంజుగుంజిత సమాకృష్టావదాతచ్ఛద

క్వాణాకర్ణనమోదమాన హృదయా గచ్ఛద్ద్విషత్కిన్నర
స్త్రైణాలోకనహృద్యమందరగతీ జ్ఞాన... 44

మ. నునుమైచాయలు దాసనంపునన చెన్నొంబూని మిన్నందఁ గ్రొ
న్ననయమ్ముం గొని తుంటవింటనెలమిన్నం టొప్పఁగాఁ జేసి యు
పునముల్లోకము గెల్చు వశ్యముఖివై పాల్పొందు నిన్ గొల్చెదన్
జననీ సర్వజగత్ప్రమోదజననీ జ్ఞాన... 45

మ. కపురంపు న్విడె మానసంబున సమగ్రస్థాయిముకాస నా
నుపమాలంకృతి చన్గవం గటితటి న్హాంబట్టుఁ బుట్టంబు స
న్నపు మైపూఁత భుజంబుల న్వలయ నున్న న్నిన్నుఁ గన్గొన్న న
చ్చపుఁ బ్రేమన్ గిరిశుండు వీడఁ డహహా జ్ఞాన... 46

శా. జేజేరాయని జాల చెల్వమున మైచెల్వొంద బల్వేలుపున్
రాజాస్య ల్నలువంకలం గొలువులోనం గొల్వ బృందారకో
ర్వీజోద్భూతపరిస్రుతాలసగతి న్వీణాకల న్మించి వా
చాజాలాతిగవై ఖరి న్మెఱసితౌ జ్ఞాన... 47

మ. ఘనవృష్టి న్భువి సస్యజాతము సమగ్రప్రక్రియ న్మొల్క లె
త్తి నవోదగ్రఫలం బొసంగుగతిఁ ద్వద్దివ్యానుకంపా కటా
క్షనికాయంబున సర్వసంపద యుదర్కప్రాప్తి, గల్గించు దు
ర్ధనదారాత్మ్యభృసరాసకారం మహాయా జ్ఞాన... 48

మ. జయశబ్దం బొనరించుచు న్నిజుజు లోజ న్మంగల న్నిల్వ ది
వ్యయమిత్రాతము సామగీతులనయంబు న్వినుల న్నింపహృ
ద్దయక్రీఁగన్నుల నంకురింప సుంలన్ దైన్యంబు వోఁ ద్రోసి ని
శ్చయసౌభాగ్యము నింతు వీవకద వే జ్ఞాన... 49

మ. పలుమాఱు న్నిను భక్తియుక్తి భజియింపం గోరి వేళాప్తి నీ
కొలువుం గూటముఁ జేరి తావకదృగం కూరత్కృతాపూరసం
కలితోదాంతరార్థ కావ్యరచనాకల్యాత్మలౌ వారిలోఁ
జలనం బేద ననుఘటింపఁ గదవే జ్ఞాన... 50

మ. ముద మొప్ప న్మద సన్నుఁ జేర్చి భయసమ్మోదంబు లోకుల్ముమ్మడిం
బొదలం దావక పాదుకార్చన కథాపూతాత్మలై నిత్యని
ర్మదవృత్తి న్భజియించువారు చెలువారం గాంతు రష్టార్థముల్
చదువుల్పెక్కులు చిక్క నేమి ఫలమో జ్ఞాన... 51

మ. సతతంబు న్దురితావహంబగుచు సంసారంబునం బుత్రమి
త్రతరుణ్యాదివిచారయోగమున నైరంతర్యదుఃఖక్రియా
యుతుఁడై చేడ్పడుకన్న నిన్ను మదిలో నొందించి వందింపఁగా
జతనంబైనను జాలు నంచుఁ దలఁతున్ జ్ఞాన... 52

మ. క్రతువు ల్నూఱొనరించి యింద్రుఁడయి స్వారాజ్యంబు పాలించి సం
భృతమందారతరుప్రసూనశుభికాభిష్టుత్యకోటీరకో
టితచే మించి సుధర్మనున్న తఁడు బల్గీవిం ద్వదీయామృత
క్రతుశీలుం బురుడింపఁలేఁడు గదవే జ్ఞాన... 53

మ. కమలాభారతు లిర్వురు న్పరటులం గైఁబూనవేల్పుం గొమల్
క్రమమొప్పం గొలువంది కట్టెదుటఁ జొక్కంబైనగీతప్రసం
గము సల్పం గొలువున్న నిన్నుఁగని శక్రాదు ల్భజింతు గ్గదా
కమలారాతికళాభియాతివసనా జ్ఞాన... 54

మ. చదలొక్కుమ్మడి గ్రింగఁగా మనమునం జర్చించుచు న్మించు దు
ర్మద నక్తంచరయోధవీరవృతన క్రూరారవం డాట పా
టవలిర్పం గనుఁగొంగ దైత్యహతిగాటంబైన తేజంబునం
గదనప్రక్రియ మింతు రెవ్వ రహహా జ్ఞాన... 55

మ. వికలంబై చకితాత్ములై యసురరాడ్వీరాళి ప్రాసాసిశ
క్తికతారాదిక సాధనవ్రజము భీతి న్బాఱఁగా వైచి నే
రక నీచేరువ వచ్చి నా మనుచు దూరం బండఁగాఁ దోలితౌ
సకలామర్త్యనికాయగేయచరితా జ్ఞాన... 56

శా. ఫాళి న్నీకు సభక్తికంబుగను సాష్టాంగంబు లర్పించి యా
శాళీవిశ్రుత తావకీనచరితాశ్రాంతశ్రుతి న్మించి య
న్యాలాపంబుల మాని తావక సమాఖ్యాపాఠముం జేయుచో
జాలం జేటికి నన్నుఁ బ్రోచుటకు నై జ్ఞాన .. 57

శా. నింద ల్సేయుదు రెండఱో ధరణిలో నీకోధదోషోక్తి నా
నందం బందుదు రెండఱో సుగుణసంతానంబు లెక్కించి యీ
చందంబు ల్మదిఁ జేర్ప నీదయ మదాసక్తి న్విజృంభింపఁ ద్వ
చ్ఛందం బెట్టిదొ తెల్పవమ్మ వడిగా జ్ఞాన... 58

శా. ధీరశ్రేణికి మెచ్చుసేయు కవితాస్థేమంబు నేమంబుతో
రారాజద్గుణరాజ రాజసభల న్రంజిల్ల వాగ్వైదుషీ

పారావారుల నీకటాక్షమహిమా వాప్తింగదా ధాఁగణేఁ
స్ఫారఖ్యాతి వహింతు రెంతయు ప శ్రీ జ్ఞాన... 59

మ. జగతి న్నెమ్మది నెన్న మానుషము దుష్ప్రాపంబుపై నందులో
న గణింపందగు నాల్గువర్ణములలోనం బుట్టు టబ్రంబు పెం
పగు బ్రాహ్మణ్యము దానిలో నచట పర్యాయంబునన్ జ్ఞానయో
గగురుత్వంబు భవత్కటాక్షముననౌ జ్ఞాన... 60

మ. సముదానేక మతంగజావళియు నాజానేయవారంబు ను
త్తమరథ్యాళి రథంబులు న్సమరవిద్యాపాండితీమండితా
సమయోధావళి రత్నకాంచన సమంచత్పుత్రదారాదియో
గము నీపూజలభించునోజ నిజమో జ్ఞాన... 61

మ. భరమా నీకు మదర్థసంఘటనశుంభద్భావసంభూత స
త్కరుణాపూరతరంగ సంగసతతో దంచత్కటాక్షాంచల
స్ఫురణాపాదన మేల జాల మిఁక హెచ్చుం బల్కు లేలా భవ
త్స్మరణం గల్గఁదేమి గల్గుభువిలో జ్ఞాన... 62

మ. తెలియ న్నాదిల నీమహామహిమ బుద్ధింజూడ బ్రహ్మాది ది
వ్యులకైన న్నిజముంచు నాగమపదవ్యక్తు ల్వచింపంగ పి
నులలో సోఁకియుఁ గొంతవర్ణనము నేమం జేయుచుండం దనా
కలనాయత్తుఁడ నైతి నీధరమె సూ జ్ఞాన... 63

మ. సమయం బిద్దియటంచు నే నెఱిఁగి నీసాన్నిధ్యముం జెంది నే
మముతో సేవ యొనర్పఁజాలఁ గవితామార్గంబునం బ్రౌఢిమం
గ్రమ మొప్పం గనినాఁడఁగాను జడుఁ డింక న్వీఁడటంచు న్ననున్
సమతం గన్గొని వేగ బ్రోవఁ గదవే జ్ఞాన... 64

మ. నలుమోములలవేల్పుఁ గన్నదొర యెన్నన్నీకుఁ దోఁబుట్టుక
ల్వలరాతున్కతలంగలాఁ డొడయఁ డేలంజాలు నీవిజ్ఞగ
మ్ములనానిమ్ముల నిన్నుఁగొల్వఁ దలఁపుంబూనఁ దగు న్శ్లోక ము
త్కాలికామాత్రి నుతింతు నన్నుఁ గనవే జ్ఞాన... 65

శా. పొంగట్టు న్విలుదాల్పుమేన నఱ్జై పొల్పొందు నిన్జూచి యా
బంగారుప్పట్టపు వేల్పురాణి యిటులై పల్వన్నె నవ్వెన్నుహా
త్తం గానంగదె యంచు ముచ్చట నెడందం జెంద మేల్రీవి సా
గంగా జాణతనంబు మానితిగదా జ్ఞాన... 66

మ. వెలయు న్నీకరుణావిశేషము సదావిర్భూతమై భక్తకో
టులయం దంచుఁదలంచి యెందుఁ బొరపాటు న్లేక నిర్వ్యాజ సే
యు లలిం జాలను నీవె ప్రోవఁదగవా నగ్రస్ఫురద్వాడిమా
కలికాగుచ్ఛ సద్వృత్తకాంతికలితా జ్ఞాన... 67

శా. ఈవేలోకములన్ సృజింప నెలమి న్బోచింప డిండింప ని
త్యావిర్భూతమహాప్రభావయుతవై యాత్మేశుని న్సాక్షిలీ
లావిష్టాత్మని జేయుదంచు నిగమవ్యక్తోక్తి నేఫింటి న
న్గావం జాలవొకో నమన్మునివరా జ్ఞాన... 68

శా. బంధూకప్రతిమాళికస్థల కనద్బాహ్యస్థాంక రేఖా జగద్బంధూపు
ప్రభుకర్ణపూరయుగళీ భాస్వచ్ఛ్రుతీ సత్కృపా
బంధూరస్థితి నన్నుఁ జూచుచుఁ గళాపాండిత్యముం బాణిక
ర్కంధూరీతిగ నేర్పరింపఁ గదవే జ్ఞాన... 69

మ. తెలివాక్కింతయు లేనివాఁడని నన్నుం దీక్షై ఛేడంజేయక
జ్జ్వలమైనట్టి భవత్కటాక్ష మిఁక నాపైఁ బర్వ సర్వంసహా
వలయస్థాఖిలసత్కవీంద్రతతిలో వర్ధిష్ణునిం జేయు ము
త్కళికావత్కమలానుతాకృతియుతా జ్ఞాన... 70

మ. చరణార్చాపరభక్తరక్షణపరాసక్తి న్నినుం గొల్వఁగా
నరుదా సంపద లబ్రమా ముదము లత్యాశ్చర్యమా పుత్రపౌ
త్రరమావత్త్వము చిత్రమా పరజనారాధాతరాయప్రతీ
కరణం బంబుజగర్భసన్నుతపదా జ్ఞాన .. 71

మ. ధరణి న్నిశ్చలమైన నీకరుణ నిర్దంభోచితం బైనయ
ప్పరమాహ్లాదవినోది గాంచు నియతప్రఖ్యాతి నీతిక్రమ
స్థిరతం బ్రాజ్యసమస్తసంపదల వృద్ధిం బుద్ధియోగోల్ల స
త్సరసానందకవిత్వ సంపదయు శ్రీ జ్ఞాన... 72

శా. శ్రీచక్రార్చనసేయుచు న్సతతస్వస్థిరత్వోదయ
ప్రాచుర్యప్రథమానభక్తిని యతప్రజ్ఞావిశేషం బటుల్
వాచామాధురి నీదునామపఠన వ్యాకోచకావ్యక్రియా
సాచివ్యంబును గాంచు మందుఁ డయినన్ జ్ఞాన... 73

మ. కలికాలం బిది దీనియం దొకఁ డనేకప్రక్రియా యుక్తిని
శ్చలభక్తి న్నినుఁ గొల్వలేఁడు జన్ముఁ డాశాయోగమా మొందుత్రో

వలనేకంబులు విఘ్నయోగములకుం బాటిల్లు నీభక్తిలోఁ
గలుగంజేయఁగ నీవదిక్కు గదవే జ్ఞాన... 74

మ. అలసత్వం బధికంబు గ్రంథములు పర్యాయంబునం జూడఁగాఁ
గలనా లెక్కకురాని వెట్లయినఁ జక్కంజేసి చూడంగ సం
దలి తాత్పర్యము దుర్లభం బనుచుఁ గానంజాలకున్నాఁడ ద్వ
త్కలితానుగ్రహ మొక్కఁడుండఁ గొఱఁతా జ్ఞాన... 75

మ. పగలు న్రేయిఁ ద్వదీయసత్కరుణకై భావించి సేవించెదం
దగ నిన్నిట్లిది చూచి వీఁడు మద నుధ్యానైక తాత్పర్య ని
ష్ఠగలాఁడంచు మదిం దలంచి కరుణాసాంతత్యసంబంధ స
జ్జగతిం బ్రోవఁగ రావిదేమి యకటా జ్ఞాన... 76

మ. కలి సంతంతంకు ధర్మకర్మపథ సంస్కారంబు మాసె న్మహా
బలవంతంబయి కానిపించె నహహా మాన్యావమానక్రియా
కలనల్ నీ కరుణాకటాక్షమున నిక్కాలంబు దోలందగుం
జలనం బింతయుఁ జెందకుండ జననీ జ్ఞాన... 77

మ. ప్రియము ల్వల్కిన నప్రియంబులని సంప్రీతి న్వగ ల్జెందకే
మయినం జూచుచు నీయనుగ్రహముగా నాంతర్యమం దెంచుచు
న్భయ మొక్కింతయులేక నిన్ను మదిలో భావింపఁగా బుద్ధి ని
శ్చయ మి మ్మాత్మజననీ హితార్థజననీ జ్ఞాన 78

మ. సరసాలాపవిలాస హాసరచనాచాతుర్య సుస్థైర్య భా
స్వర దివ్యస్వరరీతి సంతతతతవ్యాసంగదివ్యాంగనా
పరిపాటీగణనా వినోద విలసద్భవ్యాదరోద్యత్మ్సతా
చరణాంభోజన తామరవ్రజహితా జ్ఞాన... 79

మ. స్ఫుటతారాని కరస్ఫురచ్ఛుచిమణీ శోభాంకహారావళీ
ఘటితోత్తుంగ కుచద్వయోపరిలసత్కం జాతరాగారుణో
ద్భటకూర్పాసవిభాసమానకురు విందశ్రేణికా ప్రోల్లస
త్కటకాలంకృత పాదపద్మయుగళీ జ్ఞాన... 80

మ అగరాజాత్మజ తావకీన కరుణాయత్తంబు ముల్లోక మొ
చ్చఁగ నీదైన మహావిభూతివశమే సర్వామరశ్రేణికై
న నగశ్రీ పన్ భవదీ మసద్విభవ మీ నాకెట్లు వర్ణింప నో
జగతీస్ఫార గర్భగోళకలితా జ్ఞాన... 81

శా. జల్పాకామరకామినీకృత కథాసారస్యలీలా క
శా నల్పోదంచిత మందహాసలలిత స్వాస్యాబ్జకాహిపా
కల్పాత్మేష్టసహాసికాఘటన కృత్కాదంబ వాటీక న
త్కల్పోద్యాన విహారకేళిరసికా జ్ఞానప్రసూనాంబికా... 82

శా. సర్వాధీశ్వర తల్పసోదరి జగజ్జాలాభి నందోక్తి మద్గీర్వ
త్వాది సుతాత్మచాతురి త్రిలోకీ సుప్రసిద్ధాంగనా
దర్పాపాకరణాత్మ సుందరి నినున్ ధ్యానింతు నే నెప్పుడుం
గర్పూరాగురుకుంకుమాంకితకుచా జ్ఞాన... 38

శా. భద్రాపాదనముఖ్యమై తనరు నీ భక్తి న్మనుస్వార్థ సం
పద్రాజప్రద మంచు నెంచి జగతీపాలుర్ దదాయత్తులై
సద్రూఢిన్ భజియింతురేనటు బగాంచ బ్జాల సేవాస్థితిం
గద్రూజాతకలాపకంజనయనా జ్ఞాన... 84

మ. విడువన్నీపదసన్నతి క్రమగతి న్వేదార్థపూర్తిస్థితిం
గడవన్లోకమున న్వదాన్యతతి నెక్కాలంబు నేమైననుం
దడవన్సత్యముగాంగం బల్కుడం బ్రశస్తంబైన నీసత్కృపం
గడువంత ద్రోలగింప వమ్మ జననీ జ్ఞాన .. 85

శా. చింతారత్న నివాసవాసరసికా శ్రీపుర్యుదారాసి
కాశాంతా త్మాంతరసీమసాధువసతీ శ్యామాభిరామద్యుతీ
సంతాసాపహృతి ప్రవీణచరణా శత్రుచ్ఛిదా కృద్రణా
స్వాంతాంతర్జ్వలగజ్జగత్పటలికాజ్ఞాన... 86

మ. చెడుమార్గంబని యించుకైన మదిలోం జింతింపకే నెప్పుడున్
విడనాడందగు చెయ్వులన్నియును సువ్విళ్ళూరుచుం జేసితిం
బొడగానందదు పారతి న్మదిని దప్పుల్లూన కొక్కుమ్మడిన్
గడకంటం గని ప్రోవుమమ్మ దయతో జ్ఞా... 87

మ. స్ఫుటమైనీకరుణారసం బెవనిపై సోకు న్వసన్ ధాత్రివాం
డటవీవీధుల శత్రుమధ్యమున దుస్యద్వారిపూరాంతరో
త్కటవీథీనిచయంబునం బడినవేగంబ్రోతువా నీవెధూ
ర్జటిచామాంగనివాసిభాసురతనూ జ్ఞాన... 88

మ. నవకావ్యంబు రచించి ప్రాజ్ఞులను నానావృత్త్యలంకారరీ
తివిశేషంబుల మెచ్చువచ్చునటు లుద్దీపింపంగా నర్థసం

భవసారస్యముఁ దెల్పఁ దే రిపుడు నామూఢెంత యొక్కింతనా
కవితం గైకొనుమమ్మ యెట్టులయినన్ జ్ఞాన... 89

మ. తపముం జేయుచు నీమనంబునకు సాంతత్యంబుగా సంతసం
బొప్పుడుం జేయఁగఁజాల నీమనూజపం బెంతే నొనర్పందగం
గృపఁ బుట్టించు మృదూక్తి నేనెఱుఁగ నొక్కింతైన నీవిప్పు డో
క్కపరిం జూడు మహేశుకోరితినయ్యల్ జ్ఞాన... 90

మ. అమరీలోకము వేళవేళలఁ ద్వదాయత్తస్థితిన్సేవన
ల్ప మహానందముతోడఁ గొల్వయిన నీపాదంబు లర్చించున
ట్టి మహాభాగ్యము నారదాదులకుఁ బాటింపం దగుంగాక ని
క్కముగా నిన్గొలువంగఁ జాల రితరుల్ జ్ఞా... 91

మ. వశమా మాదృశులైనవారలకు నిన్ బ్రాక్కుచ్చివర్ణింప నీ
యశముం బేర్కొని సంస్తుతింప మఱి నీయక్షీణకారుణ్యలే
శశతాంశం బయి నల్లభింపక జగత్సంభావ్యసృష్టిక్రియా
కశతానం దశతాభినంద్యచరణా జ్ఞాన... 92

మ. జయమాతంగి! వణీవిపంచీవినసత్సప్తస్వరీసజ్ఝరీ
నయసందాయిత మేరుశైలగత నానారత్నవాః పూరసం
చయనానా రుచిమద్ధునీశతసమానప్రాప్త నవ్యక్రియా
జయ నిర్ధూత సమస్తదైవత భయాజ్ఞాన... 93

మ. సవినోదోద్ధృత సంయుతాయుతకరా సక్తిస్ఫురద్వ్యాతుణా
ది విశేషాభిమతప్రకార మృదుగీతి స్ఫూర్తిరేఖాజవా
ధ్య విహారాభినయప్రపంచ నియతవ్యాపార రంభాదిలా
స్యవిలాసోన్నతి దర్శనాద్భుతి మతీ జ్ఞాన... 94

మ. దయ యొక్కించుక నాపయిన్నిలిపి నీదాసుండ నౌనన్న ని
ర్భయునిం జేసి సమస్తకార్యముల సప్రబంబైన సాఫల్యమూ
న్చి యనన్యాదృశమైన తెల్వి దయతో నీఁజాలు దీవేకదా
జయసమ్మోదిత దేవతాపటలికా జ్ఞాన... 95

శా. పంచాస్యంబు హయంబుగా సముదసంప్రాప్తా సురవ్రాతముల్
గొంచెంబైనను జిక్కనీక దునుమం గోదండపాండిత్య లీ
లాంచత్పాణి విలాసవై తనరు నీయుబ్రంపు శక్తి న్నమి
త్పంచారాంచిత శక్తిసేన లెఱుఁగుల్ జ్ఞాన... 96

మ. కమలాజేశకృదాయతాక్షియుగళీ కల్యాణభూభృద్రుచి
క్రమనిర్మోటనపాటవోంసిజ యోగశ్రీ సమేతావదా
త మణీహారవిరాజమానగళ మిథ్యా మధ్యమా పూర్ణిమా
కమనీయేందు విభాసమాన వదనా జ్ఞాన... 97

మ. కలరా వేల్పులు నీకు సాటి యనఁగాఁ గన్గోఁగ లేరేల ప
ల్కులు నీవే ననుఁ బ్రోవఁగా వలె దొసఁగుల్బాలఁగాఁ దోలి నా
వలన న్నేరములున్న నీమదిని జేర్పంబోక రక్షింపుమీ
జలజాత ప్రభవాంగనాది వినుతా జ్ఞాన... 98

శా. నానాపుష్పఫలావళీ సతతదాన ప్రోల్లసద్భవ్య సం
తానానోకహ మధ్యవీథ్యుదిత విస్తారస్ఫురచ్ఛాఖికా
ధీనానేక మధువ్రతీ పరభృతీ దివ్యశ్రవస్సౌఖ్య ద
స్వానోద్యానవిహారకేళిరసికా జ్ఞాన... 99

శా. సందేహం బొకయింతయేని మదిలో సంధింప కెవ్వేళ నీ
వందారు వ్రజరక్షణ క్షమదృశావ్రాతం బపేక్షించి యు
స్పందప్రక్రియ నున్నవాఁడ మనుపన్ భారంబు నీదే కదా
ఛందోవీథి విహారలాలస మతీ జ్ఞాన... 100

మ. లలితాష్టాదశ పీఠికాకలిత లీలారూపవై జప్యకృ
త్ఫలదానాప్రతిమప్రభావ విలసత్కారుణ్య పూరంబు దో
ల్కఁ లలిం దాదృశహేలలం దగు నిసుం గాంతుగదా యింద నీ
ష్కలుషంబై తగు భక్తి యుక్తి జననీ జ్ఞాన... 101

శా. శ్రేయస్సంతతధామ నామరకుల శ్రీవేంకటేంద్రాజ్ఞఁ బ్ర
జ్ఞాయత్తౌచిత సర్వశాస్త్రి యిటు లొయ్యం జేసె జ్ఞానాంబికా
శ్రీయానుగ్రహలీలఁ బద్యశత మీరీతిం బఠింపన్ జనుల్
ధీయుక్తస్థితి నన్నివిద్యలఁ బ్రశస్తిం జెంది పెంపెక్కరే. 102

జ్ఞానప్రసూనాంబికాశతకము సమాప్తము.



శ్రీరస్తు.

# ఆంధ్రనాయకశతకము.



మదనంతలక్ష్మీయుతోరఃస్థల! చతురాననాండపూరితపిచండ
దరచక్రఖడ్గగదాశరాసనహస్త! నిఖిలవేదాంతవర్ణితచరిత్ర
సకలపావన నదీజనక పాదాంభోజ! రమణీయ ఖగకులోత్తమతురంగ
మణిసౌధవత్ఫణామండలోరగతల్ప! వరకల్పకోద్యానవనవిహార
గీ. భానుసితభానునేత్ర సౌభాగ్యగాత్ర, యోగిహృద్గేయ భువనైకభాగధేయ
చిత్రచిత్రప్రభావ దాక్షిణ్యభావ, హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ 1
సీ. వైజయంతీదామ వర్ణితసుత్రామ, శోభననామ లోకాభిరామ
కువలయశ్యామ వికుంఠపట్టణధామ, శ్రుతిహితనామ దైవతలలామ
కృతదైత్యసంగ్రామ గీతార్థపరిణామ, యదుకులాంబుధిసోమ యఘువిరామ
సంగరజితభీమ రంగద్గుణస్తోమ, త్రిభువనక్షేమ వర్ధిష్ణుకామ
గీ. దాసులముగామ నీపేరుఁ దలచుకొమ, కొసరితిమి ప్రేమ కోరినకోర్కెలీమ. చిత్ర
సీ. మానుమహార్యక్ష మార్తాండసోమాక్ష త్రిభువనాధ్యక్ష కౌంతేయపక్ష
మదనకోటివిలాస మంజులదరహాస, శ్రీహృన్నివాస కౌశేయవాస
శార్ఙ్గకోదండ పిచండభృతాజాండ, వియతవేదండ రవిప్రచండ
దీనశరణ్య విద్విట్ఛేదనైపుణ్య, భక్తానుగణ్య దిక్ప్రభువరేణ్య
గీ. సిద్ధసంకల్ప యవికల్ప శేషతల్ప, నిష్కళంక నిరాతంక నిరుపమాంక చిత్ర 3
సీ. గోవింద ముచికుంద సేవితపాదార, వింద నిత్యానంద విశ్వతుంద
శ్రీమంత విజయలక్ష్మీకాంత నిర్మల, స్వాంత భక్తోద్యానవనవసంత
యఘునాశ కోటిసూర్యప్రకాశ పరేశ, విజితాశ సన్మనోంబుజనివేశ
సద్గుణగేహ వాసవనీలసమదేహ, బంధురోత్సాహ సుపర్ణవాహ
గీ. పండితస్తోత్రచారిత్ర! పద్మనేత్ర!, మధురమంజులభాష! సమస్తపోష! చిత్ర. 4

సీ. శ్రీకాకుళము భక్తలోక చింతామణి, శ్రీకాకుళము సుకృతాకరంబు
శ్రీకాకుళము ధరాలోక వైకుంఠంబు, శ్రీకాకుళము మర్త్యసేవితంబు
శ్రీకాకుళము వేదసిద్ధాంతమహిమంబు, శ్రీకాకుళము హతవ్యాకులంబు
శ్రీకాకుళము మహాక్షేత్రావతంసంబు, శ్రీకాకుళము సర్వసిద్ధికరము
గీ. తెలియ శ్రీకాకుళంబు నీ దివ్యదేశ, మాంధ్రనాయక! నీవె శ్రీహరివి నిజము చిత్ర. 5
సీ. ఇంద్రనీలచ్ఛాయ మీఁదనెమ్మేనిపైఁ, గనకాంబరప్రభ గ్రందుకొనఁగఁ
బర్వసుధాంశుశోభాసముజ్జ్వలవక్త్రి, మున నూర్ధ్వపుండ్రము ముద్దుగుల్క
నెనుభుజంబుల ధగద్ధగితాంగదద్యుతుల్, మూర్ధరత్నకిరీటమునఁ జరింప
వర్తితోరస్థలి వైజయంతిక కౌస్తు, భాంతర శ్రీదేవియంద మమర
గీ. రమ్యదర్శన మిమ్ము ఘోరములఁ జిమ్ము, నుభయమిమ్ము భవత్తత్త్వమానతిమ్మ
సీ. కలిగినప్పుడె కన్నతలిదండ్రు లెన్న నే, నినుపు మూఁడంగ నేర్చె జగతి
బయలిజగంబు లంబకు నిజోదరమునం, దే బిడ్డ చూపించె నిద్ధరిత్రిఁ
దొడలపై ముద్దుగా నిడుకొన్న జననికే, పసిపిల్ల కొండంతబరువు దోఁచెఁ
దల్లి చెంగటనుండ యిల్లిల్లుఁ జొచ్చెయే, కుఱ్ఱఁ డింతుల బల్మిఁ గూడ నేర్చె
గీ. నాబుమతి వీవెరా యబ్బ! యబ్బురంపు, కతలమారివి నీవెఱుంగనపగల వెః చిత్ర. 7
సీ. వరమిచ్చినట్టి శంకరుని కెగ్గు దలంచు, భస్మాసురుని పేరుఁ బాపినావు
తనయిల్లుఁ గాచు నుగ్రుని బోయటకుఁ బల్చు, బాణుచేతులు తెగఁ బఱికినావు
తొలుమిన్కులజుని ముచ్చిలి గొన్నసోమకుఁ, జంపి విద్యలు ధాత కంపినావు
బలిమి దైత్యులు సుధాకలశము న్గొనవారి, పంచించి సురలకుఁ బంచినావు
గీ. నిఖిలదైవతకార్యముల్ సర్వహించు, నిను నిజకార్యము ధరించె సర్వహింప! చిత్ర 8
సీ. అచట లేవనకదా యుచేతఁ జఱచఁగ్రు, ద్ధత సభాస్తంభంబు దానవేంద్రుఁ
డచట లేవనకదా యుస్త్రరాజం బేసె, గురుసుతుం డుత్తరోదరమునందు
నచట లేవనికదా యుత్తరోపి ననిచెఁ బాండవు లున్నవనికిఁ గౌరవకులేంద్రుఁ
డచట లేవనికదా యాత్మీయమసభ ఖద్రౌ, పదివల్వ లూడ్చె సర్వధ్వజుండు
గీ. లేక యవ్వోట్లులను గల్గలదె ముదము, కలవు కేవల మవ్వోటఁ గల్గుటయదె. చి.
సీ. అంచితాఖండదీపారాధనలచేత, దీపించు నెప్పుడు దేవళంబు
అగరుసాంబ్రాణి ధూపార్పణంబులచేత, భవనం బదెప్పుడుఁ బరిమళించు
నతినృత్యగీత వాద్యస్వనంబులచేత, నెప్పుడుఁ గోవెల యెసక మెసఁగు
నఖిలోపచారసమర్పణంబులచేత, మెఱయు నెప్పుడుఁ దిరుమేని కళల
గీ. నిపుడొకించుకలోభిత్వ మెనసినట్లు, దోఁచుచున్నాఁడ విట్టియద్భుతముగలదె. చి.
సీ. భక్తిఁ జేసిన శిలాప్రతిమమాత్రమె కాని, హరి యిందుఁ గలుగునా యనెడువారు
స్వామి యిందుండిన సత్యంబుఁ జూపక, యుండునే యని పల్కుచుండువారు

బుద్ధావతారంబుఁ బూనినాఁ డఖిలంబుఁ, గని కననట్లుండు నసెడువారు
దేవతామహిమంబు దెలియునో యేమేమి, నడువ నున్నదో యని నుడువువారు
గీ. నీకు నిత్యోపచారముల్ లేకయున్న, లోకు లిట్లాడుకొందురి పరాకిదేమి చిత్ర.
సీ. ధర నూటయెనిమిదితిరుపతులందు శ్రీ, కాకుళం బరయఁ బ్రఖ్యాతమేని
యాంధ్రనాయకుఁడవం చఖిలదేశంబుల, నిన్నుఁ గీర్తించుటే నిజమయేని
వైఖానసోక్తికి వంచన రాకుండ, నెరుసు చూపించుమాట నిజమయేని
వైకుంఠుఁడవు స్వయంవ్యక్తిగా నర్చావ, తార మొందినమాట తథ్యమేని
గీ. వివిధపూజోత్సవములు నిర్విఘ్నములుగఁ, జేసికొనకున్న నీకుఁ బ్రసిద్ధిగలదె. చి.
సీ. మానితంబుగ గరుత్మద్ధ్వజారోహణం, బెప్పు డొనర్తువో చెప్పుమయ్య!
గమరితో నీ తిరుకల్యాణసంభ్రమం, బెప్పుడెప్పుడో వేగ చెప్పుమయ్య
రమతో మహోన్నతరథ మెక్కి తిరువీథు, లెప్పుడేతెంతువో చెప్పుమయ్య
ధరణి నభ్యాగతదాసప్రజాబృంద, మెప్పుడు బలియునో చెప్పుమయ్య
గీ. వత్సరోత్సవవీక్షణవాంఛ జనుల, కెపుడు ఫలియించునో యానతీయుమయ్య. చి.
సీ. తగునట్లు తిరుమేను తా నామతింపుచు, మిన్న పీతాంబరం బున్న దనుచుఁ
గమలతోఁ బుట్టినకౌస్తుభం బదిపోవఁ, దక్క సొమ్మది నీకు తక్కె ననుచు
లలితరత్నద్యుతి మొలచినట్లు కిరీట, ముత్తమాంగముఁ బాయకున్న దనుచు
మండితమాణిక్యకుండలంబులు కర్ణ, యుగళితోఁ బుట్టినట్లున్న వనుచు
నిండుకొన్నావుగడెంబుమునేరుపరివె, ప్రావలువ బారువాణముల్ బ్రాఁతియేమి? చి.
సీ. వంచనగాదె దివ్యక్షేత్రపతులలో, మంత్రార్థకృత్యము ల్మానియున్న?
నపకీర్తిగాదె లోకాలోకములయందు, వత్సరోత్సవములు వదలియున్న?
నగుబాటుగాదె యన్యమతస్థజనులలో, నిజదాసకోటి మన్నింపకున్నఁ?
బరిపాటిగాదె యల్పజ్ఞానమతులలో, దేవతామహిమంబుఁ దెలుపకున్న?
గీ. నేఁటిదా నీప్రతిష్ఠ? వర్ణించిచూడఁ, బాడిదప్పిన బలునిందపాలుగావె? చిత్ర. 15
సీ. తిరునాళ్ళతఱి వచ్చెఁ బరిపరివిధముల, నెలమి సామగ్రిఁ జేయింప వేమి?
సేవకు లందందు సేవింప భావింప, దిరువీథుల రథంబుఁ ద్రిప్ప వేమి?
వృజిన మెల్లఁ దొలంగు నిజమంచుఁ బ్రజ లెంచు, పరమప్రసాదంబుఁ బంచవేమి
దివ్యదేశం బిది తీర్థంబు సార్థంబు, చక్రతీర్థము కృపసలుపవేమి?
గీ. హితముగావించినీయన్వయంబు లెత్తి, కీర్తినిం దఁగ వర్ణించి కేలిపఱతు, చిత్ర. 16
సీ. చెల్లింపఁ దగునె వ్రేపల్లెలోఁ గలవెట్టి, గొల్లముల్లాండ్రను గొల్లగొనఁగ?
మెక్కంగఁ దగునె మున్నెక్కడ్లలో నట్లు, కెక్కి పాల్వెన్నలు దొక్క నిండ?
మ్రుచ్చిలఁ దగునె మళ్ళుచ్చి జలక మాడు; మచ్చెకంటులకోక లిచ్చకముగ?
మ్రొక్కంగఁ దగునె ముందొక్క పువ్వునకుఁదాఁ, గక్కసించినయాలికక్కజగము?

గీ. నిట్టినగు బాటుపనులు నీవెన్నికలుగఁ, జేసినాఁడవు మంచిప్రసిద్ధకుఁడవె, చిత్ర. 17
సీ. అబ్బకోఁగఁ వౌ కాయక్లేశ మొనరించుఁ దేవాసురు లటుండ దివ్యరమను
దోఁచుకోఁ గలవా చేసాచి లోకములాది, బలిమహారాత వైభవము లెల్ల
రాఁదీసుఁ గలవా సత్రాజిత్తుఁ డీకున్న, మణిశమంతక మొక మమతఁ గొల్పి
నాటించఁ గలవా నన్నకనన్ననె వనంబు, నెట్టు మూత్రిన్పకలించి పెరటిలోనఁ
గీ. దెమ్చుకొనవేమి వస్త్రాన్నదీపధూప, గంధతాంబూలములకైన గడన దెలిసె, చి.
సీ. తలను బింఛెపుదండ ధరియించవలెఁ గాని, మణికిరీటము బెట్ట మనుజపతివె?
గళమున వనమాలికలు పూనవలెఁ గాని, హారము ల్వేయ దేశాధిపతివె?
కరమున మురళి చక్కఁగఁ బూనవలెఁ గాని, శాతాసిఁ బూనంగ క్షత్రియుఁడవె
తనువు గోక్షీరవాసన గుప్పవలెఁ గాని, చందనం బలఁద రాజవె తలంప?
గీ. నెల్లలోక మెఱింగిన గొల్లవాఁడ, వేది కులమింత రాజస మేమి నీకు? చిత్ర. 19
సీ. కన్నవారల మున్న కారాగృహంబున, విడిచి పాఱితివి నీ కడిమి యేమి?
పగవాఁడు పురిటిలోఁ బట్టి నెత్తుకపోవఁ, దమకించుచున్న నీ ధైర్య మేమి?
ముద్దుమన్మని గోప్యముగ నొండు బంధింపఁ, దెలియన ట్లున్న నీ తెగువ యేమి?
వైరిధాటికి నోడి వనధిమధ్యమునందు, నిలు గట్టుకొన్న నీ బలిమి యేమి?
గీ. విఱిగి తిరిగెన్నఁ డెన్నఁడో తఱి మెఱింగి, యొరులనడఁచితివది యేమి భరము నీకు? చిత్ర.
సీ. భిల్లాంగనాదంతపీడిత ఫలభుక్తి, హేయంబు దోఁచదే దింత నీకు
సంక్రందనాత్మజస్యందన సారథ్య, మెరుసుగాఁ దోఁచదే దింత నీకు
గోపాలకానేక గోవత్సపాలనం, బెగ్గుగాఁ దోఁచదే దింత నీకు
వ్రజబాలికా ముక్తవస్త్రాపహరణము, హీనమై తోఁచదే దింత నీకు
గీ. నుచ్చనీచంబు లెఱుఁగక యిచ్చఁ జేయు, చేష్ట లివిభక్తహితమతిఁ జేసి తండ్రు చిత్ర.
సీ. వినుతభూపతు లెట్లు విముఖులై పాఱిరో, రాజపీఠం బెక్కరాని నీకు
కుంభినీధవు లెట్లు కూఁతుండ్ర నిచ్చిరో, కుల మొల్లకయె నీకు గోపకునకు
సుందరీమణు లెట్లు చూచి మోహించిరో, కన్పగు నైచాయ గలుగు నీకు
దానజం బెట్లు దాస్యంబు సలిపిరో, సిరియు వానిని మారుతిరియ నీకు
గీ. మమత నీలీల లటు సూచి భ్రమసిరేమొ, తగుదు వేయిట్టి ఘనత కుదంభభూప. చిత్ర. 22
సీ. విక్రమాక్రమితభూచక్రుఁడౌ హేమాక్షు, బొంగణించుటలు కోణంగితనము
కరగతామృతకుంభగర్వితాసురకోటిఁ, దూలఁగొట్టుటలు గయ్యాళితనము
కుచపూర్ణవిషదుగ్ధకుటిలయౌ పూతన, పేరుమాయించుట పిల్లతనము
కంసపురీద్వారగమనావరోధి యౌ, మదకరి నీడ్చుట మకురుతనము
గీ. వడిగలతనంబులౌ యివి? గడన యేమి, కొద్దిపను లివి నీకిది పెద్దతనమొ? చిత్ర. 23
సీ. కెరలి కంసుఁడు నిన్ను నఱకఁ గాచినవ్వాని, భారిసోదరిఁ ద్రోచి పాఱినావు

సరిపోర నరకు నోర్వఁగలేక చేతిచి, ల్లాలిచే నీడి దండ నలరినావు
తెగడి బంధువు రాజుఁ దిట్టికొట్టఁగ నోర్చి, వైదర్భిఁ జేపట్టి వచ్చినావు
దర్పకోద్ధతి కెంతొ తత్తరపడి నిజ, స్త్రీపదాబ్జములఁ జే మోపినావు
గీ. నీపరాక్రమ మిట్టిది నిఖిలజగము, లాజ్ఞమీఱక నిల్చుట యద్భుతంబు. చిత్ర 24
సీ. వేపల్లెలో గొల్లవెలఁదులు గొట్టరా, దొడిదొడి యిల్లిల్లుఁ దూఱలేదొ
రాసకేళికయందు రమణులాయొందఱో, చుట్టిపట్టినఁ బాఱఁజూడలేదొ
పదియాఱువేల గోపకుమారికలు తేరి, పాఱఁ జూచిన మతి బ్రమయలేదొ
పరిణయవాదంబున భార్యలా యెనమండ్రు గసరివేసినఁ గూర్మిఁ గొసరలేదొ
గీ. తలిరుబోఁడులయెదుటఁ దత్తరము గలుగ నీవు పరరాజముఖమున నిలువగలవె. చి.
సీ. ఆలు నిర్వాహకురాలు భూదేవియై, యఖిలధారకుఁ డనునాఖ్యఁ దెచ్చె
నిష్టసంపన్నురా లిందిర భార్యయై, కామితార్థదుఁ డన్న ఘనతఁ దెచ్చెఁ
గమలగర్భుఁడు సృష్టికర్త తనూజుఁడై, బహుకుటుంబకుఁ డన్న బలిమిఁ దెచ్చెఁ
గలుషవిధ్వంసిని గంగ కుమారియై, పతితపావనుఁ డన్నప్రతిభఁ దెచ్చె
గీ. నాండ్రు బిడ్డల దెచ్చుప్రఖ్యాతిగాని, మొదటినుండియు నీవు దామోదరుఁడవె
సీ. కదలి రాయని ముద్దుకన్నియఁ బెండ్లాడి యూఁచఁగా నిల్లటముండు టేమి
సహజ నొక్కతె నేక మండపాండవునకుఁ బెండ్లిఁ జేసితి వీవు పెద్దవేమి
చిరరతిప్రౌఢను జిన్నబిడ్డని కీవు గూర్చితి వారీతి గూడునేమి
యుగములనాటి పెన్ముగువను ముసలన్న కొగిఁ జేసితివి తగుం దగు మతేమి
గీ. తెలియ నస్వతంత్రుఁడవు గావు తెలిసికొన్న, నిట్టివాఁడని తెలియలే దెవ్వరికిని చిత్ర
సీ. నీజ్యేష్ఠపుత్త్రుఁ డెన్నికకు రానియశాశ్వ,తపుఁ బసుల్సేయు సంతతము జగతి
వేరొక ముద్దుకుమారుఁ డందఱిమోహ, ఉతల స్త్రీపురుషులఁ లంకెఁ బెట్టు
నీతలోదరి లోకమాత పక్షపాతు, దృష్టిఁ జంచలవృత్తిఁ దిరుగుచుండు
నీ వనన్యకృతాదని బిడమాయావిధా, నుల జేయు దెవ్వరిఁ దొలఁగనీక
గీ. నొకరికంటె గుణాధికులొకరు మీరు, ఇంతచక్కని దెలిసెమీయింటివరుస. చిత్రా.
సీ. సకలంబు నీటయై యొకమఱ్ఱియాకుపై, నిచ్చఁ బరుండునా డెంత గలవొ!
తన బిడ్డఁ డని యశోదాదేవి పొత్తుల, నిడుక ముద్దాడునా డెంతగలవొ!
తక్కులమారత్త డక్కించుకొనఁగ ని, న్నెత్తుక పెంచునా డెంతగలవొ!
భయలేశ మెఱుఁగక బల్పాముపడగపై, గంతులువైచునా డెంతగలవొ!
గీ. పరువుగలవాఁడనే మిప్రాఁబల్కులంచుఁ, దెలియవరిముక్కుముల్లంతగలవొ లేవొ! చి
సీ. కల్లుకల్గాపు (వేపల్లెవా రందఱు, పాల్గొన నచట నీమాట సాగె
మధురాపురీవరమనుజు లామోదించి, మన్నింప నచట నీమాట సాగె
ద్వారకాపట్టణధన్యులు నినుఁ గోరి, కొల్వఁగా నచట నీకొల్వు సాగెఁ

గరిపురధర్మజుం డురురాజసభ నిన్ను, భూషింప నచట నీమురుసాగె
గీ. నెరుకమాలినవారునీవరుపు దలఁతు,రేని నీపూంకముబుసాగు నేమియచట? చిత్ర.

సీ. దూడలలోఁ బెరదూడ మేయఁగఁజూచి, యట్టిపట్టుక చావఁగొట్టవలెనె
పాడవరావేగ నాబోతుకొమ్ములు పట్టి, విడువక దానిపై రుకువవలెనె
ముక్కుతోఁ జెనకిన కొక్కెరాయనిఁ బట్టి, వెరవొప్పఁగా మెడ విఱువవలెనె
తన్ను;బోతని మృగాధము మంచు నెంచక, తొడరిగార్ధభమును ద్రుంపవలెనె
గీ. యేమిఘనకార్యములుచేసి తిద్ధరిత్రి, నెన్నటికి నిపొగర్చిన విట్టిపనులె చిత్ర. 31

సీ. కవ్వడి కెంత చక్కఁగబోధ చేసిన, నతంపూంనాకర్మ మిష్టపఱుప
రాయబారం బెంతరసికత నడపిన, నఁకి భాంతుం నాయత్త పఱుప
విశ్వరూపం బెంత విమలతఁ జూపిన, నోర్వనకురురాజు నులుకుపఱుప
విలుఁ బట్టనని యెంతో చెలిమిగఁ బలికిన, నవల సుయోధను నానపఱుప
గీ. పోరుచంపక చుట్టమున్ పోరనీల్గ,జూచుచుంటివి యేనాఁటిచుట్టమీవు? చిత్ర. 32

సీ. శ్రీమద్ద్వారకాపురీవరేశుఁడ వయ్యు, గొల్లపల్లెల నుండఁ గోరుటేమి
యక్షీణలక్ష్మీకటాక్షవీక్షుఁడ వయ్యుఁ, ద్రోవపై కింటింటఁ దోఁచనేమి
భూరి చతుర్దశ భువనావనుఁడ వయ్యుఁ, గడువేడ్కఁ దొట్టులఁ గాయనేమి
నమ్మని దేవతాసంభావితుఁడ వయ్యు, నాలగాపకులతో నాడ నేమి?
గీ. గొప్పలో గొప్పవాఁడవు కొలదిలోనఁ, గొలదివాఁడవు నిన్నెట్లు గొలువవచ్చు? చి

సీ. దుర్యోధనుం డవధ్యుఁడ వంచు మానెఁగా, కలుక బంధింపఁగాఁ దలఁప లేదె?
గోపాలుఁడవు పూజఁగొందువేరాయని, సభ నిన్నుఁ దిట్టఁడే చైద్యుఁ డెదిరి?
నీలాంఛనంబులఁ బోలుచిహ్నలు దాల్చి, తానె నీ వనఁడె యుద్ధతినిఁ బౌండ్రుఁ?
డెవ్వరుఁ బట్టలే రేను బట్టెద నంచు, యవనుండు దరుమఁడే యాహవమున
గీ. నృపులు కొందఱు వెఱచిరే నీకు మున్ను, ప్రాణముల కాసపడరేని భండనమున చి.

సీ. రాజు లెవ్వరుఁ బక్కిభోజన మిడకున్న, దాసునింట భుజించి తనియలేదొ?
బంధువు లెవ్వరు గంధ మీకుండిన, ముద్వంకలది పూయ మురియలేదొ?
దొర లెవ్వరును బూలసరము లీకుండినఁ, దెలిసి మాలికుఁ డీగ నలరలేదొ?
ప్రభువు లెవ్వరు వస్త్రబహుమాన మీకున్నఁ, దెచ్చియిచ్చినచాకి మెచ్చలేదొ?
గీ. పాటి సేయంగ నేరాజు బంధుగుండవొ?, మున్నె నీపస దెలిసిన దెన్న నేమి? చి.

సీ. నాఁగలి రోఁకలన్నకు నిచ్చి శంఖాది, పంచాయుధము లీవు పట్టినావు
తాటికెక్కెంబు కోల్తలపెద్ద కెత్తించి, గరుడధ్వజం బీవు గట్టినావు
వెలరాని కఱవోనివలువ జ్యేష్ఠున కిచ్చి, కనకాంబరం బీవు గట్టినావు
మద్య మార్జునకు మైత్రిఁ ద్రావించి, జున్ను బాల్ పెరుగీవు జుర్రినావు
గీ. తగువరివె యన్నదమ్ముల ధర్మమిదె,తీర్పవలెఁగానిమఱియొందుతీర్పఁగలఁడె. చిత్ర.

సీ. అప్పనంబులు గొను నఖిలదెబ్బండలే, శ్వరులచే వేంకటాచలనివాసు
డరుదుగా నరువదా అవసరంబులు మహా, భోగంబుఁ గొనునీలభూధ్రవరుఁడు
పానకంబాలు సాఁబాలు భక్తుల కిచ్చి, మెసఁగును మంగళాద్రీశ్వరుండు
పుట్టకొలంది మైపూఁతఁగాఁ గొను మంచి, గంధంబు సింహాద్రి ప్రభుండు
గీ. సాటిసాములరీతి నివ్వోట నీవు, మూర్తిమంతంబుఁ జూపక కీర్తిగలదె. చిత్ర. 37
సీ. బొచ్చెచేపకు నైన మచ్చరం బున్నది, తాఁబేటి కైన సత్త్వంబు గలదు
డీకొన్న నడవిపందికిఁ గల్గు రోసంబు, తెరనోటివరుఁ డైనఁ దెగువ సేయుఁ
బొట్టివానికి నైన దిట్టతనం బుండు, బాపని కైన దర్పంబుగలదు
చుంచురాజున కైన శూరత్వ మున్నది, ముసలికినైనఁ జేపుష్టిగలదు
గీ. సిద్ధమాభీరుఁడవునీవె బుద్ధి నెంచఁ, గలికివై యేమి సేయఁగఁ గలవొకాని, చిత్ర 38
సీ. ముని నందగోపత్నములఁ గాయునప్పుడు, సహనయించిరె కంజజాదిసురలు?
విటచోరచేష్టల వ్రేపల్లెఁ దిరుగునీ, దగుదమోల నచ్చర లాడినారె?
నరరథాశ్వముల సంగరవీథిఁ దోలునాఁ, డెంచి దిక్పతులు భావించినారె?
మగధేశుదాడికి మథుర వీడిననాఁడు, దేవర్షు లెల్లఁ గీర్తించినారె?
గీ. యల్పునిగనెంచినారె లోకైకనాథ,నాథునిఁగనెంచినారెయున్నరణిఁ? జెపుము చి. 39
సీ. పూతనాకుచకుంభపూర్ణవిషస్తన్య, పాయివై బ్రదికిన భాగ్యమేమి?
కాళియాశీవిషగ్రసన ప్రమాదంబు, గడచి జీవించిన ఘనతయేమి?
చాణూరమల్లదోస్తంభ ఘట్టన కోర్చి, లబ్ధజయుఁడవైన లాభ మేమి?
సాళ్వరాజామోఘ శక్తిప్రయోగంబు, మాలించుకొనిన సామర్థ్యమేమి?
గీ. బడుగుదాసరివలె నన్నశస్త్రములకుఁ, బరుల కాశింతు విచట నీపంతమేమి? చి.
సీ. పట్టి గొల్లదిరోటఁ గట్ట నోపిననీకుఁ గోసంబు లేకున్న నీసుగలదె?
జారచోరాదిచేష్టలఁ బ్రవర్తిల్లు నీ, కపకీర్తియన్న భయంబు గలదె?
భార్యచేఁ దన్నులఁ బడ్డవానికి నీకు, లజ్జలేదని యన్న లాఘవంబె?
కుండంటులేదని కొసరి మెక్కిననీకు, హీనత లెంచిన న్యూనమగునె?
గీ. కోరిదాసులునిన్నింత దూరుచున్నఁ, బంతమున్నదె నీకినుమంతయైన? చిత్ర. 41
సీ. కడు దొంగతనమునఁ గని తల్లివై చినఁ, దనబిడ్డనిగఁ బెంచె నిను యశోద
జనని గర్భము దించుకొనిన వేఱొకతల్లి, కడుపుఁజేసికొనంగఁ గలిగె నన్న
తండ్రివివాహయత్నము సేయనొల్లక, తగులుకవచ్చె నీధర్మపత్ని
యన్న రారాజుకీనున్న నీసోదరి, యింటికి జోగి నానఁటుకొనియె
గీ. నిట్టినీసంప్రదాయంబు గుట్టుబెట్టు, రట్టునే యుదుఁ గనుము నాభట్టుతనము చిత్ర.
సీ. పక్షంబు గలదండ్రు పాండుపుత్రులయందు, పాఁడవుల్ పడినట్టి పాటులేమి!
పూర్వజన్మమునందుఁ బూజించె గజ మింద్రుడు, గజరాజు పొందినగాసి యేమి!

యలకుచేలునకు బాల్యస్నేహితుఁడ వంట్రు, నెఱిఁ గుచేలుఁడు పడ్డనెవ్వలేమి!
ప్రహ్లాదుఁ డాజన్మభక్తియుక్తుం డంట్రు, ప్రహ్లాదుఁ డొందిన బాధలేమి!
గీ. యెంతయాలస్యమున వారి నేలినాఁడ, విట్టిదే నీదయారసం బెంచి చూడ. చిత్ర.

సీ. అనఘమౌ విప్రసత్త్రాన్న మెంగిలిఁ జేసి, తీవె ముక్ క్రతుభోక్త నేనె యనుచు
సవతితల్లికొమాళ్ళ సమయించి తండ్రిఁ, దరుగని రాజ్యసాంతకుఁడ ననుచు
బంధువు లన్యోన్య వైరాయమాతులుగా, నడచితి భూభారహారి ననుచు
బలిమి నన్యస్త్రీలఁ బట్టితి వెండఱి, నస్ఖలద్బ్రహ్మచర్యమతి ననుచు
గీ. లోకమున నడ్డమెవ్వరు లేకయునికి, హద్దులేకట్ల నడచితి వళుసుమాలి. చిత్ర. 44

సీ. ఆదియోగ్యంతరంగాలానబంధంబు, వదలించుకొన నీకు వశముగాదో!
వేదాంత సహృద చుంబితల మంత్రవర్గ, నల గుహాలుండి రానలవిగాదో!
నిమిషార్ధనిమిషాది నిత్యవేళా చక్రి, గతి నిరోధించి రాఁ గ్రిమము గాదో!
వక్రకంటక పంకవత్కూప్రజవమనః, కాపథంబులను గా లోమ్మపరాదో!
గీ. యేమి యాలస్య మిది నీకు నేల సకల, జంతుసంతానరక్షావిచక్షణునకు. చి. 45.

సీ. కఠిన స్తనంబుల ఘట్టించి దట్టించి, జడలచే మోది నున్నాడల నదిమి
పలుగంట్లుచేసి గోరుల నాటి దొమ్మిగా, యువతీసహస్రంబు లుపరతాది
బంధనంబుల నిన్నుఁ బైకొని తమిరేచి, రమియింప నిదురింపరాక నాఁటి
బడలిక దీఱ నాపఁగరాని సుఖనిద్రఁ, బవళించియున్నట్టి భావ మిచటఁ
గీ. దోఁచుచున్నది సంఫుల్లతోయజాక్ష!, మేల్ బళా! యింక జాగేమి మేలుకొనవె. చి.

సీ. నీబొడ్డుదమ్మిలోనికిఁ జొచ్చి చూచిన, నలువకు నీలోఁతు దెలియకున్నె?
బహుసహస్రాంగనాగృహములలో నిను గన్న, మునిరాజు నీమాయఁగనకయున్నె?
నీవిశ్వరూప మెన్నికఁ జేసి పొడఁగన్న, నరుఁడు నీయురువుదా నెఱుఁగకున్నె?
తనమనఃపీఠి నిన్ననిశ మారాధించు, హరుఁడు భవత్తత్త్వ మరయకున్నె?
గీ. గరువమేటికినీమర్మ మెఱుఁగరనుచుఁ, దెలిసినమహాత్ములకునైనఁ దెలియకున్నె. చిత్ర

సీ. పురుషాకృతిగ నిన్ను గురుతుఁబట్టఁగ రాదు, స్త్రీమూర్తి వనుచును జెప్పరాదు
పరఁగ నపుంసకభావ మెన్నఁగరాదు, రూపంబు గల్గు టెఱుంగరాదు
గుణవంతుఁడ వటంచు గణుతింపఁగా రాదు, మర్యాద దెలియ నేమతికి రాదు
కులజుడ వనుచు నిక్కువముఁ జెప్పఁగ రాదు, స్థల మెక్కడనొ కాని తెలియరాదు
గీ. వస్తునిర్దేశ మొనరింప వశము గాని, నిన్ను వర్ణింపరాదయా నిశ్చయముగ. చిత్ర

సీ. నమ్మెదు రేరీతి నారదు నాత్మజు, మానినిఁ జేసినమాయవానిఁ?
దలఁతు రేరీతి నల్ దలలదయ్యము నోలి, బొడ్డునమ్మినిఁ గన్న పురుషమణిని?
భూషింతు రేరీతి పుష్పబాణవిరోధి, వినయభ్రమితుఁ జేయు వేసగాని?
భాషింతు రేరీతి బ్రహ్మాదిమశకప, ర్యంతంబు గలిగినవింతవాని?

గీ. నిన్నెఱిఁగెఱింగి యందఱు సన్నుతింతు, రెవ్వరికి నీవు కావలె నెంచిచూడ? చి.
సీ. ఎక్కడ నీకన్న దిక్కు లేనట్లని, న్నర్చింతు రబ్జగర్భాదిసురలు
మఱి యెందు గతిలేనిమాడ్కి మహాత్మును, ల్నీయందె లక్ష్యము ల్నిలుపుకొందు
రిలఁ దరణోపాయ మెందున లేనట్లు, సజ్జనుల్ నీకథల్ చదువుకొంద్రు
పగతుర మెయ్యెడ బ్రతికెద మన్నట్లు, దునిసిరి నీచేత దనుజు లెల్ల
గీ. దత్త్వమరసిన శుద్ధబుద్ధస్వరూప, మింత యధికార మెన్నటిదేమి చెప్పుమ. చిత్ర.
సీ. ఆడించెదవు బొమ్మలాటవాఁడును బోలె, సర్వచరాచరజంతువులను
కనుకట్టు గట్టెదు గారడీఁడును బోలె, మిథ్యాప్రపంచంబు తథ్యముగను
వేర్వేఱఁ దోఁతువు వేషధారియుఁ బోలెఁ, బహువిధదేవతాభద్రకళలఁ
దెలిపి మాప్పుదువు జక్కులవాని చందానఁ, బ్రజల సంపద్రంగవల్లిఁ జేర్చి
గీ. యిట్టివేకద నీవిద్య లెన్నియైన, నింక నేమిట ఘనుఁడవో యెఱుఁగరాదు. చిత్ర.
సీ. కూరిమి నల తంతెగొట్టుసన్న్యాసితోఁ, ముచ్చటించెద వేమి పుణ్యమూర్తి
సాటిగా వెలిగొండ పిటిజంగముచెల్మిఁ బచరింతు వేనాఁటి బాంధవుండు
వెలిపాపపాన్పుపై వేడ్కతోఁ బవళింతు వదియేమి భోగిభోగాంతరంబు
పొరుగిండ్ల కేప్రొద్దుఁ బోరాఁ దలఁచునింతిఁ, బాయకుండెద వేమిభాగ్యలక్ష్మి
గీ. మంచిసహవాసములుగల్గెనెంచిచూడ, నీకె తగనట్టివారితో నెనరు నెఱప. చిత్ర.
సీ. అఖిలపోషకుఁడవ న్నాఖ్యమాత్రమెకాని, కర్తవునీవె భోక్తవును నీవె
యక్షరుండవను ప్రఖ్యాతిమాత్రమెకాని, చర్చింప వేఱొండు సాక్షిగలఁడె
సుగుణాబ్ధివని నిన్నుస్తుతియొనర్చుటె కాని, సద్గుణుం డెవ్వఁడు నీకు మించ
విశ్వాత్ముఁడ వటంచు వినుతించుటయెకాని, చొచ్చిచన్నెవ్వఁడు చూచినాఁడు
గీ. వినుకరులెగాని నిన్నునీవిశ్వసములను, మొదలెఱుంగుచు రేనిజంబునకుఁబిల్వ. చిత్ర.
సీ. ఒకగుణంబుననీవె సకలప్రపంచంబుఁ, గల్పించుత వభూతకల్పనముగ
వేఱొకగుణముచే విశ్వవిశ్వప్రాణ, రక్షణం బొనరింతు వక్షయముగ
మఱియొండు గుణముచే మండలంబులు గూడఁ, జఱపివేయుదువు నిశ్శేషముగను
నిర్గుణంబున నీవె నిరవకాశంబుగాఁ, బట్టకయుందువు బయలు మెఱసి
గీ. గుణమొకటిగాదు తెలిసినగుణము లేదు, చెంపనుఁగొల్వరాదు వచింపరాదు. చిత్ర.
సీ. జీవిని జీవి భక్షింపఁ జేసితి వింతె, కాసెపెట్టినావె చేతనుల కెల్లఁ?
జేసనంత భుజింపఁ జేసినా వింతెకా, కెక్కువలెవ్వరు కచ్చినావు?
కర్మసూత్రంబునఁ గట్టి త్రిప్పెదవుగా, కచ్చనొక్కనిఁ బోవనిచ్చినావె?
వెసఁ బృథక్ప్రతుల వేఱుఁబెట్టితివిగా, కందఱి కైకమత్య మిడనావె?
గీ. తెలిసె నీరక్షకత్వంబు దేవదేవ!, వేఱె గతిలేక నిన్ను సేవింపవలసె. చిత్ర.
సీ. నీరుపట్టుగ నుంట నారాయణుఁడ వందు, నారాయణాఖ్యాధికార మేమి?

బలిసి యంతట నీవె గలుగ విష్ణుఁడ వందు, రావిష్ణునామప్రభావ మేమి?
ముగురు నీవై వెలుంగఁగఁ గేశవుఁడ వంద్రు, కేశవాభిఖ్యాప్రకాశ మేమి?
సిరికి మగఁడవై మెరయ శ్రీపతివంద్రు, శ్రీపతినామప్రసిద్ధి యేమి?
గీ. పెట్టుపేరుల నేకముల్ పుట్టుపేరు, గుఱుతెఱింగిన నీమూలమెఱుఁగవచ్చు. చిత్ర. 56
సీ. వేఁడని చూడక విపినవహ్నిజ్వాలఁ ద్రావెదో తేనియఁ ద్రావినట్లు
భారమంచనక గోవర్ధనపర్వతం, బెత్తెదో పూబంతి యెత్తినట్లు
విషపుంజ మనక నాభీలాజగరజిహ్వఁ, జింపెదో ప్రాబట్టఁ జింపినట్లు
వెస నసాధ్యం బని వెరవక నరకుని, నఱికెదో పార్వేఁట నఱికినట్లు
గీ. భక్తసంరక్షణ త్వరాపరవశతను, జేసినావేమొ యూరక సేయఁగలవె? చిత్ర. 57
సీ. వత్సాపహరణగర్వము మాని యజుఁడు దా, నపరాధి ననుచు సాష్టాంగమెఱఁగె
భవుఁడు బాణున కాజి బాసటయై వచ్చి, భక్తునిఁ బట్టిచ్చి ప్రణుతిఁ జేసె
వజ్రశిలావృష్టి వర్షించి లజ్జించి, తప్పుఁ జేసితినంచు దండ మిడియె
సమవర్తిభీతి నంజలిఁ జేసి యాత్మలో, కస్థితు గురుపుత్రుఁ గాను కిచ్చె
గీ. క్షోణిఁ బుట్టుకమాలిన గొల్లవాని, నిన్ను నా వేల్పు లోడింప నేర రేమి? చిత్ర. 58
సీ. కొనముట్టు హెచ్చుతగ్గుల ప్రాఁతసుద్దుల, తాతపుస్తక మొకఁ డాతతాయి
మ్రుచ్చిలి నీటిలోఁ జొచ్చి డాఁగిన వాని, పావన మేమి! వెంబడిగఁ బెద్ద
కోఱమీనంబవై యాఱోండుసంద్రము, ల్నిమిషంబులో నీఁది నెమకి వాని
డొక్క వ్రక్కలుగాఁ గఱుకున బరిఁ గోసి, కడలేనినుడువు లెక్కటికి నోట
గీ. మాట వెళ్ళనివానికి మగుడ నిచ్చి, యింతపనికిని నవతార మెత్తితీవు. చిత్ర. 59
సీ. అబ్ధిపయఃపాత్ర మద్రి రాణంధాన, మహిరాజగుణము దా రమరఁ గూర్చి
యమృతాభిలాష దేవాసురుల్ మథియింప, గిరి మున్గఁ గచ్ఛపాకృతి వహించి
నిర్వహించుట గాని సర్వకార్యపులలోఁ, బక్షభేదముఁ జేసి పల్మఱాస
కొల్పి దైత్యులనోరఁ గొట్టి యాదిత్యుల, కమృతాన్న మిడితి వాయసురలందు
గీ. బక్షపాతివి గావె? యభక్తిఁ బడిరి, నమ్మ దురెయానిశాలు లెన్నటికి నిన్ను. చిత్ర.
సీ. ఉక్కునఁ బసిఁడికన్ రక్కసుఁ డొకఁడు ప, ల్దిక్కు లోరిచి బొల్లిపక్కిమావు
నెక్కు శాతెక్కుడఁ జిక్కెడు నంచునీ, యిక్కువ లరయంగఁ గిక్కురించి
నక్కితి విలకింద జొక్కపుఁ బందివై, కొక్కరింపుచు నాతఁ డక్కడికిని
మొక్కరింపఁగఁ జొరఁబొక్క లేకట వాని, డొక్కగఱుకునఁ జెక్కిపట్టి
గీ. నొక్కి పుడమింత నీటిపై కెక్కఁదీయ, మక్కువ దనర్ప నదియేమి రక్కరింపు. చి.
సీ. అయవారు చదివించినట్లుగాఁ జదువక, మఱి కొట్టి తిట్టక వెఱపుఁ గొనక
తనయుఁ డెంతో పరధ్యానంబుగా నున్నఁ, దండ్రి వలదని చెప్పఁ దగఁడె ధాత్రి
నీకుఁ గోపం బేమి నృహరిరూపంబున, స్తంభంబులోఁ బుట్టి చటులనేత్రి

దంష్ట్రానఖప్రభదహనకీలలఁ బోలి, భగ్గురనంగఁ బైఁబడి హిరణ్య
గీ. కశిపుఁ దునుమాడి ప్రహ్లాదుఁ గరుణ నేలి, తందఱికసహ్యమయ్యె నిన్నపుడె కనఁగ. చి.
సీ. కశ్యపుఁ డదితి నిన్గన్నవారలు గారె, పెంచిరే మరుగుజ్జుబిడ్డ వనుచుఁ
గుండిక దండంబు గోఁచితో వచ్చిన, కపటవటుండవు నిక్కముగ భూమి
సురుఁడు గాఁ డని యాత్మగురుఁ డీయ వలదనఁ, గరుణించి బలి దాత కామితార్థ
మొసఁగంగ నభివృద్ధినొంది మే లోర్వక, ధర్మంబు నాల్గుపాదముల జరుపు
గీ. నట్టిదాతను దిగఁద్రొక్కి యతని సిరులు, దెచ్చి కులగోత్రభేది కీ నిచ్చఁబో. చిత్ర.
సీ. జపతపోనిష్ఠుఁడౌ జమదగ్ని కుదయించి, కరము దారుణవృత్తిఁ గత్తిగట్టి
కినుక రాజద్రోహమునకు శంకింపక, సకలభూపతుల గొంతుకలు గోసి
కార్తవీర్యార్జునకరసహస్రం బొండు, తఱి గండగొడ్డంట నఱికివైచి
వసుధపై రక్తప్రవాహంబు లొనరించి, తజ్జలంబులఁ బితృతర్పణములు
గీ. సేసి యిల విప్రులకు ధారఁ బోసినట్టి, కీర్తియే కాని బ్రాహ్మణకృత్యమగునె. చి
సీ. తా వచ్చెద నటంచు ధైర్యలక్ష్మి మహీజ, వెంట రా నడవికి వెడలినావు
సుగ్రీవుఁ డున్నచో సౌమ్యు దా నిడ సీత, యాజాడ నతనిపొం దతికినావు
ముందు జానకి లంక మూర్ఛించి చొచ్చి నిన్, దెచ్చినరిపుల సాధించినావు
వైదేహి భవదంకవసతిఁ గూర్చున్నచో, భువనసామ్రాజ్యముల్ పొందినావు
గీ. గట్టిగా మైథిలినిఁ జెట్టఁబట్టినట్టి, పౌరుషము లబ్బె నేనాఁటి పూరుషుఁడవొ. చిత్ర
సీ. ధర్మవిఘాత మిద్ధర నీ వొనర్చిన, మూఁడులోకంబులు మ్రోసె నపుడె
జనకునికూఁతు నిచ్చను బెండ్లియాడంగ, నరనాథకోటులు నవ్వి రపుడె
పుణ్యజనంబులఁ బోరి బాధింపంగ, సుర లద్భుతము నొంది చూచి రపుడె
సంతతాశ్రిత విభీషణు రాజుఁ జేయంగ, నల రవీందులు సాక్షి నిలిచి రపుడె
గీ. మంచినడవడి నడిచినా వెంచిచూడఁ, గీర్తిగల మూర్తివే యిట్టి వార్త లరయ. చి.
సీ. సన్ముని నధ్వరసాఫల్యుఁ గావింప, జానకీపరిణయోత్సవము గలిగె
రవినందనునిఁ గీశరాజ్యాధిపతిఁ జేయ, సేతుబంధనకీర్తిఁ జెందఁగలిగె
బహుదేవతాస్త్రీల బందిగంబులఁ బాపఁ, జెఱ నున్నవైదేహిఁ జెందఁ గలిగె
నలవిభీషణుని లంకాధినాథునిఁ జేయ, నెలమి నయోధ్య నీ వేలఁ గలిగె
గీ. నబ్బె నీకుఁ బరోపకారైకఫలము, లంతియే కాక నీచేత నైన దేమి!. చిత్ర. 67
సీ. ఒకపినతల్లి మే లోర్వలే కనిచిన, విపినంబులకుఁ బోవువెఱ్ఱి గలఁడె?
తండ్రి మృతుం డైనఁ దనరాజ్య మత్తఱి, నేల పాకుండినబేల గలఁడె?
యనుజుండు వలదన నాలిమాటలు విని, చెడుగిఱ్ఱిఁ బట్టఁ బోవెడఁగు గలఁడె?
పరదేశముననుండి బలవద్విరోధంబు, బలిపించుకొన్న వెంగలియుఁ గలఁడె?
గీ. నీవు సేసినపను లిట్టి నేరుపరివె, జగదుపద్రవమెట్లు పోఁ జఱచినావొ. చిత్ర. 68

సీ. నినుఁ గోరి కన్నతండ్రిని నీనిమిత్తమై, చింతించి మృతిఁ బొందఁ జేసినావు
నిను వని సేవింప ననుజు నాఁకటి కేమి, యొసఁగ కీవే పండ్లు మెసఁగినావు
నినుఁ గపు ల్గొల్చి తల్చిన కార్య మీడేర్పఁ, బిదప వారలఁ జెట్లఁ బెట్టినావు
నినుఁ బాయ కడవికిఁ జను దేర నిల్లాలి, నొరుపంచఁ గొన్నాళ్లు లుంచినావు
గీ. రాజకళఁ జూచి ని న్నొక రాజువనిన, మానుషం బేది? యిదియంతమాయగాని. చిత్ర.
సీ. కులగురుద్వేషి నొజ్జలుగ వెన్కొని కాచి, నిష్ఠురమంత్రము ల్నేర్చినావు
పూర్వదేవతలు కాపుర మున్న పురియందు, వంచించి యగ్గిఁ బెట్టించినావు
తాతలతరమునఁ ద్రవ్వించినపయోధి, పేరుగాఁ గొంత పూడ్పించినావు
మోసపా టెఱుఁగక మోహించి వచ్చిన, యెలనాగముక్కుఁ గోయించినావు
గీ బళిర! నీవంటిధార్మికుఁ బ్రస్తుతింపఁ. గొదువలిం కేమి కైవల్యమెదుటవచ్చు. చిత్ర.
సీ. శౌర్య మెక్కించి విశ్వామిత్రుఁ డూరకఁ, దొడరింపఁ దాటకఁ దునిమినావు
వైదేహి వాక్యనిర్బంధంబుఁ ద్రోయలే, కఱిముఱి మారీచు నఱికినావు
వెనుకంజవైచిన విడువక పైకిరా, నరుదుగా ఖరుతలఁ దరిగినావు
మొఱ్ఱోయనుచు దేవమునులువా రెన్నాళ్లొ, యనుసరింప దశాస్యుఁ దునిమినావు
గీ. కాని రోసంబు గలదె నిక్కముగనీకు?, మనసుమెత్తనివాఁడ వేమనఁగవచ్చు. చిత్ర.
సీ. కొంచెపుఁ బని దాసి నించుకదండింపఁ బగబట్టియది యెన్ని పాట్లు వెట్టె
బలిమినిఁ బట్టిశూర్పణఖ నాసికఁ గోయ, నది నీకుఁ బిదప నెంతలఁతఁ దెచ్చెఁ
జిన్నతనంబునఁ జెనకి పోఁ దోలిన, మారీచుఁ డొనరించె మాయలెన్ని
నిరపరాధునివాలి నురుశరాహతిఁ గూల్ప, వానియిల్లా లెంత వగచి తిట్టె
గీ. స్వామివై యేమి యెఱుఁగవు స్వల్పకార్య,కారణంబున నెన్నెన్నికతలుపుట్టె. చి.
సీ. నీపేరు వినుటకే యోపక చెవిఁ గంటఁ, గట్టుకున్నాతనిఁ గావనేమి?
కలన నీతోఁ గత్తిఁగట్టుకపోరాడు, వాని సోదరునిఁ బ్రోవఁగఁ బనేమి?
బాధింపఁ దగుమహాపాతకుం డటుచేరి, నీవాఁడనంటె మన్నింప నేమి?
మాయవేసముల నీ మర్మమారయు మన్న, విమతదూతలఁ బట్టి విడువనేమి?
గీ. పతితశరణాగతావనప్రకటదీక్ష,లోకములకబ్బురంబుగ నీకె కలదొ? చిత్ర. 73
సీ. పఱపిన శస్త్రంబె బహుముఖంబుల దైత్య, వాహినీమర్మమ్ముల్వ్రచ్చి వెడల
ముందు దూసిన బాణమునకన్న సరిమించి, వెనుకమ్మ దైత్యులవిఱుగఁబొడువ
నేసినమార్గణం బెదు రెక్కి యితరాస్త్ర, మడఁచి క్రవ్యాదులమగుడఁ జేయ
నిగిడించిన శరంబె నిర్జరారులఁ ద్రుంచి, తొడిఁదొడిఁ దనకుఁ దాదొనకుఁ జేరఁ
గీ. దొలఁగి రసురులు కొంతనీబలిమిదెలసె,ముష్టినీదెంతనీయస్త్రములదె వింత. చిత్ర.
సీ. అడవిలోఁ దెరువర్ల నుడుగక తినుచున్న, యాఁడుదాని వధించుటర్హమగునె?
చిక్కినవారికిఁ జేతు లెత్తయ్యుఁ జాఁచు, మొండివానివధించ ముఖ్యమగునె?

యెక్కడెక్కడనైన నేఱుక తిరుకాకి, కన్నుబోఁ బొడుచుట ఘనగుణంబె?
కడు (వేటుఁ బడి గడ్డికఱచినమారీచుఁ, దఱిమి బాధించుట నెఱతనంబె?
గీ. యెవ్వరేరాజులొనరించిరిట్టిపనులు?, చేసితివియింకనెద్దేని సేయఁగలవు! చిత్ర. 75
సీ. రాజకార్యపరుఁడు తేజోబలాధికుఁ, డాంజనేయుఁడు భృత్యుఁ డగుటఁజేసి
యమితశౌర్యుఁడు ప్లవఁగకులేశుఁ డినజుఁ, డఱలేనిస్నేహితుఁ డగుటఁజేసి
విమతమర్మజ్ఞుండు విశ్వాసభరితాత్ముఁ, డలవిభీషణుఁ డాప్తుఁ డగుటఁజేసి
సుమనస్కు లమనస్కు లమృతవాక్యంబులఁ, బొసఁగ నాశీర్వదించుటనుజేసి
గీ. లంక సాధించితివి గాని లావుచేత నిర్జరారుల గెలువంగ నీతరంబె?. చిత్ర.
సీ. నడువఁజాల దని జానకి నెత్తుకొని ముందు, నడచువిరాధుని నఱుకుటేమి?
చనవున వైదేహి చనుబిడ్డవలెఁ నోటఁ, బట్టినయైంద్రి కన్గొట్టుటేమి?
సీత సంతోషింపఁ జిత్రవేషముఁ దాల్చి, తిరుగుమారీచుని నరుకుటేమి?
తల్లినివలెఁ దెచ్చి ధరణీజను నశోక, వని నిల్ప రావణుఁ దునుముటేమి?
గీ. కోప మిటులేమి ? వారుమహాపరాధు? లైన ముక్తిప్రసాదార్హులగుటయేమి?చిత్ర
సీ. పరరాజ్యకాంక్షలోఁ బట్టకుండెద వైన, సుగ్రీవునగరంబుఁ జూడరాదె?
పరధనంబున కాస పడకయుండెద వైన, నాలంక నొకరాయి యంటరాదె?
పరయోష పైనిచ్చఁ బాయకుండెదవైన, నలశూర్పణఖముక్కు నిలుపరాదె?
పరదానవులఁ (దుంపఁ బంతగించెద వైన, మూల దైత్యులఁ దోలి పుచ్చరాదె?
గీ. చేసిన ప్రతిజ్ఞలో నొండు వీస మైనఁ, దప్పిపోకుండ నడచినధార్మికుఁడవా! చిత్ర.
సీ. నిర్దయాత్ములె కాని నిత్యాగ్నిహోత్రాది, కర్మనైష్ఠికులైనఘనులు గారె?
శుచిశూన్యులే కాని శ్రుత్యాదిపాఠక, ప్రకటవేదార్థబోధకులు గారె?
సత్యహీనులె కాని చంద్రశేఖరపాద, పద్మపూజానందపరులు గారె?
మాయికులే కాని మంత్రప్రయోగోప, సంహరణక్రియాచణులు గారె?
గీ. కులము బ్రాహ్మణ్యమసుదైత్యకులము నెట్లు, గూల్చితివి బ్రహ్మహత్యకుగొంకకహహా?
సీ. ఒక్కవ్రేటునఁ గూలునో వాలి బలశాలి, చెట్లుమాటొగ్గి వేసితివిగాని
మొనసి నీల్గుసెపట్టిముఖుఁడు తన్నాభికా, మృతకుంభ మగలఁ గొట్టితివి గాని
కుంభకర్ణుడు రణక్షోణిలోఁ దీరునే, తీఱని నిద్ర నెదిర్చెఁ గాని
చిక్కునే యింద్రజిత్తుక్కసహోదరుం, డశననిద్రలు మాని యడఁచెఁ గాని
గీ. యింత ఆయంబులెరుగుదునంచువలన, మడిసిరసురులు నీచేతమడియువారె?చిత్ర.
సీ. మొసలిఁ బెట్టినకస్తి మొత్తబెట్టినహస్తి, రక్కరించితి నన్నరంబె మేమి?
తులువ పల్యురిలోన వలువ విప్పఁగ జాన, సిగ్గుఁగాచితి నన్నపగ్గెయేమి?
బలువు శాపముచేత బండపాటిననాతి, అంకుఁ బాపితి నన్న బింకమేమి?
పెద్దమోదినభీతి బెగడివచ్చినకోఁతి, కండజేసితినన్న యందమేమి

గీ. భవభయంబున నిన్నెంత ప్రస్తుతింపఁ, గరుణఁ జేపట్టలేని నీ ఘనత యేమి? చిత్ర 81

సీ. నీచువాసనచేత నీటిలో నుండుట, యెక్కువప్పులను రాఘుత్తుకొనుట
కడుపాఁకటికిఁ దొంగకాయలు మెక్కుట, యని నోరు దెఱచి పెల్లఱచుచుంట
సిరిగల్గి బిచ్చపుఁజిప్పఁ జేపట్టుట, చేకత్తి పరరాజుచేతి కిడుట
పట్టణప్రజకుఁ జెప్పక పాఱిపోవుట, కలుద్రావి నిను నీవె తెలియకుంట
గీ. మానినుసై యుంట గుఱ్ఱపుమనిసివంట, పుడమినాడిక సేయక విడువ నిన్ను. చిత్ర.

సీ. ఖరునాజిలోఁ జొచ్చి శరముచ్చిపో నేయ, వెనుకకు లంఘించి వెఱచె ననిరి
యనిఁ బాఱునో క్రోఁతి యని ప్రమానిమాటున, నేయ వాలినిఁ బొంచి యేసె ననిరి
గరుడధ్వజుం డన్న గురుతుఁ దెల్పుటకున్న, బలభీతి శస్త్రాహి బద్ధుఁ డనిరి
బలినిఁ జంపఁగ రానివరమున యాచింప, వృత్తి నాతని భిక్షమెత్తె ననిరి
గీ. యశమదెంతొ ప్రయాసలభ్యంబె కాని, యెంతలో వచ్చునపకీర్తి యెఱుఁగ వేమి! చిత్ర.

సీ. ఘోరకబంధుదీర్ఘోరుదోర్దండముల్, దరిగి వచ్చిన మాట తథ్య మేని
పక్షికంఠాత్మజఫణిరాజబంధమో, చనుఁడవై వచ్చుట సత్య మేని
మైరావణాభేద్య కారాగృహముఁ గూల్చి ప్రదికి వచ్చినపల్కు భద్ర మేని
మారీచదుస్తరమాయామృగము తెంచి, విజయ మొందినసుద్ది నిజ మేని
గీ. కలితరాజోపచారభోగములఁ గీర్తి, శాలివై యిందు మెఱయుట సాక్షి జగతి. చిత్ర.

సీ. నీశాంతి యంబోధినిర్భరాంబువులు బాణముఖంబునకుఁ దెచ్చునాఁడె తెలిసె
నీకోప మరిరావణైకానుజన్మునా, నగరి రాజుగఁ జేయునాఁడె తెలసె
నీకీర్తి కపటదుర్నీతుఁడౌ ధ్వాంక్షుదా, నవుతప్పఁ గాచిననాఁడె తెలిసె
నీయభిజ్ఞత యవినిందిత సీతన్వి, నగ్నినిఁ జొరు మన్నయపుడె తెలిసె
గీ. నెంచ రానిగుణాఢ్యుఁడ వీ వెయనుచుఁ, దెలిసి ప్రముక్కెద నితరమౌ దిక్కు లేక. చిత్ర.

సీ. జనకువాక్యమున రాజ్యవిసర్జనమె కాని, యడరుశౌర్య మొకింత విడిచినావె?
దీక్షనాభరణము ల్విడియుమాత్రమె కాని, వర ధనుర్బాణము ల్వదలినావె?
వ్రతమని కాంచనాంబరముఁ గట్టవు గాని, బిగువు వజ్రాంగిమై విడచినావె?
ప్రతినఁబదార్థమే మితర మొల్లవుగాని, యభిమానధనముపై నలిగినావె?
గీ. నిఖిలరక్షోవిహారణ నిర్భయక, వేషధారివి నీ మునివృత్తి యేమి? చిత్ర. 86

సీ. వెఱపించఁగలవా చేవిలు నీ కొసంగి తా, విగతరోషుండైన విప్రవరునిఁ
గట్టించఁ గలవా సాగరముపై సేతువు, మలలఁ గోఁతులమూక లలరఁ బట్టి
ఘనత నీఁ గలవా యన్నను గొట్టి తమ్మునకు, కా రాజ్య మాచంద్రతారకముగ
వేంచేయఁ గలవా విన్వీథిఁ దేరగ నున్న, పుష్పకం బెక్కి నీపురికి మరల
గీ. జగతి నిటు సంతతోత్సాహచరణమునకు, యుక్తి సేయుదు వోహో నీశక్తి దెలిసె. చి.

సీ. నిన్నె దుర్గానరాని నెపమునఁ గోపించి, కోపితపితృతుష్టూతుఁ గొట్టవలెనె?

సంబంధినోటఁ గొంచెపుమాట రా వాని, కరిపురం బలుకఁ బెకల్పవలెనె?
నిను జూచి వేడ్క నొందిన గర్వమున గణించి, నిండిపాఱెడు నేరు నిలుపవలెనె?
చెలికానివలె నొద్దఁ జేరి యెత్తుకొనంగఁ, గినుకఁ బ్రలంబునిఁ దునుమవలెనె?
గీ. ఎంతరోసంబు గలవాఁడ వేమినీవు, తెలివికాఁడవె బలరామ! తెలిసెనిందు. చిత్ర
సీ. పరపురుషాకృతి గురుతుగాఁ జూడక, త్రిపుర పతివ్రతాతిలకములను
విటపయుక్తి భ్రమించి విఫలభ్రమతఁ జేసి, తత్సతీపతుల దుర్దాంతబలుల
హతము సేయించితి వల మహానటునిచే, రథరథాంగాశ్వసారథిశరాస
గుణనిషంగాస్త్రము లొక్కరినట్లుండు నే, సమకూర్చి యసురుల సంహరించి
గీ. సాహసుఁడవై తినిన్నుంచి శంకరుండు, త్రిపురసంహారుఁడనునాఖ్యఁ దెచ్చుకొనియె. చి.
సీ. సకలవర్ణంబులు సంకరంబులు జేసి, యఖిల ధర్మములు శూన్యములు సేసి
భూతలంబును బాపభూయిష్ఠముగఁ జేసి, పరగఁ బ్రపంచంబు భ్రష్టుసేసి
కలి విజృంభించినకడపట నానీవు, తురగవాహనుఁడవై దోర్వి రాజి
ఖడ్గచంచద్ధారఁ గలుషాత్ముల వధించి, శిష్టసంరక్షణ సేయు జెల్ల
గీ. ననిశము చరాచరాదిజీవావనైక, జాగరూకుఁడవా నీవు జాగుదెలిసె. చిత్రి. 90
సీ. భువనమోహన! కృష్ణమూర్తివి నీ వేని, నాలీల లిచ్చట నాడవలదె?
బలసముజ్జ్వల కామపాలుఁడ వీవేని, దీపించి యాబల్మిఁ జూపవలదె?
వీరనృసింహావతారుఁడ వీవేనిఁ, దత్తేజ మింతైనఁ దాల్పవలదె?
సత్యవిక్రమ! రామచంద్రుఁడ వీవేని, నాపౌరుష మొకింత చూపవలదె?
గీ యెంచ దేవర దైవమోయీవె కాని, చూపఱకు నీదుమహిమను జూపవలదె? చిత్రి.
సీ. ఆలగాపరివాఁడ వనక నిన్నఖిలవే, దాంతమార్గవిహారి వందు నేమి?
హాలముఁ బట్టినవాఁడ వనక నిన్బహువిధా, జాండనిర్వాహుఁడ వందు నేమి?
యలసార్థివాఁడ వంచనక నిన్ను సమస్త, శాస్త్రప్రపూర్ణుఁడ వందు నేమి?
యడవి ద్రిమ్మరివాఁడ వనక ని న్నకలలో, కాపన్నివాసుఁడవందు నేమి?
గీ. పుడమినీగగుఁ గొంచెపునడత లెంచ, కభినుతింతు నెలోకైకవిభుఁడవనుచు. చిత్రి. 92
సీ. మామయింటికిఁ బోవ మంచితీర్థము పుట్ట, దతఁడంత కారువాఁ డతఁడె సుమ్మ
పుడుక కంచము తోలుపుట్టంబు గలమిత్రుఁ, డెందు నన్నముఁ బెట్టు నేమి గప్పు
మాటమాత్రింబైన మగువ నోరాపదు, కొడుకుపెట్టునె తలగొట్లమారి
యన్నది మేపాండ మున్నదిచ్చేదొక్క, తొట్టిగొడ్డది నీకుఁ దోలు నేమి
గీ ఎవ్వరింటికిఁ బోయిన నేమి ఫలము, ఉన్న చో నుండి సిరులఁ బెంపొందుమయ్య. చిత్ర.
సీ దుర్జనభంజనోద్యుక్త సుదర్శన, ధారివే నీవు యథార్థముగను
శాత్రవభయదనిస్వన పాంచజన్య భూ, షితకరాంబుజుఁడవే సిద్ధముగను
మత్తారిభేదనాయత్తకౌమోదకి, నిజకరభరితమే నిశ్చయముగ

ఘోరవిద్వేడక్రిక్తధారార్ద్రనందక, సంధానపాణివే సత్యముగను
గీ. నన్నుతామోఘబాణైకశారఙ్గచక్రి, శయుఁడవే నన్నువచ్చునేస్వామి!నిన్ను. చి.
సీ. ఇల్లు రత్నాకరం బెన్నాళ్ళకును జాలు, జీవనం బొరుల యాచింపవలెనె?
యింట మహాలక్ష్మి యెప్పుడుఁ దాండవం, బొనరించు నొకఁడు నీకొసఁగవలెనె?
స్థిరత లోలోన నిక్షేపించుధనము నెంచఁగరాని దొకరిఁ జేఁ జాపవలెనె!
పంటపైరులకాఁపు కంటఁ గాయుచునుండు, కోరికఁ బెరసొమ్ము,గొనఁగవలెనె?
గీ. ధాత్రినెవ్వరిరక్షించఁదలఁచినావొ, కోరువారలచేఁబూజగొందు వింతె, చిత్ర.
సీ. అబ్ధికన్యావివాహమహోత్సవము నాఁడుఁ, జూడలే దిచ్చోటజూడఁగలిగె
జానకీకళ్యాణసంభ్రమం బానాఁడుఁ జూడలే దిచ్చోటఁ జూడఁగలిగె
భోజసుతోద్వాహభూరివైభవమందుఁ జూడలే దిచ్చోటఁ జూడగలిగె.
రేవతీపరిణయ శ్రీవిలాసంబప్పు, చూడలే దిచ్చోటఁ జూడగలిగె
గీ. ననుచు నిట రాజ్యరమఁ బెండ్లియాడ,నిన్నుఁ బ్రజలు సేవించిసంతోషభరితులైరి, చి.
సీ. అఖిలలోకస్థాపనాచార్య మణివయ్యు, నిజభక్తగురునిచే నిలుపుకొన్న
గర్భస్థితానేక కమలజాండుఁడవయ్యు, నొండుకోవెలను జెల్వొందుచున్న
బహుచరాచర భూతపరిపాలకుఁడ వయ్యు, భక్తార్పితార్థము ల్పట్టుచున్న
హారచతుర్ముఖదేవతాగోచరుఁడ వయ్యు నెప్పుడు దర్శనంబిచ్చుచున్న
గీ. నిన్ను సేవింప నెవ్వరో పెన్నిధాన, మెదుటనుండంగఁ గనుమూసి యేఁగువారె
సీ. కైలాసమేరు సంకాశనాగాశన,స్కంధంబుపై రథోత్సవము గల్గ
జందనమందార సంతానకల్పక, వనములన్మృగయోత్సవమ్ముగల్గ
రంగత్పయఃపయోరాశి వీచికలపై, వర్తింప డోలోత్సవంబు గల్గ
బహుఫణారత్నశుంభద్భుజంగమ భోగ, వసతిఁ బర్యంకోత్సవంబు గల్గఁ
గీ. బరకృతోత్సవ మిచ్చుట బ్రాతెనీకు, భక్తజనులకు నేత్రోత్సవంబె కాని. చిత్ర. 98
సీ. కోరిక లీనువైకుంఠంబులో నిలో నగరిలో నామూల నవ్యదివ్య
సౌధంబుదాపలి సరసమందారవ నాంతరామృత సరఃప్రాంతచంద్ర
కాంతోపలోత్పల కల్పితపర్యంక, సకల సౌభాగ్య లక్షణనివాస
లక్ష్మీమనోజ్ఞ విలాసివశీకృత, సంభోగసామ్రాజ్యసంతతాభి
గీ. రామమూర్తికి వాంఛేతర ప్రపంచ, మేమిగావలె లీలార్థ మింతేకాని. చిత్ర. 99
సీ. గుఱుతుగ సద్భక్తకోటి కేనాఁటికి, విడరాని బహుఋణస్థుఁడవు నీవు
సేవకు లెన్నెన్ని త్రోవలఁ జనుచున్న, వదలక యనుసరించెదవు నీవు
నిజదాసు లాత్మేచ్ఛ నిలిపి రెచ్చోనిన్నుఁ, దొలఁగ కచ్చోటనే నిలచె దీవు
శ్రితు లంబలియు నైనఁ జేఁజూప నదియెంత, యమృతభోగంబుగా నలరెదీవు
గీ. జగము లన్నియు నీకువశ్యము లటంటి, వీవు నిజదాసవశ్యుఁడ వెంత ఘనత?. చిత్ర

సీ. వెనుక వేసుకొని యుర్వీనాథకోటులు, సైంధవుఁ గావంగఁ జాలినారె?
ధరనేయుతనసుతు శిర మెవ్వఁ డతఁ డీల్గ, శాపించి సింధురా జోపినాఁడె?
సాటించునాసర్వసైన్యంబు లని కర్ణు, చేశక్తినరు నేయఁ జెప్పినారె?
పరులచే నొవ్వనిపంతంబు గలభీష్ము, డర్జునాస్త్రంబుల కాఁగినాఁడె?
గీ. మనుజయత్నంబుబల మెంతమాత్ర మీవు, నిజముకరుణించునాతఁడేవిజయుఁడరయ.
సీ. ఆగామిసంచితప్రారబ్ధము లటుండ, నిజజన్మమందు నే నెల్లవేళ
నఘములే చేసితినన్ని యుష్మత్సుధా, సదృశనిర్హేతుక జాయమాన
కరుణాకటాక్షవీక్షణ మెంచ కెప్పుడో, ప్రసరింపవలె నే నపారదురిత
వారధిఁ దరియింపవలెఁ గాని గతియితః, పరమెఱుంగను భక్తపాలనాంక!
గీ. శేషపర్యంక! రాజ్యలక్ష్మిసహాంక, ప్రధననిశ్శంక! యదుకులాంబుధిశశాంక! చిత్ర.
సీ. పూర్వకవీంద్రులు పుణ్యఫలంబేమి, సాక్షాత్కరించి యస్మత్పరంబు
గాగద్యపద్యముల్ గల్పించు మనినవే, వర మొసంగితి వంద్రు వాంఛఁ జేసి
నేర్చినట్లుగఁ గూర్చి నేఁటి కవిత్వంబు, నీకంకితముఁ జేసి నెనరు దోఁపఁ
జేదోయి యొగ్గిన శ్రీపాదరజ మింత, నామీఁదఁ జాఱ నీ వేమి సామి!
గీ. కృపకుఁ బాత్రముఁ జేయు మక్షీణభాగ్యఁ లక్షణాంచిత పాదపల్లవకరాబ్జ! చిత్ర.
సీ. కావ్యదోషము లెఱుంగని మత్కవిత్వంబు, విద్వన్నుతంబుఁ గాపించినావు
బహిరంతరింద్రియ పరిశుద్ధిలేని నా, తలఁపులోపల వచ్చి నిలచినావు
పుణ్యకర్మ మొకింత పూని సేయనినన్నుఁ, బెద్దలచేత మెప్పించినావు
పురుషప్రయత్నంబు గురుతెఱుంగని నన్ను, భక్తిగల్గఁగఁ జేసి ప్రోచినావు
గీ. పతితుఁ జేపట్టినావు చేపట్టినావె, యన్యగతిఁ బోవనీయకు మాత్రరక్ష! చిత్ర. 106
సీ. శబరి యెంగిలిపండ్లు చవిఁజూచు ననుకంప, కుబ్జగంధము పూఁతఁ గొన్నకరుణ
పాంచాలికూర సాపడినదయారతి, గోపమ్మ యుగ్గుఁబాల్ గ్రోలు కృపను
మాలికుఁ డొసఁగుతో మాలెఁ దాల్చినప్రేమ, ద్విజుని కొంగటుకులు దిన్నకూర్మి
గుహుఁడు పాదములు బట్టుటకుబ్బు నెనరును, సుదుతదాస్యమునకుఁ బొడముప్రేమ
గీ. శతక మంగీకరింపుము జగతి జనకుఁ, దర్భకావ్యక్తభాషల నలరినట్లు. చిత్ర. 107
సీ. శతక మొకటిమనసా! హరిపాదము, లాశ్రయించవెయని యల్లినాఁడఁ
గరిమ రామా! భక్తికల్పద్రుమా! యని, యొప్పుగా శతకంబుఁ జెప్పినాఁడ
నలరులదండ మీకనఁగ హంసలదీవి, గోపాలశతకంబుఁ గూర్చినాఁడ
యుష్మదంకితముగా నూహించశతక మే, నంచితంబుగ రచియించినాఁడ
గీ. భవదనుగ్రహకవితచేఁ బ్రబలువాఁడ, నవనిఁ గానుల పురుషోత్తమాఖ్యవాఁడ
జిత్రజిత్రప్రభావ దాక్షిణ్యభావ, హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ

శ్రీమదాంధ్రనాయకశతకము సంపూర్ణము



శ్రీరస్తు.

# మానసబోధశతకము.



రమణీమణీహృదయ సేవితముల్ నవఫుల్లహల్లక
శ్రీరమణీయసుందర విశేషవిలాసము లబ్జసంభవా
దారకిరీటరత్న లలితద్యుతి పూర్ణము లభ్రగాపగా
సారతరంబు లంచు మనసా హరిపాదము లాశ్రయింపుమా. 1

ఉ. దండిగఁ జట్టుఱాతిని యథావిధి సంగానఁగా నొనర్చెను
ద్దండతఁ గొండచిల్వను ముదంబునఁ జేసెఁ దివ్యదేహిఁగాఁ
బండితులైనవారి నెడఁబాయక బ్రహ్మపదంబుఁ జేర్చె నీ
చండితనంబుమాని మనసా. 2

చ. సనకసనందనాది మునిసత్తము లుత్తమ భక్తియుక్తిసా
ధనమున నంబుజాక్షుని పదంబుల సేవయొనర్చి ధన్యులై
ముటట యెఱింగి యింకఁ గొఱమాలినవారల వేఁడనేల నీ
యనవరతానురక్తి మనసా... 3

ఉ. సారము లేనిసంసరణసాగర మీఁదఁగలేక చాలవే
సారుచుఁ గర్మబంధములఁ జచ్చుచుఁ బుట్టుచు సారెసారెకున్
దారుణ కాలకింకరుల దండన కోరుపలేవుగాని వి
స్తార సుఖంబుగల్గు మనసా... 4

చ. పరిపరి కర్మబంధములఁ బాయక పుట్టుచు గిట్టుచుం మహో
దురిత కళంకపంకమునఁ దూఁగుచు సంసరణాను బంధదు
స్తర జలధిన్ మునింగి జడతన్ బరతత్త్వము గానలేక వా
సరములు పుచ్చ కింక మనసా... 5

చ. తను వతిచంచలంబు ధనధాన్యము లెన్నట యాధనం బహో
కనుఁగొనుచుండ వేగ చనుఁ గావున భ్రాంతినిఁ బొంది దుష్టవ
ర్తనమున సంచరింపకు వృథా కని కానిమఱుంగు జొచ్చెద
చ్చన విఁక నెల్లమాని మనసా... 6

చ. అతిమలినంబు లైనవిషయంబులఁ జిక్కి సదా నిజాత్మ సం
గతి పరిపంథిబంధుర వికారములం గడు సొక్కి సర్వకా
మితములు దక్కి చక్కనగుమేలుపదంబు దలంపలేక నీ
చతఁ బడ నేల నీవు మనసా... 7

చ. మలినపుఁగొంప రోగముల మ్రగ్గెడు నేవపుగంప జంతుసం
చలనముఁ బొందుచుంప భవసాగరమీఁదఁగ నీనికంప యె
మ్ములు పలలంబుతోలు నరముల్ మలమొప్పఁ దలంప మేను ని
శ్చల మని నమ్మఁబోకు మనసా... 8

చ. అనుఁగులు నాలుబిడ్డలును నన్నలుఁ దమ్ములు నాదియైనవా
రను వగువేళ వెంటఁ బడి యంతమునం దొకరైనఁ దోడుగా
వెనుకొని రారు వారికయి వెట్టిగఁ బండ్లికిలింప నేల యీ
యనుచితవృత్తి మాని మనసా... 9

చ. పెనిచినవాని నమ్మి వెనువెంటనె దిర్గుపొతేలు వానిచే
తన మృతిఁ బొందునట్లునుమి తప్పక కాలము నిత్యమంచు నీ
వనిశము నమ్మి యుంటి వకటా యిఁక నేమనుకొందు నింక నీ
వనుపమ వృత్తి గల్గి మనసా... 10

చ. ఋతుమతి నాతి యంటు చెడ నెగ్గగుత్రద్రుధిరంబు శుక్లసం
గతిఁ గని దేహమయ్యె నది గన్గొన దుర్మలమూత్రమాంసశో
ణిత క్రిమిజాలసంకుల మనిత్య నుసౌఖ్యము గానఁ గాయమే
సతమని నమ్మ కీవు మనసా... 11

చ. తరువులు కొమ్మలుం బిరులుఁ దద్దయుఁ బూచియుడంగునట్లుగా
సిరు లిల వచ్చుచుం జనుచుఁ జిక్కులు పెట్టెడి నట్టి దానికే
పరులను వేఁడుచుం దిరిగి ప్రాయము రిత్తయొనర్చి వెక్కవా
చఱచిన లేదు ముక్తి మనసా... 12

చ. పరుసము సోఁకఁగా నినుము భాసురకాంచన మైనభంగి శ్రీ
హరిపదసేవచే భవభయంబు లడంగి వినిష్కలంక మౌ
పరమపదంబు గల్గు నని పాయక కొల్చి తరించిరార్యులో
సరణిని భక్తి గల్గి మనసా... 13

ఉ. పెట్టనికోట ఘోరభవభీరులకుం బరమార్థదేహికిం
గట్టనియిల్లు పూర్వకృతకర్మలతల్ దెగఁగోసి వేయఁ జే
పట్టనివాలు మేను యొకపట్టు దలంపఁగ మోక్షసంపదల్
అట్టె కొనంగవచ్చు మనసా... 14

చ. అమిత జపోపవాస నిగమాగమ సంస్తుతికంటె నిత్య సం
యమని యమాది యోగవిహితాచరణంబులకంటె సాధుసం
గముముఖదాన ధర్మములకంటె మహోత్తమసౌఖ్య భాగధే
యము లనుచుం దలంచి మనసా .. 15

చ. విరివిగ రేవెలుంగు దొరవెన్నెలల న్నెలవచ్చుచుం జనున్
గరులుహరుల్ సిరుల్ విరులు కామినులున్ నిజదేహగేహముల్
స్థిరములుగావు వాని భ్రమఁ జెంది తుదిం జెడిపోవ కిప్పుడే
యఱమర లేక నీవు మనసా... 16

చ. పుడమిని నీరుబుగ్గ చెడిపోయెడి నంచు జనుండు లోహపుం
గడియము వేయఁబూనుగతిగా నిజదేహము నిల్వఁగోరి యా
గడమునఁ బ్రాణరోధమునఁ గాంతుయొసర్పరు యోగులెప్పుడా
సడ విడనాడి నీవు మనసా... 17

చ. తినఁ బెనుబాము పట్టుకొనఁ దద్వదనంబుననుండి యీఁగలం
గని తిన నేఁగు కప్పగతిఁ గాలభుజంగము తన్ను మ్రింగఁగా
ఘనవిషయాళిఁ గోరెదు జగంబిది నిత్యము కానిదంచు నీ
వనిశముఁ గాంచి నేఁడు మనసా... 18

చ. నిరుపమపద్మపత్రమున నీరము లంటకయుండుమాడ్కిఁ గు
మ్మరపురు వొందునంటని క్రిమంబున బూడిద గచ్చకాయనుం
దొరయనిరీతి నాత్మ విదుదుర్భవబంధము లంట వంద్రు నీ
వరసి నితాంతభక్తి మనసా... 19

ఉ. ఎక్కడి యర్థచింతనము లెక్కడి సంగ్రహణైకసాధనం
బెక్కడి రక్షణక్షమత లెక్కడిహమ్ము మతాభిమానముల్
కక్కస మింతయేల యొకకార్యము దెల్పెద నిత్యసౌఖ్యముం
జిక్కఁగణింపు నీవు మనసా... 20

చ. మనుజుఁ డపథ్యవస్తువుల మానక కొన్న నజీర్ణబాధ సం
జననము నొందునంచు మది సంశయ మొందెడుఁగాని దుర్భవం
బనియెడు పెద్దరోగమున కాత్మ దలంకఁ డహో విచిత్రమా
యనువు దలంచి నీవు మనసా... 21

చ. విటుల వృథాభిలాషలను వేడుక దెల్పుచుఁ జిత్తమర్థసం
ఘటనమునందుఁ జేర్చు గణికాసతిరీతిని లౌకికక్రియా
పటిమను సర్వకార్యము లపారముదంబున నిర్వహింపుచున్
జటులతరాత్మబోధ మనసా... 22

చ. సదమలవేదశాస్త్రము లనఖ్యలు నేర్చి తదంతరార్థ స
త్పద మెఱుఁగంగలేనియెడఁ బ్రాణము వాసి పునశ్శరీరివై
యుదయము నొంది యాచదువు లొప్పఁగ నీకుఁ బఠింపఁ గష్టమౌ
నది యిది యంచు నేడు మనసా... 23

చ. ఇలఁ గల ప్రాణికోటులకు నెక్కుడు మానవులందు విప్రుల
త్యలఘులు వారికంటె నిగమార్థవిదుల్ ఘను లట్టివారిలో
జలరుహనాభు పాదజలజార్చకు లుత్తము లండ్రుగాన వి
శ్వలమున భక్తిగల్గి మనసా... 24

చ. తొలుతను మాతృగర్భమునఁ దోఁచిన తత్త్వవిచారబుద్ధినే
యలయక చేసి యెల్లవిషయంబులఁ ద్రోసి నిజాత్మశత్రులం
దొలఁగఁగ ద్రోసి దుర్భవము తూలఁగ మోక్షపదంబుఁ జేరియిం
పలర సుఖించెదీవు మనసా... 25

చ. నిలయము కాలఁగా జనుఁడు నీటికి నూయిలు ద్రవ్వినట్లు నీ
విల నవసానవేళఁ బరమేశ్వరుఁ గొల్చి తరింతు నంచు నా
నలఁ బడనేల నేఁడె 'హరి, సర్వశరణ్య రమేశ పాహిమాం
జలజదళాక్ష' యంచు మనసా... 26

ఉ. అద్దమున న్మనుష్యుఁడు నిజాస్యముఁ దాఁగనుఁ గొన్నమాడ్కిలో
నిద్దపుదృష్టిఁ జూడఁగ వినిర్మలబ్రహ్మము గానవచ్చుఁ దా
నెద్దియుఁ బొందకుండు జగ మెల్లను దానయి వెల్గుచుండు నీ
వద్దరిఁ గాంచఁ గల్గు మనసా... 27

చ. ఇటు నటు పాలు ద్రావి పరువెత్తుటకంటె సు నిల్చి నీరుగ్రో
లుట కడు మేలు మేలనెడు లోకహితోక్తి గణించి చాల మి
క్కుటమగు కర్మబంధముల గాసిల కచ్యుతుఁ జేరు మంటి వే
సటఁ బడ కింకనైన మనసా... 28

ఉ. ఏనుఁగు నెక్కి దొడ్డిఁ జొరనేల తలంచి చిత్తవే జగత్త్రయా
మానపదక్రమోద్ధత మహోజ్జ్వల విక్రమకేళికామ సం
ధానుజగద్విధాను ఫణితల్పశయానునిఁ గొల్చి యన్యవాం
ఛానుభవం బికేల మనసా... 29

చ. సకలచరాచరావన విచారుని దివ్యపదాబ్జ సేవచేఁ
ప్రకటిత మోక్ష సంపదలు పాటిలు టాత్మనెఱింగి నీదుబూ
టకములు బుగ్గిగాను సకటా వికటంపు శిఖండివృత్తిరో
యక నెలకొంటివేల మనసా... 30

చ. గుఱుతుగ నేటియొడ్డు తెగికూలెడు వృక్షముభంగి దేహ మీ
ధరణినిఁ గూలువేళను యథావిధి నేఁ డొనరించఁజూచె దీ
నరయక చన్నవారిని ధ్రువంబుగఁ జూడఁగలేదొ కాల ని
స్సరణము సేయనేల మనసా... 31

ఉ. ఇచ్చె ధ్రువంబుగా ధ్రువున కెన్న మహోన్నత లోకపాలనం
బిచ్చె విభీషణాదుల కహీనసుఖాస్పద రాజ్యభోగ ము
దిచ్చె పరార్థమున్ శబరికిచ్చెఁ గుచేలున కిష్టసంపదల్
సచ్చరితుం డతండు మనసా... 32

చ. పరసతిఁ గోరి కీచకుఁడు ప్రాణముఁ బాసె పరాన్నఖాదియై
దురమునఁ గార్తవీర్యుఁ డతిదుర్బలుఁడై పడె నన్యవస్తువా
దరమునఁగోరి మున్న శతధన్వుఁడు కూలెనటందు రార్యులా
సరణిని గోరఁబోక మనసా... 33

చ. వలువ లొసంగి వాయకుఁడు వాసిగ లేపమొసంగి కుబ్జ దా
నలరు లొసంగి మాలికుఁడు నన్న మొసంగి ధరాసురాంగనల్
ఫలము లొసంగి యాశబరి పాయనిసద్గతిఁ గాంచి రట్లు సొం
పలరఁగ సేవఁ జేసి మ... 34

ఉ. కన్నులులేనివాఁ డడవిఁ గాడ్పడి పంగునిఁ ద్రోవఁ జూపఁ గై
కొన్న తెఱంగునన్ జడతఁ గోరి పరేతరులైనవారి నీ
వెన్నికఁజేసి గొల్వ ఫలమే మిఁక మాటలువేయునేల త
త్సన్నిధిఁ జేరవచ్చు మనసా... 35

చ. పతిని నహల్య పాసి సురపాలునిఁ బొంది దురంతపాపసం
గతి నొకరాయియయ్యె వ్రజకాంతలు కాంతులఁ బాసిభ్రాంతలై
సతతము శౌరితో రతులు సల్ప మనోరథసిద్ధిఁ గాంచి రా
చతురతఁ గాంచి నీవు మనసా... 36

చ. కన్నపుదొంగ వాక్కు మది కాయములేకముఁజేసి యర్థసం
పన్నతఁ గాంచు నవ్విధము బల్విడి నారసిపొంచి మంచిసా
ఖ్యోన్నత మాపదార్థమును నొప్పగఁ జేకొనవచ్చు మృత్యువా
సన్నము గాకమున్నె మనసా... 37

చ. వృకదనుజుండు శంకరుని వేదనఁ బెట్టఁగ వేగ వచ్చి యా
వికలత మాన్చి ప్రోచె సురవిద్విషు లౌమధుకైటభాదు లో
ర్వకు నలయింప బ్రహ్మను సురక్షితుఁ జేసిన దేవు గొల్వఁ దోఁ
చక చెడనేల నీవు మనసా... 38

చ. తననిజనాథుని న్వదలి దప్పక దర్పకు బారి గొత్రయై
కనుఁగొని జారులం గలసి కామిని దుష్కళ యైనభంగినిన్
వనరుహనాభుని న్వదలి వారక నన్యులఁ గోరుచుందురా
కను బడనేల నీవు మనసా... 39

చ. కనికని నూతిలోఁ బడెడికష్టునికై వడి ఘోరదుర్భవం
బునఁ బడి చచ్చుచున్ మరలఁ బుట్టుచు నాత్మసుఖోపభోగతన్
మనకు నపేక్ష చేసి పలుమారును వేదనఁ బొందనేల యొ
య్యన దరిఁ జేరవచ్చు మనసా... 40

చ. అమరనదిన్ సరస్వతి మహాంబుధి నర్మదఁ గృష్ణవేణి గౌ
తమి యమునన్ సువర్ణముఖిద్వారవతిం బదరిన్ గయాప్రయా
గములను గ్రుంకఁగల్గు గతిఁ గాంచును శ్రీహరి నామ మొక్క మా
టమరఁగ బల్కనేని మనసా... 41

ఉ. వెన్న కరంబునం గలుగ వెత్రిగ నేతికి నేఁగినట్లు లో
న న్నెలకొన్న వెన్నునిగనంగ నపేక్ష యొకింతలేక యా
పన్నత నన్యులం గొలిచి పందలఁ గూడక జ్ఞానదృష్టి బా
స్వన్నలినాక్షుఁ గోరి మనసా... 42

చ. బూరుగుమ్రానుగాంచి భ్రమఁబొంది నశించుశుకంబుమాడ్కి నం
సార మసారమంచుఁ గనఁజాలక నీచులఁ గోరి కొల్చినే
నూరక మోసపోయి తయయో యని వంతల నొంద నేల వే
సారక ముం దెఱింగి మనసా... 43

చ. మొదలను గర్భవేదనల మూర్ఛిలు దుఃఖముపుట్టి భూమిపై
మెదలక బాల్యదుఃఖ మటమీఁద వయస్సునఁ గామదుఃఖమ
య్యదనున సంసృతింబొరలు సంతట మృత్యువుచేత దుఃఖమా
నది దలపోసి చూచి మనసా... 44

ఉ. ఎందఱు దేవతల్ చనిరి యెందఱు తాపసు లట్టె భ్రష్టులై
రెందఱు రాజు లేఁగిరి మఱెందఱు యోగులు జోగులైరి గో
విందుని పాదపద్మములు వీడనిభక్తి భజింపనేర కా
చందము నొంద కీవు మనసా... 45



ఉ. గోవు లనేకవర్ణములఁ గ్రుమ్మఱఁ బాలొకతైవభంగి నా
నావిధభూషణంబుల ఘనస్థితి గాంచుకడానిమాడ్కి లో
కావళిలోనఁ దానును దదాకృతిలోకము లయ్యు నంతరా
త్మావహుఁ డచ్యుతుండు మనసా... 45

చ. క్షరుఁడవు నక్షరుండవు నసంగివి శ్రీమహిళానుషంగి వీ
శ్వరుఁడవు సత్తపోనిధివి శాంతుఁడవున్ భయదోగ్రకృష్ణకే
సరివి భవన్మహత్త్వము నిజమ్ముగ నెవ్వరికేనిఁ గాంచఁగా
నరుదుగఁ దోఁచు నంచు మనసా... 46

చ. శ్రితముగ బుద్ధ్యహంకరణచిత్తములార వినుండు మీకు నే
హితముగఁ జెప్పెదన్ మన కధీశుఁడు నల్వుర కాదిమూలమ
చ్యుతుఁ డతిమాయనుం డతని సొంపుగఁ బట్టెదఁ దోడుగుండు మీ
కతిసుఖ మబ్బు నంచు మనసా... 48

చ. శరమున నొంచినన్ బరవశమ్మునఁ గొట్టిన ఱోలఁ గట్టినన్
దఱుపులఁ గావఁ బంపినను దప్పక వాకిటఁ గాపువెట్టినన్
మఱవక ప్రోచువాని నిను మంచిగ వేఁడిన నన్ను బ్రోతువే
సరిసరియంచుఁ గూర్మి మనసా .. 49

ఉ. భక్తినిఁ గొల్వలేఁడు సదుపాయ మెఱుంగనివాఁడు సంతతా
సక్తిని నేఁడు వీఁడు నను సారెకు దూఱుచు వేఁడినాఁ డభి
వ్యక్తుఁ డటంచు నెంచక యవారితమహా దయ నన్నుఁ బ్రోవ సు
వ్యక్తుఁడ వీవ యంచు మనసా... 50

ఉ. నేరము లెన్న నేల కరుణింపుము నే నిను వెంబడించి వే
సారుచు వేఁడినన్ వినవు సామి యొకానొకవేళనైన నా
కోరిక దీరఁ గన్పడవు కూరిమిచేయ విఁ కేమిసేతు న
య్యా రఘువర్య యంచు మనసా... 51

చ. సరసిజసంభవాద్యమరసంఘము లాత్మల నీమహత్త్వమున్
దరి గననేర రట్టి నిను తప్పక గొల్చి తరించువార మం
చరయ సుధాబ్ధి రేణుగణ మచ్చటఁ గ్రోలవె యేనుఁగేఁ గలా
సరణి నటంచు నెంచి మనసా... 52

చ. చక్కనివాఁడు సర్వగుణసంపదలుం గలవాఁడు భక్తిచేఁ
జిక్కెడువాఁడు లోకముల చిక్కెడలించెడువాఁడు దీనులన్
మిక్కిలిఁ బ్రోచువాఁడు కననేర్చినఁ గన్పడువాఁడు గాన నీ
వక్కఱపాటుతోడ మనసా... 53

చ. వేఁడెద నిన్ను వీడకయె వేదనలన్ గృశియించినాఁడ నీ
వాఁడ నెపమ్ము లెన్ని నను వంచనఁ జేసితివేని నింక ది
క్కేడ దయాపయోధి వనిమెన్నితి నాదు మొఱాలకించు మె
గ్గాడకుమంచు మ్రొక్కి మనసా... 54

చ. అతులితవర్ణచర్యల గృహస్థమసీమలఁ గాననాంతర
స్థితమితవృత్తులన్ యతివిశేష విధంబుల ముక్తిగల్గునే
వితత దయాపయోధి యగు విష్ణునిఁ గోరి భజించువారి కా
యతముగఁ గల్గినట్లు మనసా... 55

ఉ. తమ్ములమీఱు సౌరుకను దమ్ములు సోముని, గేరుమోము కుం
దమ్ములచాలుఁ బోలు రదనమ్ములు సద్దపుమేను పద్మరా
గమ్ములడాలు నేలుపదకంజములుం గలశమ్మికంటి సా
ఖ్యమ్ము లొసంగునీకు మనసా... 56

చ. గరళముఁ ద్రావి చన్గుడుపు కామినికిచ్చెను మోక్ష మా సభాం
తరమున నెగ్గులాడిన పదంపడి వానికి నైక్యమిచ్చె భీ
కరగతిఁ బట్టి మ్రింగు భుజగంబున కిచ్చెను మర్త్యరూప మా
చరితము లెన్నఁగల్గు మనసా... 57

ఉ. హెచ్చగుగట్టుమోసి యలయింపక ప్రాణులఁ బ్రోచినాఁడు తా
నిచ్చను గొల్చు పాండవుల కేర్పడ రాజ్య మొసంగినాఁడు కా
ర్చిచ్చును బట్టి మ్రింగి నిజసేవకులన్ బ్రతికించినాఁడు నీ
వచ్చపు భక్తి గల్గి మనసా... 58

ఉ. ఎన్నిక సంపద ల్గలిగి యెగ్గని చూడక గొల్లయిండ్లలో
వెన్నయు జున్ను పాల్పెరుఁగు వేమఱు దొంగిలి తిన్న చిన్ని నీ
చిన్నెల నెన్నఁ జోద్యముగఁ జెల్వగ నీవిట రాఁగదన్న మా
యన్న యిదేమి యంచు మనసా... 59

ఉ. నందునిమందయందు వ్రజనందనులందఱుఁ గొల్వ గోపికా
బృందవిపంచికారవము లింపొనరింపఁగ సుందరాకృతిం
జెంది కళింగజాతటము చెంతను దాండవకేళి సల్పు నీ
చందము లెంతు నంచు మనసా... 60

చ. ఎఱుఁగవు ముక్తిమార్గమిది యెక్కడికర్మము దాపరించెఁ జే
టెఱుఁగనిబొట్టె తా మగనికింపుగఁ బెండ్లి యొనర్చినట్లు దు
ష్కర మగు కామ్యకర్మములఁ గాలముఁ బుచ్చెదవేల బాపురే
సరసముగాదు నీకు మనసా... 61

చ. పరుసము లాడఁబోకు పరభామలఁ గోరకు దుష్టవృత్తిచేఁ
దిరుగకు యాచకావళినిఁ దిట్టకు రచ్చలపక్షపాతముల్
నెఱపకు సాధుసంఘముల నింద లొనర్పకు కామమోహమ
త్సరములఁ జెంద కీవు మన... 62

చ. పొలుపుగఁ గోటివిద్యలుసు పొట్టకుఁ బట్టెడు కూటికే కదా
యిలనుజయించి పెంపు గను టెన్నఁటికైనను గాటికే గదా
కలిమి నిజం బటంచుఁ గడ గానక నిక్కెద వాయు రర్థముల్
జలముఁ మీఁది వ్రాఁత మనసా... 63

ఉ. కూరిమితోడనైనఁ దగుకోరికనైనను బ్రాణభీతిచే
దూఱుచునైన వైరమునఁ దూఁగుచునైనను భక్తినైన వే
మాఱు హరిం దలంప నసమానసుఖంబు ఘటిల్లుఁగాన వే
సారక నీవు నేఁడు మనసా... 64

ఉ. కోఁతుల నేలినాఁడవని కోవిదు లెన్నఁగ వింటి నేనయో
కోఁతిగ నుంటి సన్నుతుల గొబ్బున సేవకుఁగా నొనర్చి సం
ప్రీతిగఁ బ్రోవుమంటి నిరుపేదల బ్రోదిగ సాఁకుటెల్ల బ్ర
ఖ్యాతియకాదెయంచు మనసా... 65

చ. ఉడుతకుఁ గల్గె ముక్తిపద మూసరవెల్లికి సౌఖ్య మబ్బె నె
క్కుడుగతి పక్షి కబ్బె ధరఁ గోమలిరూపముఁ జెందె ఱాయిమేల్
వడసెను బాయకుండు భవబాధలఁ బాసె నిషాదుఁ డామహా
జడధిశయాను నాజ్ఞ మనసా... 66

ఉ. ఇల్లను నూతిలోఁ బడితి నేదరిగానక తల్లడిల్లి నా
తల్లివి తండ్రివీవయని తప్పకనన్ దరిజేర్చుమంటి నీ
వెల్లజగంబు లేలుకొను నేలికవైనను బ్రోవకున్న నే
నల్లరిఁజేతు నంచు మనసా... 67

ఉ. నీసతి యిచ్చుభాగ్యములు నీసుతుఁ డిచ్చుఁ జిరాయుసంపదల్
నీసుత చేయుఁ బావనము నీవు జగంబులఁ బ్రోతువౌ భళీ
నీసరిదైవము ల్గలరె నిన్ను భజించినవారి కేటి దా
యాస మటంచు నీవు మనసా... 68

చ. గరుడునిమూఁపున న్నిలిచి ఖడ్గశరాసన శంఖచక్రముల్
కరముల నుల్లసిల్ల మృదుకాంచనచేలము కాంతు లీన సుం
దరమణిభూషణావళు లుదారకిరీటముఁ దాల్చి వచ్చి నీ
సరసను నిల్చిప్రోచు మనసా... 69

ఉ. దాఁగొని జన్మకర్మపరితాపములం గృశియించి దిక్కు నీ
వే కరుణింపవే మనుపవే యని వేఁడితి నన్ను బ్రోవవే
యాఁకటిబాధచేఁ దనయుఁ డన్నముఁ దెమ్మని పోరుచేసినన్
సాఁకదె తల్లియంచు మనసా... 70

చ. భవదుదర ప్రభూత మహదస్మభవాండమునం డనేకజం
తువు లుదయింపఁ జేసి కృపతోడను బ్రోవ ననేకభంగులన్
భువి జనియించు విశ్వపరిపూర్ణుని నిత్యుని నిన్నుఁ గూర్చి సం
స్తవ మొనరింతు నంచు మనసా... 71

ఉ. ఆఁకొని సత్త్వముం దొఱఁగి యట్టిటుఁ గ్రుమ్మరలేనికాలమం
దాఁకొని కుంభికుంభ పిశితస్పృహవీడని గంధసింధురా
నేకపవైరిమాడ్కి గనుసేహ్యపుసఁ సరణానుబద్ధుఁ డై
యాకమలాక్షుఁ గోరు మనసా... 72

ఉ. పొక్కిటఁ దమ్మిలో నలువ పుట్టఁగవాఁడని ఫాలదేశమం
దెక్కుడు కంటివేల్పు జనియింపఁగఁ జేసి యతండు దాల్పఁ బెం
పెక్కిన మెట్టుదమ్మి చెదలేటిపథూటినిఁగన్న మేటి నీ
యక్కఱ లెల్ల దీర్చు మనసా... 73

చ. వలను మృగంబు నోదవున వారణముచ్చున నంబుజంబు భూ
తలమునఁజిక్కినట్లు నితరస్థితి నిర్మలభక్తిసూత్రధా
రుల కనువొంద లభ్యుఁడగు రూఢిగ నీశ్వరుఁడంచు నెప్పుడో
జ్జలు పరికింతు రట్లు మనసా... 74

చ. సలలితశంఖచక్ర జలజాభయహస్తము లొప్పువాని సు
జ్వలదురురత్నకీలిత సువర్ణకిరీటశిరంబువానిఁ గో
మలతులసీవిభాసురరమాయుతవక్షమువానిఁ గొల్చినం
జలనము లేని ముక్తి మనసా... 75

చ. హరిచతురాస్యషణ్ముఖ సహస్రముఖేభముఖాదిదేవతా
వరులు సమస్తవేదములు వర్ణన సేయఁగ లేరు నిన్న యో
నరుఁడను జ్ఞానహీనుఁడను నాథుఁడ వెన్నఁగ నాకు శక్యమే
శరధిశయాన యంచు మనసా... 76

చ. పాపము లెల్లఁదీఱు భవబాధలు గొందులదూఱు ఘోర సం
తాపదవాగ్నులాఱు విపదంబుధులింకఁగఁబాఱు మోక్షము
ద్దీపితవృత్తిఁ దేఱు మనదీనత మాన్పెడివారు లేరు నీ
యాపద లెల్లఁ దీఱు మనసా... 77

చ. తిరుమలలోఁ బ్రభాతకథఁ దీర్చి నీలగిరిన్ భుజించి శే
షగిరిఁ జపించి బలఁడి చల్లని దాహము సుంగశాద్రితో
గురురుచిఁ బ్రావి రంగపురిఁ గోమలిలోఁ బవళించినట్టి యా
పరముని శౌరి దీవు మనసా హరి... 78

ఉ. శ్రీకరముల్ సుధీజనవశీకరముల్ రిపులోకభీకర
స్వీకరముల్ శ్రుతిప్రకరవేద్యలసత్పరతత్త్వనిత్యల
క్ష్మీకరముల్ సతీపతి శచీపతి వాక్పతి యోగ్యభోగ్య భా
గ్యాకరముల్ దలంప మనసా... 79

చ. తొలిచదువుల్ హరింగొనుచుఁ దోయధిఁ జొచ్చిన సోమకాసురున్
బలిమిగ మీనరూపమునఁ బట్టి వధించి రయంబునన్ శ్రుతుల్
నలువ కొసగి లోకముల నర్మిలిఁ బ్రోచిన మత్స్యమూర్తి సొం
పలరఁగ నిన్నుఁ బ్రోచు మనసా... 80

చ. కులగిరి కవ్వమంబునిధి కుంభము పాములత్రేఁడు త్రాడుగాఁ
దలపడి దేవదానవులు తత్పరతన్ మథియింప భారమ
గ్గలమయి క్రుంగు శైలము సుఖస్థితిఁ దాల్చిన కూర్మమూర్తి ని
శ్చలముగ నిన్నుఁ బ్రోచు మనసా... 81

ఉ. పుత్తడికంటిరక్కసుఁడు పొత్తిగ నీధరఁ జాఁపఁజుట్టిచ
క్కొత్తుక దా రసాతలికి నేఁగఁగ వాని వరాహరూపమై
కుత్తుకఁ ద్రుంచి భూతలముఁ గొమ్మునఁ దాల్చినదంష్ట్రిసత్కృపా
యత్తత నిన్నుఁ బ్రోచు మనసా... 82

ఉ. సర్వమయుండు విష్ణుఁడని చాటిన యాపసిబాలుఁ గావగా
శర్వముఖామరుల్ పొగడ స్తంభమునన్ బ్రభవించి నిష్ఠురా
ఖర్వనఖాళిఁ దానవుని గర్భముఁ జీరిన శ్రీనృసింహుఁడే
సర్వఫలంబు లిచ్చు మనసా... 83

చ. బలి బలిమిన్ దివౌకసులఁ బాఱఁగఁ ద్రోల జగంబులెల్ల రం
జిలు వటువేష మూని బలిఁ జేరి పదత్రయభూమిదానమున్
వలనుగ వేఁడి తత్పదవి వజ్రికొసంగిన యాత్రివిక్రముం
డలయక నిన్నుఁ బ్రోచు మనసా... 84

చ. ఇరువదియొక్క కయ్యముల నిట్టులఁ గంటకులైన రాజులన్
దఱలఁగఁ గూల్చి తద్రుధిరధారల నేఱు లొనర్చి పైతృకా
చరణము సల్పి శాశ్వతయశస్కుఁడౌ భృగురామమూర్తి ని
న్నరసి కృతార్థుఁ జేయు మనసా... 85

చ. రవికులమందుఁ బుట్టి బలురక్కసి తాటకిఁ గొట్టి మహా రా
ట్నవనము చక్కఁ బెట్టి గురుసమ్మతిఁ గానను మెట్టి వార్ధి దో
ర్జవమునఁ గట్టి రావణు ధరంబడఁ గొట్టిన రామమూర్తి ని
న్నవిరళలీల నేలు మనసా... 86

చ. అలవను దేవరోహిణుల కద్భుతలీల జనించి మించి చే
హాలముసలాస్త్రశస్త్ర ముఖరాయుధముల్ ధరియించి ముష్టికా
దులవధియించి భూధరముఁ దీర్చిన శ్రీబలరామమూర్తి తా
సలలిత లీల నేలు మనసా... 87

చ. ఘనతరబోధలంద్రిపురకాంతలసిద్ధులు మాన్పి పార్వతీ
శునకు శతాంగ శస్త్రశర శూలధనుఃప్రముఖోగ్రదివ్యసా
ధనములొసంగియుఁ ద్రిపురదైత్యులఁ ద్రుంచిన బౌద్ధమూర్తి ని
న్ననవరతంబుఁ బ్రోచు మనసా... 88

ఉ. మిత్రుల మంచు దేవతలమేయసుఖస్థితి నిల్పియుండఁగా
శత్రులమంచు రాక్షసులు సంగరభూములయందుఁ జావఁగా
శత్రులుమిత్రులుం గలరె సర్వసముండు రగేంద్రశాయి త
చ్ఛాత్రునిఁ జేయు మంచు మనసా... 89

చ. తెలియక పాపకర్మములఁ దెంపునఁ జేసితి మందబుద్ధినై
మెలఁగితి కాలుఁ డేమి నిడిమేల మొనర్చునో యంచు భీతిచే
నిలిచితి నాకు దిక్కనుచు నీవె మఱెవ్వరు లేరు బ్రోవవే
జలనిధిశాయి యంచుమనసా... 90

చ. చిలుకకు రామరామ యని చెప్పిన వేశ్య తరించె ముద్దుచేఁ
దలవడి పుత్త్రు పేరిడుట ధన్యతఁ గాంచె నజామిళుండు భో
రెలుఁగున బోయ చక్రిస్మరియింప భవాంబుధి దాఁటె నట్లు ని
ష్కలుషతఁ గాంచెదీవు మనసా... 91

ఉ. గాలము మ్రింగినట్టి ఝషకంబు తుదిం జెడిపోయినట్లు నీ
వేల భ్రమించి సంసరణ హేయసుఖంబులఁ గోరెదక్కటా
కాలుఁడు పోఁజొచ్చెఁ గడకాలము దాఁకొనవచ్చెఁ గాన దో
షాళి నడంచి వేగ మనసా... 92

చ. హరి భజియింతు నేనహరహంబు హరి న్నుతియింతు భక్తిచే
హరికి సపర్యసేతు హరి కంజలు లిత్తు మనోహరంబుగా
హరి సరియైనదైవత మజాండమున న్నహియంచు నెంచ శ్రీ
హరిపురిఁ జేరవచ్చు మనసా... 93

చ. కరివరు నేలినాఁడు మునికాంత విపద్దశ మాన్పినాఁడు దు
ర్భరశరవహ్నిఁ గ్రాఁగ నుదరస్థుని బాలునిఁ బ్రోచినాఁడు త
త్తరపడి వేఁడఁ దత్క్షణమె ద్రౌపదిమానము గాఁచినాఁడు ని
న్నఱమఱసేయ బోఁడు మనసా... 95

ఉ. తల్లికిఁ గల్గినట్టిదయ దాదికిఁ గల్గునె యెంచి చూడనీ
చిల్లరవేల్పులు న్నెనరు చిల్కఁగఁ బ్రోచుట కల్లగాదె నేఁ
జెల్లజగత్కుటుంబి వెడచేయక తొల్లిటివారియట్ల నే
యల్లనఁ బ్రోవుమంచు మనసా... 96

ఉ. ఊషగవిత్తుల త్తరువు నొయ్యనఁ జేరినరీతి వాహినుల్
వీడక వార్ధిఁజొచ్చిన ప్రవీణత నుత్తమసాధ్వి వల్లభుఁ
గూడఁగ నే గుమాడ్కి లతకూన మహీజముఁ బ్రాకినట్లు మా
రాడకుఁ గోర్కెలూర మనసా... 97

ఉ. శ్రీదము నాశ్రితావన విశేష వినోదము లాగమాంతస
మ్మోదము లబ్జజాద్యమ రముఖ్యమనఃకమలార్చనాంతరా
హారము లార్తరక్షణమహత్త్వ పటుత్వ సమస్తశిష్టక
ష్టాదములౌఁ దలంప మనసా... 98

ఉ. ఏదయ నీదయాభిమత మెందుకు నాపయి యద్దిరా దయా
నాదయ నీపదాశ్రయము నమ్మితి దబ్బఱమాట గాదయా
నీదయ నేనకించనుఁడ నీవు పరిపూర్ణుఁడవంచు భక్తర
క్షాదయఁ బ్రోవుమంచు మనసా... 99

ఉ. పూర్వభవంబునం దనరుపుణ్యగతిన్ లభించి నీమహా
ఖర్వచరిత్రము లన్నిదువఁ గల్గెను బెన్నిధిఁ గన్న పేదవాఁ
డుర్వి సుఖించినట్లు ముద మొప్పఁ గృతార్థుఁడనైతినో విహం
గార్వ రమేశ యంచు మనసా... 100

ఉ. పాయక తాడెపల్లికుల పావనుఁడై విలసిల్లు పానకాల్
రాయనిచేఁ బ్రణీతమయి రంజిలు మానసరాజయోగ సం
ధాయకవంద్యసంస్తవశతం బనిశంబుఁ బఠించి మోక్ష సం
ధాయతిఁ బొందెదీవు మనసా... 101

ఉ. మంగళ మబ్జజాసహిత మన్మథకోటి సురూపసుందరా
మంగళ మార్యలోకహిత మంగళ మగ్నిరవీందులోచనా
మంగళ మభ్రకేశనుత మంగళ మాహవరంగ భీమదై
త్యాంగ విభంగయంచు మనసా హరిపాదము లాశ్రయింపుమా. 102



శ్రీరస్తు.

# భాస్కరశతకము.



కల భాగ్యశాలికడఁ జేరఁగ వత్తురు తారుదారె దూ
రాగమన ప్రయాసమున కాదట నోర్చియు నైన నిల్వను
ద్యోగము చేసి రత్న నిలయుం డనికాదె సమస్తవాహినుల్
సాగరుఁ జేరుటెల్ల మునిసన్నుత మద్గురుమూర్తి భాస్కరా 1

చ. అంగన నమ్మరాదు తనయంకెకు రాని మహాబలాఢ్యు వే
భంగుల మాయలొడ్డి చెఱుపం దలపెట్టు వివేకి యైన సా
రంగధరుం బదంబులుఁ గరంబులుఁ గోయఁగఁ జేసెఁ దొల్లి చి
త్రాంగి యనేకముల్ నుడువ రాని కుయుక్తులు పన్ని భా... 2

చ. అక్కఱపాటువచ్చు సమయంబునఁ జుట్టము లొక్కరొక్కరిన్
మక్కువ నుద్ధరించుటలు మైత్రికిఁ జూడఁగ యుక్తమే సుమీ
యొక్కట నీటిలో మొరక నోడల బండ్లును బండ్లనోడలున్
దక్కకవచ్చుచుండుట నిదానముగాదె తలంప భా... 3

చ. అడిగినయట్టి యాచకులయాశ లెఱుంగక లోభవర్తియై
కడపిన ధర్మదేవత యొకానొకప్పుడు నీదు వాని కె
య్యెడల నదెట్లు పాలు తమకిచ్చునె యెచ్చటనైన లేఁగలన్
గుడువఁగ నీనిచోఁ గెరలి గోవులు తన్నునుగాక భా... 4

చ. అతిగుణహీనలోభికిఁ బదార్థము గల్గిన లేకయుండినన్
మితముగఁ గాని కల్మిగలమీఁదటనైన భుజింపఁ డింపుగా
సతమని నమ్ము దేహమును సంపద నేఱులు నిండి పాఱినన్
గతుకఁగఁ జూచుఁ గుక్క తనకట్టడ మీఱక యెందు భా... 5

చ. అదను దలంచి కూర్చి ప్రజ నాదరమొప్ప విభుండు కోరినన్
గదిసి పదార్థ మిత్తురటు కానక వేగమె కొట్టి తెండనన్
మొదటికి మోసమౌఁ బొదుఁగు మూలము గోసినఁ బాలుగల్గునే
పిదికినఁ గాక భూమిఁ బశుబృందము నెవ్వరికైన భా... 6

చ. అనఘునికైనఁ జేకుఱు ననర్హుని గూడి చరించినంతలో
మన మెరియంగ నప్పు డవమానము కీడు ధరిత్రియందు నే
యనువుననైనఁ దప్పవు యథార్థము తానది యెట్టులన్నచో
నినుమునుఁ గూర్చి యగ్ని నలయింపదె సమ్మెటపెట్టు భా... 7

చ. అలఘుగుణ ప్రసిద్ధుఁ డగునట్టి ఘనుం డొకఁ డిష్టుఁడై తనన్
వలచి యొకించుకేమిచ్చిన వారికి మిక్కిలి మేలుచేయఁగా
తెలిసి కుచేలుఁ డొక్కకొణి దెండటుకుల్ దనకిచ్చినన్ మహా
ఫలదుఁడు కృష్ణుఁ డత్యధికభాగ్యము లాతని కీఁడె భా... 8

చ. అవనివిభుండు నేరుపరియై చరియించినఁ గొల్చువార లె
ల్లవగుణులైన నేమి పనులన్నియుఁ జేకుఱు వారిచేతనే
ప్రవిమలనీతిశాలి యగు రాముని కార్యము మర్కటంబులే
తవిలి యొనర్పవే జలధి దాఁటి సురారులఁ ద్రుంచి భా... 9

ఉ. ఆదర మింతలేక నరుఁ డాత్మబలోన్నతి మంచివారికిన్
భేదము చేయుటం దనదు పేర్మికిఁ గీడగు మూలమెట్ల మ
ర్యాద హిరణ్యపూర్వకశిపుఁ దనుజుండు గుణాఢ్యుఁడైన ప్ర
హ్లాదున కెగ్గుచేసి ప్రళయంబునుఁ బొందఁడె మున్ను భా... 10

ఉ. ఆరయ నెంతనేరుపరియై చరియించిన వానిదాపునన్
గౌరవ మొప్పఁ గూర్చు నుపకారి మనుష్యుఁడు లేక మేలుచే
కూర దదెట్లు హత్తుగడ గూడునె చూడఁ బదాఱువన్నెబం
గారములోననైన వెలిగారము గూడకయున్న భా... 11

ఉ. ఈక్షితి నర్థకాంక్ష మది నెప్పుడు పాయక లోకులెల్ల సం
రక్షకుఁడైన సత్ప్రభుని రాకలఁ గోరుదు రెందుఁ జంద్రికా
పేక్షఁ జెలంగి చంద్రుఁడుదయించు దినంబునకై చకోరపుం
బక్షులు చూడవే యెదుర పార ముదంబునఁ బూని భా... 12

ఉ. ఈ జగమందు, దా మనుజుఁ డెంత మహాత్ముఁడైన దైవమా
తేజము తప్పఁ జూచునెడఁ ద్రిమ్మరి కోల్పడు నెట్లన న్మహా
రాజకుమారుఁడైన రఘురాముఁడు కాల్నడఁ గాయలాకులున్
భోజనమై తగన్వనికిఁ బోయి చరింపఁడె మున్ను భా... 13

చ. ఉరుకరుణాయుతుండు సమయోచిత మాత్మఁదలంచి యుగ్రవా
క్పరుషతఁ జూపినన్ ఫలముగల్గుట తథ్యముగాదె యంబుదం
బురిమినయంతనే కురియకుండునె వర్షము లోకరక్షణ
స్థిరతర పౌరుషంబున నశేషజనంబు లెఱుంగ భా... 14

చ. ఉరుగుణవంతుఁ డొండు దనకొం డపకారము సేయునప్పుడుం
బరహితమే యొనర్చు నొకపట్టున నైనను గీడుఁ జేయఁగా
నెఱుఁగడు నిక్కమే కద యదెట్లనఁ గవ్వము బట్టి యెంతయున్
దరువఁగఁ జొచ్చినం బెరుఁగు తాలిమినీయదె వెన్న భా... 15

చ. ఉరుబలశాలి నంచుఁ దను నొల్లనియన్యపతివ్రతాంగనా
సురతముగోరునేని కడసుమ్మది భూతికిఁ బ్రాణహాని యౌ
శిరములు గూల రాఘవునిచే దశకంఠుఁడు ద్రుంగి పోఁడే
యెఱుఁగక సీత కాసపడి యిష్టుల భృత్యులఁ గూడి భా... 16

ఉ. ఊరక వచ్చుఁ బాటుపడ కుండిన నైన ఫలం బదృష్టమే
పారఁగఁ గల్గువానికిఁ బ్రయాసము నొందిన దేవదానవుల్
వారలటులుండఁగా నడుమ వచ్చిన శౌరికిఁ గల్గెఁగాదె శృం
గారపుఁ బ్రోవు లక్ష్మియుఁ గౌస్తుభరత్నము రెండు భా... 17

ఉ. ఊరక సజ్జనుం డొదిగియుండిన నైన దురాత్మకుండు ని
ష్కారణ మోర్వలేక యుపకారము చేయుట వానివిద్యగా
చీరలు నూఱుటంకములు చేసెడివైనను బెట్టెనుండఁగా
జేరి చినింగిపోఁ గొఱుకుచిమ్మట కేమి ఫలంబు భా... 18

ఉ. ఎట్టుగఁ బాటుపడ్డ నొకయించుక ప్రాప్తము లేక వస్తువుల్
పట్టుపడంగ నేరవు నిబద్ధి సురావళిఁ గూడి రాక్షసుల్
గట్టుపెకల్చి పాల్కడలిఁ గవ్వము చేసి మథించి రంతయున్
వెట్టియకాక యేమనుభవించిరి వా రమృతంబు భా... 19

చ. ఎడపక దుర్జనుం డొరుల కెంతయుఁ గీడొనరించుఁ గానియే
యొడలను మేలు సేయఁడొక యించుకయైనను జీడపుర్వుదాఁ
జెడఁ దిను నింతెకాక పుడిసెండుజలం బిడిపెంపనేర్చునే
పొడవగుచున్న పుష్పఫల భూరుహ మొక్కటినైన భా .. 20

ఉ. ఎడ్డమనుష్యుఁ డేమెఱుఁగు నెన్ని దినంబులు గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుఁ గలతేరపు వర్తనలెల్లఁ బ్రజ్ఞ నే
ర్పడ్డవివేకరీతి రుచిపాకము నాలుక గా కెఱుంగునే
తెడ్డది కూరలోఁ గలయఁ ద్రిమ్మరుచుండిననైన భా... 21

ఉ. ఎప్పు డదృష్టతామహిమ యించుకపాటిలు నప్పు డింపుసొం
పొప్పుచునుండుఁ గాకయది యొప్పనిపిమ్మట రూపుమాయఁగా
నిప్పున నంటియున్న యతినిర్మలినాగ్ని గురుప్రకాశముల్
దప్పిన నట్టిబొగ్గునకుఁ దానలు పెంతయుఁ బుట్టు భా... 22

ఉ. ఏగతిఁ బాటుపడ్డఁ గలదే భువి నల్పునకున్ సమగ్రతా
భోగము భాగ్యరేఖ గల పుణ్యునకున్ బలె భూరిసత్త్వసం
యోగమ దేభకుంభయుగళోత్థితమాంసము నక్కకూన కే
లాగు ఘటించు సింహము దలంచినఁ జేకుఱు గాని భా... 23

ఉ. ఏడ నసత్త్వుఁడుండు నట కేఁగు నసత్త్వుఁడు సత్త్వుఁ డున్నచోఁ
జూడఁగ నొల్లఁ డెట్లన విశుద్ధగుణస్థితి నీఁగ పూయముం
గూర్చిన పుంటిపై నిలువఁ గోరినయట్టులు నిల్వనేర్చునే
సూడిదఁబెట్టునెన్నుదుటి చొక్కపుఁ గస్తురిమీఁద భా... 24

ఉ. ఏల సమస్తవిద్యల నొకించుక భాగ్యము గల్గియుండినన్
జాలు ననేకమార్గములు సన్నుతికెక్కన దెట్లొకో యనన్
ఱాలకు నేడ విద్యలు తిరంబుగ దేవరరూపు చేసినన్
వ్రాలి నమస్కరించి ప్రసవంబులు పెట్టరె మీఁద భా... 25

ఉ. ఒక్కఁడె చాలు నిశ్చలబలోన్నతుఁ డెంతటి కార్యమైనఁ దాఁ
జక్కనొనర్పఁ గౌరవు లసంఖ్యులు పట్టిన ధేనుకోటులం
జిక్కఁగనీక తత్ప్రబలసేన ననేక శిలీముఖంబులన్
మొక్కపడంగఁ జేసి తుదముట్టఁడె యొక్కకిరీటి భా... 26

ఉ. కట్టడ దప్పి తాము చెడుకార్యముఁ జేయుచునుండిరేని దోఁ
బుట్టినవారినైన విడిపోవుట కార్యము దార్మదాంధ్యముం
దొట్టిన రావణాసురునితో నెడఁబాసి విభీషణాఖ్యుఁడా
పట్టున రాముఁ జేరి చిరపట్టము గట్టుకొనండె భా .. 27

ఉ. కట్టడ యైనయట్టి నిజకర్మము చుట్టుచు వచ్చి యేగతిం
బెట్టునొ పెట్టినట్లనుభవింపక తీఱదు కాళ్ళు మీఁదుగాఁ
గిట్టక వ్రేలుఁ డంచుఁ దలక్రిందుగఁ గట్టిరె యెవ్వరైన నా
చెట్టున గబ్బిలంబులకుఁ జేరిన కర్మము గాక భా... 28

ఉ. కట్టడ లేనికాలమునఁ గాదు శుభంబొరు లెంతవారు చే
పట్టినవైన మర్త్యునకు భాగ్యము రాదనుటెల్లఁ గల్ల కా
దె ట్టని పల్కినన్ దశరథేశ వసిష్ఠులు రామమూర్తికిన్
బట్టముకట్టఁ గోరి రది వాయక చేకుఱె నోటు భా... 29

ఉ. కానక చేరఁ బోల దతికర్ముఁడు నమ్మిక లెన్ని చేసినం
దా నది నమ్మి వానికడ దాయఁగ బోయిన హాని వచ్చు న
చ్చోనది యెట్లనం గొఱకు చూపుచు నొడ్డినబోను మేలుగాఁ,
బోనని కాన కాసపడి పోవుచు గూలదె కొక్కు భా... 30

ఉ. కానిప్రయోజనంబు సమకట్టదు తా భువి నెంత విద్య వాఁ
డైనను దొడ్డరాజు కొడుకైన నదెట్లు మహేశుపట్టి వి
ద్యానిధి సర్వవిద్యలకుఁ దానె గురుండు వినాయకుండు దా
నేనుఁగురీతి నుండియు నదేమిటి కాడఁడు పెండ్లి భా... 31

ఉ. కామితవస్తుసంపదలు గల్గు ఫలం బొరు లాసపడ్డచో
నేమియుఁ బెట్టఁడేని సిరియేటికి నిష్ఫలమున్నఁ బోయినన్
బ్రామికపడ్డలోకులకుఁ బండఁగ నే మది యెండిపోవఁగా
నేమిఫలంబు చేఁదు విడ దెన్నఁటికైన ముసిండి భా... 32

ఉ. కారణమైన కర్మములు కాక దిగంబడ వెన్నిగొందులం
దూరిన నెంతవారలకుఁ దొల్లి పరీక్షితు శాపభీతుఁ డై
వారధి నొప్పునుప్పరిగపై బదిలంబుగ దాఁగియుండినం
గ్రూరభుజంగదంతహతిఁ గూలఁడె లోకు లెఱుంగ భా... 33

చ. కులమున నక్కడక్కడ నకుంఠితధార్మికుఁ డొక్కఁడొక్కఁడే
కలిగెడుఁగాక పెందఱుచు గల్గఁగనేరరు చెట్టుచెట్టునన్
గలుగఁగ నేర్చునే గొడుగుకామలు చూడఁగ నాడనాడనిం
పలరఁగ నొక్కటొక్కటి నయంబునఁ జేకుఱుఁగాక భా... 34

ఉ. క్రూరమనస్కు లౌపతులఁ గొల్చి వసించినమంచివారికిన్
వారిగుణంబె పట్టి చెడువర్తన వాటిలు మాధురీజలౌ
ధారలు గౌతమీముఖ మహానదు లంబుధిఁ గూడినంతనే
క్షారముఁ జెందవే మొదలికట్టడ లన్నియుఁ దప్పి భా... 35

ఉ. గిట్టుట కేడఁ గట్టడ లిఖించును నచ్చటఁగాని యొండుచోఁ
బుట్టదు చావు జానువుల పున్కల నూడిచి కాశిఁ జావఁగా
ల్గట్టినశూద్రకున్ భ్రమలఁ గప్పుచుఁ దద్విధి గుఱ్ఱమామ నా
పట్టునఁ గొంచు మఱ్ఱికడఁ బ్రాణము తీసెఁ గదయ్య భా... 36

చ. ఘనబలసత్త్వ మచ్చుపడఁ గల్గినవానికి హాని లేనిచోఁ
దనదగుసత్తమే చెఱుచుఁ దన్ను నదెట్లన నీరు లావుగాఁ
గనువసియించినన్ జెరువుగట్టుకు సత్తము చాలకున్నఁచో
గనుమలు పెట్టి నట్టనడిగండి తెగంబడకున్నె భా... 37

చ. ఘనుఁడగునట్టివాఁడు నిజకార్యసముద్ధరణార్థమై మహిం
బనివడి యల్పమానవుని బ్రార్థనచేయుట తప్పుగాదుగా
యనఘతఁ గృష్ణజన్మమున నావసుదేవుఁడు మీఁద కెత్తుగా
గనుఁగొని గాలిగానికడ కాళ్ళకు మ్రొక్కఁడె నాఁడు భా... 38

చ. ఘనుఁడొకవేళఁ గీడ్పడినఁ గ్రమ్మఱ నాతని లేమి వాపఁగాఁ
గనుఁగొన నొక్కసత్ప్రభువుగాక నరాధములోప రెందఱున్
జెనుచెఱు వెండినట్టితఱిఁ బెల్లున మేఘుఁడు గాక నీటితోఁ
దనుపఁ దుషారముల్ శతశతంబులు చాలు నటయ్య భా... 39

ఉ. చంద్రకళావతంసుకృప చాలనినాఁడు మహాత్ముఁడైనఁ దా
సాంద్రవిభూతిఁ బాసియొక జాతివిహీనునిఁ గొల్చియుంటయో
గీంద్రనుతాంఘ్రిపద్మ మతిహీనత నొందుటకాదుగా హరి
శ్చంద్రుఁడు వీరబాహుని నిజంబుగఁ గొల్వఁడె నాఁడు భా... 40

ఉ. చక్కఁదలంపఁగా విధివశంబున నల్పునిచేతనైనఁ దాఁ
జిక్కి యవస్థలం బొరలుఁ జెప్పఁగరాని మహాబలాఢ్యుఁడున్
మిక్కిలి సత్త్వసంపదల మీఱినగంధగజంబు మావటీఁ
డెక్కి యదల్చికొట్టి కుదియించిన నుండదె యోర్చి భా... 41

చ. చదువది యెంతగల్గిన రసజ్ఞత యించుక చాలకున్న యా
చదువు నిరర్థకంబు గుణసంయుతు లెవ్వరుమెచ్చ రెచ్చటం
బదనుగ మంచికూర నలపాకముచేసిననైన నందు నిం
పొదవెడునుప్పులేక రుచి పుట్టఁగ నేర్చునటయ్య భా... 42

ఉ. చాలఁ బవిత్రవంశమున సంజనితుండగునేని యెట్టి దు
శ్శీలునినైనఁ దత్కులవిశేషముచే నొకపుణ్యుఁ డెంతయుం
దాలిమి నుద్ధరించును సుధానిధిఁ బుట్టఁగఁగాదె శంభుఁడా
హాలహలానలంబు గళమందు ధరించుట పూని భా... 43

ఉ. చేరి బలాధికుం డెఱిఁగి చెప్పినకార్యము చేయకుండినన్
బారము ముట్టలేఁ డొకనెపంబునఁ దాఁ జెఱు నెట్టి ధన్యుఁడున్
బోరక పాండుపుత్రులకు భూస్థలి భాగము పెట్టుమన్న కం
సారిని గాకుచేసి జెడఁడాయెనె కౌరవభర్త భా... 44

ఉ. చేసిన దుష్టచేష్ట నది చెప్పక నేర్పునఁ గప్పిపుచ్చి తా
మూసినయంతటన్ బయలుముట్టక యుండ దదెట్లు రాగిపైఁ
బూసినబంగరుం జెదరిపోవఁ గడంగిన నాఁడు నాఁటికిన్
దాసినరాగి గానఁబడదా జనులెల్ల నెఱుంగ భా... 45

చ. తగిలి మదంబుచే నెదిరిఁ దన్ను నెఱుంగక దొడ్డవానితోఁ
బగఁ గొని పోరుటెల్ల నతిపామరుఁడై చెడుటింతెకాక తా
నెగడిజయింపనేరఁ డది నిక్కము తప్పదు ధాత్రిలోపలన్
దెగి యొకకొండతోఁ దగరు ఢీకొని తాఁగిన నేమి భా... 46

చ. తడవగరాదు దుష్టగుణుఁ దత్త్వ మెఱుంగక యెవ్వఁడైన నా
చెడుగుణ మిట్లు వచ్చెదని చెప్పిన గ్రక్కునఁ గోపచిత్తుఁడై
కడుఁ దెగఁజూచుఁ గాఁ ముఱుఁగఁగాఁగిన తైలము నీటిబొట్టుపైఁ
బడునెడ నాక్షణం బెగసి భగ్గున మండక యున్నె భా... 47

చ. తనకు ఫలంబు లేదని యెదం దలపోయఁడు కీర్తిఁ గోరు నా
ఘనగుణశాలి లోకహితకార్యము మిక్కిలి భారమైన మే
లనుకొని పూను శేషుఁడు సహస్రముఖంబులఁ గాలిఁ గ్రోలి తా
ననిశము మోవఁడే నుతి మహాధరమైన ధరిత్రి భా... 4

చ. తనకు నదృష్టరేఖ విశదంబుగఁ గల్గినఁ గాని లేనిచో
జనునకు నెయ్యెడన్ బరుల సంపదవల్ల ఫలంబు లేమిగా
కనుఁగవ లెస్సఁగాఁ దెలివి గల్గినవారికిఁ గాక గ్రుడ్డికిన్
గనుపడునెట్లు వెన్నెలలు గాయఁగ నందొక రూపు భా... 49

ఉ. తాలిమితోడుతం దగవు తప్పక నేర్పరి యొప్పుతప్పులం
బాలన సేయుఁగాకట నుపాయవిహీనుఁడు సేయనేర్చునే
పాలును నీరు వేరుపఱుపంగ మరాళ మెఱుంగుఁ గాక మా
ర్జాల మెఱుంగునేత దురుచారుపసజ్ఞతఁ బూన భా... 50

ఉ. తాలిమితోడఁ గూరిమిఁ గృతఘ్నున కెయ్యెడ నుత్తమోత్తము
ల్మేలొనరించినన్ గుణము మిక్కిలి కీడగుఁ బాముపిల్లకున్
బాలిడి పెంచిన న్విషము పాయఁగ నేర్చునె దానికోఱలం
జాలఁగ నంతకంత కొకచాయను హెచ్చును గాక భా... 51

చ. తెలియనికార్య మెల్లఁ గడతేర్చుట కొక్కవివేకిఁ జేకొనన్
వలయు నటైన దిద్దుకొనవచ్చుఁ బ్రయోజన మాంద్యమేమియుం
గలుగదు ఫాలమందుఁ దిలకం బిడునప్పుడు చేత నద్దముం
గలిగినఁ జక్కఁజేసికొనఁ గాదె నరుం డది చూచి భా... 52

ఉ. దక్షుఁడు లేనియింటికిఁ బదార్థము వేఱొకచోటనుండి వే
లక్షలు వచ్చుచుండినఁ బలాయనమై చనుఁ గల్లగాదు ప్ర
త్యక్షము వాఁగులున్ వఱద లన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయమైన గండి తెగినట్టి తటాకములోన భా... 53

ఉ. దానపరోపకారగుణధన్యత చిత్తములోన నెప్పుడున్
లేని వివేకశూన్యునకు లేములు వచ్చినవేళ సంపదల్
పూనినవేళ నొక్కసరిపోలును జీకున కర్ధరాత్రియం
దైనన ద్దేమి పట్టపగలైన నదేమియు లేదు భా... 54

ఉ. దానము సేయఁ గోరినవదాన్యున కీయఁగ శక్తిలేనిచో
నైనఁ బరోపకారమునకై యొకదిక్కునఁ దెచ్చియైన నీ
బూనును మేఘుఁడంబుధికిఁ బోయిజలంబులఁ దెచ్చి యీయఁడే
వాన సమస్తజీవులకు వాంఛిత మింపెసలార భా... 55

ఉ. దానము చేయనేరని యధార్మికు సంపద యుండియుండియున్
దానె పలాయనంబగుట తథ్యము బూరుగుమాను గాచినన్
దానిఫలంబు లూరక వృథాపడిపోవవె యెండి గాలిచేఁ
గానలలోన నేమిటికి గాక యభోజ్యము లౌట భా.. 56

చ. నడవక చిక్కిలేమి యగునాఁడు నిజోదరపోషణార్థమై
యడిగి భుజించుటల్నరుల కారయవ్యంగ్యము కాదు పాండవుల్
గడుబలశాలు లేవురు నఖండవిభూతిఁ దొలంగి భిక్షముల్
గుడువరె యేకచక్రపురిఁ గుంతియుఁ దామొకచోట భా... 57

చ. నుడువుల నేర్పుచాలని మనుష్యుఁ డెఱుంగక తప్పనాడినం
గడుఁ గృపతోఁ జెలంగుదురు కాని యదల్పరు తజ్జ్ఞులెల్ల ద
ప్పడుగులు వెట్టుచున్నడచునప్పుడుబాలుని ముద్దుసేయఁగాఁ
దొడఁగుదు రింతెకాని పడఁద్రోయుదురే యెవ్వరైన భా... 58

ఉ. నేరిచి బుద్ధిమంతుఁ డతినీతి వివేకము దెల్పినం జెడం
గారణ మున్నవాని కది గైకొనఁగూడదు నిక్కమే దురా
చారుఁడు రావణాసురుఁ డసహ్యము నొందఁడె చేటు కాలముం
జేరువయైననాడు నిరసించి విభీషణుబుద్ధి భా... 59

చ. నొరిగినవేళ నెంతటిఘనుండును దన్నొకరొక్కనేర్పుతో
నగపడి ప్రోదిసేయక తనంతట బల్మికి రాఁడు నిక్కమే
జగమున నగ్నియైనఁ గడు సన్నగిలంబడి యున్న నింధనం
బెగయఁగఁ ద్రోచియూఁదక మఱెట్లు రవుల్కొననేర్చు భా... 60

ఉ. పండితులైనవారు దిగువం దగ నుండఁగ నల్పుఁ డొక్కఁడు
దండితఁ బీఠమెక్కిన బుధప్రకరంబుల కేమియెగ్గగున్
గొండొక కోఁతి చెట్టుకొనకొమ్మలనుండఁగ గ్రింద గండభే
రుండమదేభసింహనికురుంబము లుండవె చేరి భా... 61

ఉ. పట్టుగ నిక్కుచుం మదముఁబట్టి మహాత్ములఁ దూలనాడినం
బట్టినకార్యముల్ చెడును బ్రాణముపోవు నిరర్థదోషముల్
పుట్టు మహేశుఁ గాదని కుబుద్ధి నొనర్చిన యజ్ఞతంత్రముల్
ముట్టకపోయె దక్షునికి మోసమువచ్చెఁ గదయ్య భా... 62

చ. పరహితమైన కార్య మతిభారము తోడిదియైనఁ బూను స
త్పురుషుఁడు లోకము ల్పొగడఁ బూర్వమునం దొక బాలవర్షము
న్గురియఁగఁ జొచ్చినన్ గదిసి గొబ్బున గోజనరక్షణార్థమై
గిరి నొకకేల నెత్తెనఁట కృష్ణుఁడు ఛత్రము భాతి భా... 63

చ. పలుచని నీచమానవుఁడు పాటిఁ దలంపక నిష్ఠురోక్తులం
బలుకుచునుండుఁగాని మతిభాసురుఁడైన గుణప్రపూర్ణుఁ డ
ప్పలుకులఁ బల్కఁబోవఁడు నిబద్ధిగ నెట్లన వెల్తికుండఁ దాఁ
దొలఁకుచునుండుఁగాని మఱి దొల్కనె నిండుఘటంబు భా... 64

చ. పలుమఱు సజ్జనుండు ప్రియభాషలు పల్కఁగఠోరవాక్యముల్
పలుకఁ డొకానొకప్పుడవి పల్కినఁ గీడునుగాదు నిక్కమే
చలువకు వచ్చి మేఘుఁ డొకజాడను దా వడగండ్ల రాల్చినన్
శిలలగు నోటు వేగిరమె శీతలనీరము గాక భా... 65

ఉ. పాపపుఁ ద్రోవవాని కొకపట్టున మేను వికాస మొందినన్
లోపల దుర్గుణంబె ప్రబలుంగద నమ్మఁగఁ గూడ దాతనిన్
బాపర కాయకున్ నునుపు పైపయిఁ గల్గినఁ గల్గుఁగాక నే
రూపున దానిలోఁ గల విరుద్ధపుఁ జేఁదు నశించు భా... 66

ఉ. పూనినభాగ్యరేఖ చెడిపోయినపిమ్మట నెట్టిమానవుం
డైనను వాని నెవ్వరుఁ బ్రియంబునఁ బల్కరు పిల్వ రెచ్చటం
దానది యెట్లొకోయనినఁ దథ్యము పుష్పము వాడి వాసనా
హీనత నొందియున్న యెడ నెవ్వరు ముట్టుదురయ్య భా... 67

ఉ. పూరితసద్గుణంబు గలపుణ్యునకించుక రూపసంపదల్
దూరములైన వానియెడదొడ్డగఁ జూతురు బుద్ధిమంతు లె
ట్లారయఁగొగ్గులైన మఱి యందులమాధురిఁ జూచి కాదె
ఖర్జూరఫలంబుల బ్రియము జొప్పడ లోకులు గొంట భా... 68

ప్రల్లదనంబుచే నెఱుకపాటొక యింతయులేక యెచ్చటన్
బల్లిదుఁడైన సత్ప్రభు నబద్ధము లాడినఁ ద్రుంగిపోదు రె
ట్లల్లసభాస్థలిం గుమతులై శిశుపాలుఁడు దంతవక్త్రుఁడుం
గల్లరు కృష్ణునిం బలికి కాదె హతం బగు టెల్ల భా... 69

ఉ. ప్రేమను గూర్చి యల్పునకుఁ బెద్దతనంబును దొడ్డవానికిం
దా మతితుచ్ఛపుంబని నెదం బరికింపక యీయఁతాదుగా
వా మకరంబుతోడఁ గుడువం గుడిచేత నపానమార్గముం
దోమఁగవచ్చునే మిగులఁ దోఁచనిచేఁతలు గాక భా... 70

ఉ. ఫలమతిసూక్ష్మమైనను నృపాలుఁడు మంచిగుణాఢ్యుఁడైనచో
నెలమి వివేకు లాతని కపేక్ష యొనర్తు రదెట్లు చంద్రికా
విలసన మైనఁ దా ననుభవింపఁ జకోరము లాసఁ జేరవే
చలువ గలట్టివాఁడగుటఁ జందురు నెంతయుఁ గోరి భా... 71

ఉ. బంధుర సద్గుణాఢ్యుఁ డొకపట్టున లంపట మొందియైన దు
స్సంధి దలంపఁ డన్యులకుఁ జాలహితం బొనరించుఁగాక శ్రీ
గంధపుఁజెక్క రాగిలుచుఁగాదె శరీరుల కుత్సవార్థమై
గంధము లాత్మఁబుట్టఁ దఱుగంబడి యుండుట లెల్ల భా... 72

చ. బలము దొలంగుకాలమునఁ బ్రాభవసంపద లెంతధన్యుఁడున్
నిలుపుకొనంగనోపఁ డది నిశ్చయమర్జునుఁ డీశ్వరాదులం
గెలిచినవాఁడు బోయలకుఁ గీడ్పడిచూచుచుఁ గృష్ణు భార్యలం
బలువుర నీయఁడే నిలువఁ బట్ట సమర్థుఁడు కాక భా... 73

చ. బలయుతుఁ డైనవేళ నిజబంధుఁడు తోడ్పడుఁ గానియాతఁడే
బలము తొలంగెనేని తనపాలిటిశత్రు వదెట్లు పూర్ణుఁడై
జ్వలనుఁడుకానఁగాల్చు తఱి సఖ్యముఁ జూపును వాయుదేవుఁ డా
బలియుఁడు సూక్ష్మదీప మగుపట్టున నార్పదె గాలి భా 74

చ. బల్లిదుఁ డైన సత్ప్రభువు పాయక యుండినగాని రచ్చలోఁ
జిల్లరవారు నూఱుగురు సేరినఁ దేజము గల్గ దెయ్యెడన్
జల్లని చందురుం డెడసి సన్నపుఁజుక్కలు కోటి యున్న రం
జిల్లునె వెన్నెలల్ జగముచీఁకటు లన్నియుఁ బాయ భా... 75

చ. భుజబలశౌర్యవంతు లగు పుత్రులఁ గాంచిన వారి కెయ్యెడన్
నిజహృదయేప్సితార్థములు నిక్కము చేకుఱుఁ గుంతిదేవికిన్
విజయబలాఢ్యుఁ డర్జునుఁడు వీరపరాక్రమ మొప్ప దేవతా
గజమును దెచ్చి తల్లి వ్రతకార్యము దీర్పఁడె తొల్లి భా... 76

చ. భూనుతులైన దేవతలు పూర్వము కొందఱు వావివర్తనల్
మాని చరింపరో యనుచు మానవు లట్ల చరింపఁబోల దం
భోనిధులన్నియుం దనదుపుక్కిటఁ బట్టెన గస్త్యుఁడంచునా
పూనిక కెవ్వఁడోపునది పూర్వమహత్త్వము సుమ్ము భా... 77

ఉ. భూపతి కాత్మబుద్ధి మదిఁ బుట్టనిచోటఁ బ్రధాను లెంత ప్ర
జ్ఞాపరిపూర్ణులైనఁ గొనసాగదు కార్యము కార్యదక్షులై
యోపిన ద్రోణభీష్మకృపయోధు లనేకులు గూడి కౌరవ
క్ష్మాపతికార్య మేమయినఁ జాలిరె చేయఁగ వారు భా... 78

ఉ. భూరిబలాఢ్యుఁ డైనఁ దలపోయక విక్రమశక్తిచే నహం
కారము నొందుటల్ తగవుగా దతఁ డొక్కెడ మోసపోవుఁగా
వీరవరేణ్యుఁ డర్జునుఁడు వింటికి నే నధికుండ నంచుఁ దా
నూరక వింటి నెక్కిడఁగ నోపఁడు కృష్ణుఁడు లేమి భా... 79

ఉ. భ్రష్టున కర్థవంతు లగు బాంధవు లెందఱు గల్గినన్ నిజా
దృష్టము లేదు గావున దరిద్రతఁ బాపఁగలేరు సత్కృపా
దృష్టిని నిల్పి లోకుల కతిస్థిరసంపద లిచ్చులక్ష్మి యా
జేష్ట క దేటికిం గలుగఁ జేయదు తోడనె పుట్టి భా 80

చ. మదిఁ దనునాసపడ్డయెడ నుంచి గుణోన్నతుఁ డెట్టిహీనునిన్
వదలఁడు మేలుపట్టున నవశ్యము మున్నుగ నాదరించుఁగా
త్రిదశవిమానమధ్యమునఁ దెచ్చి కృపామతి సారమేయమున్
మొదలనిడండె ధర్మజుఁడు మూఁగి సురావళి చూడ భా... 81

చ. మాటల కోర్వఁజాలఁ డభిమానసమగ్రుఁడు ప్రాణహాని యా
జోటులనైనఁ దానెదురుచూచుచు నుండుఁ గొలంకు లోపల
న్నీట మునింగినప్పు డతినీచము లాడిన రాజరాజు పో
రాటమొనర్చి నేలఁబడఁడాయెనె భీమునిచేత భా... 82

ఉ. మానవనాథుఁ డాత్మరిపుమర్మ మెఱింగినవాని నేలినం
గాని జయింపలేఁ డరులఁ గార్ముకదక్షుఁడు రామభద్రుఁడా
దానవనాయకుం గెలువఁ దా నెటులోపుఁ దదీయనాభికా
స్థానసుధన్విభీషణుఁడు తార్కొని చెప్పకయున్న భా... 83

ఉ. మానవుఁడాత్మకిష్ట మగుమంచి ప్రయోజన మాచరించుచోఁ
గానకయల్పుఁ డొక్కఁ డది గాదని పల్కిన వానిపల్కుకై
మానఁగఁ జూడఁ డాపని సమంచితభోజనవేళ నీఁగ కా
లూనినవంటకంబు దినకుండఁగ నేర్పగునోటు భా... 84

చ. మానినిచెప్పనె క్లెఱుకమాలినవాఁడటు చేసినన్ మహా
హాని ఘటించు నే ఘనునికైన నసంశయ ముర్విపైఁ గృపా
హీనతఁ బల్కినన్ దశరథేశ్వరుఁ డంగనమాటకై గుణాం
భోనిధి రాముఁ బాసి చనిపోవఁడె శోకముతోడ భా— 85

చ. మునుపొనరించుపాతక మమోఘము జీవులకెల్లఁ బూని యా
వెనుకటి జన్మమం దనుభవింపక తీఱదు రాఘవుండు వా
లిని బడనేసి తా మగుడ లీల యదూద్భవుఁడై కిరాతుచే
వినిశితబాణపాతమున వీడ్కొనఁడే తనమేను భా... 86

ఉ. రాకొమరుల్ రసజ్ఞుని చిరంబుగ మన్నన నుంచినట్లు భూ
లోకమునందు మూర్ఖుఁ దమలోపల నుంపరు నిక్కమేకదా
చేకొని ముద్దుగాఁ జనువుచిల్కను బెంతురు గాక పెంతురే
కాకము నెవ్వరైన శుభకారణ సన్మునిసేవ్య భా... 87

ఉ. లోకములోన దుర్జనులలోఁతు నెఱుంగక చేరరాదు సు
శ్లోకుఁడు చేరినంగవయఁజూతురు చేయుదురెక్కసక్కెముల్
కోకిలఁగన్నచోట గుమిగూడి యసహ్యపుఁ గూతలార్చుచుం
గాకులు తన్నవే తఱిమి కాయము తల్లడమంద భా... 88

ఉ. లోను దృఢంబుగాని పెనులోభిని నమ్మి యసాధ్యకార్యముల్
కానక పూనునే నతఁడు గ్రక్కునఁ గూలును నోటిపుట్టిపై
మానవుఁ డెక్కిపోవ నొకమాటు బుటుక్కన ముంపకుండనే
తానొకలోఁతునం గెడసి దానిఁ దరింపఁగలేక భా... 89

ఉ. వంచన యింతలేక యెటువంటిమహాత్ముల నాశ్రయించినం
గొంచెమె కాని మేలు సమకూడదదృష్టము లేనివారికిన్
సంచితబుద్ధిబ్రహ్మ ననిశంబును వీపునఁ మోచునట్టిరా
యంచకుదుంపతూండ్లు దిననాయెఁగదా ఫలమేమి భా... 90

ఉ. వట్టుచుఁదండ్రి యత్యధమవర్తనుఁడైనను గాని వానికిం
బుట్టిన పుత్త్రకుండు తనపుణ్యవశంబున దొడ్డధన్యుఁడౌ
నెట్టన మఱ్ఱివిత్తు మును పెంతియుగొంచెము దానబుట్టునా
చెట్టుమహోన్నతత్వమును జెందదె శాఖల నిండి భా... 91

చ. వలనుగఁ గానలందుఁ బ్రతివర్షమునం బులినాలుగైదు పి
ల్లలఁగను దూడనొక్కటి నిలంగను ధేనువు రెండుమూఁడునేఁ
డుల కటులైన బెబ్బులి కుటుంబము లల్పము లాయె నాలమం
దలుగడు వృద్ధిఁ జెందవె యధర్మము ధర్మము దెల్ప భా... 92

చ. వలవదు క్రూరసంగతి యవశ్య మొకప్పుడు సేయఁబడ్డచోఁ
గొలఁదియె కాక యెక్కువలు గూడవు తమ్ములపాకు లోపలం
గలసిననున్న మించుకయె కాక మఱించుక యెక్కువైనచో
నలుగడఁ జుఱ్ఱుచుఱ్ఱుమని నాలుక పొక్కకయున్నె భా... 93

ఉ. వాసికి విద్యచేత సిరివచ్చె నటంచును విద్య నేరఁగాఁ
బూనినఁ బూనుఁగాక తనపుణ్యము చాలక భాగ్యరేఖకుం
బూనఁగ నెవ్వఁడోపు సరిపోచెవి పెంచును గాక దృష్టత్రా
హీనుఁడు కర్ణభూషణము లెట్లు గణింపఁగ నోపు భా... 94

ఉ. సంతతపుణ్యశాలి నొకజాడను సంపద వాసిపోయి తా
నంతటఁ బోక నెట్టుకొని యెప్పటియట్ల వసించియుండు మా
సాంతమునందుఁ జందురుని నన్నికళల్ పెడఁబాసి పోయినం
గాంతి వహింపఁడొక్కొ తిరుగంబడి దేహమునిండ భా... 95

చ. సకల జనప్రియత్వము నిజంబుగఁ గల్గినపుణ్యశాలి కొ
క్కొక యెడ నాపదైనఁ దడవుండదు వేగమె పాసిపోవుఁగా
యకలుషమూర్తియైన యమృతాంశుఁడు రాహువుచేతన్ను గ్రమింగినం
డకటక మానియుండఁడె దృఢస్థితి నెప్పటియట్ల భా... 96

ఉ. సన్నుతకార్యదక్షుఁ డొకచాయ నిజప్రభ యప్రకాశమై
యున్నపుడైన లోకులకు నొండొకమేలొనరించు సత్త్వసం
పన్నుఁడు భీముఁ డాద్విజుల ప్రాణము కావఁడె యేకచక్రమం
దెన్నికగా బకాసురుని నేపున రూపడఁగించి భా... 97

చ. సరసగుణ ప్రపూర్ణునకు సన్నపుదుర్గుణ మొక్కవేళయం
దొరసిన నిట్లు నీకుఁ దగునోయని చెప్పిన మాననేర్చుఁగా
బురద యొకించుకంత తముఁ బొందినవేళలఁ జల్లవిత్తుపై
నొరసిన నిర్మలత్వమున నుండవె నీరము లెల్ల భా... 98

చ. సరసదయాగుణంబుగల జాణమహిం గడు నొచ్చియుండియుం
దఱుచుగ వాని కాసపడి డాయఁగవత్తురు లోకు లెట్లనం
జెఱకురసంబు గానుఁగను జిప్పిలిపోయినమీఁదఁ బిప్పియై
ధరఁబడియున్నఁ జేరవె ముదంబునఁ జీమలు పెక్కు భా... 99

ఉ. సారవివేకవర్తనల సన్నుతి కెక్కిన వారిలోపలం
జేరినయంత మూఢులకుఁ జేపడ దానడ యెట్టులన్నఁగా
సారములోన హంసములసంగతినుండెడి కొంగపిట్టకే
తీరునఁ గల్గనేర్చును దదీయగతుల్ దలపోయ భా... 100

ఉ. స్థానము తప్పివచ్చునెడఁ దానెటువంటి బలాఢ్యుఁడున్ నిజ
స్థాపకుఁ డైన యల్పునికతంబున నైనను మోసపోవుఁగా
కానలలోపల న్వెడలి గంధగజం బొకనాఁడు నీటిలోఁ
గానకచొచ్చినన్ మొసలి కాటుకు లోఁబడకున్నె భా... 101

చ. సిరిగలవాని కెయ్యెడలఁ జేసిన మేలది నిష్ఫలంబగున్
నెఱిగుఱి గాదు పేదలకు నేర్పునఁ జేసిన సత్ఫలం బగున్
వఱపునవచ్చి మేఘుఁ డొకవర్షము వాడిన చేలమీఁదటం
గురిసినఁగాక యంబుధులఁ గుర్వఁగ నేమిఫలంబు భా... 102

చ. సిరివలెనేని సింహగుహచెంతఁ వసించినఁజాలు సింహముల్
కరులవధింపఁగా నచటఁ గల్గును దంతచయంబు ముత్యముల్
హరువుగ నక్కబొక్కకడ నాశ్రయమందిన నేమి గల్గెడుం
గొరిసెలుదూడతోఁకలును గొమ్ములు నెమ్ములుఁగాక భా... 103

చ. స్థిరతరధర్మవర్తినఁ బ్రసిద్ధికి నెక్కినవాని నొక్క ము
ష్కరుఁ డతినీచవాక్యములఁ గాదనిపల్కిన సన్మహాత్ముఁడుం
గొఱఁతవహింపఁడయ్యెడ నకుంఠితపూర్ణసుధాపయోధిలో
నరుగుచుఁ గాకిరెట్ట యిడినందున నేమికొఱంత భా... 104

చ. సిరిగలనాఁడు లభ్యమగు చిత్తమునందుఁ దలంచినంతనే
నరులకు నెట్టికార్యమయినన్ జతకాదు బహుప్రయత్నముల్
జరిపిననైన లేమియెడ సత్యము సుమ్మిది 'చేతి కందుపం
డరయఁగ నోటికందదుగదా' యనుసామ్యముపోల్కి భా... 105

చ. స్ఫురతర కీర్తిమంతు లగుపుత్రులఁ గాంచినఁగాక మూఢ ము
ష్కరులఁ గనంగఁ దేజములు గల్గవుగా మణికీలితాంగుళా
భరణము లంగుళంబుల శుభస్థితిఁ బెట్టినఁ గాక గాజుటుం
గరములు పెట్టినందున వికాసము గల్గునటయ్య భా... 106

ఉ. నేనగ వాంఛితాన్నము భుజింపఁ గలప్పుడు గాక లేనిచో
మేనులు డస్సియుంట నిజమేకద దేహుల కగ్నిహోత్రుఁడా
నే నిజభోజ్యముల్ గుడుచునేనియుఁ బుష్టివహించు లేని నాఁ
డూని విభూతిలో నడఁగియుండఁడె తేజము దప్పి భా... 107

ఉ. హాళినిఁ బుట్టుబుద్ధి తిరమైన విధంబునఁ బెట్టుబుద్ధు లా
వేళల కంతె కాని మఱి వెన్కకు నిల్వవు హేమకాంతి యె
న్నాళులకుండుఁగాని యొకనాఁడు పదంపడి సానఁబట్టినన్
దాళుకయుండునే యినుపతాటకుఁ జాయలు పోక భా... 108

ఉ. హీనకులంబునందు జనియించినవారికి సద్గుణంబు లె
న్నేనియుఁ గల్గియున్న నొకనేరము చెందకపోదు పద్మముల్
భానుతిఁ గాంచియుం బురదఁ బుట్టుటవల్ల సుధాకరోదయం
బైన నసహ్యమొందవె ప్రియంబునఁ జూడఁగ లేక భా... 109

ఉ ఇంచుక నేర్పు చాలక విహీనతఁ జెందిననాకవిత్వమున్
మించు వహించె నీకతన మిక్కిలి యెట్లనఁ దోలుబొమ్మలన్
మంచి వివేకి వాని తెరమాటున నుండి ప్రశస్తరీతి నా
డించిననాడవే జనులడెందము నింపవె ప్రీతి భాస్కరా. 110

భాస్కరశతకము సంపూర్ణము.



ఓమ్



# రేపాల రాజలింగశతకము



గిరీశ్వర నీదుసేవ ముక్తికిఁ ద్రోవ
నీనామ మధువార్ధి నిల్పునావ
సిరులిచ్చు చెలిపొందుఁ జేసెఁగా నీ బావ
త్రిపురవాసుల, దు్రించు తెలివి శేవ
మునిపుత్రు మొఱ విని చనితివా దయఁ గావ, మామనుడలగొట్టు మాటెలావ
చలిమలసుత నేలఁగలవాఁడవే నీవ, వేల్పులు జాలికే విషము ద్రావ
గీ. సకలసురలందు బ్రాహ్మణజాతివీవ, చావుపుట్టుక లేనట్టిసామి గావ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజితశుభాంగ రేపాలరాజలింగ. 1

సీ. నీవు బట్టిన విల్లు నేసైన బల్ గట్టు, పసమీఱు మీనారి బుసలగొట్టు
నీజటాజూటంబు నిల్వ గంగకుఁబట్టు, నఱమేను పార్వతికైన దెట్టు
నీ రథచక్రముల్ నిలువకరుగు రట్టు, నీముఖంబున కగ్ని నీటిబొట్టు
నీగళచ్ఛాయకు నీకును చలినట్టు, విను నీనివాసంబు వెండిచట్టు
గీ. మట్టుమీఱిన నీచర్య లెట్టు కట్టు, పఱచి వ్రాకుప్పఁగను బల్లపడుటదెట్టు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 2

సీ. చలిమలసుత నీకు వలసినపెఱ రాణి, ముసలియెద్దే మీకు మిసిమి ఘోణి
ఆకాశమే మీకు హాశ్చర్యమగు వేణి, చాలదు మీకథల్ జదువ వాణి
అంబరంబయ్యె మీ కఖిలదిశాశ్రేణి, పరమేశ మీకయ్యె శరధితూణి
భక్తసంరక్షణాస్పదమగు మీపాణి, తలఁప మీపిన్నాలు బలుపతాణి
గీ. లీల గణియింప వేదములేని రాణి, మీ కరంబున నున్నదే మేలిమైణి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 3

సీ. నాసలికన్గాకకు బుసబుసమను నిల్లు, కన్వేడినార్పుపై గంగబల్లు
సగము జేసెఁగదయ్య సత్తి సిఱిబల్ పెల్లు, తలకెక్కె మరుగాలు తగనిగొల్లు
వంచితే వంగక వెంచినఁ దెగువిల్లు, గఁడిగా వలపటి బండికల్లు
పెద్దకొమరునకెట్లు పెండ్లిగాని దిగుల్లు, దండిపాములపొత్తు గుండెఝల్లు
గీ. ఇట్టి గృహభార మహహ మీకెట్టు జెల్లు, చున్నదో కద జేసు మాయున్నయిల్లు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 4

సీ. కల్పవృక్షము గొప్పకలముగాఁదగ నోయి, యంబుధిజలములేనయ్య* శాయి
భూమిఖండములె సంపుటముగాఁ బడె హాయి, వనజసంభవు రాణి వ్రాయుతాయి
మీచరిత్రంబులు మించినవామ్నాయి, సంపూర్తి లిఖియింపఁ జాలదోయి
ఇతరులు లేఖనకెత్తుదురే చేయి, శక్త్యసుగుణనుతుల్ జేయమాయి
గీ. ఇవియు ఘనముగ శుభముల నిమ్మభాయి, బ్రోవవలె గాక దయఁబేర్మిభావయాయి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 5

సీ. బసవపురాణంబు బండితచారిత్ర, యనుభవ సారంబు నఖిలశ్రుతుల
సహితచతుర్వేదసారంబు సోమేశ, భాష్యసద్గ్రంథముల్ సవ్యరీతి
రచనాధికారిమై రయమొప్ప పరవాద, భీకరుండనఁగను బృథివిలోన
రుద్రుఁడయ్యు బ్రితాపరుద్రసభ విష్ణు, వాదుల నోడించి వారికెల్ల
గీ. శైవదీక్ష లొసంగిన శంకరుండు, పాల్కురికి సోమునకు నేను బ్రణుతిఁ జేతు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 6

సీ. బసవా ద్యసంఖ్యా శ్యభక్తులఁ గొనియాడి, విఘ్నేశ్వరునిఁ జాల వినతిఁ జేసి
వరదధిచ్యాదులఁ గరమొగి గణుతించి, నూతనశివభక్తనుతి యొనర్చి
నీ మీఁద భక్తిని నేనేర్చినట్టులఁ జెప్పఁబూనితినయ్య సీసపద్య
ములు గాన నిర్విఘ్నముఁగ జేయఁగా మీరె, కర్తలు తప్పులు గలిగియున్నఁ
గీ. బరసవేది యయస్స్థితిఘర్మమైన, పగిది మత్కావ్య మిల శ్రేష్ఠమగునుగాక
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 7

సీ. శంకర పరమేశ శాశ్వత సర్వేశ, కాలకాలాంతక గరళకంఠ
చంద్రశేఖర భీమశాంకరీ హృదయయేశ, ర్వ మహాదేవ శరనిభాంగ
ఫాలనేత్ర గిరీశ పంచాక్షరీరూప, భవహర పురహర భక్తవరద
గంగాధర సురేశ కంజాక్షసన్నుత భుజగభూషణ దీనపోష సోమ
గీ. యనుచుఁ బఠియించువారికి ఘనతమీఱ మోక్షసత్రంబు లేసినదీక్షనీదె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ రాజిత

సీ. వేల్పులందరిలోన విప్రుండవీవని సకలవేదంబులు జాటుచుండు
కమలాక్షుసుతు వీదుకంటను సమయింప బ్రతికింపగలిగెనే బాలునతఁడు
కమలాసనునితల ఖండించితివిగదా మొలపించుకొను శక్తి గలదె తనకు
గరళము భక్షించుతరి పంచియిమ్మని సరివేల్పు లీకొనఁజాలి రెవరు
గీ. పశుపతివి నీవు సురలంతపశువులగుట కివియె సాక్ష్యంబులగునయ్య భువనములకు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ. రాజిత... 98

* శాయి = సిరా.

సీ. సర్వేశ త్రిపురముల్ సాధించువనికైన, సాధనంబులు వ్యర్ధసాధనములు
ఫాలానలకరాళకీలలచే రిపుల్ మగ్గికూలిరి ధరబొగ్గులగుచు
రథము గుఱ్ఱంబులు రథసారథియు ముల్కినుండిమైనది కార్య మొండులేదు.
అధికారము లొసంగు కథఁజూడ వారల మన్నించువిధముగా నెన్నఁదగును
గీ. దేవదేవ మహాదేవ దివిజరాజ నామకుఁడ వీవె యితరుల నేమిచెప్ప
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ రాజిత... 10

సీ. విధికపాలంబును వింతగా బేసులై చాల మీయురమున వ్రేలుచుంట
మీనకూర్మవరాహమాన వహరివామనం బన నైదు జన్మంబులందు
శౌరిని శిక్షించి శరణన్న రక్షించి కొమ్ముమ్మకర్పరయును గోమరుదాంష్ట్రి
మును చర్మకోలెమ్ముమ్మదృష్టమాగుర్తులు గాఁగ మూరుధరింపఁ గలిగియుంట
గీ. జావుపుట్టుకలేనట్టి స్వామివగుట కివియె సాక్ష్యంబులై లేవె భువనములకు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ రాజిత... 11

సీ. గ్రామాధికారిని గని యాశ్రయించిన దేశవివాదలు దీర్పఁగలడె
దేశాధికారిని దినమాశ్రయించిన లోకవాదముదీర్చి సాకఁగలడె
లోకాధికారిని నీకు మ్రొక్కెదనన్న, సర్వేశుపగిదీయఁజాలఁగలఁడె
తమతమయధికార తారతమ్యంబుల, గొలఁదిగా ఫలమీయఁగలరుగాక
గీ. పశుపతిత్వముగల మీకుబలెను పశువు, లైనసుర లోపఁగలరె నెద్దానికైన
భావభవభంగ గౌరి హృత్పద్మభృంగ, రాజిత... 12

సీ. బాదరాయణి తాను వారణాసీస్థుల, శపియింపఁదలఁచిన చంద్రమౌళి
కోపించి పొమ్మన్నఁ గ్రోధియై ప్రతికాశి, కట్టినఁ జెసియె నా కాలమందె
పద్మపురాణంబు బల్కెనాఁ డొకకొంత, వ్యాసకాశీఫల వ్యాప్తినొందె
నని స్కాందమునఁ గన్నదదియుఁ గాదనిరేని, వైష్ణవులైనను వ్యాసకాశి
గీ. లోనఁ జావంగఁగోరరు మానుషంబె, హరియట వ్యాసుఁడనగను హర్ష పడరొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ రాజిత... 13

సీ. హరవృషమధ్యంబునందుండి వ్యాసులు, భుజముల్తెత్తి ప్రమాణపూర్వకముగ
నారాయణునకన్న వేఱెదైవములేఁడు, ముమ్మాటికెనియను మూర్ఖమతిని
నెత్తిన బాహువు లెత్తినట్లుగ వాక్కు, స్తంభనంబైనదో ధైర్యమెడలి
ప్రార్థింప హరివచ్చి పరమేశ్వరుఁడు తన, కర్తగాఁ జెప్పినకారణమున
గీ. విశ్వనాథునిగొనియాడి విగతభయుఁడు, డయ్యె ననిజెప్పెస్కాందంబునమితముగను
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 41

సీ. దారుకావనఋషుల్ దైవంబు లేఁడని, గర్వించినను వారిగర్వమణఁప
హరిభార్యగా మీరు నాముకిపల్లెకు, వచ్చి నిర్వస్త్రులై వారిమునము

లుభయులు దొంగిల నోర్వక ఘర్షించి, వ్యర్థప్రయత్నులై వారు బ్రహ్మ
కడకేగిచెప్పినఁ జెడితిరి వారలు, హరిహరులనవిని యంతవచ్చి

గీ. శౌరిపీఠంబు లింగంబు మీరుగాఁగఁ, దలఁచి లింగార్చనలుజేసి ధన్యులైరి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 15

సీ. పద్మనాభుండును బద్మజుండునుగూడ, ఘర్షించుకొన వారికలఁతదీర్ప
దేజోమయంబైన దివ్యరూపంబునఁ దోఁచితి రదిచూచి తోయజాక్షుఁ
డరిగె పదముగన శిరముజూడఁగ బ్రహ్మ, నడచెను గనలేక వెడలివచ్చి
నిజకరియై విష్ణు నిన్ను మెప్పించెను, నిజములాడక విధినిందితుండు

గీ. నయ్యె భువిఁ బూజలేకుండ నయ్యె మొగలి, రేకు మీపూజ కర్హంబుగాకపోయె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 16

సీ. గతజన్మమున మిమ్ము మతిఁదలంపమి తప్పు, తప్పని యీజన్మ తనకుఁజెప్పు
నిప్పుడు మిముఁ గొల్వ నెఱిఁగితి నిదిముప్పు, ముందుజన్మంబున మొదలెఱుఁగుప్పు
పుట్టుటలేకున్నఁ బూజలే దదితప్పు, తప్పులుమూఁడు నాతలన నొప్పు
తప్పులొప్పులుగాఁగ దయసేయుటే మెప్పు, భక్తసంరక్షణాస్పదుఁడ వెప్పు

గీ. డఖిలలోకేశ సర్వేశ యఘవినాశ, నీటనెత్తుము పాల నేనేటనొత్తు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 17

సీ. లూతయేవేదంబు లూతగాఁజదివెను, శాస్త్రముల్ భుజగ మేచాయఁజూచె
గజరాజు యేవిద్య గష్టతనేర్చెను, ఎఱుక తా నేమంత్ర మెంతజేసె
కాటకోటం డెట్టికవితఁ జెప్పఁగజాలె, గొడగూచి యేనీతిఁ బొడమి పెరిగె
నిమ్మవ్వ యేపాటిసామ్ము నీకిడెనయ్య, సాంఖ్యతొండఁడు యోగసరణిఁ గనెనె

గీ. కావు ముఖ్యంబులివి భక్తకారణముగఁ, దలఁప మీకృప మోక్షంబు గలిగెగాని
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 18

సీ. ఘనమృకండజుపైనిఁ గల్గినప్రేమయు, గన్నప్పయందలి గౌరవంబు
బసవేశ్వరునియందుఁ బ్రకటమౌ మీదయ, చెన్నబస్వనిమీఁదఁ బన్నుకరుణ
పాల్కురిసోమేశుపైఁ బడ్డదృష్టియుఁ, జేరమరాయుపైఁ జెలఁగుకృపయు
మలహణకవిపయి మన్ననగరికాల, చోళరాయనిపైని దాళుజాలి

గీ. గూడనామీఁదనుంచు మేజాడనైన, నేఁడు మీపాదములు విడనాడఁజాల
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 19

సీ. శక్కియందును రెండుచక్కనిబొల్లివి, శూలచక్రము లొక్కజాలుగలవి
గొల్లవ్రేతల మానికుఁజరసతులను, జెఱిపినా రిద్దఱు శిశువాకచే
ఆలిపై యాండ్లను నాజ్ఞించుమునికిని, నుభయులచిత్తంబు లొక్కరీతె
సుతలరక్షింపను సరభోజనులఁ జంపఁ, బూనినా రిరువురి పూన్కిసరియె

గీ. చావుపుట్టుక గలిగిన సామి శౌరి, చావుపుట్టుక లేనట్టి సామి వీవు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 20

సీ. పంచాక్షరీమంత్రపఠనంబు పఠనంబు, పరమేశునందలి భక్తి భక్తి
శివుని బూజించెడి చేతులు చేతులు, కరకంఠునకు మ్రొక్కు శిరము శిరము
శ్రీగిరీశ్వరుజేర్చు చిత్తంబు చిత్తంబు, శ్రీగిరిజాధీశు సేవ సేవ
భవుభక్తవరులది భజనంబు భజనంబు, వాసుదేవునుతించు వాక్కు వాక్కు
గీ. అనుచుఁదెలియకకొందఱు వధములితర, మార్గములు బోయిపుట్టుచు మడియుచుంద్రు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 21

సీ. ఇక్షుఖండంబున కెన్నివంకరలున్న, దానిమాధుర్యంబు దరుగనట్లు
గంగోదకంబులు గలుషంబులై యున్న, జలమహత్త్వం బేమితలఁగనట్లు
గోవుపొదుగున నెన్నిగోమారులుండిన, క్షీరంబులకు రుచి చెడనియట్లు
బాలుని వవ్యక్తభాషలై యుండిన, జనని జనకుముద్దు స్రగ్గనట్లు
గీ. మత్కవిత్వంబునను తగ్గుమాటలున్న, భక్తిరసమధురంబు లోపంబుగాదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 22

సీ. దీర్ఘాయువులు లేవు స్థిరమతులా లేవు, లేవు శాస్త్రజ్ఞానభావగతులు
దుశ్చరిత్రలుపోవు దొంగనీతులు పోవు, పోదు కామక్రోధపుంజ మెపుడు
యాగంబులా లేవు త్యాగంబులా లేవు, లేదు సత్సంగతి లేశమైన
పాపంబులాలావు వాపోకలాలావు, లావుకు జనసేవ లక్షవిధుల
గీ. కలియుగంబిదియారీతిఘటనపడియె, యోమహాదేవయన బ్రోవవా మహేశ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 23

సీ. అఱువదివేలేండ్లు నాయువు తండ్రికి, బదియునొక్కటివేలు బ్రతికెఁ బట్టి
ముగ్గురుభార్యలతోడఁ దగసుఖించెను దండ్రి, కొడుకు పత్నికుఁడై కుతలమేలె
తండ్రిస్వర్గముకేగి దనుజులమర్దించె, భూమిలో దశముఖు బొడిచె గొడుకు
ఆదియుగములయందె యాయాంతరముల, తారతమ్యత యెంతో తక్కువయ్యె
గీ. నాయురర్థబలంబులు నంతకంత, కవనిఁ దగ్గుట కాశ్చర్య మరయ లేదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 24

సీ. వాలినిఁ జాటుగాఁ గూలనేసినదాన, నెఱుకబ్రేటున శౌరి యొగురవలసె
బలిసంటఁగట్టిన పాపంబునకు రాముఁ, డరిపాశబద్ధుఁడై యడలవలసె
కురురాజకొడుకులఁ గూల్చినయఘమున హరికులక్షయుఁడౌట జరుగవలసె
మునిపత్నిహత్యకై మురవైరి జగతిలోఁ బుట్టుచు బెరుగుచు గిట్టవలసె
గీ. నంతవారికిఁ గృతకర్మ మనుభవంబు గలిగె నింకెవ్వడికిఁ దప్పగలదు కర్మ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ రాజిత 25

సీ. శ్రీకృష్ణుభార్య లంచితగుణ లెనమండ్రు భర్తపోయినమీఁద బ్రతికిరకట
గోవిందుపిమ్మట గోపికలందఱు బోయలకవఁగూడఁ బోయిరకట
శ్రీహరిచేఁ గర్మచేయఁ బ్రాప్తములేక, వసుదేవుఁ డీల్గఁగావలసె నకట?
పాండవుల్ శౌరికి బంధులు భక్తులై, కడ యమదుఃఖముల్ గాంచి రకట?
గీ. అంతవారికిఁ గృతకర్మ మనుభవంబు, గలిగె నింకెవ్వరికిఁ దప్పఁగలదు కర్మ
సీ. అవిముక్తమందుండు సర్వజ్ఞుఁడుగాఁడని, శర్వుచే వ్యాసులు శప్తుఁడయ్యె
బృందనుజెఱిచినవృత్తికి రాములా, సీతావియోగముఁ జెందవలసె
ననుజను మోహించునఘమున బుద్ధుండు కాళ్ళుఁజేతులు మొండిగాఁగవలసె
గౌతముభార్యను గామించి సురరాజు తనువెల్ల యోనులై మనఁగవలసె
గీ. నంతవారికిఁ గృతకర్మ మనుభవంబు గలిగె నింకెవ్వరికి తప్పఁగలదు కర్మ భా.
సీ. బ్రాహ్మణ్యమునకు దగు భస్మధారణయను భస్మోపనిషదర్థ ఫణితిఁ గనరొ
వ్యాసవాల్మీకులు వారిగ్రంథంబులు భసితమాహాత్మ్యంబుఁ బలుకు తెలుఁగ
రో యాగమంబులు వాయూడ భస్మము, గొనియాడుచుండుట మనసురాదొ
వేదముల్ స్మృతులును వేవిధంబుల భస్మ, ధారణ ముఖ్యమన్దారి వినరొ
గీ. జగతి విప్రులుగొందఱు నిగమమెఱిఁగి, భస్మధరియింపరెట్టిదౌర్భాగ్యగుణమొ భా.
సీ. ముఖబాహుజులకును సుఖము త్రిపుండ్రంబు, వైశ్యుల కగుజుమీ వర్తులంబు
నర్ధచంద్రునిరీతి హర్షంబు నాలవ, జాతి యితరులకెల్ల భాతియూర్ధ్వ
పుండ్రి మంచని భస్మబూయువిధంబులు, బహుగ్రంథములయందుఁ బలుకఁబడియె
నన్యజాతులకైన నాయూర్ధ్వపుండ్రంబు, భస్మచే ననిగదా పథముగలిగె
గీ. జగతివిప్రులు గొందఱు నిగమమెఱిఁగి, భస్మధరియింప రెట్టిదౌర్భాగ్యగుణమొ భా.
సీ. ఉపనీతుఁడగువేళ విపరీతమేదయా, భువి నాందిముఖ విప్రభోజనంబు
భస్మధారణ గోవి పంచశిఖల్ మౌంజి, దండంబు భిక్షయుఁ దనర భర్గ
మంత్రోపదేశంబు మఱి యగ్నిముఖమున, గద చేయునవి దీనికర్మముచూడ
రుద్రచిహ్నలఁజేసి రూఢిగా ద్విజుఁ డయ్యెఁ, గానిచో బ్రాహ్మడుగాఁ డతండు
గీ. జగతి విప్రులుగొందఱునిగమమెఱిఁగి, భస్మధరియింపరెట్టిదౌర్భాగ్యగుణమొ భా.
సీ. ఉపనయనాగ్నియందుండుభస్మముఁ దాల్ప, కుండిన సిద్ధిలేకుండు నగ్ని
వైశ్యదేవాగ్నిలోపల నుండుభస్మంబు, ధరియింపకుండినఁ జెడును కర్మ
ప్రేతకార్యములందుఁ బెట్టంగవలె భస్మ, బెట్టకుండినబ్రేత తిట్టఁగలఁడు
క్రతుకర్తయగువాఁడు క్రమముగా భస్మంబు, దాల్పఁడేనియు సేయఁడగఁడతండు
గీ. జగతి విప్రులు గొందఱు నిగమమెఱిఁగి, భస్మ ధరియింప రెట్టిదౌర్భాగ్యగుణమొ.
సీ. వాల్మీకి కుంభజ వాసిష్ఠ గౌతమ, వ్యాస పరాశర వామదేవ
పర్వత దూర్వాస భరత మార్కండేయ, కణ్వ దధీచ్యాది ఘనమునులును

విధి విష్ణు రవి చంద్ర బుధ బృహస్పతి శచీ, పతి ముఖులగునట్టి పరమసురలు
బలి బాణ రావణ బహులేంద్రి తారక, శూర పద్మాసుర సోమహారులు
గీ. భస్మ ధరియించిరనిగ్రంథబహుళమున్న,వినియుదెలియరుకొందఱీవెట్టియేమొ భా.
సీ. భస్మనిషేవణ భస్మధూళనములు, భస్మధారణమనఁ బరగుమూఁడు
విధులలో స్నానంబు వెనుకజన్మాఘముల్, మొదలంట జెఱుచుట ముఖ్యమగును
తనుగుణంబులదోషతతి నణంగింపఁగాఁ, జాలు నద్ధూళనసంజ్ఞక్రియయు
వేధదుర్లేఖలు వెడలింప మోక్షంబు, లొసఁగ ధారణమును బొసఁగుశక్తి
గీ. భస్మమునకుగూర్చిదగుగ్రంథబహుళమున్న, వినియుఁదెలియరుకొందఱీవెట్టియేమొ.
సీ. భూతభేతాళముల్ పారిబుచ్చఁగలశక్తి, బ్రహ్మరాక్షసులను బట్టుఢాక
కామినీగ్రహములఁ గనిరన్నఁ గలదీవి మోహినీ గ్రహముల ముంచునూహ
వీరవైష్ణవు లెట్లు జేరరానిమహత్తు, జైనబౌద్ధులదుమ్రింపఁ జాలుగుణము
శాకినుల్ ఢాకినుల్ జడిసెడి రాద్రింబు, శివభక్తులకు సిరుల్ సేయుగరిమ
గీ. భస్మముకెకాక యొంటి కీపగిదిగలదె, వినియు దెలియరు కొందఱీవెట్టియేమొ భా.
సీ. తపసియై వనమునకుఁ దర్లిపొయ్యేవేళ, దాశరథియు భస్మధారియయ్యె
మోక్షార్థియై శైవదీక్షఁగొన్నప్పుడు, దాశరథియు భస్మధారియయ్యె
రామలింగము నిల్పఁ గామించినప్పుడు, దాశరథియు భస్మధారియయ్యె
అశ్వమేధముఁ జేయు నవసరంబందున, దాశరథియు భస్మధారియయ్యె
గీ. వ్యాసవాల్మీకకావ్యముల్ వసుధలేవె,చూచియు దెలియఁజాలరీచోద్యమేమొ భా.
సీ. భస్మంబు ధరియింపఁ బాపముల్ విడిపోవు, భస్మంబు సిరులీను పరసవేది
భస్మంబు రోగార్తి భంజనకరమగు, భస్మంబు వైరులపట్టుఁ జెఱచు
భస్మంబు త్రైలోక్యపదమబ్బఁగాఁజేయు, భస్మంబు సుగుణముల్ బొదుగొల్పు
భస్మంబు సుజ్ఞానపదముఁ జూపఁగఁజాలు, భస్మంబు మోక్షసుఖఫల మొసంగు
గీ. ననుచు మొఱలిడు వేదంబులధికముగను,వినియుఁదెలియకకొందఱీ వెట్టియేమొ భా.
సీ. జలమిశ్రితసుభస్మ మిలను బూయఁగఁవలె, గాలత్రయంబున ఘనగృహస్థు
తక్కిన యాశ్రమతతిసతుల్ బొడిభస్మ, ధరియింపవలె శ్రుతిధర్మ మిదియు
శాస్త్రోక్తమగు విరజాభస్మముఖ్యంబు, హర్షమావైశ్యదేవాజ్యజంబు
గాకున్న శ్రోత్రియాగార యోగాగ్నిజొ, భూతియు ధరియింప నీతియనుచు
గీ. శ్రుతులుస్మృతులునుజెప్పుటఁజూచియెఱిఁగి, భస్మధరియింపఁ నొల్లరీపాపమేమొ
సీ. భస్మధారణవిధి పరిమితిఁజెప్పెనఁ, బంచశిఖల్ వక్త్రిబాహుమూల
ములను భ్రూమధ్యంబునఁ దగునాసికా, మూలంబు ద్విశ్రోత్రమూలములను
యురమున స్తనముల నుదరమందున నాభి, జాను పృష్ఠంబున జంఘలందు
రక్షకోబరికూబరక్షోణిగళముల, భుజయుగ్మమునఁ గరమూలములను

గీ. బాహువులమధ్య నూరువు పాదములను, ముప్పదాఱగుస్థానముల్ ముఖ్యమగును భా.

సీ. నియతి రుద్రాక్షోపనిషదర్థములు విని, రుద్రస్వరూపిగా రూఢిగలిగి
యామ్నాయములయందు నాగమంబులయందు, రుద్రాక్షధారణ భద్రమనుచు
సకలవిధులఁజెప్పె శార్వాణి మొదలైన, శక్తిసంఘము మానిసముదయంబు
దేవదానవకోటి భావశుద్ధినిదాల్చెఁ నాదుగా రుద్రాక్ష పేరు లభవ

గీ. యెలమిరుద్రాక్షధారణగలుగునరుని, భక్తిగనుమ్రొక్కినను మోక్షపదవిగల్గు, భా

సీ. పదునాల్గుముఖములు పదునాల్గుభేదముల్, పదినల్వు రధిపతుల్ పదియనాల్గు
వినియోగపద్ధతుల్ తనువున ధరియించు, విధులు నెఱింగింతు విరళముగను
ముదమొప్పఁగా నేకముఖముఖ్యమై యుండు సదరుగా దొరుకును నచటనచట
నూర్ధ్వమధోముఖయుక్తిని గనవలె నూర్ధ్వముఖంబైన నొప్పియుండు

గీ. ధన్యమైయుండు రుద్రాక్షధారణంబు నిగమమంత్రోక్తిబూజింపఁ దగినదగును భా.

సీ. సకలపాపంబులు సమయింపఁగాఁజాలు ధరణిలో రుద్రాక్షధారణంబు
సతతంబు కాశివాసముజేయు ఫలమిచ్చు ధరణిలో రుద్రాక్షధారణంబు
నిరతంబు శ్రీశైల నిలయపుణ్యముకొద్ది ధరణిలో రుద్రాక్షధారణంబు
పరగ శివజ్ఞానపరుని గావించును ధరణిలో రుద్రాక్షధారణంబు

గీ. రుద్రరూపంబుగామదిరూఢిగల్గి తనువునందున రుద్రాక్షదాల్పవలయు భా.

సీ. శంకర మీయక్షిజాతంబులగుటను రుద్రాక్షనామంబు రూఢియయ్యె
సంసారదుఃఖముల్ సంహరింపగను రుద్రాక్షనామంబు రూఢియయ్యె
దుష్టులదుఃఖించి తొలగునట్లుగఁ జేయ రుద్రాక్షనామంబు రూఢియయ్యె
భవులకు మోక్షసంప్రాప్తిఁ గూర్చుటఁజేసి రుద్రాక్షనామంబు రూఢియయ్యె

గీ. జగతిరుద్రాక్షతో సరిజేయఁదగిన పూసలేలేవు కల వన్న దోసమయ్య భా.

సీ. శంకరదేవేశ జ్వలల పద్మాసన కాలాగ్నిరుద్రుండు కార్తికేయుఁ
డన వాసుకియు వినాయకభైరవుఁడు చోరి యీశాన భాస్కరుఁడెలమిస్కంద
హరుఁడును పదినల్వు రధిపతుల్ రుద్రాక్షలకు నేకముఖమొదల్ బ్రకటముగను
శ్రీగలరుద్రాక్షలాగమంబులయందుఁ గొనియాడఁదగియె నీకుతలమందు

గీ. శాస్త్రసమ్మతి రుద్రాక్షసరులు దాల్పవలయు మోక్షంబునేమదివలయువారు భా.

సీ. శిఖను నొక్కటియును శిరమున ముప్పది రెండు మూర్ధ్నిని మాలనిండుగాన
ముప్పదాఱును కర్ణముల నాఱు గంఠంబునందు ద్వాత్రింశతి సమరవక్ష
ముననైదుశతములు ఘనబాహువులకును, బదియాఱు బదియాఱు బదియురెండు
బదిరెండుగరముల బరగ నష్టోత్తర, శతమాను జపమాల హితవుమీఱ

గీ. రెండునూఱుల ముప్పదినుండు మెండు, వరకిరీటంబు నీరీతి వలయుఁ దాల్ప, భా.

సీ. శిఖనేకముఖియును శిరమున ద్వాదశ, ముఖియు నేకాదశముఖియు మూర్ధ్న

మునకు శ్రుతులపంచముఖి సప్తముఖి దశముఖి షష్ఠముఖి యష్టముఖియుఁ గంఠ
మునకు నరోదేశమునకుఁ జతుర్ముఖి, తగు బాహువులఁ ద్రయోదశముఖియును
ద్వాదశముఖి మణిబంధనంబుకుఁ జతు, ర్దశముఖి జపమాల తనువహించు
గీ. నన్ని ముఖముల రుద్రాక్షలగు కిరీట, మునకునని తెల్పుకొనరయ్యముదముమీఱభా
సీ. కాయశోషణజేసి కష్టమందుటకంటె, పంచాక్షరీమంత్రపఠన మేలు
కాశీగయాదులు గలయదిరుగుటకంటె, పంచాక్షరీమంత్రపఠన మేలు
పవనబంధనఁజేసి బాధలొందుటకంటె, పంచాక్షరీమంత్రపఠన మేలు
సాంఖ్యయోగాదులజాడఁ బోవుటకంటె, పంచాక్షరీమంత్రపఠన మేలు
గీ. పాపముహరించు ఘనమోక్షపదవినిచ్చు, పరమ పంచాక్షరీమంత్రపఠనమిచ్చుభా
సీ. ధర యజుర్వేదమన్ తారహారములోన, పంచాక్షరం బనుపతకమలరు
ప్రథమద్వితీయముల్ ప్రకృతియుఁ బిమ్మట, రెండును బురుషుఁడు నుండి కొదువ
సంయోగమగు శివశక్తియుక్తము మంత్ర, ములకెల్ల జననిగాఁ దలఁచవలయు
గురుమూర్తిదయపేర్మిఁ గొని న్యాసధ్యానాది, కములతో జపియింపఁగలదుముక్తి
గీ. గానసీమంత్రరాజంబుఁ గాంక్షసేయు, వారె మీఱరౌదురిఁక వేఱుగారు వారు, భా.
సీ. పంచాక్షరీమంత్ర పరసవేదియ నబ్బె, నినువేఁడుకొనసేల నీలకంఠ
ఘనతపంచాక్షరీ కల్పకం బబ్బింది, నినువేఁడుకొనసేల నీలకంఠ
చిత్రపంచాక్షరీ చింతామణియుగూడె, నినువేఁడుకొనసేల నీలకంఠ
భవ్యపంచాక్షరీ పారిజాతంబబ్బె, నినువేఁడుకొనసేల నీలకంఠ
గీ. నిన్ను నన్నుఁగ జేయఁగా నేర్చినట్టి, మంత్రరాజంబుదొరకిఁదిమాకిఁకేమి, భా.
సీ. మహితపంచాక్షరీమహిమయుఁ దెలుపంగ, వాణిపతికైన వశముగాదు
మహితపంచాక్షరీమహిమయుఁ దెలుపంగఁ, బాముకుఁజేడియుకైనఁ దెలియఁబడదు
మహితపంచాక్షరీమహిమయుఁ దెలుపంగఁ, జిలువఱేఁడైనను బలుకలేఁడు
మహితపంచాక్షరీమహిమయుఁ దెలుపంగ, జంభారికైనను శక్తిలేదు
గీ. గానపంచాక్షరీమంత్రఘనతఁ దెలుప, మంత్రరూపుండవగునీవు మాకుఁగలవు, భా
సీ. పంచాక్షరీమంత్రపఠనఁ జేసినయంత, బ్రహ్మహత్యాదులు బాయఁగలవు
పంచాక్షరీమంత్రపఠనఁ జేసినయంత, నుపపాతకము లవి యుండఁబోవు
పంచాక్షరీమంత్రపఠనఁ జేసినయంత, సంసారదుఃఖముల్ సడలఁగలవు
పంచాక్షరీమంత్రపఠనఁ జేసినయంత, మాతృగర్భావస్థ మఱుగిపోవు
గీ. దల్లిదాతయునేతయుదండ్రియగుచు, భుక్తిముక్తులుపమసేయుమూలమిదియ, భా.
సీ. కుంభసంభవువల్లఁ గొనియు పంచాక్షరి, దశరథరాముండు దాజపించె
దూర్వాసుదయసేర్చి తొల్లి పంచాక్షరి, శౌరియు రాముఁడు జపితలైరి
తండ్రి దయసేయ తపసియై పరశురా, ముఁడును బంచాక్షరినుడివెగాదె

వర దధీచ్యాదులు గరము పంచాక్షరీ, మంత్రంబు జపియించి మహిమఁగనిరి
గీ. మంత్ర సంతతికిది మూలమంత్రమయ్యె, నిహపరసుఖంబులిచ్చుటకేమి కొదువ, భా.
సీ. పంచాక్షరీయను బలువైననావచే, దరిలేనిదుఃఖాబ్ధి దాఁటవచ్చు
పంచాక్షరీ యను ప్రబలమౌసురియచే, ఘోయని భవలతల్ గోయవచ్చు
పంచాక్షరీ యనుభానుదీప్తులవల్ల, నిరయమ స్తకమును నఱకవచ్చు
పంచాక్షరీ యనుబహుళమౌనగ్నిచే, ఘనజవనాటవిఁ గాల్పవచ్చు
గీ. మోక్షలక్ష్మీప్రదాయకదీక్షితంబు, మహిని పంచాక్షరియె యన్యమంత్రమేల భా.
సీ. ప్రణవయుక్తంబుగాఁ బంచాక్షరీమంత్రి, పఠనంబు దగునయ్య బ్రాహ్మణులకు
నితరవర్ణంబుల కెల్లసుందరులకుఁ, బ్రణవహీనంబుగాఁ బఠన మేలు
అష్టాదశావర్తి నక్షరలక్షగా, జపియింప సిద్ధినిఁ జెందవలయు
ప్రతిపునశ్చరణకు బ్రాహ్మణభోజనా, ద్యఖిలవిధులు జేయ సుఖముగలుగు
గీ. మోక్ష మఱచేతిదైయుండు దీక్షలేక, చేసినను మేలె పాపముల్ జెడుట నిజముభా.
సీ. గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి, గురుఁడు పంచాక్షరిగరిమ నొసఁగు
గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి, పంచాక్షరీమంత్రిపఠనగల్గు
గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి, పంచాక్షరిని సిద్ధిఁబడయనగును
గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి, పంచాక్షరియె మోక్షపదముఁ జూపు
గీ. దుష్కృతుల కిది గల్గుట దుర్ఘటంబు, సుకృతమతులకుదొరకుట సులభమగునుభా.
సీ. పంచాక్షరీమంత్రిఫలమెకా కిరీటికిఁ, బాశుపతాస్త్రంబు బడయనగుట
పంచాక్షరీమంత్రిఫలమెకా చక్రికి, ద్రోణియస్త్రజ్వాలఁ దప్పనిడుట
పంచాక్షరీమంత్రిఫలమెకా రాముండు, దశముఖుఁ దెగటార్చుదశను గనుట
పంచాక్షరీమంత్రఫలమె మార్కండేయుఁ, డవనిదీర్ఘాయుష్య మమరనుంట
గీ. భారతము శివగీతలు భాగవతము, స్కాందమాదిగ గ్రంథముల్ సాక్షిగలవు భా.
సీ. శైవపంచాక్షరీజపముకు ముఖ్యంబు, విమలమంత్రోద్ధారవిధియు వినుఁడు
మొదల నకారంబు ముందు మకారంబు, పిదప శికారంబు గదపిపరత
వాకారము యకార వైఖరి లిఖియింప పంచాక్షరంబులై ప్రబలుచుండు
ప్రణవంబుతోఁగూడి భవ్యషడక్షరి యగునని షణ్ముఖుం డధికప్రేమ
గీ. మున్ను జెప్పెను గొందరుమూర్ఖులగుచు విప్రులుపదేశమంద రీవింతయేమొ భా.
సీ. బ్రాహ్మణజనములు భక్తితోఁ డను లింగ, మును మేనదాల్చుట ముఖ్యమనుచు
వేదాగమంబులు నాధారతను బల్కు, చున్నవి భక్తిచే విన్నజాలు
విష్ణ్వాదిసురలును వేత్తలౌమునులును మణిదారుమృచ్ఛిలామయములైన
లింగముల్ ధరియించి రంగుగాఁ బూజలు చేయుట వ్యాసులు చెప్పినారు
గీ. ధరను గొందఱు ధనులింగ ధారణంబు గాకపోవుట వారిదుష్కర్మగాక భా

సీ. ధరయిష్టలింగంబుఁదగు స్థూలమునకును సూక్ష్మమునకునౌను శుభముప్రాణ
లింగంబు మూఁడవయంగవ్రాకారణ మున భావలింగంబు ముదముమీఱ
ధరియింపవలెనని మొఱయును శ్రుతులన్ని తెలిసిదెలియనివారిఁదెలుపుటరిది
యాణువాదిమలత్రిహారణఁబు గావించి మాంసపిండంబును మంత్రపిండ
గీ. ముఁగనుజేసియు గురుమూర్తి నిగమసూక్తిశిష్యునకు లింగధారణఁ జేసి బ్రోచుభా
సీ. లింగధారినిఁగని లొంగిమ్రొక్కినజాలు పాపాటవులు గాలిభస్మమగును
లింగధారినిఁగని లొంగిమ్రొక్కినఁజాలు దుఃఖాంబుదములన్ని తూలిపోవు
లింగధారినిఁగని లొంగిమ్రొక్కినఁజాలు జన్మబీజము మొదల్ సమసిపోవు
లింగధారినిఁగని లొంగిమ్రొక్కినఁజాలు బుణ్యాపయోనిధుల్ పొంగుచుండు
గీ. ననినచో లింగధారణ ఘనసభక్తి యైనవారలు మీఱుగా నగుటయరుదె భా.
సీ. అంగమందున లింగ మమరియుండినవాఁడు శ్వపచాధముండైన శంకరుండె
అంగమందున లింగ మమరియుండినవాఁడు శాంతవిప్రుండైన శ్వపచసముఁడె
అంగమందున లింగ మమరుచున్నట్టివాఁ, డనువర్తనుండైన యమునిపరుఁడె
అంగమందున లింగ మమరియుండనివాఁడు, వరసోమయాజైనఁ బరమఖలుఁడె
గీ. ననెడియర్థంబు స్కాందంబునందు గలదు,వినరు చదువరుకొందఱీవింతయేమొభా.
సీ. తనువులు మూఁటను దగిన వస్త్రంబుల, మూఁడులింగముల ముడిచికట్టి
ఇష్టంబు బ్రాణమందింపుగా లగియుంచి, భారమందునఁ జేర్చి పరిణమించి
తనయందు లింగంబు దాను లింగమునందుఁ, జొచ్చి లోవెలుపల నిచ్చ మఱచి
లింగంబు తానయై లింగవర్తనుఁడైన, లింగైక్యసమరసలీనుఁ డగును
గీ. నట్టిపురుషుని సాంగత్య మతనిసేవ, గలుగు మోక్షపగలిగినఘనులకెల్ల, భా.
సీ. అద్వైతసిద్ధైననాతని ఘటవర్తనములు ద్వైతంబులై యమరుచుండు
గాని స్థూలాంగంబు గలయంతమట్టుకు, స్థూలలింగంబందుఁ దొలఁగకుండ
ధరియించి పూజింప ధర్మమైయుండును, స్థూలంబు లింగమై శుద్ధిఁ గనదు
కొదువరెంటను నీశుఁ గూర్చితిమనిచెప్పి, బాదలాదిదేవుని బుట్టలందు
గీ. దాచి పూజింపఁదగదు నద్వైతు లిట్లు,సేయదేవార్చనలు సిద్ధిఁ జెంద వెపుడు,భా
సీ. ద్వైతుఁడై యుండె నద్వైతుఁడై యుండెను, దనువర్తనలకును దలఁగనపుడు
తనదైవమెప్పుడు దన కవినాభావ, సంబంధిగా నుంచఁజాలవలయు
నట్లుసేయక సంచులందు బెట్టెలయందు, నుంచి పిల్లలపూజ కుంచి వచ్చి
నామనిజెప్పుట నగుబాటుగా కిది, శ్రేష్ఠవర్తనమని చెప్పఁదగదు
గీ. దేవుఁ డెవఁడైనసరె స్థూలదేహమందుఁ,జేర్చి విడనీకగొల్చుట శ్రేష్ఠమగును, భా
సీ. శివునిప్రసాదంబు శ్రేష్ఠంబుఁగాదని, భుజియింపఁ గొందఱు బుచ్చికొనరు
హరుఁడు ఘా నైవేద్య మర్హంబుగాదని, బలికినాఁ డనిగూడ దలఁతు రవని

జ్ఞానహీనంబిది సత్యవాక్యముగాదు, శివునినైవేద్యంబు శిరముమొదలు
పాదయుగ్మముదాఁక భక్తితోఁ బూసియు, భుజియించెఁగృష్ణుండుపూర్వమందు
గీ. ననుచుశ్రీభాగవతమున వినఁగఁజెప్పె, నింద్యమనువారలే బుద్ధిమాంద్యులకట, భా.
సీ. పిత్రార్పితాన్నంబుఁ బ్రియమొప్ప భోక్తలు, ప్రాణాహుతులుచేయఁబనికివచ్చు
ధరపితామహునకూడు ధన్యులౌభోక్తలు, ప్రాణాహుతులుజేయఁ బనికివచ్చు
ప్రపితామహాన్నంబు భవ్యులౌభోక్తలు, ప్రాణాహుతులుజేయఁ బనికివచ్చు
విష్ణ్వర్పితాన్నంబు వేత్తలౌభోక్తలు, ప్రాణాహుతులుజేయఁ బనికివచ్చు
గీ. గాని శర్వప్రసాదంబుగాదుగొనఁగ, ననెడిదుష్టులమాటలు వినఁగఁదగదు, భా...
సీ. శ్రాద్ధకాలంబున శ్రద్ధతోఁ బెట్టెడు, పిండత్రయంబుచేఁ బ్రేతలంత
సుగతిగందు రటన్నసూత్రంబు లున్నవి, మధ్యపిండము రుద్రమయముదయ్యె
నాపిండ మాకర్త కర్ధాంగి యగుసతి, సేవింపవలె నని చెప్పెశ్రుతియుఁ
దత్ప్రసాదము గొన్న తరుణియు సంతానవంతురాలగు నని వార్తగలదు
గీ. శివప్రసాదంబుగొనఁగ నిషిద్ధమెట్లు, భక్తిహీనుల వాదముల్ పాటిగావు, భా...
సీ. పంచభూతంబులు పరమేశ్వరప్రసాద, మైయుండె వ్యతిరిక్తమైనదెద్ది
అష్టమూర్తులు భవునంగసంభవులైరి, హరుప్రసాదులెగాక యన్యులెవరు
చరచరాస్పదమైనజగములో శ్రీకంఠు, వరప్రసాదముగాని వస్తువెద్ది
విష్ణువిధాతాదివేల్పులు శివభక్త, పరులుగా కున్నట్టివార లెవరు
గీ. భవప్రసాదమహత్వంబుభాగవతము, శైవస్కాందాదిగ్రంథముల్ చాటుచుండు, భా.
సీ. హరునకు శివభక్తులర్పించుభూములు, ఛత్రచామరములు సకలవాహ
నంబులు హారముల్ నానావిధంబుల, వస్తువుల్ నైవేద్యవాసన లవి
యివి యనర్హంబులౌ నెవ్వరుగొనరాదు, గొనినచో నరకాబ్ధిఁ గూలఁగలరు
శివభక్తులై యుండి శివునిఁ బూజించుచు, శివప్రసాదము దినఁ జెల్లకున్నె
గీ. పత్రపుష్పఫలంబులు పక్వములును, హరునివేదనభుక్తి కనర్హమగునె భా...
సీ. ఏమంత్రివ్యాసాదు లామంత్రమునకును, దగదని చెప్పినఁ దథ్యమగునె
యజ్ఞపురోడాశ మాయాజులకుఁగూడఁ, దగదని చెప్పినఁ దథ్యమగునె
పితృశేషమును గర్తప్రీతిభుజింపంగఁ, దగదని చెప్పినఁ దథ్యమగునె
శివుని బ్రసాదంబు శివభక్తులకుఁగూడఁ, దగదని చెప్పినఁ దథ్యమగునె
గీ యొప్పవచ్చునె యీమాట దప్పుగాక, భస్మరుద్రాక్షధారులౌ పాపు లధమ
గతికిఁ బోఁగోరి నిందించుకథకుఁ జొరిరి, భావ...
సీ. కాశికాపురమందుఁ గాలభైరవుకన్న, మకరమందుఁ బ్రయాగమాధవులను
గాంచిన మాంగల్యగౌరిదర్శనమైన, సేతువుకేగిన శేషగిరియుఁ
బోడగన్నఁ గేదారమున గంగఁద్రావినఁ, గోటియజ్ఞము లొకమాటుసేయఁ

గలిగిన నొకలక్షకన్యల దానంబు, సేయనబ్బినఁ బుణ్యసిద్ధియంత
గీ. నేకబిల్వార్చనంబున నిత్తుననుచుఁ, బాదరాయణి మొదలైనవార లనిరి భా...
సీ. బహుళాష్టమిని బిల్వపత్త్రంబుతో మిమ్ము, నర్చింపఁ బాతకహరణమగును
శివరాత్రిరోజున భవ నీస్మరణతోడ, బిల్వార్చనము సేత ప్రీతికరము
లక్షబిల్వార్చన దక్షులై చేసిన వారన మీరన వేఱు లేదు
ప్రతిసోమవారంబు భక్తితో బిల్వంబు చేఁబూజసేయ విశేషమగును.
గీ. నేకబిల్వమహాత్వ్య మమేకముగను బాదరాయణి మొదలైనవారలనిరి, భా.
సీ. బిల్వవృక్షముక్రిందఁ బ్రేమతో వైశాఖ కార్తికంబులభక్తిగలిగి యొక్క
విప్రున కెవ్వరువిందుఁజేసిన కోటి బ్రాహ్మణభోజనఫలము గల్గు
మారేడుతరుమూల మహిని లింగార్చన నొకరోజుజేసిన సకలకాల
ములను లింగార్చన సలిపినవాఁడు గా ఫలమబ్బు సందేహ మణుత వలదు
గీ. సత్యమిది సత్యమిదియును సత్యమనుచు బాదరాయణి మొదలైనవార లనిరి, భా.
సీ. భృగుపత్ని నన్యాయముగఁ జంపినందున శపియించె భృగుముని శౌరి నపుడు
నదికారణముగాఁగ నాహరితావచ్చి పుడమిపై పదిమార్లు బుట్టవలసె
బుట్టుట గిట్టుట పురహరిగొల్చుట భాగవతము జెప్పఁబడినదయ్యె
మితిమించిపలుమాఱు కుతలమందునఁ జక్రి జననమంది కథల్ చాలగలవు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము కొందఱెల్లకాలము మిముఁ గొల్వకుందురకట భా.
సీ. జలచరంబులలోన శ్రావ్యముగాబోలు మత్స్యమై జన్మించె మాధవుండు
వేదంబులు హరించువిద్వేషుఁ బోరివచ్చి తెచ్చి శ్రుతులు వేధ కిచ్చినాఁడు
మత్స్యకేశ్వరుఁ డనుమారారి నతిభక్తి, భువిని ప్రతిష్టించి పూజచేసె
మత్స్యపురాణంబు మన్నించి విని మత్స్య, లంకకుఁజని చూడ శంకదక్క
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుటనిజము,కొందఱెల్లకాలము మిముఁగొల్వకుందు రకట భా.
సీ. రెండవజన్మమున దండిదికాఁబోలు, తాఁబేలునయ్యె నా దైత్యవైరి
దైత్యులు సురలును దర్చనంభోరాశి, మునుఁగు తిప్పకు వీఁపు మోపినాఁడు
తూర్పుసంద్రముపొంత నోర్పుతోఁ గూర్మేశు, నిల్పి సద్భక్తుఁడై కొలిచినాఁడు
కూర్మపురాణంబుఁ గూర్మిచేఁ జదివినఁ, గూరేశుఁజూచినఁ గునుకువిడును
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుటనిజము, కొందఱెల్లకాలము మిముఁగొల్వకుందురకట, భా.
సీ. అడవిమృగములలో వడిగలదని హరి, ఘనవరాహంబుగాఁ గలిగినాఁడు
ఇదియు మూఁడవజన్మ మిందు హిరణ్యాక్షుఁ, జంపి జగతి మేలు నింపినాఁడు
శ్రీవరాహేశ్వరు శ్రీగిరిపై నిల్పి, మించినభక్తి సేవించినాఁడు
ధర వరాహపురాణతాత్పర్యముమ వరాహేశుఁ జూచియునైన నెఱుఁగవచ్చు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుటనిజము, కొందఱెల్లకాలముమిముఁగొల్వకుందురకట, భా.

సీ. ప్రహ్లాదుకొఱకు స్తంభంబున నరసింహ, రూపుగా జన్మించి శ్రీపతియును
ప్రహ్లాదుతండ్రిని బట్టి గోళ్ళఁజీరి, పరలోకగతునిగాఁ బంపినాఁడు
శేషాచలంబున శ్రీనృసింహేశుని, స్థాపించి పూజలు సలిపినాఁడు
బాదరాయణిపల్కు భవ్యస్కాందము న్నృసిం, హేశ్వరంబుఁజూడ నిపుడుగలవు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుటనిజము, కొంద ఱేలొకొ మిముఁగొల్వకుందురకట, భా.
సీ. లచ్చిపెనిమిటి గొప్పబిచ్చమెత్తుటకునై, అదితికి సుతుఁడుగా నవతరించి
బలిని యాచించియు బలిని బంధించియు, బలిరాజ్య మింద్రునిపరము జేసి
వామనేశ్వరు హిమవంతంబుపై నిల్పి, యర్చించె భక్తితో నహరహంబు
వామనేశ్వరుఁడును వ్యాసగ్రంథంబులు, నేఁడును సాక్ష్యమై నిలచియుండె
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుటనిజము, కొంద ఱేలొకొ మిముఁగొల్వకుందురకట, భా.
సీ. దశరథరాజుకు తనయుఁడై శ్రీవిష్ణు, రామనామంబున రహిఁ జెలంగె
వానరసేనతో వారధిబంధించి, దశకంఠకంఠ బృందములుఁ ద్రెంచె
శివదీక్షితుఁడునై శివగీతలు గ్రహించి, పరశివజ్ఞానియై ప్రబలె నిలను
సేతువుదగ్గఱ శ్రీరామలింగేశు, నిలిపి యంతశ్శుద్ధిగొలిచినాఁడు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుటనిజము, కొంద ఱేలొకొ మిముఁగొల్వకుందు రకట, భా.
సీ. కమలాక్షునంశనే గలిగెను యదువంశ, వార్ధిచంద్రుఁడు హలపాణియనఁగ
దుష్టదానవులను డులిచివేసి యనేక, శిష్టసంరక్షణఁ జేసినాఁడు
విద్యార్థియై పోయి విశ్వేశు పురిలోన, సాందీపుకడఁ దానుఁ జదివినాడు
తనపేర లింగంబుఁ దగ వారణాసిలో, స్థాపించి పూజలు సల్పినాఁడు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుటనిజము, కొంద ఱధములు మిముఁగొల్వకుందురకట, భా.
సీ. వసుదేవసుతుఁడునై వాసుదేవుఁడన, జన్మించె శ్రీవిష్ణు జగతిలోన
శివునిప్రసాదంబు స్థిరమతి భోగించి, దూర్వాసుకృపఁ గాంచె త్రోయజాక్షుఁ
డత్రిప్రయాసమునోర్చి మతినిల్పి హరుఁగూర్చి, తపమాచరించుట ధన్యుఁడయ్యె
చక్రంబుగలిగె నవక్రపరాక్రమ, శీలియై వైరులఁ దూలఁబుచ్చె
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁడగుట నిజము, కొంద ఱధములుమిముఁగొల్వకుందురకట, భా.
సీ. కృష్ణుండు కాశిలోఁ గృష్ణేశలింగంబు, నిలిపినాఁ డిప్పుడు గలదు చూడఁ
జంద్రజూటునికృప జాంబవతీదేవి, సాంబునిగనినది సకల మెఱుఁగుఁ
బార్థివలింగంబు బార్థకృష్ణులు బూజఁ జేయుట వ్యాసులు చెప్పినాఁడు
నరునితోఁ గైలాసనగరంబునకుఁ గృష్ణుఁ డేగి మీకును మ్రొక్కు టాగడంబె
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుటనిజము, కొంద ఱధములుమిముఁగొల్వకుందురకట, భా.
సీ. అదితినందనుఁ డైనయావామనునిపాద, కమలమందున గంగ గలిగెననియు
విష్ణుపద్భవయన వెలసినయాగంగ, హరుఁడు జటాజూటమందు భక్తి

డాల్చినాఁ డనియేటిదబ్బఱమాటను, వినరాదు దోషంబు విస్తరించు
గంగపుట్టుకవేళ గంగాధరుండౌట, కారణం బది వేళగలదు మొదలఁ
గీ. పూర్వపక్షంబుజెప్పెదఁ బొందుగాను, వెనుక వినుపింతు సిద్ధాంతవివరమెల్ల, భా.

సీ. మునిశాపవృతమైన మురవైరిజన్మముల్, బదివిధంబులు నందు బంచము బు
వామనంబగు గంగ వామనుపదమునఁ, బుట్టక పూర్వమేపుట్టె జలము
గతకాలమున గంగగనుపడకుండిన, జగమువర్తన మెట్లు జరుగఁబడును
మత్స్యకూర్మంబులమాట సేమనవలె, నీరులే కవియెట్లు నిలువఁగలిగెఁ
గీ. గాన జలములు బూర్వమే కలవటంచు, నొప్పుకొనవలె లే దింకఁదప్పుకొనఁగ, భా.

సీ. బలి వామనునిపాదపద్మముల్ గడుగంగ జలము లెక్కడనుండి సంభవించె
వటునిపాద బ్రహ్మ యెటులఁ బ్రక్షాళించెఁ, దనవద్ద నుదకంబుఁ దాచకున్న
వామనుండే ముందొ వార్ధిమథనమె ముందొ, కూర్మావతార మీగుఱుతుఁదెల్ప
బలిని జన్మంబులోపలఁగదా యాచించె, జన్మమెట్టుల సాగె జలములేక
గీ. కాన జలములు బూర్వమే కలవటంచు, నొప్పుకొనవలె లేదింకఁ దప్పుకొనఁగ, భా.

సీ. బలికొఱకై పుట్టుపని తనపనిగాని, కలదె గంగోద్భవకారణంబు
బలియింటికిని బోవు పని తనపనిగాని, కలదె గంగోద్భవకారణంబు
బలిని భిక్షించెడిపని తనపనిగాని, కలదె గంగోద్భవకారణంబు
బలిని నిగ్రహపెట్టుపని తనపనిగాని, కలదె గంగోద్భవకారణంబు
గీ. కారణము లేనిచో గంగ కలుగు టెట్లు, లూరులేకున్న బొలిమేర యుండు టెట్లు, భా.

సీ. హరిపాదమున గంగ యుదిపుట్టకుండిన, హరిపదపూత యైనట్టి గంగ,
మాళిదాల్చినవాఁడు శూలియటంచన, నొప్పరా దది గొప్ప తప్పుమాట
మన్నొకయడుగున మిన్నొకయడుగునఁ, గొలిచిన జలవాసములను విడచి
కొలిచెనే గతమందు జలములెన్నఁడు పాద, ప్రక్షాళనము సేయఁ బడఁగలేదె
గీ. విష్ణు తనపాదమునకని వేరె గంగ, దాచికొనినాఁడొ యిదియేనొ తెలుపఁగూడ, భా.

సీ. ఘనత్రివిక్రమమింటికాల్ గడుగకమున్న, మిన్నేరు లేదొకో మించిపూత
యై లేదొ లేకున్న నాలోకులకు నెట్లు, జరిగెనో పూతయౌజలము లేల
వారలుద్రావిరి వామనుపదముకుఁ, బ్రక్షాళనము కెట్లు పనికివచ్చె
హరి వామనుండైన నాకాలమెన్నఁడు, బంచభూతంబుల ప్రభవ మెపుడు
గీ. నాలుగవతత్త్వ మిది వటుకాలు సోకి, పావనంబయ్యె ననుటిది బాడిగాదు, భా.

సీ. ఆది కనాదియౌ నాకాలమునఁగదా, గంగనాదలఁదాల్చెఁ గాలకంఠుఁ
డదితిగర్భంబున హరిబుట్టె యింద్రుని, తమ్ముఁడై నదినంబు దలఁచిచూడ
ధర భగీరథరాజు తనవారికొఱకునై, భాగీరథిని దెచ్చుపర్వమెన్నఁ
గాలభేదంబులు గనుపించె భాగీర, థీజన్మకాలంబె దేవదేవ

గీ. నకును గంగాధరత్వంబు ప్రకటమనుట, నేర కనుమాటలేగాని నిజముగావు, భా.

సీ. ఆకాశవీధికి హరిపాదమునకును, విష్ణుపాదంబని వెలయుపేరు
శౌరికిఁ గప్పకుఁ జెలఁగి సింహంబుకు, హరి యనుపే రొక్కటగును జగతి
హరి కప్పఁగాఁ బోవఁ డాకాశవీధియు, హరిపాదమని చెప్ప నలవిగాదు
ఆకాశముననుండి యవనికి దిగుగంగ, కును విష్ణుపద్భవ యనఁగఁ జెల్లు
గాక హరికిని గంగ గలుగలేదెన్నఁడు, గలిగినదనుమాట కల్లకల్ల

గీ. బ్రహ్మ నడిగిన నీ రిలఁబడియె నదియె, విష్ణుపది యనునదియునై వెలసెనేమొ, భా.

సీ. భాగీరథినిజొచ్చి ప్రాణంబువిడిచిన, శుద్ధుఁడౌననుట ప్రసిద్ధిగలదు
భాగీరథిని శల్యపాతంబుఁగల్పిన, శుద్ధుఁడౌననుట ప్రసిద్ధిగలదు
భాగీరథినిఁ బిండపతనంబుగల్గిన, శుద్ధుఁడౌననుట ప్రసిద్ధిగలదు
భాగీరథినిఁ దిలల్ బట్టి తర్పణమేర్చ, శుద్ధుఁడౌననుట ప్రసిద్ధిగలదు

గీ. పరగ భాగీరథికి హరిపాదముననుఁ, సిద్ధిగలదను శాస్త్రప్రసిద్ధి లేదు, భా...

సీ. సరయువులోఁబడి చనియెఁగా రాముండు, తనపాదపూతయై తగియెనేమొ
వార్ధిలో హరిబడి వరదనవచ్చుట. తనపాదపూతయై తగియెనేమొ
పరశురామునితండ్రి పరభువక్రియలకుఁ, దనపాదపూతయై తగియెనేమొ
దివ్యతిరుపతులందు దేవార్చనములకుఁ, దనపాదపూతయై తగియెనేమొ

గీ. గంగచే హరి పూతుఁడౌ కతలుగలవు, గంగ శౌరిపదంబునఁ గలుగుటెట్లు, భా.

సీ. ఆదికాలంబున నంబిక హరినేత్ర, కమలముల్ మూసిన కామవైరి
ఫాలనేత్రమువిప్పి ప్రళయాగ్ని జగములఁ, బర్విన హిమసుత భయమునంది
కనులమూతయుమాని కరములు దివియఁగా, నానందజలములు నంగుళములఁ
బదియుజారెను నవి పరగ నాపస్తత్త్వ, సంబంధులీరీతి సంభవించి

గీ. గంగ జగములు ముంపఁగ నంగజారి, సురలు వేఁడిన నిడె జటాజూటమందు, భా.

సీ. కమలాసనుఁడు మది గర్వించి మించినఁ, దల ద్రుంచితివి యొక్కతలయుఁబోయి
నాల్గుమోములతోడ నాటనుండియు సృష్టి, మేరమీఱక తాను మెలఁగుచుండె
బ్రహ్మను దలఁగొట్ట బ్రహ్మహత్యయు శివు, నంటినదని మూర్ఖులందు రకట
బ్రహ్మచావనిదెట్లు బ్రహ్మహత్యఘటించుఁ జచ్చిన మఱిగదా వచ్చుహత్య

గీ. యనుచుఁ దెలియంగఁజాలరాయంగహీన, తయునుమృతియనా నెపరికింపఁదగదెదీని, భా

సీ. గంగలోఁబడి ద్విజుల్ గాలంబుఁజేసిన, గంగకు హత్యయు గలుగదయ్యె
నగ్నిలో విప్రులు నాహుతియైనను నగ్నికి హత్యయు నంటదయ్యె
పడమటిగాడ్పుకు బ్రాహ్మణుల్ జచ్చిన గాలికి హత్యయు గలుగదయ్యె
భూమిగ్రుంగిన గొప్పభూసురుల్ మడసిన భూమికి హత్యయు బొందదయ్యె

గీ. గాని వాణీశు నొకతల గత్తిరింప నెట్లుదవిలెనో హత్య యీనీతియెట్లొ, భా.

సీ. ధరదినప్రళయము జరిగినప్పుడు విప్రసంఘమరణము లెన్నిజరుగలేదు
బ్రహ్మప్రళయమునందు బాడబుల్ బహుమంది ప్రాణహింసనుబొందఁబడగలేదొ
విష్ణులయంబున వేదవేత్తలు చాల జీవముల్ విడుచుటఁ జెల్లలేదొ
ప్రళయకర్తృత్వము బరమేశునకుఁదక్క నొరులకు లేదన్న యుక్తివినరొ
గీ. యెప్పుడును హత్యజెందక తప్పుసేయు విధిని దండింప హత్యను విధులుగలవె, భా.
సీ. కండకావరమున గర్వించి నిందించు నట్టిదక్షుని తలఁగొట్టినపుడు
నాజన్నమందు దున్న హరితలఁ దెగఁగోసి తీసి గుండంబులో వేసినపుడు
పూషుఁడన్ సూర్యునిఁ బోసికపడవేసి పొడిబొడిగాఁ బండ్లుబొడిచినపుడు
పలుఁకుజేసియ నంటఁబట్టి చేకత్తితో ఘోరంబుగా ముక్కుగోసినపుడుఁ
గీ. జెప్పలేరైరి హత్యగాఁ దప్పుసేయు విధిని దండింప హత్యను విధులుగలవె, భా.
సీ. దశకంఠుహత్యను దప్పింపరాముండు నిలమీఁద రామేశు నిలిపినట్లు
పరశురాముఁడు రాజవరులఁ జంపినహత్య జీర్ణింప శివునిఁ బూజించినట్లు
బ్రహ్మాదిసుర లంతపాపముల్ హరియింపఁ గుతలమందు మహేశు గొలిచినట్లు
బ్రహ్మహత్యయుఁ బాయఁబరమేశ్వరుఁడుమున్ను నేదేవు నర్చించి యాగెననినఁ
గీ. జెప్పఁజాలరు నోరెత్తి తప్పువారుఁ జేయువారల యెన్నికఁ జేయనేల, భా.
సీ. భస్మాసురుం డను పారాంతరముగల వృకుఁ డనురక్కసుఁ డొకడు మున్ను
మీరిచ్చువరమున మీశిరంబునఁ దన, కరముబెట్టెదనన్న బఱుగుఁజూపి
వైకుంఠమునకేగ వైకుంఠుఁ డాశత్రుఁ, బరిమార్చినను మీరు బ్రతికినార
లని భాగవతమున ఘనమునిజెప్పెను, సత్యమిది యనినమ్మఁజాలినట్టి
గీ. యితరసాక్ష్యంబులా లేవు నిందుకైనఁ, బూర్వపక్షంబు లిత్తునపూర్వఫణితిఁ, భా.
సీ. మృత్యుంజయత్వంబు నిత్యత్వకాలాంత, కత్వంబుమీకును గలదటంచు
వేదాగమంబులు వినుపించుచున్నవి, యనృతంబులనగను నలవిగాదు
పుట్టుకగలవారు గిట్టకదప్పదు, పుట్టుటలేనిచో గిట్టుటెట్టు
కోరిననిచ్చిన మారక నిశ్చయు, లగువారి కుపయోగమగునుగాక
గీ. వృకునకిచ్చినవరమునకటమీకు, భయముగలదనతగుహేతుపథములేదు, భా...
సీ. వరమువేఁడు వృకుండు వానిశిరంబును, వానికరస్పర్శవలన వ్రక్క
లగునట్లు కోరఁడు నడుగక యిచ్చుట, పొసఁగదు యీమాటపొందిలేదు
వానికరస్పర్శవలననె వానికి, మృతిగల్గె ననుమాట సతముగాదు
పొసగింపుకథగాన పసలేనిరీతులు, గలుగ నుడివెనంచుఁ దలఁపవచ్చు
గీ. వీరభద్రునికథవలె వేదమందు, వృకునిచరితంబు నిజమైనబ్రకటపడదె, భా...
సీ. ధరలోన నేదేవుఁ దలఁచి జపించిన, వచ్చి ప్రత్యక్షమై వారిమనిచి
యంతర్హితముగను టదిసహజమెకద, యంతర్హితుం డగునట్టిశక్తి

గలవాని కేటికి వలసెఁ బరాజితుం, డగుటకు వృకునకుఁ దగనొసంగు
వరముఁ బరీక్షింప వైకుంఠమునకును, వచ్చినవైకుంఠవాసుఁ డడలి
గీ. తలఁప దయఁజేసి వృకుఁజంపఁ గలుగుశక్తి, నతనికిచ్చితిరని చెప్పనగునుగాక, భా॥
సీ. శాత్రవకృతమైన శ్రమలనుభవించుట, ప్రబలవైరులగని పారిచనుట
శంకరుగృపచేత జయములనొందుట, గర్వించి శిక్షలగనుట మనుట
భాగవతమున హరిపాటులు బలుమాఱు, దనుజెప్పకయె మాని తనదు వల్ల
లేక బోవుటనుండి యాకవిహృదయంబు, క్షోభించి తనకిదేలాభమనుచుఁ
గీ. బూని బదులుగ వృకుకథ లేనిదొకటి, జేర్చియుండిన నిజమని చెప్పరాదు, భా॥
సీ. మింటిపురములమూటి మంటగలిపిననీదు, కంటిసెగల్ వృకుఁ గాల్పఁదగవె
పలుమాఱు బ్రహ్మాండవిలయాగ్నులౌ నీదు, కంటిసెగల్ వృకుఁ గాల్పఁదగవె
పుష్పబాణునిమేను బూదిఁజేసిననీదు, కంటిసెగల్ వృకుఁ గాల్పఁదగవె
వృకునకు వరమీయ వృకుఁడు నిన్ బాధింప, నొరులు నివారింప నుండిరంట
గీ. నమ్మఁగారాదు నిజమైనకమ్మవిల్తు, దండ్రి మీకును భార్యయాతతిని గలుగు
ప్రేమచేఁ దక్కువకు నోర్చి కామివగుచు, గీర్తిపరుఁజేయ నారీతిఁ గొరలితేమొ, భా
సీ. శూరపద్మునకంటె శూరుండుగాఁ జెప్ప, దగదు వృకాసుర జగతిలోన
సింహవక్త్రునకన్న శ్రేష్ఠుండుగాఁ జెప్ప, దగదు వృకాసుర జగతిలోన
దారకాసురుకంటె దండివాఁడని చెప్ప, దపదు వృకాసుగు జగతిలోన
వృకునకు వరమీయ వృకుఁడు నిఁక బాధింప, నొరులు నివారింపఁ జరితయగుట
గీ. నమ్మఁగారాదు నిజమైవకమ్మవిల్తు, దండ్రిమీకును భార్యయాతరిని గలుగు
ప్రేమచేఁ దక్కువకునోర్చి కామివగుచు గీర్తివరుఁ జేయ నారీతిఁ గొరలి తేమొ
సీ. స్రష్టముఖంబున సాక్షాత్కరించిన, జనకత్వమతని కేసరణిగలదు
స్తంభమందు నృసింహుసంభవంబయ్యెఁగా స్తంభంబుహరికిని దండ్రియగునె
స్తంభంబునకు శౌరి తనయుఁడంచన బల్క, వచ్చునె యామాటమెచ్చఁదగునె
యుట్టిలక్ష్యంబులు గట్టిగాఁ బరికింప, కున్న లాభంబేమియున్నదిందు
గీ. ధాతయతిభక్తిమిముఁగూర్చి తపసియైన, నతనిముఖమందుఁబ్రత్యక్షమైతిరింతె, భా॥
సీ. వసుదేవనందను వాసుదేవుండని, పిలచినట్లుగ మిమ్ముఁ బిల్వకుండ్రె
యదితిసూనుని నింద్రానుజన్ముఁడాయని, పిలచినట్లుగ మిమ్ముఁ బిల్వకుండ్రె
పద్మమం దుదయింపఁ బద్మజుఁడాయని, పిలిచినట్లుగ మిమ్ముఁ బిల్వకుండ్రె
దశరథపుత్రుని దాశరథీయని, పిలిచినట్లుగ మిమ్ముఁబిల్వకుండ్రె
గీ. ధాతకును మీరుపుట్టుట తథ్యమేని, నిజమెఱుంగకయనుట దుర్నీతిగాక, భావ...
సీ. భాగవతంబునఁ బోతీకుఁడై కవి, వాస్తవంబులు గొన్ని వదలినాఁడు
పెక్కులేటికి లెక్కబెట్ట వ్యర్థపుశ్రమ, నొక్కటినుడివెదఁ జిక్కగనుఁడు

దక్షాధ్వరంబుకు దనుజారివచ్చిన, లేదనిజెప్పెను గాదు నిజము
వేదముం దీకథ విరళమైయున్నది, వేగిమైపీఠంబు విష్ణుశిరము
గీ. వెఱచియాహవనీయాగ్ని వేసెననుచు, శ్రుతియుబలుకుటఁబోతనచూడఁడేమొ, భా.

సీ. పద్మాక్షుఁ డొకతరి పద్మాక్షియై సుధా, భాగనిర్ణయముకు భారపడియె
విష్ణుప్రకృతి భగవిధము రూపంబని, వేదాగమంబుల వినఁగవచ్చు
శివుఁడు పురుషుఁడని చెప్పెనుశ్రుతులన్ని, ప్రకృతియుఁ బురుషులు భావశుద్ధి
గన నభేదంబు భేదగతులునై తోఁతురుఁ మాన్యమోహినికిని మగఁడవీవె
గీ. కాన నిన్నభిలషించిసగలిగెఁగొడుకు, కూఁతురామోహినికివారుగుఱుతుఁగారె, భా.

సీ. మోహినీదేవికి మొదటిబిడ్డండయ్యె, భైరవుం డతఁడీశ భవనములకుఁ
ముద్దుకూఁతురుగదా మోహినికిని శాస్త కువలయేక్షణ లెల్ల కోవిలలకు
నధికారులై యుంట యందరెఱిఁగినపని కాదన లేదన గలుగ నెవరు
ఆయన్న చెల్లెండ్రు హరిరాణి నే వావి పిలువంగ వలయునో పలుక రెవరు
గీ. విష్ణు శివునకు భార్యయై వెలసెననియు ధరమహిమ్నంబు జెప్పుటనరులు వినరొ, భా.

సీ. భృంగాఖ్యుఁ డనెడువాఁ డంగనయై సంతుఁ గనుటభారతమందు గలుగలేదొ
యిళుఁడింతియై గురు నిందుపుత్త్రుని గూడి సంతతిగను టదినతముగాదొ
వీర లిట్లగుటకుఁగోరిరె యాదిమ దంపతుల్ జేసినదారిగాదొ
తనపరికృతై యున్నదనుజారి నారీతి స్త్రీఁజేయ సుఖింపఁ జేతగాదె
గీ. మోహినియు శివునిమాయలో ముంపెననుచు, విష్ణువాదులు జెప్పుటవెఱ్ఱిగాక, భా.

సీ. శ్రీయుద్భటారాధ్య శేఖరుం డగువీర భద్రాఖ్యగురుకర భవ్యశిరుడ
గురులింగజంగమచరణ సేవానంద శైవుఁడ సంప్రాప్తషట్స్థలుండ
దేశికానుగ్రహదివ్యలింగాంగైక్య సంధానసమరససంపదుఁడను
త్రివిధపరిసాదానుభవయోగసుఖకర విమలహృత్కర్ణికా వికసనుఁడను
గీ. భువి కొమఱ్ఱాజు వేంకటశివుఁడసంగ, వెలసిరచియించితిని బ్రోవవలయుదయను, భా.

సీ. మత్కావ్యకన్యను మనుమీఁయువలెనని తలఁచితి మీకన్నధన్యులెవరు
సురలంత తక్కువతరము కులములయందు భుజగభూషా నీవె భూసురుఁడవు
సిరికి నీకన్నను శ్రేష్ఠు లెవ్వరు వెండి బంగారు కొండలపతివి గావె
శాశ్వతుల్ గారయ్య సకలవేల్పులు శ్రుతి సిద్ధంబుగాను శాశ్వతుఁడవీవె
గీ. కనుక నిచ్చితి మత్కృతికన్యనిపుడు గొనియు సల్లాప సౌఖ్యంబు లనుభవింపు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత శుభాంగ రేపాలరాజలింగ. 113

రేపాల రాజలింగశతకము. సంపూర్ణము.



# నా రా య ణ శ త క ము.



శ్రీ రామామణి పాణిపంకజ మృదుశ్రీతజ్ఞ పాదాబ్జ శ్రీం
నారాకారశరీర చారుకరుణాగంభీర సద్భక్తముం
దారాంభోరుహపత్రలోచన కళాధారోరు సంపత్ప్రథా
పారావారవిహార నాదురితముల్ భంజింపునారాయణా 1

మ. కడకుం బాయక వేయినోళ్ళ గలయాకాకోదరాధీశుఁడున్
గడముట్ట న్వినుతింపలేక నిగుడన్ గ్రాలంగ నొప్పారు మి
మ్మడరన్ సన్నుతిసేయ నాదువశమే యజ్ఞాని లోభాత్ముఁడన్
జడుఁడన్నజ్ఞుఁడ నైకజిహ్వుఁడ జనస్తబ్ధుండ, నా...

శా. నే నీదాసుఁడ నీవు నాపతివి నిన్నే కాని యొండెవ్వరిన్
ధ్యానింపం బ్రణుతింప నట్లగుటకున్నా నేర్పు చందంబునన్
నీనామస్తుతు లాచరించునెడల న్నేతప్పులుం గల్గినన్
వానిన్ లోఁగొనుమయ్య తండ్రి! విహితవ్యాపార, నా...

మ. నెరయ న్నిర్మల మైన నీస్తుతి కథానీకంబు పద్యంబులో
నొరుగుల్ మిక్కిలి గల్గ నేనియుఁ గడు న్యోగంబె చర్చింపఁగాఁ
గుఱుగ న్నైనను వంకబోయినఁ గడుం గుజ్జైనఁ బేడెత్తినం
జెఱుకుం గోలకు తీపు గాక కలదే చేదెందు, నా 4

మ. చదువుల్ పెక్కులు సంగ్రహించి పిదపం జాలంగ సుజ్ఞానినై
మదిలోఁ బాయక నిన్ను నిల్పఁదగు నామర్మంబు వీక్షింపఁడే
మొదలం గాడిద చారుగంధవితతుల్ మోవంగ శక్యంబె కా
కది సారథ్యపరీక్ష జూడ కుశలేయవ్యక్త, నా...

మ. లలిఁ గబ్బంబు కరాట మివ్వసుధ నెల్లన్నిర్మించెం బో నీకథా
వలి కర్పూరము నించిన న్నితరమా వ్యర్థార్థకామోదముల్
పెలుచం బూనినయక్కరాటము తుదిన్ బేతేకరాటంబెపో
చలదిందీవరపత్రలోచన ఘనశ్యామాంగ, నా...

మ. మనమార న్నచలేంద్రజాధిపతికి న్మస్తాగ్రమాణిక్యమై
మునికోపానలదగ్ధ రాజతతికి న్ముక్తిస్ఫురన్మార్గమై
యెనయన్ సాయక శాయికిం జననియై యేపారుమిన్నేటికిం
జనిమూలం బగు నంఘ్రి నాదుమదిలోఁ జర్చింతు, నా...

శా. నీపుత్రుండు చరాచరప్రతతుల న్నిర్మించి పెంపారఁగా
నీపుణ్యాంగన సర్వజీవతతుల న్నిత్యంబు రక్షింపఁగా
నీపాదోదక మీజగత్త్రయముల న్నిష్పాపులం జేయఁగా
నీపెం పేమని చెప్పవచ్చు సుగుణా నిత్యాత్మ, నా... 8

శా. బ్రహ్మాండావలిలోన సత్వగుణివై బాహ్యంబునం దాదిమ
బ్రహ్మాఖ్యం బరతత్వబోధములకున్ భవ్యాధినాథుండవై
బ్రహ్మేంద్రామర వాయుభుక్పతులకున్ భావింపరాకున్న నా
జిహ్మావ్యాప్తుల నెన్న నాదువశమే చిద్రూప, నా... 9

మ. ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయము లెల్ల వందిగణమై బ్రహ్మాండ మాగారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై
వరుస న్నీఘనరాజసంబు నిజమై వర్ధిల్లు,నా... 10

మ. మగమీనాకృతి వార్ధిఁ జొచ్చి యసుర న్మర్దించి యవ్వేదముల్
మగుడం దెచ్చి విరించి కిచ్చి యతని న్మన్నించి యేపారఁగాఁ
బగ సాధించినదివ్యమూర్తివని నే భావింతు నెల్లప్పుడున్
ఖగరాజధ్వజ భక్తవత్సల ధగత్కారుణ్య, నా... 11

మ. అమరుల్ రాక్షసనాయకుల్ కడఁకతో నత్యంతసామర్థ్యులై
భ్రమణీదండము మందరాచలముగా బాథోనిధిం ద్రచ్చఁగా
దమకించెన్ భువనత్రయంబును గిరుల్ దంతావళుల్ మ్రొగ్గినం
గమఠంబై ధరియించి మించిన జగత్కల్యాణ, నా...

శా. భీమాకారవరాహమై భువనముల్ భీతిల్లి కంపింపను
ద్దామోర్విం గొనిపోయి నీరధిలో డాఁగున్న గర్వాంధునిన్
హేమాక్షాసురు వీఁకఁ దాకి జయలక్ష్మిన్ గారవింపంగ నీ
భూమిం దక్షిణదంష్ట్ర నెత్తిన నినుం బూజింతు నా... 13

శా. స్తంభంబందు నృసింహమై వెడలి యచ్చండాట్టహాసధ్వనుల్
దంభోళిం గడువంగ హేమకశిపోద్దండా సురాధీశ్వరున్
శుంభద్గర్భము వ్రచ్చి వానిసుతునిన్ శోభిల్ల మన్నించియు
జ్జంభారాతిని బ్రీతిఁ దేల్చిన నినుం జర్చింతు, నా...

మ. మహీయు న్నాకసముం బదద్వయపరీమాణంబుగాఁ బెట్టి యా
గ్రహ మొప్పం బలిమస్తకం బాకపదగ్రస్తంబుగా నెమ్మితో
విహరించిందగ్రి విరించి శంకరమహావిఖ్యాతదివ్యాకృతిన్
సహజంబై విలసిల్లు వామనల సచ్చారిత్రి నా...

మ. ధరణిన్ రక్తమహాహ్రదంబు లెలమిం ద్రైలోక్య నిర్దిష్టమై
పరగం బైతృక తర్పణంబుకొఱకై ప్రఖ్యాతిగాఁ దీవ్రతన్
నిరువయ్యొక్కటిమారు క్షత్రివరులన్నేపార నిర్జించి త
త్పరశుభ్రాజితరామనామము కడుఁ ధన్యంబు నా... 16

మ. వరుసం దాటకిఁ జంపి కౌశికు మఖస్వాస్థ్యంబు గావించి శం
కరుచాపం బాగిఁదుంచి జానకిఁ దగం గళ్యాణమై తండ్రి పం
పరుదారన్ వనభూమికేఁగి జగదాహ్లాదంబుగా రావణున్
ధరణింగూల్చిన రామనామము కడుఁ ధన్యంబు నా... 17

మ. యదువంశంబునఁ గృష్ణు కగ్రజుఁడవై* యాభీల శౌర్యోన్నతిన్
మదవద్ధేనుక ముష్టికాద్యసురలన్ మర్దించి లీలారసా
స్పద కేళీరతి రేవతీవదన కంజాతాంతభృంగంబనన్
విదితంబౌ బలరామమూర్తివని నిన్ వీక్షింతు నా... 18

మ. పురముల్మూఁడును మూఁడులోకములు నేప్రొద్దు న్విదారింపఁ ద
త్పురనారీ మహిమోన్నతుల్ సెడుటకై బుద్ధుండవై బుద్ధితో
వరబోధద్రుమ సేవఁజేయుటకునై వారిం బ్రబోధించి య
ప్పురముల్ గెల్చిన నీయుపాయము జగత్పూజ్యంబు నా... 19

మ. కలిధర్మంబునఁ బాపసంకలితులై గర్వాంధులై తుచ్ఛులై
కులశీలంబులు మాని హేయగతులం గ్రొవ్వారు దుష్టాత్ములం
బలిగాఁజేయఁదలంచి ధర్మమెలమిం బాలించి నిల్పంగ మీ
వలనం గల్క్యవతార మొందఁగల నిన్ వర్ణింతు నా... 20

మ. ఇరవొందన్ సచరాచరప్రతతుల న్నెన్నంగ శక్యంబుగా
కరయన్ పద్మభవాండ భాండచయమున్నారంగ మీకుక్షిలో
నరుదార న్నుదరుంచుఁ బెంచు నడఁగు న్నన్నారికేళోద్భవాం
తరవాఃపూరము చందమొంది యెపుడున్ దైత్యారి నా... 21

మ. దళదిందీవర నీలనీరదసముద్యద్భాసితాకార శ్రీ
లలనా కౌస్తుభ చారువక్ష విబుధశ్లాఘోద్భవ స్థానకో
మలనాభీ చరణారవింద జనితామ్నాయాద్య గంగా! లస

జలజాతాయతనేత్ర నిన్ను మదిలోఁ జర్చింతు నా... 22

మ. జగదాధారక భక్తవత్సల కృపాజన్మాలయా పాంగ! భూ
గగనార్కేందుజలాత్మ పావక మరుత్కాయా! ప్రదీపప్రయో
గిగణస్తుత్య మహాఘనాశన! లసద్గీర్వాణసంసేవితా!
త్రిగుణాతీత! ముకుంద! నామదిలో దీపింపు నా... 23

శా. భూతవ్రాతము నంబుజాసనుఁడవై పుట్టింతు విష్ణుండవై
ప్రీతిం బ్రోతు హరుండవై చెఱుతు నిర్భేద్యుఁడవై త్రైగుణో
పేతుండవై పరమాత్ముడవై నిలుతు నీపెంపెవ్వరుం గాన ర
జ్జాతోద్భూత సుజాత పూజిత పదాబ్జశ్రేష్ఠ నా... 24

మ. వరనాభీధవళాంబుజోదరమునన్ వాణీశుఁ గల్పించి య
ప్పురుషశ్రేష్ఠుని ఫాలమందు శివునిం బుట్టించి యామేటికిం
బరమోత్తంసముగా వియత్తలనదిం బాదంబులం గన్న మీ
సరి* యెవ్వారలు మీకుదక్కఁగ రమాసాధ్వీశ నా... 25

మ. ప్రభ మీనాభి జనించినట్టి విలసత్పద్మోరుసద్మంబునం
బ్రభవంబైన విరించిఫాలజనితప్రస్వేదసంభూతుఁడై
యభిధానంబును గోరి కాంచెను భవుండార్యేశు లూహింపఁగా
నభవాఖ్యుండవు నిన్నెఱుంగవశమే యబ్జాక్ష నా... 26

మ. పటుగర్భాంతరగోళభాగమున నీబ్రహ్మాండభాండంబు ప్రా
కటదివ్యాద్భుతలీలఁ దాల్చి మహిమం గల్పాంతమంభోధిపై
వటపత్రాగ్రముఁ జెంది యొప్పినమిము న్వర్ణింపఁగా శక్యమే
నిటలాక్షాంబురుహాసనాదికులకు న్నిర్వాణ నా... 27

మ. సవిశేషోరుసువర్ణబిందువిలసచ్చక్రాంకలింగాకృతిన్
భవుచే నుద్ధవుచేఁ బయోజభవుచేఁ బద్మారిచే భానుచే
ధ్రువుచే నా దివిజాధినాయకులచే దీవ్యన్మునీంద్రాళిచే
నవదివ్యార్చన లందుచుందువు రమానారీశ నా... 28

మ. సర్వంబున్ వసియించు నీతనువునన్ సర్వంబునం దుండఁగా
సర్వాత్మా! వసియించు దీవనిమదిన్ సార్థంబుగాఁ జూచి యా
గీర్వాణాదులు వాను దేవుఁడనుచున్ గీర్తింతు శ్రీప్రొద్దు నా
శీర్వాదంబు భవన్మహామహిమ లక్ష్మీనాథ నా... 29

మ. గగనాద్యంచిత పంచభూతమయమై కంజాతజాండావలిన్
సగుణబ్రహ్మమయాఖ్యతం దనరుచున్ సంసారివై చిత్కళా

* యింకెవ్వరు నీవెకర్తవు రమానంబంధ

సుగుణంబై విలసిల్లుదీవు విపుల స్థూలంబు సూక్ష్మంబునై
నిగమోత్తంస గుణావతంస సుమహా నిత్యాత్మ నా... 30

మ ఎలరారన్ భవదీయనామకథనం బేమర్త్యుచిత్తంబులోఁ
బొలుపారం దగిలుండునేని యఘముల్ పొందంగ నెట్లోపెడున్
కలయం బావకుచేతఁ బట్టువడు నక్కాష్ఠంబుపైఁ గీటముల్
నిలువన్నేర్చునె భక్తపోషణ కృపానిత్యాత్మ నా... 31

మ. కలయం దిక్కులు నిండి చండతరమై కప్పారు మేఘౌఘముల్
వెలయన్ ఘోరసమీరణస్ఫురణచే వే పాయుచందంబునన్
జలదంభోళిమృగాగ్ని తస్కర రుజా శత్రోరగవ్రాతముల్
దొలఁగున్నీదగు దివ్యమంత్రపఠనన్ దోషఘ్న నా... 32

మ. కలుషాగాధ వినాశకారి యగుచుం గైవల్యసంధాయియై
నలి నొప్పారెడు మంత్రరాజమగు నీనామంబు ప్రేమంబుతో
నలర న్నెవ్వనివాక్కునం బొరయదే నన్నీచు ఘోరాత్మయుఁ
వెలయన్ భూరుహకోటరంబదియ సూ వేదాత్మ నా... 33

మ. పరమంబై పరతత్త్వమై సకలసంపత్సారమై భవ్యమై
సురసిద్ధోరగ యక్షపక్షిముని రక్షోహృద్గుహాభ్యంతర
స్థిరసుజ్ఞానసుదీపమై శ్రుతికళాసిద్ధాంతమై సిద్ధమై
సరిలేకెప్పుడు నీదునామ మమరున్ సత్యంబు నా... 34

మ. అధికాఘౌఘతమో దివాకరమునై యద్రీంద్రజా జిహ్వకున్
సుధయై వేదవినూత్నరత్నములకున్ సూత్రాభిధానంబునై
బుధసందోహ మనోహరాంకురమునై భూదేవతాకోటికిన్
విధువై మీబహునామరాజి వెలయున్ వేదాత్మ నా... 35

మ. పౌనరస్మృక్తికిఁ ద్రోవ వేదములకుం బుట్టిల్లు మోదంబునం
దునికిస్థానము యిష్టభోగములకు న్నుత్పత్తి యేప్రొద్దునన్
ఘనపాపంబులవైరి షడ్రిపులకున్ గాలావసానంబు మీ
వినుతాంఘ్రిద్వయపద్మసేవనగదా విశ్వేశ నా... 36

మ. భవరోగంబులమందు పాతకతమోబాలార్క బింబంబు క
ర్మ విషజ్వాలసుధాంశుగామృతతుషార వ్రాతపథోధిమూ
ర్తివి కైవల్యపదావలోకన కళాదివ్యాంజనశ్రేష్ఠమై
భువిలో మీదగుమంత్రిరాజ మమరున్ భూతాత్మ నా... 37

మ. వరుసన్ గర్మపిపీలికాకృత తనూవల్మీకనాళంబులోఁ
బరుషాకారముతో వసించిన మహాపాపోరగశ్రేణికిం

బరమోచ్చాటనమై రహస్యమహిమం బాటింపుచు న్నందఁ మీ
తిరుమంత్రంబగు మంత్రరాజ మనుమం దివ్యాత్మ నా... 38

మ. హరునిన్నద్రిజ నాంజనేయుని గుహు న్నయ్యంబరీషున్ ధ్రువుం
గరిఁ బ్రహ్లాదు విభీషణాఖ్యుని బలిన్ ఘంటాశ్రవు న్నారదుం
గరమొప్ప న్విదురుం బరాశరసుతున్ గాంగేయునిం ద్రౌపదిన్
నరునక్రూరునిఁ బాయకుండను భవన్నామంబు నా... 39

శా. శ్రీకిన్మందిరమైన వక్షము సురజ్యేష్ఠోద్భవస్థాననా
భీకంజాతము చంద్రికాంతర సుధాభివ్యక్తనేత్రంబులుం
లోకస్తుత్యమరున్నదీజనక మాళోలాంఘ్రియుం గల్గు నా
లోకారాధ్యుడవైన నిన్నెపుడు నాలోఁ జూతు నా... 40

శా. విందుల్ విందులటంచు గోపరమణుల్ వ్రేపల్లెలోఁ బిన్ననాఁ
డందెల్ మ్రోయఁగ ముద్దుమోమలర నిన్నాలింగితుం జేయుచో
డెందంబుల్ దనివార రాగరసవీటీలీలలం దేల్చు మీ
మందస్మేరముఖేందురోచులు మది న్స్మరించు నా... 41

శా. విందుల్వచ్చిరి మీయశోదకడకు న్వేగంబె హామ్మయ్యయో
నందానందన! చందనాంకురమ! కృష్ణా! యింకఁ బోవేమి మా
మందం జాతరసేయఁ బోదమిదె రమ్మా యంచు మిమ్మెత్తుకో
చందంబబ్బిన నుబ్బకుండుదురె ఘోషస్త్రీలు నా... 42

శా. అన్నా కృష్ణుడ నేఁడు వెల్వలకు మీఁదన్నార మీచట్లలో
వెన్నల్ ముట్టకు మన్న నాక్షణము సర్వేశాకృతిస్ఫూర్తివై
యున్నన్ దిక్కులు చూచుచున్ బెగడి నిన్నోలి న్నుతుల్ సేయుచున్
గన్నల్ మూయ యశోదకుం జిఱుతవై కన్పింతు నా... 43

శా. ఉల్లోలంబులుగాఁ గురుల్ నుదుటిపై నుప్పొంగ మోమెత్తి ధ
మ్మిల్లం బల్లలనాడ రాగరస సమ్మిశ్రంబుగా నీవు వ్రే
పల్లెం దాడుచు గోపగోనివహ గోపస్త్రీలయుల్లంబు మీ
పిల్లంగ్రోవిని జుట్టి రాఁదిగుదు నీపెంపొప్పు నా... 44

మ. కసవొప్పన్ పసి మేసి ప్రొద్దుగలుగం గాంతారముం బాసి య
ప్పసియు న్నీవును వచ్చుచో నెదురుగాఁ బైకొన్న గోపాంగనా
రసవద్వృత్తపయోధరద్వయహరిద్రాలేపనామోదముల్
పసిఁ గొంచున్ బసిఁ గొంచువచ్చుటలు నే భావింతు నా... 45

శా. చన్నుల్ మీఁదికి చౌకళింప నడుముం జవ్వాడ కందర్పసం
పన్నాఖ్యంబు నటించుమాడ్కి కబరీభారంబు లూటాడఁగా

విన్నాణంబు నటింప గోపజన గోబృందంబుతో వచ్చు మీ
వన్నెల్ కన్నుల ముంచి గ్రోలుటలు నే వర్ణింతు నా... 46

మ. పెరుగుల్ దచ్చుచు నొక్కగోపిక మిముం బ్రేమంబునం జూచి రా
గరసావేశత రిత్త దచ్చునెడ నాకవ్వంబు నీవు న్మనో
హరలీలం గనుంగొంచు ధేనువని యయ్యాంబోతునుం బట్టితీ
వరవృత్తాంతము లేను పుణ్యకథగా వర్ణింతు నా... 47

శా. కేలన్ గోలయు గూటిచిక్కము నొగిం గీలించి నెత్తంబునం
బీలీపింఛముఁ జుట్టి నెన్నడుమునం బింఛావళిన్ గట్టిక
ర్ణాలంకారకదంబగుచ్ఛమధుమత్తాలిస్వనంబొప్పనీ
వాలన్ గాచినభావమిట్టిదని నే వర్ణింతు నా... 48

శా. కాళిందీతటభూమి నాలకదుపుల్ కాలూఁది మేయన్ సము
త్తాలాలోల తమాలపాదపశిఖాంతస్థుండవై వేణురం
ధ్రాలిన్ రాగరసంబునిండ విలసద్రాగంబు సంధించి గో
పాలవ్రాతము గండుగోయిలలుగా వర్ణింతు నా... 49

శా. రాణించెన్ గడునంచు నీసహచరుల్ రాగిల్లి సోలంగ మీ
వేణుక్వాణము వీనులంబడి మనోవీథుల్ బయల్ ముట్టఁగా
ఘోణాగ్రంబులు మీఁది కెత్తుకొని లాంగూలంబు లల్లార్చి గో
శ్రేణుల్ చిందులుద్రొక్కు యాటలు నేఁ జర్చింతు నా... 50

మ. పసులంగాపరి యేమెఱుంగు మధురప్రాయోల్లసద్వృత్తవా
గ్విసరారావము మోవిదా వెదురు గ్రోవిం బెట్టి నాఁడంచు నిన్
గసటుల్ సేయఁగ నాఁడు గోపికల తద్ధ్యానంబులన్ మన్మథ
వ్యసనాసక్తలఁ జేయుచందములు నేవర్ణింతు నా... 51

మ. జడియొంతేఁ దడవయ్యె జెయ్యియలసెన్ శైలంబు మాచేతులం
దిడుమన్నన్ జిరునవ్వుతో వదలినన్ హీనోక్తిగీపెట్టనె
క్కుడుగోవుల్ బ్రియమంద నింద్రుఁడడలంగోవర్ధనాద్రీంద్రమున్
గొడుగై యుండగఁ గేలఁబూనితిగదా గోవింద నా... 52

మ. లలితాకుంచితవేణి యందడవిమొల్లల్ జాఱ ఫాలస్థలిన్
దిలకం బొయ్యనజాఱఁ గుండలరుచుల్ దీపింపలేఁ జెక్కులన్
మొలకన్నవ్వుల చూపులోరగిల మేన్మువ్వంకలన్ బోవఁగా,
నలిగైకొందువుగాదె నీవు మురళీనాట్యంబు నా... 53

శా. మాపాలం గడుగ్రొవ్వి గోపికలతో మత్తిల్లి వర్తింతువే
మాపాలెంబుల వచ్చియుండుదు వెసన్మాపాలలో నుండుమీ

మాపాలైన సుఖాబ్ధిలో మునుగుచున్ మన్నించి తాగొల్లలన్
మాపాలంగల వేల్పు వీవెయని కా మన్నింతు నా... 54

మ. ఒకకాంతామణి కొక్కడీవు మఱియున్నొక్కర్తె కొక్కండవై
సకలస్త్రీలకు సంతసంబలర రాసక్రీడతన్మధ్య క
ల్పకమూలంబున వేణునాదరస మొప్పంగా, బదార్వేలగో
పికలంజెంది వినోద మొందునెడ నీపెంపొప్పు నా... 55

మ. లలితంబైన భవత్తనూవిలసనన్ లావణ్యదివ్యామృతం
బలుగుల్వారఁగ నీకటాక్షమునఁ దామందంద గోపాంగనల్
తలఁపుల్వాదులుకట్టి కందళితనూత్న శ్రీలు వాటింతురా,
నెలతల్ తీవెలు చైత్రవిస్ఫురణమా నీయొప్పు నా... 56

శా. లీలన్ బూతకిప్రాణవాయువులు పాలిండ్లందు వెళ్ళించి దు
శ్శీలుండై చను బండిదానవు వెసంజింపై పడందన్ని యా
రోలన్మద్దులు గూల్చి ధేనుదనుజున్ రోఁజంగ నీల్గించి వే
కూలం గంసునిఁగొట్టి గోపికలకోర్కుల్ దీర్తు నా... 57

మ. రసనాగ్రంబున నీదునామరుచియుక్ రమ్యంబుగాఁ జెప్పుకు
న్నసలారంగ భవత్కథాభిరతియున్ హస్తాబ్జయుగ్మంబులన్
వెసనీపాదసుపూజితాదియుగమున్ విజ్ఞాన మధ్యాత్మకున్
వెస నింపొందనివాఁడు దాఁ బశువు నూవేహాత్మ నా... 58

మ. వరకాళిందితరంగడోలిక లలో వైకుంఠధామంబులో
వెరవొప్పార నయోధ్యలో మధురలో వ్రేపల్లెలో ద్వారకా
పురిలో నాడెడుభంగి నాదుమదిలో భూరిప్రసన్నాననాం
బురుహం బొప్ప నటించుటొప్పును సితాంభోజాక్ష నా... 59

శా. చల్లల్వేఁడుకయూరఁ నమ్ముకొను నాసంబోవుచోఁ ద్రోవ నీ
వుల్లాసంబున నడ్డకట్టి మదనోద్యోగానులాపంబుల
చల్లన్ జల్లనిచూపు జల్లుచుని గోపస్త్రీలపైఁ జల్లు మీ
చల్లఁబోరు తెఱంగు జిత్తమున నే జర్చింతు నా... 60

మ. కలయస్వేదములైన బాణములు బ్రఖ్యాతంబుగా తెల్పి మీ
వలనన్ భక్తిహీనుఁడై నపిదపన్ వ్యగ్రప్రియత్నంబెపో
కులకాంతామణి గోడ్డువోయిపగతిం గొప్పవ్వారు సస్యంబు దా
ఫలకాలంబున నీచపోవుపగిదిన్ పద్మాక్ష నా... 61

శా. స్నానంబుల్ నదులందుజేయుట గజస్నానంబు చందంబగుక్
ధ్యానంబొప్ప జపించు వేదమటవీ మధ్యంబులో నేడ్పగున్

నానాహోమములెల్ల బూడిదలలోన న్వేల్చునెయ్యి చను
న్నీనామోక్తియు నీపదాబ్జరతియున్ లేకున్న నా... 62

మ. అలనీటందగు రొంపిపైఁ జిలికిన న్నానీట నేపాయు నా
యిలపాపంబులు దుర్భరత్వము మహాహేయంబునుం బొందినం
బలువై జీవుని దొప్పఁ దోఁగినవి యీబాహ్యాంబునం బాయునే
పొలియుంగాక భవత్సుపాదజలముం బ్రోక్షింప నా... 63

మ. తనచిత్తాబ్జము మీపదాబ్జయుగళంబుం దాత్పర్య సద్భక్తితం
తున బంధించిన బంధనంబుకతనం దుష్పాపపుంజంబు లె
ల్లను విచ్ఛిన్నములై యడంగు మహిమోల్లాసాబ్ధియైనట్టి దా
సున కింపొందును మోక్షమై భవము దా సుశ్లోక నా... 64

మ. తనువుం జీవుఁడు నేకమైనపిదపన్ ధర్మక్రియారంభుఁడై
యనయంబున్మది దన్నెఱుంగక తుదిన్మాయాచే మగ్నుఁడై
తనుతత్త్వాది వియోగమైనపిదపం దానేర్చునే నీదుద
ర్శన మింపారఁగ భక్తివైభవ మహాసంకాశ నా... 65

మ. తనకుం సాత్త్వికసంపదాన్విత మహాదాసోహ భావంబునన్
ననయంబున్మది నన్యదైవభజనం బారంగ దూలింపుచున్
జనితాహ్లాదముతోడ నీ చరణముల్ సద్భక్తి పూజించి నిం
గనుగొన్నంతనె కల్మషంబు లడఁగుం గర్మఘ్న నా... 66

మ. పరికింపన్ హరిభక్తి క్షేమజనకున్ భవ్యంబుగా మీఁద మీ
చరణాంభోరుహ దర్శనంబు గలదే సంప్రీతి నెట్లన్నఁ దా
ధరలోఁ జోరుఁడు గన్న దుస్తర పరద్రవ్యంబుపై నాశలం
బారయన్నేర్చునె దుర్లభంబగు గృపాంభోజాక్ష నా... 67

మ. పరమజ్ఞాన వివేక పూరిత మహా భవ్యాంతరాళంబునం
బరగ న్నీ నిజనామమంత్రి మొనరన్ భక్తిన్ననుష్ఠింపుచుం
దురితాన్వేషణ కాలభూతము వెసన్ దూలంగ వాకట్టు వాఁ
డరుగున్ భవ్యపదంబు నొందుటకునై యవ్యక్త నా... 68

మ. సరిఘోరాంధక బోధకారణ విపత్సంసార మాలిన్యముం
బరమానంద సుబోధకారణ లసద్భస్మంబు పైనూఁది యా
నిరతజ్ఞానసుకాంతి దర్పణమున న్నిస్సంగుఁడై తన్ను దా
నరయం గాంచిన వాఁడు నిన్నుఁ గనువాఁ డబ్జాక్ష నా... 69

మ. పరుషాలాపములాడ నోడి మదినీపాపార్జనారంభుఁడై
నిరసించేరికిఁ గీడుసేయక మది న్నిర్ముక్త కర్మండునై

పరమానంద నిషేధముల్ సమముగా భావించి వీక్షించునా
పరమజ్ఞాని భవత్కృపం బొరయు నో పద్మాక్ష నా... 70

మ. ఒరులం దన్ను నెఱుంగు నియ్యెఱుకయు న్నొప్పార నేకాంతమం
దరయంబై పడు నన్యభామినులపై నాకాంక్షదూరత్వమున్
మరణావస్థను నీదునామములె సన్మానంబునం దోఁచుటల్
ధరలోన న్నివి దుర్లభంబులు సుధాధామాక్ష నా... 71

మ. వెరవొప్పు న్బహుశాస్త్రమంత్రము లొగి న్వీక్షించి వే తెల్పిమీ
వరనామామృతపూర మానుచుఁ దగన్ వైరాగ్యభావంబునన్
సరి న్రశాంతముఁ గోరువారు పిదపన్ సంసారమాతుఃపయో
ధరదుగ్ధంబులు గ్రోలనేరరు వెసన్ దైత్యారి నా... 72

శా. వేదంబందు సునిశ్చయుండగు మహా వేల్పెవ్వఁడో యంచు నా
వేదవ్యాసపరాశరుల్ వెదకిన న్వేఱొండు లేఁడంచు మీ
పాదాంభోజము లెల్లపొద్దు మదిలో భావింతు రత్యున్నతిన్
శ్రీదేవీ వదనారవింద మధుపా శ్రీరంగ నా... 73

మ. సుతదారాప్తజనాది విత్తములపై శూన్యాభిలాషుండునై
యతనోద్రేకయుతంబులై పొదలునయ్యె యింద్రియవ్రాతముల్
మృతిఁబొందించి దమంబునన్ శమమునన్ మీఱంగవర్తించు ని
ర్గతసంసారి భవత్కృపంబొరయు నో కంజాక్ష నా... 74

మ. ప్రమదం బారఁగ పుణ్యకాలగతులన్ భక్తిన్ననుష్ఠింపుచున్
నమర న్నన్నసువర్ణగోసలిల కన్యాధారుణీగ్రామదా
నము లామ్నాయవిధోక్తి భూసురులకున్ సన్మార్గుఁడై యిచ్చువాఁ
డమరేంద్రార్చితవై భవోన్నతుఁడగు న్నామీఁద నా... 75

మ. ఇల నెవ్వారిమనంబులో నెఱుకదా నెంతెంత గల్గుండునా
కొలదిం జెంది వెలుంగుచుండు కలయన్గోవింద నీరూపులన్
యలర న్నంబు మితంబులై సరసిలో నంభోరుహంబుల్ దగన్
నిలనొప్పారెడుచంద మొందెదెపుడు న్నీలాంగ నా... 76

మ. మదిలో నత్తమభక్తిపీఠముపయిన్ మానాథ మీపాదముల్
గదియం జేర్చినవాని కేనొడయఁడన్ గాదంచు నత్యున్నతిన్
పదిలుండై సమవర్తి మృత్యువునకున్ బాఠంబుగాఁ బల్కు మీ
పదపద్మార్చకు లెంతపుణ్యులో కృపాపారీణ నా... 77

మ. కులమెన్నం గొలదేల యేకులజుఁడుం గోత్రాభిమానాభిలా
షలు నజ్ఞానము బాసి జ్ఞానము మదిన్ సంధించి శుద్ధాత్ముఁడై

యలరారం బరుసంబుసోఁకు నినుమున్ హేమాకృతిస్తోమమై
వెలయు న్నాగతి వాఁడుముక్తికరుగున్ వేదాత్మ నా... 78

మ. నిరతానందనియోగులై నియతులై నిర్భాగ్యులై నీచులై
కరుణాహీనమనస్కులై మలినులై కష్టాత్ములై నష్టులై
పరుషవ్యాధినిబద్ధులై పతితులై భగ్నాంగులై మగ్గువా రరయ
న్నిన్నొన్నగి నాత్మయం దిడనివా రబ్జాక్ష నా... 79

మ. ఘనభోగాస్పదులై గతౌఘమతులై కారుణ్యులై ముక్తులై
ధనకీర్తిప్రదులై దయాభిరతులై ధర్మాత్ములై నిత్యులై
మనుజాధీశ్వరులై మనోజనిభులై మాన్యస్థులై స్వస్థులై
యొనరన్నొప్పెడువారు నీపదరుచుల్ యూహించు నా... 80

మ. విదితామ్నాయ నికాయభూతములలో విజ్ఞానసంపత్కళా
స్పదయోగీంద్ర మనస్సరోజములలో బ్రహ్మేంద్రదిక్పాలక
త్రిదశవ్రాతకిరీటరత్నములలో దీపించుచున్నట్టి మీ
పదపద్మంబులు భావగేహమున నే భావింతు నా... 81

మ. వెలయన్ యౌవనకాలమందు మరుఁడున్ వృద్ధాప్యకాలంబునన్
బలురోగంబులు నంత్యమందు యముఁడుం బాధింపఁనట్టైన యీ
పలుజన్మంబులు చాలదూలితి ననుం బాలింపవే దేవ మీ
ఫలితానంద దయావలోకనము నాపైఁజూపు నా... 82

మ. బలుకర్మాయత పాశబంధవితతిన్ బాహాపరిశ్రేణికిన్
జలయంత్రాన్వితబంధయాతనగతిన్ సంసారకూపంబులో
నలరం ద్రిమ్మరుచుండు నన్ను నకటా! యార్తుండనై వేఁడెదన్
వెలయ న్నీకృపచేతఁ జేకొనవె నన్ వేవేగ నా... 83

మ. మమహంకారవికారసన్నిభ మహామత్తాది లోభాంధకా
రముచే ముక్తికి నేఁగుమార్గ మెఱుఁగన్ రాదింక నాలోన నీ
విమలాపాంగదయాదివాకరరుచిన్ వెల్గింపు మింపార నో
కమలానంద విహారవక్షలలితా! కంజాక్ష నా... 84

మ. పరిపంథిక్రియ నొత్తి వెంటఁబడు నప్పాపంబుఁ దూలించి మీ
చరణాబ్జస్థితిపంజరంబు శరణేచ్ఛం జొచ్చితిం గావుమీ
బిరుదుం జూడుము మీరు సూడఁగ భవద్భృత్యుండు దుఃఖంబులం
బొరయ న్నీకపకీర్తిగాదె శరదంభోజాక్ష నా... 85

మ. సతతాచారము సూనృతంబు కృపయున్ సత్యంబుఁనున్ శీలమున్
నతి శాంతత్వము చిత్తశుద్ధి కరమున్ నధ్యాత్మయున్ ధ్యానమున్

ధృతియున్ ధర్మము సర్వజీవహితము౦ దూరంబుగాకుండ స
మ్మతికిం జేరువ మీనివాసనుఖమున్ మానాథ నా... 89
మ. భవనాశిఁ గయ తుంగభద్ర యమునన్ భాగీరథిం గృష్ణ
వేత్రవతి న్నర్మద పెన్న గౌతమి పయోరాశి న్వియద్గంగయం
దవగాహంబున నైనపుణ్యములు పెంపారంగ నేఁ డిచ్చుటన్
భవదంఘ్రి స్మరణంబునంగలుగు నోపద్మాక్ష నా... 87
మ. ధర గ్రామాధిపు నింటిదాసుఁడు వెసం చాద్రోహముం జేసినన్
పరగం జెల్లుట సూచితీ భువన సంపాద్యుండ వైనట్టి మీ
వరదాసావలి దాసదాసినని దుర్వారాఘముల్ జేసితిన్
కరుణంజేకొని కావుమయ్య త్రిజగత్కల్యాణ నా... 88
మ. గణుతింపన్ బహుధర్మశాస్త్ర నిగమాఘం బెప్పుడు న్నిన్న కా
రణబంధుఁడనిచెప్ప సత్తెఱఁగు దూరంబందకుండంగనే
బ్రణతుల్ జేసెదఁ గొంతయైన గణుతింపం బాడిలేకుండినన్
ఋణమానానుతి నీవు శ్రీపతివి నీకేలప్పు? నా... 89
మ. కరినాథుండు జలగ్రహగ్రహణ దుఃఖాక్రాంతుఁడై యాశ మీ
శరణంబన్నఁ గృశానుభాను శతతేజస్ఫూర్తియైనట్టి మీ
కరచక్రంబున నక్రకంఠము వెసన్ ఖండించి మించెం దయా
పరసద్భక్తభయానక ప్రకర సత్ప్రాకట్య నా... 90
శా. ఏభావంబున నిన్ దలంచె గజయూథేంద్రుండు ఆపన్నుఁడై
యేభావంబున దౌప్రపదయ్యెడ రమాధీశా యనె న్వాయసం
బేభావంబున నీశరణ్య మనెనో యానీకృపాదృష్టిచే
నాభావంబున నీతలంపుఁ గలుగ న్నాకిమ్ము నా... 91
శా. నీలగ్రీవుఁడు చేతిపుర్రె విడిచె న్నీయింతి భిక్షఁబునన్
నీలగ్రీవుఁడు యాశ్వరాఖ్యఁ దనరె న్నీనామజప్యంబునన్
నీలగ్రీవుఁడు మించిత్రుంచెఁ బురముల్ నీప్రాపు సేవించినన్
నీలగ్రీవముఖాబ్జభాస్కరకృపానిత్యాత్మనా... 92
మ. నినువర్ణింపనివాఁడు మూఁగ మదిలో నీనామముఁన్ వీనులన్
విని మోదింపనివాఁడు చెవ్వుమరినిన్ వేడ్కన్ మనోవీథినిన్
గనిపూజింపనివాఁడు నాశకరుఁడౌ కర్మక్రియారంభుఁడై
తనలోఁ గానని వాఁడు నీచమతియౌ తత్త్వజ్ఞ నా... 93
మ. నినువర్ణింపని నీచబంధమతి దానిర్మగ్నమూఢాత్ముఁడై
పెనుదైవంబులఁ గోరి తా మనమునన్ సేవించుచందంబుతా

వనలం బారిన భూతియందు వెలయు న్నాజ్యాహుతుల్ పూనివే
ల్చినచందంబున వ్యర్థమై తనరు జూచిదూ్రప నా... 94

మ. నినువర్ణింపని జిహ్వ దాఁబడటికా? నీలాభ్రదేహాంగకా
నినునాలింపనిచెవులు దాఁ బడటికా! నీరేజపత్రేక్షణా
నినుఁబూజింపని కేలు దాఁ బడటికా? నిర్వాహకక్ష్మాతలా
నినుఁ జింతింపనియాత్మ దాఁ బడటికా? నిర్వాణ నా... 95

శా. నీవేతల్లివి నీవెతండ్రి వరయన్నీవే జగన్నాథుఁడౌ
నీవేనిశ్చలబాంధవుండ వరయ న్నీవేమునిస్తుత్యుఁడౌ
నీవేశంకరమూలమంత్ర మరయన్ నీవే జగత్కర్తవున్
నీవేదిక్కను వారి వారలె కడు న్నీవారు నా... 96

మ. అపరాధంబులు నిన్నునమ్మి వినుమే నాజన్మపర్యంతముల్
విపరీతంబుగఁ జేసినాఁడనిఁక నీవేదిక్కు నాలోనికిన్
గపటం బింతయులేక దండధరుకుం గట్టీక రక్షింపుమీ
కృపకుం బాత్రుఁడనయ్య ధర్మపురిలక్ష్మీనాథ నా... 97

శా. చెల్లం జేసితి పాతకంబులు మదిన్ శ్రీనాథ మీనామముల్
పొల్లుల్ బోవనినమ్మి పద్యశతమున్ బూర్ణంబుగాఁ జెప్పితిన్
చెల్లం బోనను నమ్మి వీఁడని దయం జేపట్టి రక్షింపుమీ
తల్లిందండ్రియు నీవుగాక యొరులే తర్కింప నా... 98

మ. నరసింహాచ్యుత వాసుదేవ వికసన్నాళీకపత్రాక్ష భూ
ధరగోవిందముకుంద కేశవ జగత్త్రాతాహితల్పాంబుజో
దరదామోదరతార్క్ష్యవాహనమహాదైత్యారివైకుంఠమం
దిరపీతాంబరభక్తవత్సల కృపన్ దీపింపు నా... 99

మ. కడకంట న్గడలేని సంపదలొగిం గావింపు లక్ష్మీశపా
ల్కడలిన్ బన్నగశాయివై భువనముల్ గల్పించు సత్పుత్రినిన్
బొడమన్ జేసిన నాభిపంకజ జగత్పుణ్యాత్మ భాగీరథీ
పడతింగన్న పదారవిందముల నే భావింతు నా... 100

మ. తపముల్ మంత్రసమస్త యజ్ఞఫలముల్ దానక్రియారంభముల్
జపముల్ పుణ్యసుతీర్థసేవఫలముల్ సద్వేదవిజ్ఞానముల్
ఉపవాస వ్రతశీలకర్మ ఫలముల్ యొప్పార నిన్నాత్మలో
నుపమింపం గలవారికే గలుగు వేయున్నేల నా... 101

శా. శ్రీనారాయణ యన్నఁ జాలు దురితశ్రేణి న్నివారింపఁగా
నానందస్థితి గల్గునంచు నిగమార్థానేక మెల్లప్పుడున్

నానాభంగులఁ జెప్ప నేను విని శ్రీనారాయణా యంచు ని
న్నే నేనెప్పుడు గొల్తు బ్రోవఁగదె తండ్రీ నన్ను నా... 102

మ. కలితాఘౌఘ వినాశకారి యగుచుం గైవల్య సంధాయి యై
నలి నొప్పారెడు మంత్రరాజ మగు నీనామంబు ప్రేమంబునన్
అలరన్నెవ్వని వాక్కునం బొరయదో యన్నీచుదేహంబు దా
వెలయన్ భూరుహకోటరం బదియ సూవేదాత్మ నా... 103

మ. రమణీయంబుగ నాదిమంబు నవతారంబుల్ భవద్దివ్యరూ
పము నామామృతముల్ దలంప దశకప్రాప్తమ్యెఁ గృష్ణావతా
రము సుజ్ఞానము మోక్షముల్ ద్వివిధసంప్రాప్తిన్ శతాంధ్రాఖ్యకా
వ్యము నర్పించితి మీపదాబ్జములకున్ వైకుంఠ నా... 104

శా. నీమూర్తుల్ గన నీకథల్ వినఁ దుదిన్ నీపాదనిర్మాల్య ని
ష్ఠామోదంబు నెఱుంగ, నీచరణతోయం బాడ, నైవేద్యముల్
నీమంబొప్ప భుజింప నీజపము వర్ణింపన్ గృపం జేయవే
శ్రీమించన్ బహుజన్మజన్మములకున్ శ్రీయాది నా... 105

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ
పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన నారాయణ శతకంబున

సర్వంబును సంపూర్ణము.






# మహిజామనోహర శతకము





శ్రీ రమణీమనోహర యశేషఋషీశ్వర దేవతాశ్రితా
పూరిత పాదపద్మములకున్ బ్రణమిల్లి రచింతు నేఁడు సం
సారగభీర ఘోరతరసాగర మేను తరించఁగోరి నీ
తారకనామ కావ్యము యథావిధిగా మహిజామనోహరా. 1

ఉ. రేమెలవంశసంభవుఁడ రేణిగ నార్వేలగోత్రజుండనో
రామ సురారిభంజన సురార్చితవిగ్రహ రామదాసుఁడన్
కామ మెలర్ప నొక్క శతకంబును గానుకగా నొనర్చి మీ
వామపదాబ్జముల్ గొలుతు వ్యాసనుతా మహిజామనోహరా...

ఉ. అప్పయసూరి సౌమ్యగుణి నంచితశీలిని వెంకమాంబనున్
ఒప్పుగఁ బెండ్లియాడి ధరనుత్తమచర్యలఁ గీర్తిఁ బొందె యా
కప్పురగంధికిన్ చతురగర్భజ రామయనామధేయుఁడన్
దప్పకఁ జేతు మీ భజన దాసుఁడనై మహిజామనో... 3

ఉ. ధైర్యమును న్మహత్త్వమును ధార్మికమున్ధనధాన్యసంపదౌ
దార్యమహాతపస్వి భయదాకృతి పండితకోటికి న్సదా
చార్యము సూపినట్టి ప్రతివాది భయంకరయార్యసింగరా
చార్యుల శిష్యుఁడ న్విమలచక్రధరా మ... 4

ఉ. బాధలు మాన్పి ధీరప్రతిపక్షభయంకరులైన రావుగం
గాధర రామరావు కరుణారసభావముఁ బూని బ్రోవఁగా
మాధవ దుగ్గుదుర్తిపురమందు నివాసముఁ జేయుచుందు మో
రాధ మనోహరా కలుషరాగహరా మ... 5

ఉ. శ్రీరమణీయ మీచరణసేవయు మా కనయం బొసంగుమీ
తారకనామమంత్రమును దాండవమాడఁగ నాదు జిహ్వపై
ధారణఁజేసి నాయుష్షును తర్లఁగఁ జేయుము శేషశాయి మీ,
దారికిఁ జేరినాఁడసుమి పాపహరా మ... 6

ఉ. పావనరామమంత్రమును పాటిగఁ బొందుట యెన్నఁ డబ్బునో
భావమునందు మీచరణపద్మము లెప్పుడు నిల్పుటెన్నఁడో
భూవర మీదయారసము పూర్ణముగా మఱివచ్చు టెప్పుడో
పావనుఁజేయ శక్తుఁడవు పాపహరా, మ... 7

చ. పదములు నమ్మినాఁడ నతిపామరుఁడంచు దలంపకయ్య మీ
సదమలపాదపద్మములు సారెకుఁ గొల్చినవారిదోషముల్
పదపదమంచుఁ ద్రోతువట పాయక నామొఱయాలకించి నీ
వదనముఁ జూపవేమిటికి వాలిహరా మ... 8

ఉ. రమ్మిఁక జాలమేల నను రాపులఁబెట్టకు దాసకామ ని
న్నమ్మితి రామ నీమదయ నాపయి నించుకరాద దేమి మీ
కమ్మితి దేహమింకనిజ మారడిఁబెట్టకు సూరికామ ని
న్నమ్మికచేతఁ గొల్చెదను నామదిలో మ... 9

ఉ. ఓరఘురామయంచు బహుకోరికఁ బిల్వఁగ నేలరావు రా
నేరము చాలఁగల్గినను నీరజనాభ సహింపఁగాదగుఁ
గూరిమిచేత నీవు నను ఘోరభవాంబుధిలోన వేసటల్
దూరముఁజేసి యేలుమిఁక దోషహరా మ... 10

ఉ. కాముకుఁడంచు నీవుననుఁ గాలభటాళికిఁ జేర్పకయ్య యో
తామరసాక్ష దీను నిటుఁ దాపము నొందఁగనేఁచ న్యాయమా
కోమలదేహ నామనవిఁ గూరిమితో వినరావ నాపయిన్
దామసమేలనీకు నిటు దాసునిఁగా మ... 11

చ. ఘనుఁడవటంచు నమ్మితి నఘౌఘములఁదోలుము రామదాసుని
న్ఘనతగఁ బ్రోవరావ ననుఁగంజదళాక్ష నిరాకరించుట
న్మనమున నెన్నఁ డెంచకు రమాపతి యెట్లుఁదలంచినావొ యీ
తనువును నమ్మలేమర సదామదిలో మ... 12

ఉ. వాసిఁదొలంగి నీభటులు వ్యాధివిబొందినఁ గీర్తియేరిదో
రోసములేక దాసునెడ రూఢిగఁ బ్రోచెడివాఁడ వంచు నే
దోసిలియొగ్గి సంస్తుతులు దోషహరా నినుఁ జేయుచుందు నీ
దాసులలోన నేనొకఁడ దాసుఁడనై మ.. 13

చ. కరివరునేలినావు మునుఁ గాంక్షయొకింతయులేక కాకమున్
శరణనివేఁడఁగానె దయశాలివినై కరుణించినావు నా
మొఱవిని కావవేమి నిను మోదముతో స్తుతిసేయుచుందునో
తరణికులేశ యీభవము ధన్యతకై మ... 14

ఉ. చూడఁగ నీపదద్వయముసొంపు నుతింపఁగ నెంతవాఁడనే
వీఁడను నీదుభక్తియుఁ నేనుఁ జాటుననైన నామదిన్
వేఁడెద రామరామయని వేడుకతోడ భజింపుచుందు నీ
వాఁడను నన్నుఁ బ్రోవు మిఁక వాలిహరా మ... 15

ఉ. వాదముజేసి దాసపరివారజనంబులలోన నుండెద
న్నాదని నీవు యేవిధము మాయలుజేసిన నీదుభక్తిచే
నాదరిజేరకుండఁగను నౌరని దాసులు మెచ్చ రోలెద
న్వాదమె మీకునాకు మరి వాలిహరా మ... 16

చ. మరణము నొందువేళ నినుమాటికి పన్నగశాయి యంచునే
దిరముగఁబల్కఁజాల నను దీనదయాపర యేమిజేతువో
యిరువుగ నిప్పుడే మదిని యీశ్వరపూజిత నీదు నామము
ల్తరచి తరింపఁగోరెద సదా మదిలో మ... 17

ఉ. జాలము సేయఁగాఁ దగదు చాలురనావయి పంతమేలరా
జాలియొకప్పుడైన ననుఁ జాలఁగ నమ్మిన వాఁడటంచు నా
పాలిఁటఁ బుట్టదాయె భవబంధము తేగతిఁ బాపువాఁడవో
దూలితబాధ బెట్టకిక దోషహరా మ... 18

ఉ. దాసులు వెంట వత్తురని దానవమారణ వైనతేయునిన్
వాసిగఁజూచి నీకతఁడు వాహనమౌటకుఁ గారణం బగున్
భాసురహస్తి గుఱ్ఱములు పల్లకియుండఁగ వైనతేయునిన్
వాసిగ నెక్కుటేమిటికి వాలిహరా మ... 19

ఉ. నారద గానలోలతను నామొఱ వీనుల నాటదాయెనో
తారక రామనామములు దాసులు బాడుచు చుట్టుకుండిరో
పారములేని పాతకుని భారముగా విని యూరకుంటివో
నేరములేదు యుండినను నేలగదే మ... 20

ఉ. విన్నపమాలకించు పరవీరభయంకర నీదునామముల్
సన్నుతిఁజేయు దాసులకు సాదరమోక్ష మొసంగినావు నీ
కన్న మహాత్ముఁడున్ గలఁడె కానకపోయితి నిన్నినాళ్ళు నా
కన్న దురాత్ముఁడున్ గలఁడె కంసహరా మ... 21

ఉ. చిత్తమునందు నీపయిని చింత యెకప్పుడు మానలేదు నీ
చిత్తమునందు నన్మరచి చిక్కులు బెట్టఁగనేల రామ మీ
చిత్తము నింత బింకముగఁ జేసితె దాసుఁడు యెట్లునోర్చు మీ
చిత్తము కెట్లుదోఁచినదొ చిక్కదురా మ... 22

ఉ. ఎంతని వేడుకొందు నిను యేమనిదూరుదు యేమిజేతురా
పంతము కెంతవాఁడ బలుపంతము జేయకు మోర్వఁజాల నీ
వింత శిలాత్మకుండవని యెన్న డెఱుంగక పోయినాను నే
నింతటిలోనె తెలితని యెంచకుమీ మ... 23

చ. కరివరునిన్ విభీషణుని గాకమునున్ గుహునిన్ గుచేలునిన్
మరియును గుబ్జనున్ రవికుమారుని నాదిగఁ గాచినావు గా
నరమరలేక నీవునటు నన్నొకనిన్ దయఁ జూడకుందువా
పరమమునీంద్ర యోగిజన పాపహరా మ... 24

ఉ. ఏమిరరామ నన్నిటుల నేచుట ధర్మముగాదు యేలరా
పామరుగాచుటే బిరుదు పావనరామ తలంచిచూచినన్
బామరు గానివాని భువిఁ బాలనఁ జేయుటగాదు కేశవా
నీమది నెంచిచూడు మిఁకనిక్కము రా మ ... 25

ఉ. ఒక్కొకవేళ నిన్మదిని నోరఘువీర దలంపకుందు వే
రొక్కొకవేళ మీసొగసురూపము జూపుచుటంచు వేడుచున్
మక్కువచేత వీనిని సమత్వముజేయుము నీమనంబులో
తక్కినకోరికేల పటుదైత్యహరా మ... 26

ఉ. నీదయరాదు నాపయిని నేఁ డెవరిన్ కరుణించమందునో
యాదవవంశపావనుఁడ యాదరమించుక పుట్టదాయె నీ
పాదసరోరుహంబులును భావములోపల వేఁడువారికిన్
నీదగుసన్నిధిచ్చితివి నే నెరుసా మ... 27

చ. సనకసనందాది మునిసంఘమె చాలునటంచు నామొఱ
ల్వినమును వీరలన్వినియు దీక్షవహించియు బ్రోవకుంటివో
ననునటుగాక చాలగను నాపద బెట్టదలంచినాడవో
మనమువ కుందు బుట్టె నిక మాన్పగదే మ... 28

చ. పరులను వేఁడనంటి నినుఁ బ్రార్థనఁ జేయుచునుంటి నిత్యమున్
దగదని పాదసేవయును దాసునకిమ్మనుచుంటి శ్రీహరీ
పరమపదం బొసంగుటకుఁ బాత్రుడనైతినొ లేదో దెల్పవే
పరమదయాంతరంగ బహుపాపహరా మ... 29

చ. పటుతరమైన మాయలకు పన్నగభూషనుత ప్రతాప నే
నెటువలె నోర్చువాఁడ జగధీశ్వర నన్నను గావకున్న యా
చటులతరమ్ము నన్నుడుకు చిమ్ముచునుండెడి పాపవారధిన్
దొటుదరిజేరువాఁడ నిఁక నేలగదే మ .. 30

ఉ. ప్రోచిననీవు నన్ను విడఁజూచిన నీకృపఁగోరి యుండితిన్
భూచరఖేచరాళికినిబోషకకర్తవు నీవె రామ చేఁ
జాచి కృపాకరుండవని సంతసమందభయంబుగోరితే
యోచనబుట్ట దిచ్చుటకు యోగిరుతా మ... 31

చ. శరణని మిమ్ము వేడఁగను శత్రునితమ్ముఁడటంచు నీమదిన్
నిరసన బుట్టకుండగను నెమ్మదిగా దయనేలినావు నే
నిరతము నిన్నుఁగోరి కరుణించుమటంచు భజించి వేడగా
కరఁగదు నీమనంబెటులు కంసహరా మ... 32

ఉ. భావజ శత్రుమిత్ర భవబంధవిమోచన శస్త్రదీపికా
పావన నీలగాత్ర నవపద్మదళాయతనేత్ర శ్రీకరా
భావనమాలసూత్ర ఘనపంకజధామ రమాకళత్ర నా
భావమునందు కల్మషము బాపఁగదే మ... 33

ఉ. రంగదరాతి భీషమణిరాజవిరాజిత భూష గోపికా
సంగసమగ్రవేష ననయంబున దాసజనాళిపోష ని
ర్భంగతరంగ సంఘములపాప పయోనిధి శోషకామ దు
స్సంగతిఁ బొందకుండఁగను జేయగదే మ... 34

ఉ. దానవసంహరాయ రణదర్పితశూరహరాయ సేవకా
దీనదయారసాయ జగదేకవిరాట్పురుషాయ శ్రీరమా
మానసపద్మభృంగ యతిభాసిత మంగళవిగ్రహాయ నా
మో నమయంచు మ్రొక్కెడుదుఁ బ్రోవగదే మ... 35

ఉ. దీనజనాళిఁ బ్రోచుటకు దిక్కెవరింకను సామి యీవిధిన్
దీనతఁ బెట్టనేల భవదీయకటాక్షము రాద నాపయిన్
కానిర నిన్ను నమ్మగను కష్టము బెట్టఁదలంచినావుగా
కానక చేసితి న్నఘము గావగదే మ... 36

ఉ. ఎన్నగరాని యాయమునిహింసకు లోఁబడకుండ మున్నె వో
పన్నగశాయి కాయమున బల్మియు దప్పక మున్నెవో మహా
పన్నశరణ్య కాలభటబాధలు జెందకమున్నె రామ మీ
సన్నుత పాదపద్మముల చాటున నుంచుము ప్రేమతోడ నా
విన్నప మాలకించు యతివేగముగా మ... 37

ఉ. రామ యనేకరాక్షసవిరామ సదాసుగుణాలలామ నీ
నామసుధారసంబు మరి నాకును దృప్తిని బొందనియ్యవే
సామజరాజరక్షకుఁడ సంతతము న్భజియించి నమ్మితిన్

కామవికారము ల్గణఁచి కావఁగదే మ... 38

ఉ. చేసితి దుష్టకృత్యములు జీర్ణవయస్కుల జూచి నవ్వితిన్
రోసితి సజ్జనుల్పయిని రోసము జేసితి రామరామ నే
జేసిన నేరము ల్దలఁచి చిక్కులు బెట్టకు దాసకామ నీ
దాసులలోన నేనొకఁడ దాసునిగా మ... 39

ఉ. పాపములన్ని నీవు మొనఁబాపెడి సామివటంచు నమ్మితిన్
యాపదఁబాపవే పరమయార్తశరణ్య కృపాకరుండవై
జూపుము నీదురూపమిటు సూరిజనస్తుత నీవె దిక్కను
ద్దీపిత శత్రుమూర్ధ్నిచర దివ్యశరా మ... 40

చ. మనవి పరాకుగా వినకు భాసురతేజ మదీయదోషము
ల్దునిమి నిరంతరంబు కృపతోఁ బరిపాలనఁ జేయుమయ్య మీ
తనయుని మీఁద యింత దయదప్పిన వేరెనికేమనందు నీ
మనమున కిట్లుదోఁచినద మంచిదటే మ... 41

ఉ. నీసరి దైవముల్గలరె నిశ్చయమహాధర మానవాళిలో
నాసరి పాతకుల్గలరె నమ్మినదైవము నీవె పాపము
ల్వీసము జెందకుండ నను వేంకటనాయక జేయుమయ్య యా
భాసుని జేయకయ్య భవబంధహరా మ... 42

చ. అతికఠినుండవీవు బహునాపద బొందినవాఁడ నేను నీ
మతముకు జాలిబుట్టదెటు మంచిది బంగరురంగశాయి నా
పతితము మాన్ప వేరొకరు భారకులెవ్వరు నీవుదప్ప న
న్నితరులు లేరు గాచుటకు నేలగదే మ... 43

చ. దినముదినంబునందు యతిదీనుఁడనై బ్రతిమాలుచుండఁగాఁ
గనికరమింతలేదొ కడకంటెనినైననుఁ జూడవైతివే
మనఁగల దీర్ఘకోప మిఁకమాని ననుఁ గృపఁజూడుమయ్య మీ
తనయుఁడఁగాన నేను ఘనదైత్యహరా మ... 44

చ. సలలిత నీదునామ జపసంగతెఱుంగ గిరీశగాను
సద్విలసితపాదపద్మ భవదించుకరేణు మహత్ప్రభావముల్
దెలియ వహాల్యగాను జగతీవర నీమృదుసత్యభాషలన్
దలఁపఁగ రావణానుజుని తమ్మునిగాను భవద్విలాసముల్
దెలిసి నుతింప నాతరమె దేవనుతా మ... 45

ఉ. నీసగురాకగోరి ధరణీతలమందున స్వాతివానకున్
మోదముతోడ శుక్తివలె భూమిజనాయక నున్నవాఁడ నా

మీఁదను నీకు నింతచల మెఁదుకు నిన్ను నమ్మియుంటి రా
రా దరిఁజేర్చి యేలగద రా కృపచే మ... 46

ఉ. ఫుల్లసరోజనేత్ర ఘనపుణ్యచరిత్ర విభూతిరాజితా
పల్లవరాజపుత్ర శశివంశజు నర్జునమిత్ర గోపికా
యుల్లసరోజమిత్ర ఘనయోగిజనస్తుతిపాత్ర రామ నా
యుల్లములోపల న్నిలుము యోగిసుత్రామ ... 47

చ. దురితభరంబుదోలి మరితుచ్ఛమతంబు వధింపఁ జాలి ని
బ్బరపు సుబుద్ధినేలి పటుభానుజదూతలఁ బారదోలి శ్రీ
ధర తవపాదపద్మ సుధధారలు గ్రోలి భజించువాఁడె రా
తరగని పుణ్యశాలి ఘనదైత్యహరా మ... 48

ఉ. భావజకోటిరూప భవబంధవిదారణరూప పాండు రా
జీవయశఃకలాప పరచిత్తభయంకర చాప యోమహా
దేవనుతప్రతాప జగదేకవిరాజిత భూప రాగదే
కావగదే ననుం గృపను కంసహరా మ... 49

చ. వలదు చలంబు నాయెడను వారిజనేత్ర దయాసముద్ర న
న్నలసటఁబెట్ట నీకు మరినాయముగాదని యెంతవేఁడినన్
పలుకవు యింక నే నెవరి పాలికిఁ జేరుదునయ్య యయ్య నీ
తలపునఁ జాలిఁబుట్టదెటు దైత్యహరా మ... 50

ఉ. నీపదభక్తి సల్పుచు ననేకము లైన దురంతకార్యముల్
పాపమనంబుచేత పరభామలకౌఁగిటఁ జిక్కి చేసితిన్
పాపుడటంచు నన్ను యెడఁబాయకు సామి తరింపఁజేయవే
తాపము నొందఁజాల పటుదైత్యహరా మ... 51

ఉ. నీదరిఁ జేరినాఁడ బహునేరము లెన్నక నాదరంబుచే
నాదుభయంబుదీర్చి శరణాగతచిహ్నము బొందవయ్య రా
మా దయ యేలరాదు పరమాప్తుఁడవంచును కోరియుండితే
ఖేదము బెట్టుచుండితివి క్రూరహరా మ... 52

ఉ. కోరినకోర్కెలిచ్చెదని కుంభినిలోపల యార్యులందఱున్
భూరిగఁ జెప్పుచుండఁగను బొందుగ వింటి నిజంబునైతె సం
సారభయంబు వాపి ధరఁ జాగుతరంబగు మోక్షమార్గమున్
నేరములెన్నియున్న నీకనియ్యగదే మ... 53

ఉ. ఎన్నటికైన నిన్ను మదియందున సంతసపాటుతోడ నా
కన్నులనిండఁ జూచుటకుఁ గల్గునొ గల్గదొ దెల్పవయ్య యా

వన్నతఁ జెందనయ్య భవబంధముచేతను బ్రోవవయ్య రా
మన్న పరాకదేల వినుమా మొఱలన్ మ... 54

చ. దురితపయోధిలో మునిఁగిదోఁగకమున్నె జరాదిరోగముల్
బిరబిరవచ్చి యీతనువు బింకము నొంచకమున్నె కుత్తుకన్
గురగురలాడుచున్ కఫముఁ గూడకమున్నె భజించ దోషముల్
శరమునఁ గూల్చవయ్య పటుచక్రధరా మ...

ఉ. ధీరతనిన్ను వేఁడుటకు దివ్యచరిత్ర ధ్రువుండఁగాను దై
త్యారిజనార్దనా పరమదైవమయంచు నుతింపసాగ న
క్రూరునిఁగాను పామరుఁడ కృష్ణభవద్వినుతేఁ జేయఁగా
నేరనఁ జాలమేల కరుణించఁగదే మ... 56

ఉ. చేసినదుష్కృతిన్ దునిమి చింతను బాపిటుఁ గారవంబుచే
దాసజనాళిలోఁ గలిపి ధన్యత నొందఁగఁ జేయుమయ్య యో
భాసురచక్రధారి పరభాసురశౌర్యహతస్వరూప నా
దోసము గొట్టివేయుటకుఁ దోఁచదుగా మ... 57

చ. పరమకృపానిధే విమలపంకజనేత్ర హరేయటంచు ని
బ్బరమతులై నిను న్భజన పాయక జేసిన వారిపుణ్యముల్
తరమె వచింప శేషునకు ధాతకునైనను నీదునామముల్
మఱవని వాఁడెపుణ్యుఁడగు మాన్యుఁడునౌ మ... 58

ఉ. కానుకలివ్వఁజాల కతికంధిగిరీశ...లట్లనీ
మానితపాదపద్మములు భావమునందు భజింపఁజాల నా
దీనతఁ బాపవేల జగతీధవ చాలఁగ నమ్మియుండితిన్
దానవసంహరా దురితదైత్యహరా మ... 59

ఉ. దండధరుండుఁ బెట్టు పటుదండనకేను భయంబుఁ జెంది నీ
యండను జేరియుంటి నభయంబు ఘనంబుగ నివ్వవేమి కో
దండకళాప్రవీణ భవదండను జేరిన దాసకోటికిన్
దండిగ మోక్షమిచ్చితివి దైత్యహరా మ... 60

చ. మునునిను వేఁడువారిని నమోఘముగాదయఁ జూచినావు న
న్నును నటుఁజూడవేమి శరణోరఘురామ యటంచు వేఁడుచున్
దినములు దుర్భరంబుగను దీనదయాపర త్రోయుచుండు నీ
వినవు యదేమి నామనవి వేదనుతా మ... 61

ఉ. తల్లివి దండ్రివంచు మరిదాత గురుండవటంచు నేను శ్రీ
సల్లలితంబులైన పదసారసముల్ మది నమ్మియుండితే

నల్లనిమేనువాఁడ కరుణారసమొందుకు బుట్టనయ్య నీ
యుల్లమునిండ కల్మషమె యోగినుతా మ... 62

చ. మిమునిటు వేఁడుచుండఁగను మెల్లఁగఁ బ్రాణము లెప్డుపోవునో
కమలదళాక్ష వానిఁక కాలభటుల్ గొనిపోవకుండఁగా
శమనుని కాజ్ఞ సేయుము విశాలబలున్ దరి కావలుంచవే
మమయిసుమంటకుండ భవబంధహరా మ... 63

ఉ. రమ్మ్ర విహంగవాహన నిరంతరవైరము నీకునాకు వీ
సమ్మనులేదు నుండిచను జక్కనిరామ క్షమించి నన్ను మీ
సమ్ముఖమందునున్న మునిసంఘములోపల నుంచివేయ దో
సమ్ములు దుంపవే దురితపాశహరా మ... 64

ఉ. బాములు నెత్తఁజాల ననుభావములోపల నుంచవేల నా
సామివి నీవు చక్కఁగను శాంతముచేతను రావదేల ని
ష్కామునిఁ జేయవేల భవసాగర వీచులనీఁదఁజాల నీ
దామమునందు దాఁచఁగదె దైత్యహరా మ... 65

ఉ కోపము నాపఁజాలన్ మదినిగూరిమిఁ బుట్టదు గావరావు నా
పాపము యేమొగాని యొకమారిటుఁ జూడకనుంటివేమి యో
తాపసబృంద యీగతిసదా కఠినంబు వహించి యుండితే
నాపదలెట్లు బాతు విను నందసుతా మ... 66

ఉ. ఎంతటివాఁడవయ్య విను మెన్నటికిన్ నినునమ్మరాదు నీ
చెంతనుఁ జేరియుండినను చిక్కులు బెట్టఁదలంచితౌర నే
నింతకు నేమిజేసితిని నీవు యెఱుంగని ఘోరకృత్యముల్
పంతముమాను నాపయిని పాపహరా మ... 67

చ. నిను మరినమ్మరాదనుచు నేరములెన్నుచు బల్కినాఁడ నీ
మనమున ముద్దువాక్యముగ భావనఁజేయుము రోషగించకే
నను గృపఁజూడు దాసుఁడ ననాదరణీయుఁడనైతి బ్రోవరా
తనువునిఁకే లనిత్యమిది దైత్యహరా మ... 68

ఉ. పొండని కాంతుల న్విడిచి పూజలొనర్చిన వారి దోషముల్
కొండలవంటివైన ధరఁగూలి హరించక యున్నె నిత్యమా
ఖండలసంపదల్ భువిని గల్గకయుండునె ముక్తికాంతకై
దండను నివ్వకున్నె తుది దైత్యహరా మ... 69

చ. దశరథరాజగర్భమున ధారుణియందునఁ బుట్టి యేపునన్
మశకములట్లు దానవుల మారణఁజేసి సురాళికిన్ సదా

కుశలము నొందఁజేసి జనకోటికి సంతసమబ్బునట్లుగా
దశదిశలెల్ల నేలితివి దైత్యహరా మ... 70

ఉ. ఏటికి రామయీవరుస హింసకు బెట్టెదు వోర్వఁజాల నీ
పాటికినైన నన్ను దయపాలికిఁ బిల్వుము రంగశాయి నా
కాటలఁబ్రోచినట్లు ననుఁగావఁగరాద చలంబదేలరా
తాటకసంహరా దురితదైత్యహరా మ... 71

ఉ. శ్రీయుతమోముతో పరమసేవకసాధుజనాళితోలస
చ్ఛాయలనీను హారసముదాయముతో నతిశాంతమూర్తివై
రా యభయంబు నియ్యగదవే యపరాధినిఁ గావవే జగ
ద్గేయ గుణాలవాల ఘనకీర్తి ధరా మ... 72

చ. పరభయచక్రధారి భవబంధవిమోచనకారి యేలరా
కరగదు నీమనంబు కనకాంబరధారి యిఁకేమిజేతు యే
తెఱఁగున నాపదల్ గడతు దీనతఁ బెట్టుట మంచియేకదా
వరమునియోగివంద్య బహువ్యాధిహరా మ... 73

ఉ. స్నేహితుఁడైన యావరకు చేలునకున్ ధనసంపదల్ బహూ
త్సాహముతో నొసంగి మరి దానునిఁగాఁ గృపఁజూచినావు వై
దేహివిభుండ యాకరణి దివ్యముగాఁ గరుణించకున్న యో
శ్రీహరి యెందుఁబోదు నిఁక చింతిలుచున్ మ... 74

చ. కరుణ యొకింతరాదొ నను గాచుటకున్ మరివేళగాదొ నా
మొఱవిన నీకు నాదరముఁ బుట్టకయున్నదొ యిట్లుగాక నన్
గరుణను జూడకుండుటకుఁ గారణమేమి దయాసముద్ర నీ
దరిసెన మెవ్విధిన్నగును దైత్యహరా మ... 75

ఉ ఘోరములైన పాపములఁ గూల్పఁగఁజాలిన మేటివయ్యు సం
సారులకెల్ల నీవు సిరిసంపద లిచ్చెడివాఁడవయ్యు నిన్
భూరిగ గొల్చుభక్తులకు మోక్షమునిచ్చెడివాఁడవయ్యు న
న్వేఱుగఁ జేసి తేమనుదు వేధనుతా మ... 76

చ. పలుకవదేల యో పతితపావన రామ యటంచుఁ బిల్వఁగా
నలిగినయట్లు నుంటివిఁక నాదరమెప్పుడుఁ బుట్టునయ్య నీ
తలఁపున శంకమాని భవదంఘ్రులుఁ జూపుము నమ్మియుంటి న
త్ఫలమునుఁ బొందఁజేయఁగదె పాపహరా మ... 77

ఉ. ఇప్పుడు బ్రోవకున్న మరియెప్పుడు బ్రోతువు రంగశాయి మా
యప్పవునీవు చాలఁగను యాదరముంచి ఘనంబులైన నా

తప్పులు గావు మీయెడను దైన్యముఁ బెట్టఁగరాదు దీనుఁడన్
దప్పకఁజేతు మీభజన దాసుఁడనై మ... 78

ఉ. బంటను దాసపోషబిరుదాంకితరామ పురారిమిత్ర నా
జంటను బాయకుండఁగను చక్కఁగ రమ్మని వేఁడుకొంటి నీ
వింటివొ లేదొ నాదుమొఱ వీనులసోక పరాకదేల నా
దంటకు రావదేల ఘనదైత్యహరా మ... 79

ఉ. ఎంతనివేఁడుకొందు జగదీశ్వర నాపయిఁ బ్రేమనీకుఁ గా
సింతయునైన లేక మరిచిక్కులు బెట్టఁగరాదు నామొఱా
లింతువటంచు నమ్మితి నిలింపులగుంపులనేలుమేటి క
త్యంతము భారమా నను దయామతిఁ బ్రోచుట గానరాదు మున్
దంతినిఁ గావవే కృపను దైత్యహరా మ... 80

ఉ. పాపపుబుద్ధిచేత బహుపాపము లార్జనఁజేయుచున్ దురా
లాపము లాడుచుండెనని రాఘవరామ తలంపకయ్య నీ
దాపున జేరియుంటి నను దాసునిగాఁ గృపఁజూచి నేరముల్
కోపములేక బాపఁగదె కూరిమితో మ... 81

చ. కరివరదా రమారమణ కారుణికోత్తమ భక్తపాల నీ
మఱుఁగునఁజొచ్చియుంటి నను బంటుగ నేలుము శాశ్వతంబుగా
పరమపదంబునందు యతిభాతిగ నన్నుసుపంగఁగోరితిన్
సరగుననీవె యీవరము శాంతముచే మ... 82

ఉ. ఏమిర రామచంద్ర నను నేలినవాఁడవటంచు వేఁడితే
కామితదాసుకోరికెను గైకొనకుంటివి యించుకైన నే
నేమియుఁ జేయువాఁడ నిను నిష్ఠురవాక్యము లాడఁజాల రా
మా మనసందు వాదమిఁక మాన్పవుగా మ... 83

ఉ. శ్రీవర మీపదాబ్జములు సేవయొనర్చుచు నమ్మియుంటి నా
భావములోన యోపరమపావననామ పురారిమిత్ర న
న్గావఁగ రాకయుండి చిరకాలముఁ జిక్కులఁ బెట్టుచుండితే
నావశమౌనె యోర్చుటకు నాయమటే మ... 84

చ. చిలుకను నొక్కవారసతి చేరికఁబెంచియు దానిమాటికిన్
బిలచిన రామరామయని భేదముసేయక నీవు నంతసా
లలనకు మోక్షమిచ్చిన పురాణకథల్ నిజమైతె రామ నేఁ
దలఁచఁగ రావదేమి ఘనదైత్యహరా మ... 85

ఉ. నాయకుఁగాఁడు యింతకఠినమ్మువహించుట రంగశాయి నేఁ

బాయని మోహజాలములు బంధముచేతను జిక్కి బిల్చితే
నోయనిబల్కరాద శరణొందిన దాసులఁగావ మేరగా
దాయదువంశపావన రథాంగధరా మ... 86

ఉ. పాతకిఁ గాచుటే పతితపావన రామ ధరిత్రిలోన ప్ర
ఖ్యాతినిఁబొందు సామికని గానకఁజేసిన దోషసంఘమున్
యాతనబెట్టకుండఁగ దయారసముం మదినుంచి బాపవే
పాతకిసంహరా దురితపుంజహరా మ... 87

ఉ. మానవకోటిలో దురితమానవుఁడంచు దలంచినీమదిన్
హీనతఁజేయుచుండితివి యింతియెగాని దయాపరుండవై
బూనిన దోషముల్ దునిమి మోదమునియ్యవు యింతపంతమా
దీనుఁడ నీదయాంబుధిని దేల్చఁగదే మ... 88

ఉ. నాసరివైనపాతకుల నార్తుల నెందఱిఁ గాచితో జగ
ద్భాసిని గాను మిమ్ములను దానవసూతి తలంచినంతనే
భాసురరూపుతో వెడలి భక్తునిఁగాచియు నేఁడునన్ను నా
యాసముఁ బెట్టుటేల దురితాళిహరా మ... 89

ఉ. నేనొనరించుపాపము లనేకము గుంపులుగూడియుండె రా
మానుజ వానినెవ్వరును బాపెడువారెటు లేరుగాన రా
వే నఘసంఘముల్ దునుమ వేల్పవు నీవె పరాకదేల లే
వే ననుఁ గావరమ్మ యతివేగముగా మ... 90

ఉ. మేలుగ దాసకోటికి నమేయ ఫలంబులు నివ్వఁజాలి నా
పాలికి రాక నీవు పరిపాలనసేయక రామనామ మే
మూలను దాచుకోఁగలవె ముక్తిప్రదాయక నాకుఁదెల్పవే
చాలగఁ జిక్కులన్నిడకఁ జక్రధరా మ... 91

ఉ. ఏనిఁకయెంతవేడినను యేమనవైతివి రామచంద్ర యీ
దీనతఁబాపి చక్కఁగను దిక్కయి ప్రేమను గావకుండినన్
దీనులఁగావ నీవె మరిదిక్కనుమాట లబద్ధమానుగా
గాన చలంబుమాని ననుఁ గావఁగదే మ... 92

ఉ. రామ యనేకనామ బహురాక్షస గర్వవిరామ యోపరం
ధామ గుణాభిరామ నృపతారకసోమ వినీలనీరద
శ్యామ శమాభిరామ భవసాగర మగ్నత నొందకుండఁగా
క్షేమముగాను నన్ను దరిఁ జేర్చగదే మ... 93

చ. జలచరరూపమై వడిగ సాగరమున్ జొరఁబారి నుగ్రత

దలములుచేత యా నిగమ తస్కరవీరునిఁ జీఁవై చిరం
జిలుచును నాల్గువేదములుఁ జేకొని చిక్కులుఁ బాపి ధాతకున్
దెలిపి యొసఁగి తీవెకద దేవనుతా మ... 94

చ ఘనముగు మంధరాచలము కవ్వముగా ఫణిరాజు రజ్జుగా
నొనరిచి దేవదైత్యులు పయోనిధిఁ బూని మథింపుచున్నచో
చని యడుగంట కూర్మమయి శైలము దాల్చినవాఁడ వీవె కా
కనక విశాలచేలధర కంసహరా మ... 95

చ. ధరఁ గని చాపఁజుట్టిన విధంబునఁ జుట్టియుఁ గొంచుఁబోయి సా
గరమున డాగియున్న కనకాక్షుని ద్రుంచి వరాహమూర్తివై
ధరణిని తొల్లి చందముగ దక్షిణకొమ్మున యెత్తి గ్రిక్కనన్
విరివిగఁ జేసితీవెగద వేదనుతా మ... 96

చ. కనుగొన దేవబృందముల కద్భుతమైన నృసింహమూర్తిచే
దనుజుల ప్రాణముల్గొనర స్తంభమునం దుదయించి వక్ష మే
పున విదళించి హేమకశిపున్విదళించి వధిన్ సురారినం
దనుగృపఁ జూచితీవెగద దైత్యహరా మ... 97

చ. పదయుగళంబు భూగగన భాగమునందిడి శౌర్య ధైర్య సం
పదుఁడగు నబ్బలీంద్రు నొక పాదముచే తలఁ గ్రుంగఁ ద్రొక్కి పెం
పొదవఁ ద్రిలోకముల్ నముచిసూదనుకియ్య వటుఁడవైన యో
నదమలమూర్తి వీవె గద చక్రిధరా మ... 98

చ. ధరఁగల క్షత్రిజాలములఁ దారుణ వీరపరాక్రమ బుచే
యిరువదియొక్కమారు పృథివీస్థలిఁ గూల్చియు వారి రక్తముల్
త్వరితముగాను పైతృలకు తర్పణ మిడియు భూసురాళికిన్
ధరను నొసంగి తీవెగద దైత్యహరా మ... 99

ఉ. ఆలమునందు తాటకిని యంతము నొందగనేసి యాగమున్
పాలనఁజేసి గోతముని పత్నికి శాపముమాన్పి రామసీ
తాలలన న్వరించి యతిదర్పితు రావణకుంభకర్ణ ము
ఖ్యాళి వధించితీవె గద ఖ్యాతిగనో మ... 100

ఉ. ఏలినవాఁడ నీవయిని యేను బొనర్చిన వృత్తిజాలముల్
మాలికగాను గైకొని యబద్ధములున్న క్షమింపవయ్య గో
పాలకృపాలవాల భవబంధ విమోచన నిన్ను నెప్పుడున్
జాల భజింపుచుందు పటుచక్రిధరా మహిజామనోహరా. 101

మహిజామనోహరశతకము సంపూర్ణము.



# రామలింగేశశతకము



గౌరి సామేన శిరసునఁ జదలేఱు తురువైనకేల ముమ్మొనలవాలు
గుజ్జువేలుపు ముద్దుఁగుఱ్ఱ మిక్కిలికన్ను పునుకకంచంబు నుభూతిపూఁత
గిబ్బ రాతత్తడి బెబ్బులిదోలును గాలిమేపరి సూడిగములజోడు
గట్టురావిల్లును గడలి బత్తలికయు వలమురి వాలుపువాఁడితూఁపు,
తే. గలిగి భువనత్రయంబు రక్షణముసేయ నభిలషించెడి నీపేర నంకితముగ
నీసశతకంబుఁ జెప్పెదఁ జిత్తగింపు రామలింగేశ రామచంద్రపురవాస... 1

సీ. దానవత్వము గలమానిసి యని పల్క నసురవర్తనుఁ డన్న యర్థమబ్బ
ననిహత విక్రముండని సన్నుతించిన, రణభీరుఁడన్న యర్థము లభించు
నలసమానాకృతి నానస్ఫురద్రూపి యన్న యర్థము నది యనుసరించు
ధీరహితుం డని తివిరి వర్ణింప మేధాహీనుఁ డన్న యర్థములభించు
తే. మనుజలోకాధిపతిఁ గీర్తనము సేయ శబ్దములె నుతిఁ దగఁడని చాటిచెప్ప
వేఱె వాని నుతింపంగ వేడ్కగలదె రామ... 2

సీ. తెరవాట్లు గొట్టి సత్తరువుఁ బెట్టుటకంటె న్యాయార్జితాన్న మింతైనఁ జాలు
తోఁటలు నఱికిన దొడ్డచావడికంటె ననఘమైతగు పంచటఁరుగు మేలు
బహుఘాతుకుఁడు పెట్టు పాయసాన్నము కంటె సద్వర్తనుఁడు పోయుజావ మేలు
అందఱఁ జెఱచి వెయ్యావులిచ్చుటకంటె గష్టార్జితం బొక్కగవ్వ మేలు
తే. గర్వపడుదురు తమపాట్లు గానలేక ప్రభువుల మటంచు దుర్ణయోపాయరతులు
వారిఁ బొగడంగ నాకుత్సవంబులేదు రామ... 3

సీ. మాన్యంబులీయ సమర్థుఁడొక్కఁడు లేఁడు మాన్యము ల్చెఱుప సామంతులంద
ఱొండినయాళ్ళగో డెఱిఁగింపఁ డెవ్వఁడుఁ బండినయాళ్ళన్నఁ బ్రోధులంద
ఱితఁడు పేద యటంచు నెఱిఁగింపఁ డెవ్వఁడుఁ గలవానిసిరి యెంచఁగలరు చాలఁ
దనయాలి చీఁకటితప్పెన్నఁ డెవ్వఁడు బెఱకాంతఱంకెన్నఁ బెద్దలంద,
తే. ఱిట్టిదుష్టుల కధికారమిచ్చినట్టి, రాజు ననవలెఁ గాక దుర్ణయులననఁగ,
నేమిపని యున్నయది సత్కవీంద్రులకును, రా... 4

సీ. మల్వతీలను బ్రజల్ మాపంగవచ్చును వర్షంబుఁ గురిపింప వశముగాదు
కలవానిచే దండుగలు గొనవచ్చును ధనహీనుఁ బ్రోవంగఁ దరముగాదు
పండులఁ బొడిపింపఁ బరుగులెత్తఁగవచ్చుఁ బులులను శిక్షింపఁ బోవరాదు
బలముచాలనివాని భంగింపఁగా వచ్చుఁ జేవఁగల్గినవానిఁ జెనకరాదు
తే. పాపమార్జించుటకుఁ గాక ప్రాణవంతు ప్రజలయాపదఁ బాపనోపముగదయ్య!
నీకటాక్షప్రసాదంబు లేకయున్న, రా... 5

సీ. శ్రీమంతునాజ్ఞప్తి సేయఁడొకండు నుబరులనేరములెన్నఁ బరుగులెత్తు
తోఁటలు నఱికిన దోసమెన్నఁడొకండు నడవిఁగొట్టకుమని యాజ్ఞవెట్టు
నరదిఁ గోర్మించిన సాటిచెప్పఁడొకండుతుప్పఁగంటిన వాని దోసమెన్ను
నమ్మఁగొల్చినవాని న్యాయమెన్నఁ డొకండుఁ దప్పఁ గొల్చినవానితప్పఁజెప్పు
తే. నిట్టిపెద్దల కధికారమిచ్చినట్టి, రాజుననవలెఁగాక దుర్నయుల ననఁగ
నేమిపనియున్నయది సత్కవీంద్రులకును, రామ... 6

సీ. ఆక్రమింపఁగవచ్చు నన్యరాష్ట్రంబులు ప్రజల నందఱ బాధపఱుపవచ్చు
నన్యాయమున విత్తమార్జింపఁగావచ్చు విభవంబు పెంపుగావింపవచ్చు
మిత్రాధికారంబు మీఱి వేయఁగవచ్చు మహితోపకారంబు మఱువవచ్చు
నొకమాటవల్కి వేఱొకటి సేయఁగవచ్చు సంపదున్నతికి గర్వింపవచ్చు
తే. నాయువధికంబు గాఁగూర్ప నలవియగునె, దుర్నయులు మీఁదెఱుంగక దుండగమున
నిహపరములకు వెలియౌదు రింతెకాక, రామ... 7

సీ. మేలుచేసినయట్టి మిత్రునిఁ జెడఁగొట్టి పెద్దకిరీటంబుఁ బెట్టనేల
తనప్రాపుఁ గోరు భూధవుని కగ్గొనరించి గంధసింధురములఁ గట్టనేల
తను గొల్చుబంట్లజీతములు తక్కువఁజేసి ఘోటకంబులు పెక్కుగూర్పనేల
ప్రజలను బడరానిపాట్ల కగ్గముచేసి యగ్రహారంబులీయంగనేల
తే. యధికనిందలకొడిగట్టియులరునట్టి, నృపులకీదృశవిభవసమృద్ధులెల్ల
శవకృతాలంకృతులుగావె చర్చసేయ, రామ...

సీ. మానంబుఁ దాల్చుట మన సిచ్చగింపమిగడపి వేయుట లోభకారణంబు
దర్శనం బీయమి తప్పు సైపకయున్కి పెడమోముఁ బెట్టుట ప్రియములేమి
గర్వంబుఁ దెల్పుట కారాంతరాసక్తి సమయముగాదంట జరపునేర్పు
నరయుద మన్న రంధ్రాన్వేషణాసక్తి యతివినయంబు ధౌర్త్యంబుఁ దెలుపు
తే. నిట్టిప్రభుదుర్నయపుఁజేష్ట లెఱుఁగలేక, వెంబడించెడివాఁడెపో వెఱ్ఱివాఁడు
దాని కొడఁబడఁ డింగితజ్ఞానశాలి రామ,... 9

సీ. పదుగురుఁ గోఁతివెంబడి సంచరింపరే వాహకుల్లేరె శవంబునకును
గఁగిరెద్దుకులేవె ఘనతూర్యరావముల్ కలిమిగల్గదె వారకామినులకుఁ

బులి గోపుఁ-జంపి నక్కలనుబోషింప దే స్థూలకాయము లేదె మన్నలకును
బుప్పిపంటికి లేదె పుట్టంబుఁ జుట్టుట వేఁమఘరుం డెద్దు వెంట రాఁడె
తే. న్యాయపద్ధతి నడువని యవనిపతికి, నెన్ని చిన్నెలు గలిగిన నేమి కొఱకు
నంతమునఁ జూడవలయు నాయుష్యసుఖము రామ...
సీ. కుమతియుఁ జుట్టంబుఁ గొండె కాఁడు ప్రియుండు కరుణావిహీనుండు కార్యదక్షుఁ
డొరులసంపద కోర్వకుండెడు ప్రతినిష్ఠ ప్రత్యర్థిస్థానంబు కపటచింత
దుర్బలహరణంబు దోశ్శక్తికి ఫలంబు కృత మెఱుంగక యుక్తికి రిగరిను
ప్రజలఁగో డాలించమియుఁ బ్రాభవచిహ్న దబ్బఱ లాడుట తగవు నేర్పు
తే. పాపభీరుఁడు గాని భూపాలునకును, నిట్టి నృపు నాశ్రయించిన నేమి గలదు
ధార్మికస్థలి యాచన దగ్ధ మగును రామ... 11
సీ. కొండెంబు వానికి గొనచెవి ముత్తెంబు నర్థాతురత వానిహారయష్టి
యనృతోక్తి వాని జిహ్వారంగ నర్తకి ఘాతుకత్వము వానికాంతకోల
ముష్కరత్వము వానిముంగొంగుబంగారు కూహకత్వము వానిగోడచారు
కూటసాక్ష్యము వానికూర్చుండు గద్దెమా పోపమిః వానికి నోరుఁగబిళ్ళ
తే. పాపభీరుండు గాని భూపాలునకును, నిట్టి నృపు నాశ్రయించిన నేమి గలుగు
ధార్మికస్థలి యాజ్ఞయు దగ్ధమగును, రామ... 12
సీ. ఆపన్నరక్ష సేయఁడు గాని సజ్జన పీడనం బొనరింపఁ బిఱుగుతునుక
నయశాస్త్రగరిమ పూనఁడుగాని దుర్నయ వ్యాపారమునకు సిద్ధాంతవేత్త
కాసైనఁ దనసొమ్ము ఖర్చు సేయఁడుగాని పరులసొమ్ము హరింప బ్రహ్మకాయ
కలనైన సత్యంబుఁ బలుకనోపఁడుగాని యనృతంబు లాడ సహస్రముఖుఁడు
తే. అనుచుఁ దనదు చరిత్రంబు లవనిజనులు నింతసేయఁగఁ బ్రతుకు దుర్నీతినృపుని
వైభవం బౌర యని మెచ్చువాఁడె జనుఁడు, రామ 13
సీ. తనతల్లిచోట నెనప్ప నటించిన దురితాత్మునకు గురుద్రోహ మెంత
గొంకొకింతయు లేక గురుని కెగ్గొనరించు కఠినాత్మునకుఁ గృతఘ్నత్వ మెంత
కృత మెఱుంగని మహాకిల్బిషాయత్త చిత్తునకు మిత్రద్రోహమనఁగ నెంత
పరమమిత్త్రుల బాధ పఱుచు దుర్నయునకుఁ బ్రజలనందఱ బాధపఱుచు టెంత
తే. యనుచుఁ దనదు చరిత్రంబు లవనిజనులు, నిందసేయంగ బ్రదుకు దుర్నీతినృపుని
వైభవం బౌర యని మెచ్చువాఁడె జనుఁడు రామ... 14
సీ. కడుపింత యగుస్థూలకాయంబు గలుగుట చిత్రభూషాంబరస్థితి నలరుట
తూర్యనాదంబులతో జనుదెంచుట వాలవ్యజన సమువాప్తిఁ గనుట
శృంగవేత్రోద్ధతిఁ జేరరాకుండుట చూపరు లదుగుదు చుట్టికొనుట
స్వనియంతృవాద్యంబు వినితల యూఁచుట మౌనముద్ర వహించు మతముఁ గనుట

తే. గంగిరెద్దుకు మూర్ఖభూకాంతునకును, భేదమించుకయును గానుపించ
దట్టి ప్రభుపు వేడిన సత్కవిపదవి చెడదె రామ .. 15

సీ. తలక్రొని పాదుపాతలఁ దన్నఁగాఁజూచు మిహిరబింబమునైన మ్రింగఁ జూచు
దిగ్దంతితోనైన దీకొనంగను జూచు బెబ్బులితోనైనఁ బెనఁగజూచు
జలరాసులైనను జంగఁ జాఁచఁగ జూచు నాకసంబున గేల నంటఁజూచు
గాలాహి నోటను గాలు పెట్టఁగ జూచు యమునితోనైనఁ బోరాడఁ జూచు.
తే. నెవరి సత్త్వంబుఁ దనసత్త్వ మెఱుఁగ లేక, పరుగులెత్తు దురాధ దుష్పార్థివుండు
దానికి ఫలంబు మూలతో హానిసుమ్ము, రామ... 16

సీ. సారమేయం బుట్టిచేరుఁ దెంపునుగాని పడకుండఁ బట్టునే పాలకుండ
కోఁతి కొబ్బరికాయ కొన కెక్కి పడఁద్రోయు దానిజలంబులు ద్రావఁగలదె
ముదుసలి పెండ్లాడి ముదితయౌవనము వ్యర్థముఁ జేయుఁగాకేమి దానఁ గాంచుఁ
గాకి ముంగఱ నోరఁగఱచి డొంకలపాలు గావించుఁ గాకేమి కాంచుదానఁ
తే. జెడుగునరుఁడొరుసంపదఁ జెఱుపుఁగాని, తనకు ఫలమేమిగలుగును తథ్యమరయ
నిందమాత్రంబు వానికి నిల్చు జగతి, రామ... 17

సీ. చిక్కిన పశుమేను చింపఁ జూచును గాకి బలిసిన పసరంబు పైకిఁ బోదు
నక్క పీనుఁగుల డొక్క లీడ్చునుగాని బ్రతికిన జంతువు పైకిఁ బోదు
వెలవైన తరుశాఖఁ దొలుచును నుసిపుర్వు చేవగల్గినచోటఁ జేరలేదు
పుంటిమీఁదను సీఁగ గంటుపెట్టునుగాని గట్టి నెమ్మేనిపైఁ గదియలేదు
తే. బీదలను దుష్ప్రభుఁడు బాధపెట్టుఁ గాని, చేవకలవారి చెంతకుఁ జేరఁలేఁడు
సింహము మదేభకుంభముల్ చింపఁజూచు, రామ... 18

సీ. బరకాంతఁబట్ట నుపాయంబు గల్గదే పరులనిందకు భయపడుట గాక
బలమున్న దుర్బలుఁ బరిభవింపఁగ రాదె పాపంబునకు స్రుక్కఁబడుట గాక
కలిమి గల్గినవాఁడు గర్వింపఁగా రాదె యది తొలంగ హసింతురనుట గాక
యధికారమున్న నాఁ డాక్రమింపఁగ రాదె యది సన్నపడ దక్కదనుటగాక
తే. దుర్నయులుమీఁదెఱుంగక దుండగమునఁ, గార్యమును మించఁజేసితత్కార్యభరము
లనుభవింపుదు రాయాయి యవసరముల, రామ... 19

సీ. ఒకటి గల్గఁ బదింటి కూహాగావించును బదిగల్గ నూటికిఁ బాలుపడును
నూఱుగల్గినఁ బదినూర్లకపేక్షించు వేయిగల్గినఁ బదివేలుగోరు
నయుతంబు గల్గినఁ నాశించు లక్షకు లక్ష గల్గిన బదిలక్షలకును
బాటి వెట్టుచునుండు బదిలక్షలబ్బినఁ గోటికావలెనని కోర్కి సేయుఁ
తే. జాలునని యెంతగల్గిన స్వాంతమునను, సంతసిలఁడుగదా ధనాశానిమగ్నుఁ,
డాశ విడువకయున్న సౌఖ్యంబు గలదె, రామ... 20

సీ. ప్రాభవం బుండి పాపభయము లేకున్నఁ బ్రజల నేగతి బాధపఱుపరాదు
ధనలోభముండి నిందకు భయంపడకున్నఁ గావింపఁడే యెంతకార్యమైన
దయలేకయుండి సంతానబాహుళ్యంబైన నొనరింపరానికి డొకటిగలదె
ముష్కరత్వం బుండి మూర్ఖసంగతియున్నఁ బాల్పడఁడే యెంతపనికినైనఁ,
తే. గాఁగలవిపత్తికి భయంబు గదురకుండి, కాదనెడివారు లేకున్న ఖలనృపుండు
కానిపని కెంతకైన నగ్గంబు గాఁడె, రామ... 21

సీ. జలధివేష్టితమహీచక్ర మేలెడి రాజు వెంటఁ జేరెడు భూమి గొంచఁ బోఁడు
కొండంత ధనరాశిఁ గూర్చు సంపన్నుండు వెంటఁగా పోకకైన గొంచఁ బోఁడు
బహుధాన్యరాసు లుపార్జించు నాతండు వెంటఁబోలేఁడు కొల్చిఁ గొంచఁ బోఁడు
బహుమూల్యవస్త్ర సంపాదకుండగువాఁడు వెంట వేలెఁడుగుడ్డఁ గొంచఁ బోఁడు
తే. ఇన్నియును నెఱింగిదుర్నయుండెందుకొఱకు, త్యాగభోగంబులుడిగి లుబ్ధత వహించు
వాని జన్మంబు జన్మమే వసుధలోన, రామ... 22

సీ. జంగాలపాలు దేవాంగుల విత్తంబు కాఁపు విత్తము పంబకాని పాలు
బలిజీలవిత్తంబు పట్టెదాసరిపాలు గొల్లవిత్తము పిచ్చుగుంటపాలు
వ్యాపారివిత్తంబు వారకాంతలపాలు కల్లువిత్తము రుంజకాని పాలు
పరజాలపాల్శిష్టు కరణాలసొమ్ము ఘూర్జరుల విత్తంబు నక్కరులపాలు
తే. కవుల కీఁ గలజాతి యొక్కటియు లేదుఁ వితరణము వైశ్యులకుఁ బెండ్లి వేళఁ గలదు
కొంగుఁజఱచిరి నృపతులా కూటికొఱకు, రామ... 23

సీ తమరు దానము సేయఁ దలపోయరేకదా పరుల దానంబు సైపంగ లేరు
తమరు సత్యము వల్కఁ దలపోయరేకదా పరుల సూనృతము సైపంగ లేరు
తమరు సజ్జనగోష్ఠిఁ దలపోయరేకదా పరుల సద్గోష్ఠి సైపంగలేరు
తమరు సద్వ్రతనిష్ఠఁ దలపోయరేకదా పరుల సద్వ్రతము సైపంగలేరు
తే. దుర్నయులు వారిగుణములుద్రోయ రాదు, దానికిఫలంబు యమసన్నిధానమునను
దేటపడుగాక యొరులకుఁ దెలియ వశమె రామ... 24

సీ. నోరువాఁడైన బూతే రచింపఁగఁ జూచు ధనము పెంపైన మత్తత వహించుఁ
గులరూపసంపదల్ గలిగినగర్వించు వయసున్నఁ బరవధూవాంఛఁ బెనఁగు
బలమున్న దుర్బలుఁ బరిభవింపఁగ జూచు దృఢవిద్యయున్న వాదెంప దివురు
త్యాగ మించుకయున్నఁదను దాఁబొగడఁజూచు మమణియమబ్బిననూరు మహాపజూచు
తే. దుర్నయులు వారిగుణములుద్రోయ రాదు, దానికిఫలంబుయమసన్నిధానమునను
దేటపడుగాక యొరులకు దెలుపదరమె రామ... 25

సీ. అచ్చినవానియి ల్లరకట్టగాజూచు దానీయవలనన్నదప్పు జూచు
నలుసైనవానియిల్లాక్రమింపఁగఁ జూచుఁ దనకు గడ్డైనఁ బాదములు వట్టు

నణువుఁగాఁ జూచుఁ గొండంతైనఁ దనతప్పు గోరంత యొరుతప్పుకొండ సేయు
బంధులకిడఁడంచుఁ బరుని దూషించును దనయిల్లు జొచ్చినఁ దరిమిగొట్టు
తే. దుర్నయుల దుర్గుణంబులు ద్రోయరాదు, దానికిఫలంబు యమసన్నిధానమునను
దేటపడుఁగాని యొరులకుఁ దెలుప వశమె రామ... 26

సీ. ఖరశాబమునకు జక్కనిజవ్వనముభంగి సారమేయమున కాజ్యంబుభంగి
జారచోరాళికి జంద్రోదయముభంగి కౌశికంబునకు భాస్కరునిభంగి
రోగికిమలయమారుతము చందంబున గాలిమేపరికి సుగంధిభంగి
వెలిచవుల్ మరగినవెలఁదికిఁ బతిభంగి గళితదంతునకు శష్కులికభంగి
తే. షండునకు లేఁతప్రాయంపుసకియభంగి, వాయసమునకుఁగోకిలస్వనముభంగి
దుష్టునకు సజ్జనుండు హితుండుగాఁడు రామ... 27

సీ. మలభూధరపవమాన మల్పంబయ్యు జంఝానిలముకంటె సౌఖ్యకరము
చెలమ లోపలిజలం బలఁతియై యుండియు శరధితోయముకంటె శర్మదంబు
అలఁతి యయ్యు విపంచికలమంజులధ్వని భేరీరవముకంటెఁ బ్రియకరంబు
కొంచెమయ్యు సువర్ణకుసుమంబు పృథుకర్ణికారంబుకంటె సౌఖ్యప్రదంబు
తే. గుణముగలవానిసంపదకొంచెమయ్యు, నర్ధిజనులకుఁ బ్రియకరంబగుచునుండు
నెంతసిరియున్న ఫలమేమి యొడ్డెలకును, రామ... 28

సీ. కణుఁదురీఁగలపట్టుఁ గడఁగి రేఁపఁగవచ్చుఁ దప్పించుకోరాదు దానిపోటుఁ
బఱచునశ్వముతోఁకఁ బట్టియీడ్వఁగవచ్చుఁ దప్పించుకోరాదు దానితాఁపుఁ
బుట్టలోపలిత్రాచుఁ గట్టఁదట్టఁగవచ్చుఁ దప్పించుకోరాదు దానికాటు
గాఁకచేఁ బొరుగిల్లుఁ గాల్పరావచ్చును దనయిల్లుఁ గాచుకోఁ దరముగాదు
తే. దుర్ణయులుమీఁదెఱుంగక మండగమునఁ, గార్యములుమించఁజేసితత్కార్యఫలము
లనుభవింపుదు రాయాయి యవసరముల, రామ... 29

సీ. కన్నంబుఁద్రవ్వు తస్కరుఁడింటివారికి వాడ లేదని ముంతపైచి చనునె
పెరవాటుకాఁడు చింతించునే కట్టినబట్ట దుల్చిన మానభంగమనుచు
వలఁబడ్డమెకము చూల్వహియించె ననుచును విడువంగఁ జూచునే వేఁటకాఁడు
జారుండు పరకాంతశయ్యపై దారిచి వావి గాదని పల్కి వదలి చనునె
తే. యాత్మజను గుత్తరూఁకల కమ్మునాతఁ డరణము లోసంగఁజూచునే యల్లునకును
నెఱుఁగ రింతియకాక పరేంగితంబు రామ... 30

సీ. గోముఖవ్యాఘ్రంబు కూరలోనిడునాభి కప్పకూఁతలు గూయుకోలభుజగ
మొరలేని గాలము నేటిలోపల నూయిపైఁ బూరి గ్రమ్మినపాడునూయి
పైఁబండ్లు గలిగి లోపలఁ బుచ్చు తరుశాఖ గొంగళిమూల దాకొలుపురాయి
బొరనేమరించి ముంచుకొను ప్రవాహంబు కునుకుపట్టినఁ జుట్టుకొనుదవాగ్ని

తే. దుర్జనుఁడు వానినమ్మినఁ దోడరకున్న హాని యెటువంటివానికైన జగతిఁ
దలఁపఁ దవిబాసనేసినఁ దగమునమ్మ రా... 31

సీ. మితభాషి యగువాని మేకుండని పల్కుజడుఁ డంచు వచియించు శాంతపరుని
సంగవిరక్తుఁ బుంస్త్వము లేనివాఁడను నబహుళాశయుని రోగార్తుఁడనును
గరుణాసమగ్రు విక్రమహీనుఁ డని పల్కు దానశీలుని వేషధారియనును
అవలేపరహితు విద్యాహీనుఁ డని పల్కుఁ దెలియనివాఁడను దీర్ఘదర్శిఁ
తే. బనికిమాలినవాఁడను బాపభీరుఁ బుడమినెవ్వరు పొగడికఁ బొందగలరు
దుర్జనునిచెంత నెంతసాధుత్వమున్న రామ... 32

సీ. కోఁతికి జల్తారుకుళ్ళాయి యేటికి విరజాజిపూదండ విధవ కేల
ముక్కిడిటోత్తుకు ముత్యంపునత్తేల యద్ద మేటికిని జాత్యంధునకును
మాచకమ్మకు నేల మౌక్తికహారంబు క్రూరచిత్తునకు సద్గోష్ఠియేల
అంకుఁబోతునకు సద్వ్రతనిష్ఠ లేటికి వావి యేమిటికి దుర్వర్తనునకు
తే. మాటనిలకడ సుంకరమోట కేల, చెవిటివానికి సత్కథాశ్రవణమేల
సరసకవితారసంబు ముష్కరుని కేల, రామ... 33

సీ. కోఁతికి జల్తారుకుళ్ళాయిఁ బెట్టిన గోళ్ళవ్రక్కలుచేసి కుప్పఁబెట్టు
కుక్కనందలములోఁ గూర్చుండఁ బెట్టిన నెంగిలాకులు నాఁక నిలకు నుఱుకు
దొడ్డఫుట్టంబుఁ దొత్తుకుఁ గట్టఁ బెట్టిన నది పేడమలకల కగ్గపఱుచుఁ
జెడిపెను మృదుశయ్యఁ జేర్చిన విసిచి బల్ పెంటగుట్టలఁ బవ్వళింపఁ జూచు
తే. హీనజాతికి నధికార మిచ్చెనేని, హీనవర్తనమునఁ జరియించుగాని
పూనుకొని పెద్దపోకలు పోవఁగలదె, రామ... 34

సీ. కోయిల రొద సేయఁ గూయదే కాకంబు దంతివచ్చినబాట దుంత రాదె
పొగడపూఁదొడిగినఁ బూయదే మోదుగు పాలపండిన వేము పండకున్న
శివుఁడు నర్తింప నాడవే పిశాచంబులు నడువదే రాయంచ నడువ బకము
దొర దాల్చురవణముల్ తొడుగఁడే భృత్యుండుకొండికఁ బ్రాయఁడే గురుఁడు వ్రాయ
తే. దొడ్డవాఁడు కవిత్వంబు దొడరి చెప్ప, నల్పుఁడు కవిత్వము రచింప నభిలషించు
వారి వారింపఁ బనిలేదు వరకవులకు, రామ... 35

సీ. ఒడ్లపైఁ బాఱుచు నుండిన నదిపెంపు దూలిపోవును స్వల్పకాలమునను
గట్టుపైఁ బొరలంగఁ గట్టుతటాకంబు నిమిషమాత్రంబైన నిలువలేదు
పెక్కుగాఁగఁ బెరిఁగి క్రిక్కిఱిసియు వనంబు దవవహ్ని, జరియించి దగ్ధమగును
అధికార్థమత్తత యత్యుచ్ఛ్రయంబైన నది శీఘ్రముననె పెంపణఁగిపోవుఁ
తే. బాపకర్ముఁడు గావించు బాధ కడలి, యనధిలేనని కృశియింతు రవని జనులు
తెలియఁబడవె సుయోధనాదుల చరితలు రామ... 36

సీ. కదలునే యీఁగఱెక్కల గాడ్పున సురాద్రి యింకిపోవునె యనావృష్టి జలధి
తొలఁగునె తమము ఖద్యోతజృంభణమున నాఱునే చుళుకోదకాప్తి దవము
పాగచే బంధింపఁబడునె మత్తేభంబు కట్టచే నిలుచునే గంగఝరము
గొడ్డళ్ల బయలౌనె ఘోరకాంతారంబు చెదలు గ్రమ్మినచేవ శిథిలమౌనె
తే. యెదిరిసత్త్వంబుఁ దమసత్త్వమెఱుఁగలేక, పలుకుదురుపెద్దపలుకులు తులువజనులు
తొలఁగఁ ద్రోయంగ నశమౌనె దొడ్డవాని, రామ... 37

సీ. చోరజారులకు నుత్సుకత కల్గదటంచు నుదయించకుండునే యుష్ణకరుఁడు
వెనుకఁబట్టునె రాజవీథిఁ జరించుచోఁ గుక్కకూఁతకు భద్రకుంజరంబు
తీతువచాల రేఁగి దిక్కుల రొదసేయ సంచరింపకయున్నె సాళువంబు
నక్కలన్నియుఁ గూడి యొక్కపెట్టు మొఱుంగ ధాటిసేయకయున్నె మేటిమెకము
తే. కుమతులయినట్టివారికిఁ గొందఱికిని, హితవుగాకుండు నని సత్కవీశ్వరుండు
వేఁడకుండునె యరసి పృథ్వీతలేంద్రు, రామ... 38

సీ. తనతల్లి శిశువులఁ దలఁద్రుంచి నైచిన చెడుముండయనుచు వచింపరాదె
తనతండ్రియొకులవిత్తము పరిమోషించిన నన్యాయవర్తనుం డనఁగరాదె
తనదేశికుఁడు పరదారసంగమొనర్పఁ బాపకర్ముండని పలుకరాదె
తనరాజు జగదుపద్రవకారియైనను గ్రూరాత్ముఁ డనుచు వాక్రుచ్చరాదె
తే. ఇట్టిపలుకులు తప్పుగా నెన్నునట్టి, కుటిలచిత్తులగర్వంబుఁ గొంచెపఱుప
నీకకాకన్యులకుఁ బోలునే వచింప, రామ... 39

సీ. నెక్కొను విష్ణుసన్నిధిఁ గేఁగఁగల్గిన నమృతాంబునిధి నోలలాడు సుఖము
నెలకొను నింద్రుసన్నిధి కేఁగఁ గల్గిన భవ్యరంభానాట్య పాటవంబు
కల్గుఁగదా కామగమనంబు గల్గిన ద్వీపాంతరసువస్తువీక్షణంబు
సమకూఱుఁ బాదుషాసముఖంబు గల్గినఁ బృథుతరమానసాభీష్టసిద్ధి
తే. సాధనం బూహసేయక సాధ్యవస్తు, లాభమొనయంగ నాత్మఁదలంతురేల
జాల్ములది యింగితజ్ఞాన సరణిగాదు, రామ... 40

సీ. ఆశకు ముదిమియు నర్థికి సౌఖ్యంబు ధనపరాయణునకు ధర్మచింత
కఠినమానవునకుఁ గరుణాపరత్వంబు వెఱ్ఱిమానిసికి వివేకగరిమ
యల్పవిద్యునకు నహంకారశూన్యత జారకామినికి లజ్జాభరంబు
బహుజనద్వేషికిఁ బరమాయు రభివృద్ధి గ్రామయాచకునకు గౌరవంబు
తే. తామసగుణాఢ్యునకును నుత్తమగుణంబు పాపభీరుత సంతానబాహ్యునకును
గలుగు ననువార్తగలదె లోకములయందు రామ ... 41

సీ. శక్తిచాలనివాఁడు సాధుత్వము వహించు విత్తహీనుడు పాపవృత్తిఁ దలఁచు
వ్యాధిపీడితుఁడు దైవభక్తిఁ బొరలాడు ముదిమి పాతివ్రత్యమునకుఁ జొచ్చు

నాపద ప్రాప్తింప నన్యార్తికిఁ గృశించు భారంబుపైఁ బడ్డ బరు వెఱుంగు
రమణి లేకున్న విరక్తిమంచిద యనుఁ దనివార మానివర్తనముఁ దాల్చు
తే. యెంతవారలకైన మహితలమున నిట్టిభావవిరక్తుల కేమి ఫలము
తనరుచియుఁ జొరలోఁతును దెలియఁబడదె రామ... 42

సీ. వసరంబు జారైనఁ బసుల కాపరితప్పు ప్రజలు దుర్నయులైనఁ బ్రభువుతప్పు
భార్యగయ్యాళైనఁ బ్రాణనాథునితప్పు తనయుండు ధూర్తైనఁ దండ్రితప్పు
అశ్వంబు జారైన నారోహకునితప్పు దంతి దుష్టైన మావంతుతప్పు
సైన్యంబు చెదరిన సైన్యనాథుని తప్పు కూఁతురు చెడుగైన మాతతప్పు
తే. ఇట్టితప్పు లెఱుంగక యిచ్చవచ్చి, నట్లుచరియించు వానికి హానివచ్చు
నాడికలు గల్గునది నిక్క మరసిచూడ రామ 43

సీ. తల్లి సేవించిన దైవతార్చనమేల తండ్రిగల్గినఁ బెన్నిధానమేల
దీనరక్షణమున్నఁ దీర్థాటనంబేల విద్యాధికత యున్న వేషమేల
పరమమిత్త్రుండున్న బంధువర్గంబేల పతిభక్తిగల్గిన వ్రతములేల
రసికత్వమున్నను రత్నభూషణమేల ఘనసాహసంబున్నఁ గవచమేల
తే. ఇష్టసంసిద్ధిఁ గనదంతి నెక్కనేల కవిత గలిగిన రాజ్యాధికారమేల,
తగవినయమున్న వశ్యౌషధంబు లేల రామ... 44

సీ. జనుల నిందించిన సామ్రాజ్యమేటికి నక్కఱకొదవనియర్థమేల
జయము సిద్ధించని సాహసం బేటికి సిరి లభింపని రాజసేవయేల
అక్షరం బెఱుఁగని యధికారమేటికిఁ గోర్కిదీఱనినతికూట మేల
వినయంబు గల్గనివితరణం బేటికి క్షమదొలంగినతపశ్చర్యయేల
తే. కాంతమందిరమున లేనికలిమియేల, పరుల నొప్పింప నాశ్రితోద్ధరణమేల
కవుల కియ్యని దాతృత్వగరిమ యేల రామ... 45

సీ. అతిసమర్థునకు సేయఁగ రానిపని లేదు విద్యాధికున కెందు వింతలేదు
పరుషోక్తునకు నోటఁ బలుకరానిది లేదు సత్యసంధునకుఁ బక్షంబు లేదు
హానకారికి నితఁడాతఁ డన్నది లేదు దురితాత్మునకు వావి వరుసలేదు,
భాగ్యశాలికి లభింపని శోభనము లేదు చెడ్డవానికి రానిచేటులేదు
తే. నేర్చిదిరిగినవానికి నిందలేదు కష్టమోర్వకయున్న సౌఖ్యంబులేదు
జ్ఞాననిధిగాకయున్న మోక్షంబులేదు రామ... 46

సీ. అర్థాతురునకుఁ గృత్యాకృత్యములులేవు కపిజనంబుల కెఱుంగనిది లేదు,
కుక్షింభరుఁడుగాని కూటికిఁబోయఁడు కామాతురుడర్థకాంక్షఁబడఁడు
వలిచవుల్గొనుకాంత వెఱవదు నిందకు నీఁతకు మిక్కిలిలోఁతులేదు
పాపశీలునకు దయాపరత్వములేదు వెఱ్ఱివానికి సాధువృత్తిలేదు

తే. మద్యపాయికి ననర్థానిమాటలేదు, గ్రామ్యునకుఁ గల్గ దెందు నాగరికము ప్ర
తప్పెఱుంగక పోవఁ డుత్తమకులజుఁడు, రామ... 47

సీ. జనసమ్మతము లేనిపని సేయఁగూడదు చలము కూడదు కార్యసాధకునకు
గుట్టుఁ బోనిచ్చిన గిట్టుఁ బెద్దఱికంబు దుర్వ్యయపరుఁడైనఁ దొలఁగు మిసిమి
ఘనతృష్ణ పెరిగిన మును పున్నది నశించు నోరుచేటుఁ గోరఁ జేటొందుఁదనకు,
దుడుకు సేయఁగరాదు దూరంబుచూడఁగాఁ బట్టినపని కడముట్టవలయుఁ
తే. దెలివి చాలనిపని సేయఁగలుగుఁ గీడు, అడుగవచ్చిన లేదనుటనుచితంబు
దుర్జనులొలంది యెఱుఁగుట దొడ్డతనము, రామ... 48

సీ. మరణంబు మేలగు మానము చెడుకంటెఁ గొంచెమైనను బంచి కుడువ మేలు
తనవిత్తహాని కోర్చినపూటపడవలె హితవున్నచోట నప్పీయఁదగదు
విత్తంబు చాలనివిభవంబు కొఱగాదు కుదువఁ బెట్టఁగరాదు కుందనంబు
ఆలస్య మొనరింప నమృతంబు విషమౌను దగవు దప్పినమాటఁ దలఁపరాదు
తే. వదలవలయు నృపోపద్రవంపువృత్తి విడువవలయును మూర్ఖపృథ్వీతలేంద్రుఁ
ద్రోయవలయును గపటబంధువులమైత్రి, రామ... 49

సీ. దైవంబు కృపలేక తనుఁ బ్రోవఁడెవ్వఁడు మోహమగ్గలమైన మొనయుఁగీడు
ఒంటమి ఘనమైన నూర నుండఁగరాదు చింత వెగ్గలమైనఁ జిక్కు మేను
గర్వంబు లావైనఁ గల్గుఁ బరాజయం బాశ హెచ్చైన సౌఖ్యము నశించు
బలము తక్కువయైనఁ బైబట్ట బరువగు సంచార ముడిగిన సడలు రశ్మి
తే. స్థలము విడిచిన మిత్రుఁడే శత్రుఁడగును, దిండి మేరదొలంగినఁ దెవులుముంచు
ముదిసి పెండ్లాడఁ జూచిన ముప్పుఁగల్గు, రామ... 50

సీ. పాపాత్మునకుఁ బారుపత్తె మియ్యఁగరాదు చాలనిపనికిఁ గాల్చాఁచరాదు
తప్పు సేయనివాని దండింపఁ బోరాదు చేసినసుకృతంబుఁ జెప్పరాదు
పలుగాకివానితోఁ భాషింపఁగారాదు చెడ్డవానికి మేలు సేయరాదు
ఆదాయ మెఱుఁగని యప్పు సేయఁగరాదు పలువుర ద్వేషము పడఁగరాదు
తే. పరుల ధనసంపద కసూయ పడఁగరాదు, తనదు లేమికి ఖేదమందంగరాదు
సాధువర్తన లివిగదా చర్చసేయ, రామ... 51

సీ. కాకున్నపనికిఁ జంకలు వైచుకొనరాదు గడచినవెత దుఃఖపడఁగరాదు
అగపడ్డఫలముల కాసింపఁగారాదు నరనాథు మన్నన నమ్మరాదు
కలిసి తెలియరాదు తెలిసి కలియఁగరాదు గుఱిగానిమాట యూఁకొనఁగరాదు
తప్పి వచ్చినచోటఁ దాల్మి సేయఁగరాదు ముద్దు చెల్లినచోట ముఱియరాదు
తే. ఇందుముఖులకు నధికార మీయరాదు, ఆనుషంగికఫల మల్ప మనఁగరాదు
సాధువర్తన లివిగదా చర్చసేయ, రామ... 52

సీ. ఇల్లుఁ జూచినఁ దోఁచు నిల్లాలిశుభవృత్తి కలవిద్య లగపడుఁ బలుకఁబడినఁ
గొలుసు లోఁతుగఁ దీయ జలములోఁ దేర్పడు జేలపంటలు కొయ్యకాలె తెలుపుఁ
బ్రజలపొంకముఁ దెల్పుఁ బ్రభుధర్మపాలన సుముఖత భావంబు సొంపుఁ దెల్పు
భాండశుద్ధియె తెల్పుఁ బాకనైపుణ్యంబు కూఁతురు ప్రకటించు మాతగుణము
తే. కవితనేరుపుయతిఁ గూర్పుకైపె తెలుపు, నిట్టి బహువిధధర్మంబు లెఱుఁగునతఁడె
యింగితజ్ఞానశాలి మహాస్థలమున రామ... 53

సీ. ఎరువు నిత్యంబౌనె యిల్లౌనె పందిలియిల నెండమావులు జలము లౌనె
వరవు డిల్లాలౌనె వాఁపు బలంబౌనె కులట తనూజుండు కొమరుఁడౌనె
మెఱుపు దీపంబౌనె మేఘంబు గొడుగౌనె స్వాంగవాద్యంబు తూర్యంబు లౌనె
కత్తి తలడ యౌనె కల యథార్థంబౌనె పెనుబుడ్డ ముక్కాలిపీఁట యగునె
తే. కానివస్తువుఁ బట్టుకోఁ గాంక్షచేతఁ, బెనఁగుమాత్రంబెకాని లభించదేమి
దాని కొడఁబడ డింగితజ్ఞానశాలి రామ... 54

సీ. ముంజేతికంకణంబున కద్దమేటికి తంగేటిజుంటికిఁ దాఁపయేల
వెలికాటుగ్రమ్మఁగూరలు చవులౌన నేల పరులెన్న నేల స్వభార్యగుణము
దొడ్డది యననేల దొరదాల్చు రత్నంబు గోఁచి బెట్టిన లేమి దోచకున్నె
జవ్వాది యులఁదినఁ జంక లెత్తిఁగ నేల విధవకుఁ దలనుబ్బు వెదుకనేల
తే. వెఱ్ఱితన మున్నఁ జేష్టల వికృతులెల్లఁ, దేటపడుఁగాక వాక్రుచ్చి తెలుపనేల
గృహిణి లేకున్న గృహసౌఖ్య మెన్ననేల రామ... 55

సీ. ఏనుఁగు నిచ్చిన దానకళానిధి కంకుశంబిచ్చుట యాఘుళంబె
కథితసాలంకృత కన్యాప్రదాతకు వరదక్షిణ యొసంగు వార్తయెంత
యర్థికి నూటపదార్లిచ్చుదాతకు బత్తెం బొసంగు టేపాటిమాట
గ్రామం బొసంగిన ఘనదానశీలున కిల్లు గట్టించుట యెంతవింత
తే. నఖిలభువనావనైక నిర్నిద్రమతికి, నీకు నన్బ్రోచు టేపాటి నిపుణవృత్తి
కాన నన్నాదరించు సౌఖ్యముగ నెపుడు రామ... 56

సీ. పిడికెఁడుబిచ్చంబుఁ బెట్టనియతఁ డెట్టు కామితార్థము లీయఁ గాంక్ష సేయు
సంధ్యముక్కిఁ బఠింపఁ జాలనియతఁ డెట్టు క్రత్వనుష్ఠానసంగతికి నోపుఁ
దండ్రికి మృతతిథిఁ దప్పించునతఁ డెట్టు షణ్ణవతి శ్రాద్ధసరణి కోపుఁ
దప్పికి నీళ్ళీక తఱుమువాఁ డెటువలె నెలకు నిష్టాన్నసంతృప్తిఁ జేయు
తే. నింగితజ్ఞాన మించుక యెఱుఁగలేక, యాచకజనంబులెల్ల దురాశచేత
హీనమనుజుల యాచింతు రింతెకాక, రామ... 57

సీ. కఱ వేమిసేయు భుక్తము రుచింపనివాని నామయంబు మితాశి నేమిసేయు
ఘనధైర్యనిధిని శోకంబేమి సేయును కష్టమేమి యొనర్పుఁ గర్మనిరతుఁ

దృష్ణ బాధించునే స్పృహ దొలంగినవాని హితవు నోర్చని ప్రియం బేమి సేయు
మెలఁకువగలవాని నళు కేమి గావించు నెగ్గు మానవిహీను నేమి సేయు
**తే.** మృతికి రోయనినరు మృత్యు వేమి సేయు, నీమ మెడలినవానిఁ గీడేమి సేయు
నింగితజ్ఞుని నొరుధార్ష్య మేమి సేయు, రామ... 58

**సీ.** పొరుగూరి కేఁగినఁ బోవునే దుర్దశ కాదె పెండిలి సన్నికల్లు దాఁచ
డొంకలో డాఁగఁ బినుగుపోటు దప్పునే కాలొడ్డ నిలుచునే గాంగఝరము
*కుంతితం జాన యొక్కఁడు దుమ్మఁ గ్రితుయత్న మింకిపోవునె యనావృష్టిజలధి
ధవుఁడు పిన్నన్నన వైధవ్యంబు దప్పునే మనఁదీర్ఘాయువు మందు లేక
**తే.** నర్కుఁ డుదయింపఁ జెనునె గుహాతిమిరము తాళమెత్తుకపోవ మందసములోని
విత్తములవడకుండునే వెచ్చమునకు రామ... 59

**సీ.** భయపలాయితునకుఁ బ్రతిశుక్రభయ మేల త్రొక్కఁ ద్రెంపగ ముహూర్తంబు లేల
దొరసాని చెఱవోవఁ దొత్తింట నిలచునే చలువ లెక్కనను భైషజ్య మేల
మద్యపానము సేయ మడివస్త్ర మేటికి మొదలుఁబోవఁగ వడ్డి ముట్టు టెట్లు
పదపహీనునకును బెబ్బ్రముక్కు లెటకి నయనహీనున కంజనంబు లేల
**తే.** బండిఁగొన నేమిటికి లెకపరకలెత్త బాఱిరా మెచ్చనేటికిఁ బౌరుషంబు
పత్తనేటి కాపోశనం బెంగిలికిని రామ... 60

**సీ.** మనుజునిద్రాహాని మత్కుణంబెఱుఁగునే యెఱుఁగునే వాయసం బెద్దునొప్పి
మధుపానమత్తుఁడు గల్మలసేవ యెఱుగునే కంటివేదన మశకం బెఱుగునె
పెనె మెఱుంగును బెడతలకండూతి వృషణదుర్వ్యథ చీమ యెఱుగు టెట్లు
తనభార్య పంపావేదన జారు డెఱుగునె మృగయుం డెఱుంగునె మృగము బాధ
**తే.** యెఱుగునె యలుఁడ తవారంటె లెఱు ప్రజలకష్టము నిర్దయప్రభు వెఱుగునె
యెఱుగ ఠంతియు కాక పరేంగతంబు రామ... 61

**సీ.** ప్రజయార్తి యెఱుగని ప్రభువుదూరము వెళ్ళి వచ్చెనే మచ్చాట జచ్చెనేమి
యపకీర్తిభాజనుం డైనట్టితనయుండు పుట్టెనేమి యతండు గిట్టెనేమి
దర్శనంబియని ధరణీశ్వరుండింట నుండెనేమి చితాగ్ని బండెనేమి
బహుజనద్వేషి యన్యాప్రభు వన్యరాష్ట్రంబు లేలెనేమి విపత్తిదూలెనేమి
**తే.** పతికిహిత మాచరింపని పద్మగంధి చెంతల వసించెనేమి నశించెనేమి
యిట్టివారల సౌభాగ్య మొందుకొఱకు రామ... 62

**సీ.** కీడేమి చేసె జిక్కనక్క కాకికి ఫణినేమి శోకంబు బాధపఱచె
పులి కేమియపరాధము ఘటించె ధేనువు చిమ్మట కొగ్గె మిచేసె జీర

---

*కుంతిచే. వెడునె యొక్కఁడు మంత్రియత్నంబు.

నేర మేమి యొనర్చె గీరంబు పిల్లికిదుంత కళ్వం జేసిదోసగుజేసె
నొచ్చి మేమి యొనర్చె నోరుగాలికి దీపమొరగలి కడ వేమియొగ్గొనర్చె
తే. జీడ పురుగున కెగ్గేమిచేసె జేను ఖలుడు కీడొనరించు నిష్కారణంబు
సజ్జన పరంపరలకెల్ల జగతియందు రామ... 63

సీ. పాత్రసంయోజన ప్రతిభగల్గినగాని ధనమొసంగిన గాడు దానశాలి
కర్తవ్యమున వివేకంబు గల్గినగాని గడ్డంబు నెరసిన గాడు పెద్ద
సముచితాచారంబు సంగ్రహించినగాని చదువుమాత్రమె కాడు సద్ద్విజుండు
న్యాయమార్గంబున నడువనేర్చినగాని పదుగురు సేవింప బ్రభువుగాడు
తే. విమలతరమైన సరసవివేకబుద్ధి శిష్యసమితికి బోధ జేసినను గాని
దేశికుడుగాడు మంత్రోపదేశమాత్ర రామ... 64

సీ. అఖిలద్వేషి యగువానికడ జూడ జాతకసిద్ధాంత చర్చయేల
దర్శనంబీయని ధరణీశ్వరుడు పాప నిర్భీరుడనుచు నేల
వేఁడిన మోము వెల్వెలఁబోవుదొర కీవి పసలేదటంచను బలుకనేల
వెలిచవుల్ మరగిన విభుఁడు స్వకాంతఁగన్నడచేసె నంచును నుడువనేల
తే. పాపకర్మునిపై రాజ్యభరముఁ బూన్పఁ, బ్రజల కెగ్గగు నని వచింపంగనేల
యెఱుఁగ రింతియగాక పరేంగితంబు, రామ 65

సీ. అల్పునితోనైన నధికునితోనైనఁ జెలిమిఁ గాంచినఁ జేటువచ్చు
గోరంతవాఁడైనఁ గొండంతవాఁడైనఁ బగకు నర్హుండు నృపాలవృత్తి
విద్యాధికుండైన విత్తాధికుండైన సజ్ఞాతకులునితో నంటఁ దగదు
ధనమెంతగల్గినఁ జనవెంతగల్గిన గర్వమొందకయున్కి కార్యసరణి
తే. యిట్టినయమార్గ మెఱుఁగక యిచ్చవచ్చి, నట్లు చరియించువానికి హానివచ్చు
నాడికలు గల్గువిది నిక్కమరసి చూడ, రామ... 66

సీ. అప్పు దీర్పఁగనైన నపహరింపఁగనైనఁ దలఁచువానికిని బత్రంబు వలదు
పరగటితట్టైన భద్రేభమైనను ధ్యానశీలునకు లక్ష్యంబు గాదు
అధికాశగలవాని కల్పసంతోషికి గణ్యంబు గాకుండుఁ గనకశిఖరి
నాథుండు రక్తుఁడైన విరక్తుఁడైనను దరుణి కేమిటికి సౌందర్యరేఖ
తే. పరమహితుఁడైన మిక్కిలి పగతుఁడైన, నొక్కతీరుగఁ గన్పించుచుండుఁగాదె
చెఱుపఁ దలఁచిన యట్టి దుశ్శీలునకును, రామ... 67

సీ. పుణ్యనదీజలంబులు నిషిద్ధము లౌనె యొకఁడు తప్పెఱుఁగక యుమియుమాత్రఁ
జెక్కుభూసురు లొక్కపెట్టు దీవింపంగ నొకఁడు తుమ్మిన శుభంబాదవకున్నె
బహుశుభగ్రహదృష్టి బలముగల్గినచోట నొకక్రూరదృష్టి కీడొసఁగు టెట్లు
ప్రబలషోడశకళాపరిపూర్ణచంద్రుఁ డొక్కకళంకమున మోదకరుఁడుగాఁడె

తే. గుణముబహుళంబు దోషంబుకొంచెమైనఁ, గొదువఁజెందకయుండునెక్కువగుణంబు
తాఱుమాత్రైన నిదియె పద్ధతిదలంప, రామ...

సీ. లవణాబ్ధి మాధుర్యము వహించునే నదీమధుకోదకముల సంప్రాప్తివలన
ఘనవిస్ఫులింగ భీకరదవాగ్నిజ్వాల లాఱునే చుళుకోదకాప్తివలనఁ
గతక మొక్కటిరాచి కలుషమాత్రింబున నేటిలోనిజలంబు తేటపడునె
యభిహతసర్పాంగుఁ డామానవుని జిహ్వాననవాత్తుఁ జొనుపసౌఖ్యంబుగనునె

తే. ప్రబలపాతకపూర్ణు, డల్పంబుసుకృత,మునను శుద్ధుఁడుగాకుండుననుట నిక్క
మాడుఁగాకేమి యిచ్చకం బన్నృతవాది... 69

సీ. ఆరగింపంగ యోగ్యముగాకయుండునే సైత్వక్కు బిరుసైనఁ బనసపండు
మాధుర్య మొడలునే మామిడిపంటికిఁ దొడిమపట్టున జీడి తొడరుమాత్రి
గేదంగివిరి మాలిఁ గీలింపకుండురె యగ్రభాగమున ముండ్లలముమాత్రి
నఖిలాంగసీమ నొయ్యారంబు తిలకించు నతివకు వాల్చన్నులన్నిగనేమి

తే. గుణముబహుళంబు దోషంబుకొంచెమైన,గొదువఁజెందకయుండునెక్కుడుగుణంబు
తాఱుమాత్రైన నిదియెపద్ధతి దలంప, రామ... 70

సీ. గోవధఁ గావించి గోరోజనంబు రో గార్తుల కొసఁగఁ బుణ్యాత్ముఁ డౌనె
ఫలశాఖఁ బడమొత్తి ఫలము లేటించి భూసురుల కర్పించిన సుకృతి యౌనె
నిండుతటాకంబు ఖండించి చేఁపలు మత్స్యభుక్కుల కంపమాన్యుఁడౌనె
గుడిఁ గొట్టి యిటికలు గూర్చి తులసితిన్నెలు రచించినఁ బుణ్యనిలయుఁడౌనె

తే. ప్రబలపాతకపూర్ణుఁ డల్పంబు సుకృత, మునను శుద్ధుండు గాకుండు ననుటనిక్క
మాడుఁగాకేమి యిచ్చకం బన్నృతవాది, రామ... 71

సీ. పతి వధూటిని భంగపఱుపంగఁ దలఁచిన నెన్ని నేరములైన నెన్నవచ్చుఁ
బ్రభువుకొల్చినవాని భఁగింపఁ దలఁచిన నెన్ని నేరములైన నెన్నవచ్చు
నరునకుఁ దననోట నాలుక గలిగిన వింతదేశంబు లెవ్వియునులేవు
తనలోఁ బ్రబోజకత్వము గల్గియుండిన నాశ్రయింపఁగ నెందరైనఁ గలరు

తే. తనయెడల సాధుభావంబు గలిగియున్న, సాధుజను లెందఱైనను జగతిఁ గలరు
మంచి దగు నూరు తననోరు మంచిదైన, రామ... 72

సీ. మందు మాకిడి గండమాల మాన్పఁగలండె చక్కఁజేయ గలండె నక్కమోరు
వ్రేలివంకర మాత్ర పీఁగ నొత్తఁగలేఁడు కుదురుసేయఁగలండె గూనువీఁపు
త్రోయఁజాలఁడు కుక్కతోఁక వంకరమాత్ర మేటి వంకలు దీర్ప నెవ్వఁడోపు
తనవారి యొచ్చెంబుఁ దానె తీర్పఁగఁజాలఁ డొరులయొచ్చెముఁ దీర్పనోపునెవఁడు

తే. దైవకృతమైన వంకరఁదలఁగఁ ద్రోయ, వశముగాకుండుగద యెంతవారికైన
బొరలు ధాని నెఱుంగక మూఢజనుఁడు, రామ... 73

సీ. జీలుఁగుబెండ్లచేఁ జెవులు పెంచఁగ నేర్చుఁగూర్చ నేర్చునె రత్నకుండలములు
తంతువు ల్పెనఁచి సూత్రము రచింపఁగ నేర్చుఁ దెచ్చునే హారమౌక్తికచయంబు
సాధకుల్గాసియాడ సాము సేయఁగ నేర్చు నోనగూర్పఁ గలఁడె భండనజయంబుఁ
బడరాని పాట్లెల్లఁ బడుఁగాక యనయంబుఁ బడయఁగలండె సంపత్సమృద్ధి
తే. నీకటాక్షప్రసాదంబు లేకయున్న, ఫలముఁ జెందంగ నేరునే పౌరుషంబు
పౌరులు దాని నెఱుంగక బుద్ధి జడుఁడు, రామ... 74

సీ. దాసికి దండంబు తల గొఱిగించుట చెలికానిశిక్ష భాషింపకునికి
భార్యకు దండంబు పడకకు వెలివేఁత విబుధదండము గౌరవింపకునికి
యపకారిఁ గొట్టుట యుపకృతిసేయుట తామసిదండంబు తాల్మిచేఁత
గర్వాంధునకు శిక్ష గణియింపకుండుట ధనవంతునకు శిక్ష తప్పుఁగొనుట
తే. ఇట్టినయమార్గ మెఱుఁగక యిచ్చవచ్చి, నట్లుచరియించువానికి హానివచ్చు
నాడికలుగల్గునది నిక్కమరసి చూడ, రామ... 75

సీ. ఋణశేషమున్నను రిపుశేషమున్నను వహ్నిశేషం బున్న వచ్చుఁగీడు
భుక్తివధూజన రక్తివిదారసక్తి యగ్గలంబైనఁ గీడావహిల్లుఁ
గుత్సితాత్మునితోడఁ గోపిజనముతోడఁ గొండికవానితో గోష్ఠితగదు
అర్భకపశుమందిరాంగరక్షలయందు నేమఱుపాటొంద నెగ్గుఁ జెందు
తే. నిట్టినయమార్గ మెఱుఁగక యిచ్చవచ్చి, నట్లుచరియించువానికి హానివచ్చు
నాడికలుగల్లు నిదినిక్కమరసి చూడ, రామ... 76

సీ. పెట్టిపోసిననాఁడె చుట్టాలచేరిక కలిమిగల్గిననాఁడె కాంతప్రాపు
సేవఁ జేసిననాఁడె క్షితినాథునన్నన వయసుగలిగిననాఁడె వనితరక్తి
విభవంబుగలనాఁడె వెనువెంటఁ దిరుగుట పసియున్ననాఁడె మావారలనుట
పోరిమిగలనాఁడె పొరిగింట పోరట మఱుఁడింపఁగలనాఁడె తగవుపూటి
తే. ఆత్మశక్తిదొలంగిన యవసరమునఁ, దనకునెవ్వరు గానిది తథ్యమరయ
బలిమిపో నవయవములె పనికిరావు, రామ... 77

సీ. పరునితో రమియించుభార్యఁ గూడుటకంటె మలినదాసీసంగమంబు మేలు
అనికోహటించు సైన్యాధిపత్యముకంటె గోపాలకత్వంబు కొంతమేలు
పరులఁ బీడించెడు ప్రాభవంబునకంటె నందమైతోఁచు భిక్షాటనంబు
మనవిఁ జెప్పఁలేని మంత్రిత్వమునకంటె ఘనముగాదే సూపకారవృత్తి
తే. తనదుచెల్లెలిదొడ్డభూధవున కిచ్చి, యతనివలనను సిరిగాంచు నంతకంటె
సారమైతోఁచుఁ గొండదాసరితనంబు రామ... 78

సీ. నగవు మార్దవముదంతములు దోఁచనియున్కి మనసు నొవ్వకయున్కి మాటనేర్పు
ఎలమి రిక్తుల దాత హింసించకుండుట దానసౌష్ఠవము పాత్రం బెఱుఁగుట

జనరంజనముచేత ధనముఁ గూర్చెడినేర్పు, మొగమోటవిడుచుటకుఁగ్వునేర్పు
అగపడనీని మంత్రాలోచనము నేర్పు తటి యెఱుంగుట కెప్డుఁ జెఱచునేర్పు

తే. శక్తిఁ బాగడించుకొనునేర్పు సహనముద్ర, హెచ్చరించుటకనులు సేయుచునేర్పు
మాన మన్యుల యచ్చంపుమాటనేర్పు, రామ... 79

సీ. ఊహించుచుండు సామోపాయ మొక్కటే సమమైనయెడ మైత్రి సలుపునతఁడు
ఊహించుచుండు దానోపాయ మొక్కటే బలవంతు లోకువపఱచునతఁడు
ఊహించుచుండు భేదోపాయ మొక్కటే చెఱుపఁ దలంచు దుశ్శీలుఁ డతఁడు
ఊహించుచుండు దండోపాయ మొక్కటే పరధనాపేక్షచే బ్రతుకునతఁడు

తే. చతురుపాయ ప్రయోగవిజ్ఞానవిధులు, మంత్రులెఱుఁగంగవలె వీనిమర్మ మెల్ల
వ్యత్యయముసేయఁ గార్యంబు వరుస దప్పు రామ... 80

సీ. చెఱువులో నీరు నిల్చిన పానయోగ్యమౌనది వార్ధిఁ జేరఁ బానార్హమగునె
యుదక మల్పంబైన నూబిలోఁ బడు చేప చెఱువు నిండినవెన్కఁ జిక్కునెట్లు
చరణాయుధాండంబు చట్టిడా నోర్చిన నవయంగఁ జేసిన నల్పభుక్తి
వహ్నియల్పము దీనివలన నేమనఁ గూడ దదియు రాఁజింప వీ డంతగాల్చు

తే. నాశ్రయింపంగఁ దగినచో టరివఖింపఁ, దరుఫలాపేక్ష కోర్కి యౌదత్యమునకు
వస్తుతత్త్వంబుఁ బరికింపవలయుఁ బ్రౌఢ రామ... 81

సీ. శునకమైథున మప్పు చూ లధికారంబు లాదంతసౌఖ్య కష్టాస్పదంబు
లధమాధముం డసిష్టాన్వితుండుఁ బ్రవాసి జీవన్మృతులు వీరు క్షితితలమున
సదుపదేశము తపోమితభక్తు లగువారి కాద్యంతకష్టసౌఖ్యాస్పదంబు
శివలింగకృతి తటాకవన ప్రతిష్ఠలఁ బ్రబలువారలు చచ్చి బ్రదుకువారు

తే. తనదు దేహార్తికంటె సజ్జనులపీడ, యధికమై తోఁచుఁగద సజ్జనావళికిని
నొనరుచును గీడు తనచెట్టు కోర్చి ఖలుఁడు, రామ... 82

సీ. చెఱకుపిప్పికి మూఁగు చీమలభంగిని వ్యాఘ్రంబుతో నుండువటువుపోల్కి
నెంగిలి పుల్లపై నెసయుకాకులరీతి గోవ్యంగముల మూఁగుకొఱుజులట్లు
శవముపైఁ గదిసిన జంబుకంబులమాడ్కి మలముపై మూఁగునీఁగలవిధమున
గోరింటపొదలఁ బైకొనునుష్ట్రములలీలఁ గాటిలోఁ బొరలాడు ఖరములట్లు

తే. కటికచీఁకటిఁ దిరుఘూకంబు పోల్కిఁ, గుళ్లుతిత్తికిఁ గవిసినకుక్కవలెనె
దుష్టప్రభు ననుసరింతురు దుర్జనములు, రామ... 83

సీ. శ్రీవైష్ణవుఁడు ముడ్డిఁ జెఱువులోఁ గడిగిన నదియు సదాచార మనఁగఁ దగునె
సోమయాజిసుతుండు శునకంబుఁ జంపిన నది న్యాయపద్ధతి యనఁగఁ దగునె
పరపీడనము రాజుగురువుగా రొనరింప నది సాధువర్తనం బనఁగఁ దగునె
పౌరాణికుం డుల్లిపాయ భక్షించిన నది నిషేధంబు గాదనఁగఁ దగునె

తే. ఛాందసుం డొక్కరుఁడు మలోత్సర్జనంబు, సేయఁబోవుచు శివుని దర్శించెనేని
యతని సద్భక్తుఁడని కొనియాడ దగునె, రామ... 84

సీ. తొంగుంప మంచంబు దొరకలే దని కృశింప బంటున కబ్బునే బట్టుపఱుపు
దొరసాని కొకనాఁడె దొరకదంచుఁ గృశింపఁ దొత్తుకుఁ గల్గునే తొగరుచీర
యంబటి కుప్పబ్బదని కృశించెడివాఁడు వాంఛ సేయునె పిండివంటలకును
గంకుల నొజ్జలే కాలంబు గడుపంగ నూఁచబియ్యంబు శిష్యులకుఁ గలవె
తే. ఇంగితవిచార మాత్మలో నించుకయిన. నూహసేయక కలిఁబోయ నట్లవంక
జూచుచుండెద రజ్ఞులీక్షోణియందు, రామ... 85

సీ. నిర్వాళిపళ్ళెంబు నృపునకుఁ బట్టిన కాంతియొప్పునె నిషేకంబునకును
మకరాంక కేళిచే మనసు రంజిలఁ జేయు నువిద యొప్పునె మల్లయుద్ధమునకు
దుక్కినాఁగటిముక్కుఁ జెక్కు నడ్డంగికిఁ గలుగునే మేడలు గట్టునేర్పు
సాదాపని మెఱుంగు జాడఁగాంచు సొనారి కుందనంబున మణుల్ గూర్చఁగలఁడె
తే పుక్కిటిపురాణములఁ బ్రొద్దు పుచ్చునతఁడుఁ జాలునెపురాణములువిప్పిచదివిచెప్ప
నెఱుఁగ రింతియకాక పరేంగితంబు, రామ... 86

సీ. ఇల్వలుం డిష్టాన్న మిడఁడె భూసురుల కధ్యయనంబు లేదె దశాస్యునకును
దుర్యోధనుఁడు విప్రవర్యులఁ బ్రోవఁడే కాలనేమికి జపగరిమ లేదె
బాణున కీశ్వరపదభక్తి వెల్తియే నహుషుండు వైభవోన్నతిఁ గనండె
బలి దైత్యునకు దానపటిమంబు తక్కువే వృత్రుండు విక్రమాన్వితుఁడుగాఁడె
తే. నాశమొందరె దుర్వర్తనమునవీరు, హృదయసంశుద్ధి లేకుండెనేని జనుల
కెంత సుకృతంబు గల్గిన నెందుకొఱకు, రామ... 87

సీ. చేరువపగయును దూరపుమైత్రియుఁ గావించెనేనియు, గార్యహాని
స్వనృపుతో వైర మన్యనృపుతో మైత్రి యొనరించెనేనిఁ గీడొదవకున్నె
త్యాగమ్మునకు నాత్మభోగమ్మునకు రాని విత్తార్జనంబుఁ గావింపనేమి
బాసకు లోఁగాక ప్రతిభాషలాడిన పాలతితో వాదింపఁబోవ దగదు
తే. ఇట్టి నయమార్గ మెఱుఁగక యిచ్చవచ్చి, నట్లు చరియించువానికి హానివచ్చు
దాని కోడఁబడఁ డింగితజ్ఞానశాలి, రామ... 88

సీ. అగ్రహారములు నామావశిష్టము లయ్యె మాన్యంబు లన్నియు మంటఁ గలిసె
బత్తెంబునకుఁ దొంటిపడికట్టు దప్పెను బుధజనంబుల రాకపోక లుడిగె
వర్షాశనంబులు వఱచపాలైపోయె మలవతీలను ప్రజల్ మాసి చనిరి
సతియించిపోయె వంటరులుఁ దురుష్కులు గజతురంగములు తాకట్టువడియె
తే. ధార్మికస్థానమున కిట్టితళ్ళుపుట్టెఁ, గఠినచిత్తుని రాజ్యాధికారిఁ జేసి
యింత పీడించితివి సత్కవీంద్రకోటి, రామ... 89

సీ. ఉభయసంధ్యల నిద్ర యుచ్ఛిష్టసంగ్రహం బవసనశయనదిగంబరతలు
గ్రాసాతిరేకం బకారణహాసంబు చరణద్వయాల్ప సంక్షాళనంబు
పరవధూపరవిత్తహరణాభిలాషయు స్వాంగవాద్యమును ద్యూతాభిరతియు
మలినాంబరత జానువులు వ్రాలిచేర్పుట యవనిలేఖనము దంతాల్పపూజ
తే. పలువ ఋమియుట దుశ్శీలభాషణములు, మొదలుగాఁ గలదుర్గుణంబులనటింప
శ్రీనివాసునికైనను సిరి దొలంగు, రామ... 90

సీ. సూర్యుండు దనశీతాంశువులఁ బోఁ దఱిమినఁ గలుగవే గుహలు చీఁకట్లుడాఁగ
జంఝూనిలము డాడి నలుప దీపమునకుఁ గలుగదే వసియింపఁ గలశమొకటి
వనిసాళువంబు గువ్వను బాఱఁ దఱిమినఁ దరుకోటరము లేదె దానిఁ బ్రోవ
గరుడుండు వెఱచినఁ గాకోదరమునకుఁ గలుగదే వల్మీక బిలమునొకటి
తే. ప్రబలుఁడగువాఁడుదుర్బలుఁ బాఱఁదఱుమ, దైవమొకప్రాపుఁగల్పింపఁదలఁపకున్నె
పొరలఁగాక సహంకారమున నరుండు, రామ... 91

సీ. గానమూయంగ మూఁకుడు నానుఁ గాకనుకలఁదె వానను దటాకంబు మూయ
నాజ్ఞవెట్టఁగ సర్వమగుఁగాక మామిళ్ళకర్వామే చిలుకలకాజ్ఞవెట్టఁ
జెలమలో నీరుడోఁకులఁ జెట్లఁ ద్రోఁచుఁగా కద్రితోయము ద్రోఁడ నలవియగునె
దాసుని శిక్షిఁపఁదగు నేరముండిన సర్వామే శిక్షింపసతనిభార్య
తే. గాఢతరమైన నధికారగర్వతమము, కానసీయదు గాన మూర్ఖజనపాలు
నిది యసంభావ్య మని యెవ్వఁ డెఱుఁగకుండు రామ... 92

సీ. కాశికిమార్గంబు కడవెళ్ళఁజూపిరే యేదిరె తలిదంద్రు లెల్లకాల
మింటింటఁ బెట్టించె నేపుణ్యసతిభిక్ష మతిథి పోషించిరే య దినంబుఁ
దరువు లెక్కుటకును దాఁపనిర్మించిరే యత్తబోధించెనే యన్నిపనులు
ప్రతిశబ్దమునకు విభక్తులేర్పఱచిరే కాలువల్ ద్రవ్విరే కడలిముట్ట
తే. నెంతనయమార్గములను ననేకగతులఁ, గార్యములు దిద్దుకొనవలెఁ గాకనరుఁడు
జడత వహియింప నదిలోక సమ్మతంబె రామ... 93

సీ. మావితోఁపులు పండి మహిమీఁద రాలించి మొక్కలు మొలిపించుఁ బెక్కుగాను
అనితోఁటలాయెనెయని తెచ్చిగూఁటిలోపల నాటి తఱుచుగా వెలుగువెట్టి
కందకంబులుద్రవ్వి గట్టిగూళ్ళల్లించ దుక్కలుదున్నింపఁ దోఁటలవునె
యాచందమునసె కన్నంతమాత్రనె తండ్రిపోషకుఁడగువానిఁ బోలఁగలదె
తే. పోషకుఁడురాజుపప్రజలెల్లఁబుత్రసములు, వారి కన్యోన్యకలహంబువచ్చినపుడు
ప్రభువరులసీతి సమపక్షపాతరీతి, రామ... 94

సీ. హరునందు భక్తివిద్యలయందు వ్యసనంబు శక్తిగల్గినచోట స్థైరణయును
గురునందుసద్భక్తి పరగుణంబులఁ బ్రీతి క్షాంతి సత్పురుష సాంగత్యమందు

నాపన్నజనతాప హరణంబునందున స్వార్జితవిత్తవ్యయాభిలాష
స్వకళత్రమందును సంగమాసక్తి భయంబు లోకాపవాదంబువలన
తే. సత్పురుషరత్నములుగాంత్రు సకలలోక, పూజనీయులు వారలఁ బొగడవశమె
వందనం బొనరించెద వారికొఱకు, రామ... 95

సీ. తనవిత్తమనుచు నమ్మినదేల చనువేళ కాసైనఁ దనసొమ్ము కాక యుండు
దనవారలనుచు నమ్మనదేల చనువేళ రమణియే తనువెంట రాక యుండుఁ
దనదేహమనుచు నమ్మినదేల చనువేళఁ గాయమ్మె తన సొమ్ము గాక యుండుఁ
దనగేహమనుచు నమ్మినదేల చనువేళ నిమిషమైన క్షణంబు నిలువకుండుఁ
తే. దనకు సద్గతియుఁ గానిదే దక్క దరయఁ, దాను జేసినసుకృతమే తనకుఁ దక్కుఁ
బొరలు బొనిసెఱుఁగక బుద్ధిజనుఁడు. రామ... 96

సీ. ధనమున్న నృపవహ్నితస్కరభయచింత కునుకు కంటికి రాకకుండు చుండు
ధనహీనుఁ డగువాఁడు దారపుత్రుల దుర్భరార్తిని నేమి దోఁచకుండు
పుత్రవంతుఁడైన పురుషాగ్రగణ్యుండు తన మృత్యుభీతికిఁ దల్లడిలును
సంతానహీనుఁ డౌజనుఁ డజన్మంబును గతి లేదటంచును గసలుచుండు
తే. సౌఖ్యమబ్బునె సంసారజలధిమునుఁగు, జనులకెవ్విధమునను జర్చ సేయ
నిరుపమానూనవైరాగ్యనిధికిఁ గాక, రామ... 97

సీ. విన్నవించితి వేమివృత్తాంతమంటివా తావకసర్వజ్ఞతకుఁ గొఱంత
దుర్వారభవబార్తిఁ ద్రోయలేనంటివా యధికమా యిది హాలాహలముకంటె
బ్రహ్మ వ్రాఁతకు మాఱుపలుకరాదన్న మార్కండేయుఁ బ్రోచుటకల్లవార్త
నాన్యశరణ్యుండ నగునట్టినన్ను నీవారులపైఁ ద్రోయంగ నుచితమగునె
తే. సాధుకరుణాకటాక్షవీక్షణము చేత సుగుణఖనివైన యడిదము సూరయాఖ్యు
మనుచ కీర్తిఁ దప్పించుకొనఁగవచ్చు రామ... 98

సీ. అఱుత ముత్యపుసరుల్ గొఱికివై చినకోఁతిచెవి కెంపుచౌకట్లు చిదుముకున్నె
గడ్డంబు వపనంబుఁ గావించుమంగలి కొఱఁతవెట్టునె తల గొఱిగివేఁత
నట్టింటిలోఁ గాలువెట్టిన శునకంబు జరచుర గోండిల్లు జొరకయున్నె
కంచంబు ముంతయుఁ గైకొన్న చోరుండు పూజించునే దేవపూజపెట్టె
తే. కరణములసొమ్ము గైకొనఁ గాంక్షఁ జేసి శ్రోత్రియుల ద్రవ్యములు దేఱిచూడకున్నె
పాపనిర్భీరుఁడైన భూపాలకుండు, రామ... 99

సీ. కాకోదరవిషంబు కాలిపై సోఁకిన నవయంబులకెల్ల హానివచ్చు
వహ్నికణం బొకవాడపై సోఁకిన గ్రామమశేషంబుఁ గాల్చిపుచ్చు
నలివేణియొకనాఁడు వెలిచవుల్మరగినఁ దొలఁగును నూఱునోములఫలంబులఁ
జీడపర్వాకచెంతఁ జేనిపై సోఁకిన సరిపుచ్చివైచును సస్యమంతఁ

తే. చెడుగొకఁడు సంభవించినఁ జెడుఁ గులంబు, దీనికినిదర్శనంబు దశాననుండు
కౌరవాధీశ్వరుండునుగాదె జగతి, రామ... 100

సీ. అంకుఁబోయినకాంత బొంకశంకించునే కత్తియేమఱులునే కన్నగాఁడు
మగనిఁ దిట్టినదాన మఱఁది మన్నించునే యమ్ముఁడే యిలుభార్యనమ్మినతఁడు
జ్ఞాతిఁద్రోవనివాఁడు లాఁతిఁ బోషించునే యిలుగొన్న దొరమాన్యమిచ్చువాఁడె
వెలఁబట్టు సుదతికిఁ గలుగునే మోమోట వెఱచునే చలపాదివెచ్చమునకుఁ

తే. ప్రభువుదుర్నయవృత్తికిఁ బాలుపడిన, భటుఁడుదుర్నయవృత్తికిఁ బాలుపడఁడె
యెఱుఁగ రీతియెకాక పరేంగితంబు, రామ... 101

సీ. ప్రాప్తించునొకవేళఁ బాదుషాహునకైన నతిదైన్యయాఞ్చాసమాగమంబు
సిద్ధించునొకవేళ సిద్ధాంతవేత్త మనుజేంద్రసభలోన మాటతప్పు
సమకూరు నొకవేళ జమునంతవానికిఁ బ్రబలసంగ్రామపరాజయంబు
లభియించునొకవేళ విభవాధికునైనఁ బృథులదారిద్ర్యసంపీడనంబు

తే. గర్వమొందుటతగనిదొక్కటియెకాక, యెంతవారికి నొకవేళ నెగ్గువచ్చుఁ
బ్రతిన పల్కఁగఁ జెల్లునే బ్రహ్మకైన రామ... 102

సీ. పరపీడనము కంటెఁ బాతకం బెయ్యది సత్య మాడుటకంటె సరణి యెద్ది
అతిథి పోషణకంటె నాచార మెయ్యది వరవిద్యకంటె సద్వస్తు వెద్ది
పుణ్యశీలముకంటె భూషణంబెయ్యది కృతి మెఱుంగుటకంటె మతమదెద్ది
తాలిమికంటె నుత్తమగుణం బెయ్యది తామసంబునకంటె దౌష్ట్య మెద్ది

తే. న్యాయపద్ధతికంటె సన్మార్గ మెద్ది, పౌరుషోత్సర్జనముకంటె బన్నమెద్ది
దైవతం బెద్ది నీకంటెఁ దలఁచి చూడ, రామ... 103

సీ. తన మందిరమున నెంత ధనంబు గల్గినఁ బరధనాపేక్ష యెప్పటికిఁ బోదు
తనకాంత కెంతసౌందర్యంబు గల్గినఁ బరవధూజనకాంక్ష బాసిపోదు
తనకుఁ బాలింప నెంతటి రాజ్యమబ్బిన నన్యరాష్ట్రాపేక్ష యణఁగిపోదు
తనకెంత యధికార మలవడి యుండిన నితరాధికారంబు లిచ్ఛగించు

తే. దుర్నయగుణంబులివి పాయఁద్రోయరాదు, దానికిఫలంబుయమసన్నిధానమునను
దేటపడుఁగాక యొరులకుఁ దెలుపవశమె, రామ... 104

సీ. భయమేల కొండంత పగతుఁడు నాకున్న మేరువువంచిన మేటి గలుగ
నాకేల శోక సంతాపంబునను గుంద శీతాంశుమౌళి నాచెంత నిలువ
దస్కర భీతికిఁ దల్లడిల్లఁగనేల ప్రమథులతో శూలపాణి నిలువ
నగ్ని భీతికి నాకు నళుకుఁ జెందఁగ నేల గంగాధరుండు నాకడ వసింప

తే. ననుచు నెంతటి కెంతటి కలుగలేక, నమ్మియుంటిని నీప్రాపు నామనమున
జాగరూకుఁడవై నన్ను సాఁకుమయ్య, రామలింగేశ రామచంద్రపురవాస. 105

రామలింగేశ శతకము, సంపూర్ణము.



# దాశరథీశతకము

శ్రీరఘురామ చారుతులసీదళదామ శమక్షమాది శృం
గార గుణాభిరామ త్రిజగన్నుత శౌర్య రమాలలామ దు
ర్వార కబంధరాక్షస విరామ జగజ్జన కల్మషార్ణవో
త్తారకనామ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. 1

ఉ. రామ విశాలవిక్రమ పరాజిత భార్గవరామ సద్గుణ
స్తోమ పరాంగనా విముఖ సువ్రతకామ వినీలనీరద
శ్యామ కకుత్థ్సవంశ కలశాంబుధిసోమ సురారి దోర్బలో
ద్దామవిరామ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. 2

ఉ. అగణిత సత్యభాష శరణాగతపోష దయాలసజ్ఝరీ
విగత సమస్తదోష పృథివీసురతోష త్రిలోకపూత కృ
ద్గగనధునీమరంద పదకంజవిశేష మణిప్రభా ధగ
ద్ధగిత విభూష భద్రగిరి దా... 3

ఉ. రంగదరాతిభంగ ఖగరాజతురంగ విపత్పరంపరో
త్తుంగ తమఃపతంగ పరితోషితరంగ దయాంతరంగ స
త్సంగ ధరాత్మజా హృదయ సారసభృంగ నిశాచరాబ్జమా
తంగ శుభాంగ భద్రగిరి దా... 4

ఉ. శ్రీద సనందనాదిముని సేవితపాద దిగంతకీర్తి సం
పాద సమస్తభూత పరిపాల వినోద విషాదవల్లికా
చ్ఛేద ధరాధినాథ కులసింధు సుధామయపాద నృత్తగీ
తాది వినోద భద్రగిరి దా .. 5

చ. ఆర్యులకెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునాథ భట్టరా
చార్యుల కంజలెత్తి కవిసత్తముల న్వినుతించి కావ్య సౌ
కర్య మెలర్ప నొక్కశతకం బొనఁగూర్చి రచింతు నేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపు మిది దా... 6

ఉ. మసకొని రేఁగుబండ్లకును మౌక్తికము ల్వెలవోసినట్లు దు
ర్వ్యసనముఁ జెంది కావ్యము దురాత్ముల కిచ్చితి మోసమయ్యె నా
రసనకుఁ బూతవృత్తి సుకరంబుగ చేకుఱునట్లు నీకథా
రసములు జిల్కఁబద్య ముఖరంగమునందు నటింపవయ్య సం
తసమును జెంది భద్రగిరి దా... 7

ఉ. శ్రీరమణీయహార యతసీకుసుమాభశరీర భక్తమం
దార వికారదూర పరతత్త్వవిహార త్రిలోక చేతనో
ద్ధార దురంతపాతక వితానవిదూర ఖరాది దైత్య కాం
తార కుఠార భద్రగిరి దా... 8

ఉ. దురితలతాలవిత్ర ఖరదూషణ కాననవీతిహోత్ర భూ
భరణ కళావిచిత్ర భవబంధ విమోచన సూత్ర చారువి
స్ఫురదరవింద నేత్ర ఘనపుణ్యచరిత్ర వినీలభూరి కం
ధర సమగాత్ర భద్రగిరి దా... 9

ఉ. కనక విశాలచేల భవకాననశాత కుఠారధార స
జ్జన పరిపాలశీల దివిజస్తుత సద్గుణకాండ కాండ సం
జనిత పరాక్రమక్రమ విశారద శారద కందకుంద చం
దనఘనసార సారయశ దా... 10

ఉ. శ్రీరఘువంశతోయధికి శీతమయూఖుఁడ వైననీ పవి
త్రోరు పదాబ్జము ల్వికసితోత్పల చంపకవృత్త మాధురీ
పూరిత వాక్ప్రసూనములఁ బూజలొనర్చెద జిత్తగింపుమీ
తారకనామ భద్రగిరి దా... 11

ఉ. గురుతరమైన కావ్యరస గుంభన కబ్బురమంది ముష్కరుల్
సరసులమాడ్కి సంతసిలఁ జాలుదురోటు శశాంకచంద్రి కాం
కురముల కిందుకాంతమణికోటి స్రవించిన భంగి వింధ్య భూ
ధరమున జాలునే శిలలు దా... 12

ఉ. తరణికులేశ నానుడులఁ దప్పులు గల్గిన నీదునామ స
ద్విరచితమైన కావ్యము పవిత్రముగాదె వియన్నదీ జలం
బరుగుచు వంకయైన మలినాకృతిఁ బాఱినఁ దన్మహత్త్వముం
దరమె గణింప నెవ్వరికి, దా... 13

ఉ. అజునకుఁ దండ్రివయ్యు సనకాదులకుం బరతత్త్వమయ్యు స
ద్ద్విజమునికోటికెల్లఁ గులదేవతవయ్యు దినేశవంశభూ
భుజులకు మేటివయ్యుఁ బరిపూర్ణుఁడవై వెలుఁగొందుపక్షి రా
డ్ధ్వజ నినుఁ బ్రస్తుతించెదను, దా... 14

ఉ. పండితరక్షకుం డఖిలపాపవిమోచనుఁ డబ్జసంభవా
ఖండలపూజితుండు దశకంఠవిలుంఠనచండకాండుఁడౌ
దండకలాప్రవీణుఁ డను తావకకీర్తివధూటి కిత్తుఁ బూ
దండలు గాఁగ నాకవిత, దా... 15

ఉ. ముప్పునఁ గాలకింకరులు ముంగిట వచ్చినవేళ రోగముల్
గొప్పరమైనచోఁ గఫము కుత్తుక నిండినవేళ బాంధవుల్
గప్పినవేళ మీస్మరణ గల్గునొ గల్గదొ నాఁటి కిప్పుడే
తప్పక చేతు మీభజన, దా... 16

చ. పరమదయానిధే పతితపావననామ హరే యటంచు సు
స్థిరమతులై సదా భజనసేయు మహాత్ముల పాదధూళి నా
శిరమునఁ దాల్తుమీరటకుఁ జేరకుఁ డంచుయముండు కింకరో
త్కరముల కానఁబెట్టు నఁట, దా... 17

ఉ. దారుణపాతకాబ్ధికి సదా బడబాగ్ని భవాకలార్తివి
స్తారదవానలార్చికి సుధారసవృష్టి దురంతదుర్మతా
చారభయంకరాటవికిఁ జండకఠోరకుఠారధార నీ
తారకనామ మెన్నుకొన, దా... 18

చ. హరునకు నవ్విభీషణున కద్రిజకుం దిరుమంత్రరాజమై
కరికి నహల్యకున్ ద్రుపదకన్యకు నార్తిహరించుచుట్టమై
పరఁగిన యట్టి నీపతితపావననామము జిహ్వపై నిరం 19
తరము నటింపజేయుమిక, దా...

ఉ. శ్రీరమ సీతగాఁగ నిజసేవకబృందము వీరవైష్ణవా
చారజనంబు గాఁగ విరజానది గౌతమి గా వికుంఠము
న్నారయ భద్రశైలశిఖరాగ్రముగాఁగ వసించి చేతనో
ద్ధారకుఁడైన విష్ణుఁడవు దా... 20

ఉ. కంటి నదీతటంబుఁ బొడఁగంటిని భద్రనగాధివాసముం
గంటి నిలాతనూజ నురుకార్ముకమార్గణశంఖచక్రముల్
గంటిని మిమ్ములక్ష్మణునిఁ గంటిఁ గృతార్థుఁడ నైతినో జగ
త్కంటకదైత్యనిర్దళన దా... 21

చ. హలికునకున్ హలాగ్రమున నర్థము సేకుఱు భంగి దప్పిచే
నలమటఁ జెందువానికి సురాపగలో జలమబ్బినట్లు దు
ర్మలిన మనోవికారి నగుమర్త్యుని నన్నొడగూర్చి నీపయిం
దలఁపు ఘటింపఁజేసితివి దా... 22

ఉ. కొంజకతర్కవాద మనుగుద్దలిచేఁ బరతత్త్వభూస్థలిన్
రంజిలఁ ద్రవ్వి కన్గొనని రామనిధానము నేఁడు భక్తిసి
ద్ధాంజనమందు హస్తగతమయ్యె భళీ యనఁగా మదీయహృ
త్కంజమునన్ వసింపు మిఁక దా... 23

ఉ. రాముడు ఘోరపాతకవిరాముడు సద్గుణకల్పవల్లికా
రాముడు షడ్వికార జయరాముడు సాధుజనావన
వ్రతోద్ధాముడు రాముడే పరమదైవము మాకని మీ
యడుంగుగెందామరలే భజించెదను దా... 24

ఉ. చక్కెరమాని వేముఁ దినఁజాలినకైవడి మానవాధముల్
పెక్కురు బక్కదైవముల వేముఱఁ గొల్చెద రట్లు కాదయా
మ్రొక్కిన నీక మ్రొక్కవలె మోక్ష మొసంగిననీవ యీవలెం
దక్కినమాట లేమిటికి దా... 25

ఉ. రా కలుషంబులెల్ల బయలం బడద్రోచినమా కవాటమై
దీకొని ప్రోచునిక్కమని ధీయుతులెన్నఁ దదీయవర్ణముల్
గైకొని భక్తిచే నుడువఁ గానరు గాక విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల దా... 26

ఉ. 'రామ హరే కకుత్స్థకులరామ హరే రఘురామ రామ శ్రీ
రామ హరే' యటంచు మది రంజిల భేకగళంబులీల నీ
నామము సంస్మరించినజనంబు భవం బెడఁబాసి తత్పరం
ధామనివాసు లౌదు రఁట దా... 27

ఉ. చక్కెరలప్పకున్ మిగుల జవ్వని కెంజిగురాకు మోవికిం
జొక్కపుజుంటి తేనియకుఁ జొక్కలుచుం గనలేరు గాక నేఁ
డక్కట రామనామమధురామృత మానుటకంటె సౌఖ్యమా
తక్కిన మాధురీమహిమ దా... 28

ఉ. అండజవాహ నిన్ను హృదయంబున నమ్మినవారిపాపముల్
కొండలవంటి వైన వెసఁ గూలి నశింపకయున్నె సంతతా
ఖండలవైభవోన్నతులు గల్గక మానునె మోక్షలక్ష్మికై
దండ యొసంగకున్నె తుద దా... 29

ఉ. చిక్కనిపాలపై మిసిమిఁ జెందినమీఁగడ పంచదారతో
మెక్కినభంగి నీవిమల మేచకరూపసుధారసంబు నా
మక్కువపళ్లెరంబున సమాహితదాస్య మనేటిదోయిటన్
దక్కెనటంచు జుర్రెదను దా... 30

చ. సిరి లిడ సీత పీడ లెగఁజిమ్ముటకున్ హనుమంతుఁ డార్తి సో
దరుఁడు సుమిత్రసూతిదురితంబులు మానుప రామనామముం
గరుణ దలిర్ప మానవులఁ గావఁగఁ బన్నిన వజ్రపంజరో
త్కరము గదా భవన్మహిమ దా... 31

చ. హలకులిశాంకుశధ్వజ శరాసనశంఖరథాంగకల్పకో
జ్జ్వలజలజాతరేఖలను సాంకములై కనుపట్టుచున్న మీ
కలితపదాంబుజద్వయము గౌతమపత్నిఁ గోసంగినట్లు నా
తలఁపునఁ జేర్చి కావఁ గదె దా... 32

చ. జలనిధిలోన దూఁటి కులశైలము మీఁటి ధరిత్రిఁ గొమ్మునం
దలవడ మాటి రక్కసునియంగము గీటి బలీంద్రునిన్ రసా
తలమున మాటి పార్థివకదంబముఁ గూల్చి నమేటి రామ నా
తలఁపున నాటి రాఁగదవె దా... 33

ఉ. భండనభీముఁ డార్తజనబాంధవుఁ డుజ్జ్వలబాణతూణ కో
దండకళాప్రచండభుజతాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవసాటిదైవ మిఁక లేదనుచున్ గడ గట్టి భేరికా
డాండడడాండడాండనినదంబు లజాండము నిండ మత్తవే
దండము నెక్కి చాటెదను దా... 34

చ. అవనిజకన్నుదోయితొగలందు వెలింగెడుసోమ జానకీ
కువలయనేత్రగబ్బిచనుఁగొండల నుండుఘనంబ మైథిలీ
నవనవయౌవనం బనువనంబునకున్ మదదంతి వీవె కా
తవిలి భజింతు నెల్లపుడు దా... 35

చ. ఖరకరవంశజా విను మఖండితభూత పిశాచఢాకినీ
జ్వరపరితాపసర్పభయవారక మైన భవత్పదాబ్జవి
స్ఫురదురువజ్రపంజరముఁ జొచ్చితి నీయెడ దీనమానవో
ద్ధరబిరుదాంక మేమఱకు దా... 36

ఉ. జుట్టెద మీకథామృతము జుట్టెద మీపదకంజతోయమున్
జుట్టెద రామనామమున జొబ్బిలుచున్న సుధారసంబు నే
జుట్టెద జుట్టు జుట్టఁగ రుచుల్ గనువారిపదంబుఁ గూర్పవే
తట్టులతోడి పొత్తిడక దా... 37

ఉ. ఘోరకృతాంతవీరభటకోటికి గుండెదిగుల్ దరిద్రతా
కారపిశాచసంహరణకార్యవినోది వికుంఠమందిర
ద్వారకవాటభేది నిజదాసజనావళి కెల్లప్రొద్దు నీ
తారకనామ మెన్నుకొన దా... 38

ఉ. విన్నప మాలకించు రఘువీర నహిప్రతి లోకమందు నా
కన్న దురాత్ముఁడుం బరమకారుణికోత్తమ వేల్పులందు నీ

కన్న మహాత్ముఁడుం బతితకల్మషదూరుఁడు లేడు గాన వి
ద్వన్నుత నీవె నాకుగతి దా... 39

ఉ. పెంపను దల్లివై కలుషబృందసమాగమ మొందకుండ ర
క్షింపను దండ్రివై మెయి వసించు దశేంద్రియరోగముల్ నివా
రింపను వెజ్జవై కృపగుఱించి పరంబుఁ దిరంబుఁ గాఁగ స
త్సంపద లీయ నీవెగతి దా... 40

ఉ. కుక్షి నజాండపంక్తు లొనఁగూర్చి చరాచరజంతుకోటి సం
రక్షణ సేయు తండ్రివి పరంపర నీతనయుండనైన నా
పక్షము నీవు గావలదె పాపము లెన్ని యొనర్చినన్ జగ
ద్రక్షక కర్తనీవె కద దా... 41

ఉ. గద్దరియోగిహృత్కమలగంధర సానుభవంబు జెందుపె
న్నిద్దపుగండుఁ దేఁటి ధరణీసుతకౌఁగిలిపంజరంబునన్
ముద్దులు గుల్కు రాచిలుక ముక్తినిధానము రామ రాఁగదే,
తద్దయు నేఁడు నాకడకు దా... 42

ఉ. కలియుగమర్త్యకోటి నినుఁ గన్గొనరానివిధంబో భక్తవ
త్సలత వహింపనో చటులసాంద్ర విపద్దశవార్ధిఁ గ్రుంకుచోఁ
బిలిచినఁ బల్కవింతమఱపే నరులిట్లనరాదుగాక నీ
తలఁపున లేదె సీతచెఱ దా... 43

చ. జనవర మీకథాళి విన సైఁపక కర్ణములందు ఘంటికా
నినదవినోదముల్ సలుపు నీచునకుఁ వరమిచ్చినావు ని
న్ననయము నమ్మికొల్చినమహాత్ముల కేమియొసంగెదో సనం
దననుత మా కొసంగుమయ దా... 44

ఉ. పాపము లొందువేళ రణపన్నగభూతభయజ్వరాదులం
దాపద నొందువేళ భరతాగ్రజ మిమ్ము భజించువారికిం
బ్రాపుగ నీవుఁ దమ్ము డిరుపక్కియలం జని తద్విపత్తి సం
తాపము మాన్పి కాతురఁట దా... 45

చ. అగణితజన్మకర్మ దురితాంబుధిలో బహుదుఃఖవీచికల్
దెగిపడ నీఁదలేక జగతీధవ నీపదభక్తి నావచేఁ
దగిలి తరింప గోరితిఁ బదంపడి నాదుభయంబు మాన్పవే
తగ దని చిత్తమం దిడక దా... 46

ఉ. నేనొనరించు పాపము లనేకము లైనను నాదు జిహ్వకుం
బానకమయ్యె మీ పరమపావననామము దొంటిచిల్క పా

మా ననుఁగావు మన్న తుదిమాటకు సద్గతిఁ జెందెఁ
గావునన్ దాని ధరింపఁగోరెదను దా... 47

చ. పరధనముల్ హరించి పరభామలనంటి పరాన్న మబ్బినన్
మురిపమె కానిమీఁద నగుమోస మెఱుంగదు మానసంబు దు
స్తర మిది కాలకింకరగదాహతిపాల్పడనీక మమ్ము నే
తఱి దరిఁ జేర్చి కాచెదవొ దా... 48

ఉ. చేసితి ఘోరకృత్యములు చేసితి భాగవతాపచారముల్
చేసితి నన్యదైవములఁ జేరి భజించినవారిపొందు నేఁ
జేసిననేరముల్ దలఁచి చిక్కులఁ బెట్టకుమయ్య యయ్య నీ
దాసుఁడ నయ్య భద్రగిరి దా... 49

చ. పరులధనంబుఁ జూచి పరభామలఁ జూచి హరింపఁ గోరుమ
ద్గురుతరమానసం బనెడు దొంగనుబట్టి నిరూఢదాస్యవి
స్ఫురితవివేకపాశములఁ జుట్టి భవచ్చరణం బనేమరు
త్తరువునఁ గట్టివేయఁగదె దా... 50

చ. సలలితరామనామ జపసార మెఱుంగను గాశికాపురీ
నిలయుఁడఁ గాను మీచరణ నీరజరేణు మహాప్రభావముం
దెలియ నహల్యగాను జగతీవర నీదగు సత్యవాక్యముం
దలఁపఁగ రావణాసురుని తమ్ముఁడఁగాను భవద్విలాసముల్
తలఁచి నుతింప నాతరమె దా... 51

ఉ. పాతకులైన మీకృపకుఁ బాత్రుల కారె తలంచి చూడఁ జ
ట్రాతికిఁ గల్గెఁ బావనమరాతికి రాజ్యసుఖంబు గల్గె దు
ర్జాతికిఁ బుణ్యమబ్బెఁ గపిజాతి మహత్త్వము నొందెఁ గావునన్
దాతవ యెట్టివారలకు దా... 52

ఉ. మామకపాతకవ్రజము మాన్ప నగణ్యము చిత్రగుప్తుఁ డే
మేమని వ్రాయునో శమనుఁ డేమి విధించునొ కాలకింకర
స్తోమ మొనర్చు టేమొ వినఁ జొప్పడ దంతకుమున్నె దీనచిం
తామణి యెట్లు గాచెదవొ దా. 53

ఉ. దాసినచుట్టమా శబరి దాని దయామతి నేలినావు నీ
దాసునిదాసుఁడా గుహుఁడు తావకదాస్య మొసంగినావు నేఁ
జేసినపాపమా వినుతి చేసినఁ గానవు కావుమయ్య నీ
దాసులలోన నే నొకఁడ దా... 54

ఉ. దీక్షవహించి నాకొలఁది దీనుల నెందఱిఁ గాచితో జగ
ద్రక్షక తొల్లి ద్రుపదరాజతనూజ తలంచినంతనే
సాక్షయమైనవల్వ లిడి తక్కట నామొఱ చిత్తగించి ప్ర
త్యక్షము గావ వేమిటికి దా... 55

ఉ. నీలఘనాభమూర్తి వగునిన్నుఁ గనుంగొనఁగోరి వేఁడినన్
జాలము సేసి డాఁగెదవు సంస్తుతి కెక్కినరామనామ మే
మూలను దాఁచుకోఁ గలవు ముక్తికిఁ బ్రాపది పాపమూలకు
ద్దాలముగాదె మాయెడల దా... 56

చ. వలదు పరాకు భక్తజనవత్సల నీచరితంబు వమ్ముగా
వలదు పరాకు నీబిరుదు వజ్రమువంటిది కావ కూరకే
వలదు పరాకు నాఁదురితవార్ధికిఁ దెప్పవుగా మనంబులోఁ
దలఁతుమె కా నిరంతరము దా... 57

ఉ. తప్పు లెఱుంగలేక దురితంబులు సేసితి నంటి నీవు మా
యప్పవు గావు మంటి నిఁక నన్యులకున్ నుదు రంట నంటి నీ
కొప్పిదమైనదాసజను లొప్పినబంటుకు బంట నంటి నా
తప్పుల కెల్ల నీవె గతి దా... 58

చ. ఇతఁడు దురాత్ముఁడంచు జను లెన్నఁగ నాఱడిఁ గొంటి నేనెపో
పతితుఁడ నంటి నోపరమపావనమూర్తివి నీవు గల్గ నే
నితరుల వేఁడ నంటి నిహ మిచ్చిన నిమ్మపరంబొసంగు మీ
యతులితరామనామమధురాక్షరపాళి నిరంతరంబు హృ
ద్గతమని నమ్మి కొల్చెదను దా... 59

ఉ. అంచితమైననీదుకరుణామృతసారము నాదుపైనిఁ బ్రో
క్షించినఁ జాలు దాన నిరసించెద నాదురితంబు లెల్లఁ దూ
లించెద వైరివర్గ మెడలించెదఁ గోర్కుల నీదు బంటనై
దంచెదఁ గాలకింకరుల దా... 60

చ. జలనిధు లేడు నొక్కమొగిఁ జక్కికిఁ దెచ్చె శరంబు ఱాతి నిం
పలరఁగఁ జేసె నాతిగఁ బదాబ్జపరాగము నీచరిత్రమున్
జలజభవాదినిర్జరులు సన్నుతిసేయఁగ లేరు గావునం
దలఁప నగణ్య మయ్యె యిది దా... 61

చ. కోఁతికి శక్యమా యసురకోటుల గెల్వను గెల్చెఁ బో నిజం
బాతని మేన శీతకరుఁ డౌట దవానలుఁ డెట్టి వింత మా

సీతపతివ్రతామహిమ సేవకుభాగ్యము మీకటాక్షమున్
ధాతకు శక్యమా పొగడ దా... 62

చ. భూపలలామ రామ రఘుపుంగవరామ త్రిలోకరాజ్య సం
స్థాపనరామ మోక్షఫలదాయకరామ మదీయపాపముల్
పాపఁగదయ్య రామ నినుఁ బ్రస్తుతి సేసెదనయ్య రామ సీ
తాపతిరామ భద్రగిరి దా... 63

చ. నీసహజంబు సాత్త్వికము నీవిడిపట్టు సుధాపయోధి ప
ద్మాసనుఁ డాత్మజుండు కమలాలయ నీప్రియురాలు నీకు సిం
హాసన మిద్ధరిత్రి గొడు గాకసమక్షులు చంద్రభాస్కరుల్
నీసుమతల్పమాదిఫణి నీవె సమస్తముఁ గొల్చినట్టి నీ
దాసులభాగ్య మెట్టిదయ దా... 64

చ. చరణము సోఁకినట్టిశిల జవ్వనిరూపగు టొక్కవింత సు
స్థిరముగ నీటిపై గిరులు దేలిన దొక్కటివింతగాని మీ
స్మరణఁ దనర్చు మానవులు సద్గతిఁ జెందిన దెంతవింత? యీ
ధరను ధరాత్మజారమణ దా... 65

చ. దైవము తల్లిదండ్రితగుదాత గురుండు సఖుండు నిన్నె కా
భావన సేయుచున్నతఱిఁ బాపములెల్ల మనోవికార దు
ర్భావితుఁ జేయుచున్నవి కృపామతివై ననుఁ గావుమీ జగ
త్పావనమూర్తి భద్రగిరి దా... 66

చ. వాసవరాజ్యభోగసుఖవార్ధిని దేలుప్రభుత్వ మబ్బినన్
ఆసకు మేరలేదు కనకాద్రిసమానధనంబుఁ గూర్చినం
గాసును వెంటరాదు కని కానకచేసిన పుణ్యపాపముల్
వీసరపోవ నీవు పదివేలకుఁ జాలుభవంబునొల్ల నీ
దాసునిఁగాఁగ నేలుకొను దా... 67

చ. సూరిజనుల్ దయాపరులు సూనృతవాదు లలుబ్ధమానవుల్
వీరపతివ్రతాంగనలు విప్రులు గోవులు వేదముల్ మహీ
భారముఁ దాల్పఁగా జనులు పావన మైనపరోపకార స
త్కార మెఱుంగలే రకట దా... 68

చ. వారిచరావతారమున వారిధిలోఁ జొరఁబాఱి క్రోధవి
స్తారగుఁడై నయానిగమ తస్కరవీరనిశాచరేంద్రునిం
జేరి వధించి వేదముల చిక్కెడలించి విరించికిచ్చి మహో
దారత నిచ్చి తీవెకద దా... 69

చ. కర మనురక్తి మందరముఁ గవ్వముగా నహిరాజు ద్రాడుగా
దొరకొని దేవదానవులు దుగ్ధపయోధిమథించుచున్నచో
ధరణి చలింప లోకములు తల్లడ మందఁగఁ గూర్మమై ధరా
ధరము ధరించి తీవె కద దా... 70

చ. ధారుణిఁ జాఁపఁ జుట్టినవిధంబునఁ గైకొని హేమనేత్రుఁ డ
వ్వారిధిలోన డాఁగినను వాని వధించి వరాహమూర్తివై
ధారుణిఁ దొంటికైవడిని దక్షిణశృంగమునన్ ధరించి వి
స్తార మొనర్చి తీవెకద దా... 71

చ. పెటపెట నుక్కుఁగంబమున భీకరదంతనఖాంకురప్రభా
పటలముఁ గప్ప నుప్పతిలి భండనవీధి నృసింహభీకర
స్ఫుటపటుశక్తి హేమకశిపుం విదళించి సురారిపట్టినం
దటఁ గృపఁ జూచితీవె కద దా... 72

చ. పదయుగళంబు భూగగనభాగములన్ వెస నూని విక్రమా
స్పద మగునబ్బలీంద్రు నొకపాదమునం దలక్రింద నొత్తి మే
లొదవజగత్త్రియంబుఁ బురుహూతున కియ్య వటుండవైన చి
త్సదమలమూర్తి వీవె కద దా... 73

చ. ఇరువదియొక్కమాఱు ధరణీశుల నెల్ల వధించి తత్కళే
బరరుధిరప్రవాహమునఁ బైతృకతర్పణ మొప్పఁజేసి భూ
సురవరకోటికిన్ ముదము చొప్పడ భార్గవరామమూర్తివై
ధరణి నొసంగి తీవె కద దా... 74

చ. దురమునఁ దాటకం దునిమి ధూర్జటివిల్ దునుమాడి సీతనుం
బరిణయమంది తండ్రి పనుపన్ ఘనకాననభూమి కేఁగి దు
స్తరపటుచండకాండ కులిశాహతి రావణకుంభకర్ణ భూ
ధరములఁ గూల్చితీవెకద దా... 75

చ. అనుపమయాదవాన్వయ సుధాబ్ధిసుధానిధి కృష్ణమూర్తి నీ
కనుజుఁడుగా జనించి కుజనావళినెల్ల నణంచిరోహిణీ
తనయుఁడనంగ బాహుబలదర్పమునన్ బలరామమూర్తివై
తనరినవేల్పు వీవె కద దా... 76

చ. సురలు నుతింపఁగాఁ ద్రిపురసుందరులన్ వరియింప బుద్ధరూ
పరయఁగఁ దాల్చి తీవు త్రిపురాసురకోటి దహించునప్పు డా
హరునకుఁ దోడుగా వరశరాసనబాణముఖోగ్రసాధనో
త్కర మొనరించి తీవెకద దా... 77

ఉ. సంకరదుర్గమై దురితసంకుల మైనజగంబుఁ జూచి స
ర్వాంకషలీల నుత్తమతురంగము నెక్కి కరాసిఁబూని వీ
రాంకవిలాస మొప్పఁ గలికాకృతి సజ్జనకోటికిన్ నిరా
తంక మొనర్చె దీవె కద దా... 78

చ. మనమున నూహాపోహణలు మర్వకమున్నె కఫాదిరోగముల్
దనువుననంటి మేనిబిగి దప్పకమున్నె నసుండు మోక్షసా
ధన మొనరింపఁగావలయుఁ దత్త్వవిచారము మానియుండుట
ల్తనువునకున్ విరోధమిది దా... 79

చ. ముదమున కాటపట్టు భవమోహమదద్విరదాంకుశంబు సం
పదలకొటారు కోరుకులపంట పరంబున కాది వైరుల
న్నదనజయించుత్రోవ విపదబ్ధికి నావ గదా సదాభవ
త్సదమలనామసంస్మరణ దా... 80

చ. దురితలతానుసారి భవదుఃఖకదంబము రామనామ భీ
కరతరహేతిచేఁ దెగి వకావకలై చనకుండ నేర్చునే
దరికొని మండుచుండు శిఖ దార్కొనినన్ శలభాదికీటకో
త్కరము విలీనమై చనదె దా... 81

చ. హరిపదభక్తి నింద్రియజయాన్వితుఁ డుత్తముఁ డింద్రియంబుల
న్మరగక నిల్పనూఁదినను మధ్యముఁ డింద్రియపారవశ్యుఁడై
పరఁగినచో నికృష్టుఁ డని పల్కఁగ దుర్మతి నైన నన్ను నా
దరమున నెట్లు కాచెదవొ దా... 82

చ. వనకరి చిక్కె మైనసకు వాచవికిం జెడిపోయె మీను తా
వినికికిఁ జిక్కెఁ జిల్వకను వేదుఱుఁ జెందను లేళ్లు తావిలో
మనికి నశించెఁ దేఁటి తరమా యిరుమూఁటిని గెల్వ నైదుసా
ధనముల నీవె కావఁ దగు దా... 83

చ. కరములు మీకు మ్రొక్కులిడఁ గన్నులు మిమ్ము నెచూడ జిహ్వ మీ
స్మరణఁ దనర్ప వీనులు భవత్కథలన్ వినుచుండ నాస మీ
యఱుతను బెట్టుపూసరుల కాసకొనం బరమార్థసాధనో
త్కర మది చేయవే కృపను దా... 84

చ. చిరతరభక్తి నొక్కతులసీదళ మర్పణసేయువాఁడు ఖే
చరగరుడోరగప్రముఖసంఘములో వెలుఁగున్ సదాభవ
త్స్ఫురదరవిందపాదములఁ బూజ లొనర్చినవారి కెల్లఁ ద
త్పర మఱచేతిధాత్రిగద దా... 85

ఉ. భానుఁడు తూర్పునందుఁ గనుపట్టినఁ బావకచంద్రతేజముల్
హీనతఁ జెందినట్లు జగదేకవిరాజితమైన నీపద
ధ్యానము సేయుచున్నఁ బరదైవమరీచు లడంగకుండునే
దానవగర్వనిర్దళన దా... 86

ఉ. నీమహనీయతత్త్వరసనిర్ణయబోధకథామృతాబ్ధిలోఁ
దామును గ్రుంకులాడక వృథా తనుకష్టముఁ జెంది మానవుం
డీ మహిలోకతీర్థముల నెల్ల మునింగిన దుర్వికార హృ
త్తామసపంకముల్ విడునె దా .. 87

ఉ. కాంచనవస్తుసంకలితకల్మష మగ్నిపుటంబు వెట్టి వా
రించినరీతి నాత్మ నిగిడించినదుష్కర దుర్మలత్రయం
బంచితభక్తియోగదహనార్చిఁ దగుల్చక పాయునే కన
త్కాంచనకుండలాభరణ దా... 88

ఉ. నీసతి పెక్కుకల్ము లిడ నేర్పరి లోక మకల్మషంబుగా
నీసుత సేయు పావనము నిర్మితకార్యధురీణదక్షుఁడై
నీసుతుఁ డిచ్చువాయువులు నిన్ను భజించినఁ గల్గకుండునే
దాసుల కీప్సితార్థములు దా... 89

ఉ. వారిజపత్త్రమం దిడినవారివిధంబున వర్తనీయమం
దారయ రొంపిలోనఁ దనువంటని కుమ్మరపుర్వురీతి సం
సారమునన్ మెలంగుచు విచారగుఁడై పరమొందుఁగాదె స
త్కార మెఱింగి మానవుఁడు దా... 90

ఉ. ఎక్కడితల్లిదండ్రి సుతు లెక్కడివారు కళత్రబాంధవం
బెక్కడ జీవుఁ డెట్టితను వెత్తినఁ బుట్టుచుఁ బోవుచున్నవాఁ
డొక్కఁడె పాపపుణ్యఫలమొందిన నొక్కఁడె కానరాఁడు వే
ఱొక్కఁడు వెంటనంటి భవ మొల్లనయా కృపఁజూడవయ్య నీ
తక్కరిమాయలం దిడక దా... 91

చ. దొరసినకాయముల్ ముదిమితోఁచినఁజూచి ప్రభుత్వము ల్సిరుల్
మెఱుపులుగాఁగఁ జూచి మఱి మేదినిలోఁ దమతోడివారు ముం
దరుగుటఁజూచిచూచి తెగునాయు వెఱుంగక మోహపాశము
ల్దఱుగనివారి కేమిగతి దా... 92

ఉ. జీవన మింకఁ బంకమునఁ జిక్కినమీను చలింపకెంతయుం
దావున నిల్చి జీవనమె తద్దయుఁ గోరువిధంబు చొప్పడం
దావలమైనఁ గాని గుఱి దప్పనివాఁడు తరించువాఁడయా
తావకభక్తియోగమున దా... 93

చ. సరసునిమానసంబును రసజ్ఞుఁ డెఱుంగును ముష్కరాధముం
డెఱిఁగి గ్రహించువాఁడె కొలనేకనివాసముగాఁగ దర్దురం
బరయఁగ నేర్చు నెట్లు వికచాబ్జమరందరసైకసౌరభో
త్కరము మిళింద మొందుక్రియ దా... 94

ఉ. నోఁచినతల్లిదండ్రికిఁ దనూభవుఁ డొక్కఁడె చాలు మేటి చే
చాఁచనివాఁడు వేఱొకఁడు చాఁచిన లే దన కిచ్చువాఁడు నో
రాఁచి నిజంబకాని పలు కాడనివాఁడు రణంబులోన మేన్
దాఁచనివాఁడు భద్రగిరి దా... 95

ఉ. శ్రీయుతజానకీరమణ చిన్మయరూపరమేశ రామ నా
రాయణ పాహిపాహి యని ప్రస్తుతిఁ జేసితి నామనంబునం
బాయక కిల్బిషవ్రజవిపాటనమందఁగఁ జేసిసత్కళా
దాయిఫలంబు నా కియవె దా... 96

ఉ. ఎంతటిపుణ్యమో శబరియెంగిలిఁ గొంటివి వింతగాదె నీ
మంతన మెట్టిదో యుడుతమైని గరాగ్రనఖాంకురంబులన్
సంతసమందఁ జేసితివి సత్కులజన్మము లేమి లెక్క వే
దాంతముగాదె నీమహిమ దా... 97

చ. భ్రమరము కీటకంబుఁగొని పాల్పడి ఝూంకరణోపకారియై
భ్రమరముగా నొనర్చునని పల్కుటఁ జేసి భవాదిదుఃఖసం
తమస మెడల్చి భక్తిసహితంబుగ జీవుని విశ్వరూపత
త్త్వమున ధరించు టేమరుదు దా... 98

చ. తనువులుపూఁచి కాయలగుఁ దత్కుసుమంబులు పూజగా భవ
చ్చరణము సోఁకి దాసులకు సారము లౌ ధనధాన్యరాసులై
కరిభటఘోటకాంబరనికాయము లై విరజానదీసము
త్తరణ మొనర్చుఁ జిత్రమిది దా... 99

ఉ. పట్టితి భట్టరార్యగురుపాదము లిమ్మెయి నూర్ధ్వపుండ్రముం
బెట్టితి మంత్రరాజ మొడిఁబెట్టితి నయ్యమకింకరాళికిం
గట్టితి బొమ్మ మీచరణకంజములందుఁ దలంపువెట్టి పోఁ
దట్టితిఁ బాపపుంజముల దా... 100

ఉ. అల్లన లింగమంత్రిసుతుఁ డత్రిజగోత్రజుఁ డాదిశాఖ కం
చెర్లకులోద్భవుం డనఁ బ్రసిద్ధుఁడనై భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచియించితి గోపకవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ నీకు దాసుఁడను దా... 101

దాశరథిశతకము సంపూర్ణము



శ్రీరస్తు.

# వృషాధిపశతకము





గురులింగమూర్తిసువిశేషమహోజ్జ్వలకీర్తి సత్క్రియో
ద్యోగకళాప్రపూర్తి యవధూతపునర్భవజూర్తి పాలితా
భ్యాగతసంశ్రితార్థికవిపండితగాయకచక్రవర్తి దే
వా! గతి నీవె మాకు బసవా! బసవా! బసవా! వృషాధిపా!

చ. ప్రమథవిలోల భక్తపరిపాల ధురంధరశీల సంతతా
స్తమితసమస్తదేహగుణజాల! సుఖప్రదలీల లింగజం
గమమహిమానుపాల గతకాల సమంచితనాదమూల దే
వ మము భరింపుమయ్య బసవా... 2

ఉ. అప్రతిమప్రతాప సముదంచితనాదకళాకలాప దీ
ప్తప్రమథస్వరూప శివభక్తగణాత్మగతప్రదీప ధూ
తప్రబలేక్షుచాప విగతప్రికటాఖిలపాద లింగత
త్త్వప్రప నీవె దక్కు బసవా... 3

ఉ. భక్తిరసాభిషిక్త భవపాశవితానవిముక్త జంగమా
సక్త దయాభిషిక్త తనుసంగతసౌఖ్యవిరక్త సంతతో
ద్యుక్తగుణానురక్త పరితోషితభక్త శివైక్యయుక్త ప్ర
వ్యక్తమ నీవె దిక్కు బసవా... 4

ఉ. శత్రులతాలవిత్ర గుణజైత్ర భవాబ్ధివహిత్ర జంగమ
క్షేత్రవిచిత్రసూత్ర బుధగీతచరిత్ర శిలాదపుత్ర స
త్పాత్ర విశుద్ధగాత్ర శివభక్తికళత్ర శరణ్య మయ్య భా
స్వత్త్రిజగత్పవిత్ర బసవా... 5

ఉ. త్ర్యక్షుసదృక్షు సంచితదయాక్షు శివాత్మకదీక్షు సత్ప్రసా
దాక్షు ప్రతాపశిక్షితమహాప్రతిపక్షు మహోక్షు భూరిక
ర్మక్షయదక్షు జంగమసమక్షుమ భక్తిపరోక్షు లింగ త
త్త్వక్షుమ నీవె దిక్కు బసవా... 6

ఉ. అక్షయభక్తిపక్షు బసవాక్షు ♦సారకకల్పవృక్షు రు
ద్రాక్షవిభూతివక్షు ఫలితార్థముముక్షు శివప్రయుక్తశా
లాక్షు కృపాసమంచితకటాక్షు శుభాశుభపాశమోక్షు త
త్త్వక్షుమ నీవె దిక్కు బసవా... 7

ఉ. ఆర్యవితానవర్య భువనాధికశౌర్య యుదాత్తసత్ప్రదా
చార్య యవార్యవీర్య బుధసన్నుతచర్య విశేషభక్తితా
త్పర్య వివేకధుర్య పరిపాలితతుర్యశరణ్యమయ్య దు
ర్వార్యయసూనధైర్య బసవా... 8

ఉ. తజ్జ్ఞజితప్రతిజ్ఞ యుచితప్రమథానుగతజ్ఞ సప్రదై
వజ్ఞ కళావిధిజ్ఞ బలవచ్ఛివభక్తిమనోజ్ఞ ధూతశా
స్త్రజ్ఞ సునాదపూరితరసజ్ఞ తృణీకృతపంచయజ్ఞ స
ర్వజ్ఞ శరణ్య మయ్య బసవా... 9

ఉ. క్షీణజనప్రమాణ యసికృత్తకుయంత్రకఘోణ జంగమ
ప్రాణ వినిర్జితప్రసవబాణ సమంచితభక్తియోగసం
త్రాణ కళాప్రవీణ శివధర్మరహస్యధురీణ సత్తని
ర్వాణ శరణ్య మయ్య బసవా... 10

ఉ. గానరసప్రవీణ గతకాలవితాన సమస్తభక్తస
న్మాన మహాకులీన యసమానచరాచరరూపభేదసం
ధాన జితాభిమాన తనుధర్మవిహీన మహాప్రధాన దే
వా ననుఁ గావుమయ్య బసవా... 11

ఉ. లింగమయాంతరంగ గురులింగపదాంబుజభృంగ సత్ప్రసా
దాంగ కృపాపరిస్ఫురదపాంగ విముక్తభుజంగ జంగమో
త్తుంగ జితాభిషంగ గతసుప్రకృతిభంగ మదీయలింగ నీ
వంగడ మేఁజుమయ్య బసవా... 12

ఉ. ఉత్తమభక్తివృత్త భజనోత్సుకచిత్త యుదాత్తచిత్సుఖా
యత్తక్రియాప్రమత్త నిఖిలాగమవేత్త గుణోపయుక్త స
ద్వృత్త ప్రసాదభోగసముదీర్ణవిశేషసుఖప్రమత్త భా
స్వత్తమ నీవె దిక్కు బసవా... 13

♦ సాధక.

ఉ. దేవాజవైరివాహ శివదీపితదేహ సుఖప్రవాహ ని
ర్మోహ వినమ్రసంయమిసమూహ లసద్గుణగేహ సంతతో
త్సాహ నిరీహ జంగమవితానదయావిహితావగాహ ని
ర్వాహము నీవె దిక్కు బసవా... 14



ఉ. న్యాసఫలానివాస దరహాసముఖప్రతిభాస దత్తకై
లాస విశేషజంగమవిలాస శివైక్యసమాస నిర్జితా
యాస సమస్తభక్తహృదయాంబుజనిత్యనివాస ధిక్కృతా
వ్యాస శరణ్యమయ్య బసవా... 15

ఉ. రాగపరోపభోగ గతరాగ విధూతభవాదిరోగ ని
ర్యాగ మహానురాగ బహిరంతరనిష్ఠితయోగ సత్క్రియో
ద్యోగ యకర్మయోగ శివయోగ సమగ్రసుఖాతిభోగ దే
వా గతినీవె మాకు బసవా... 16

ఉ. శీలలతాలవాల యవశిష్టభవప్రతికూల లాలితో
త్తాల గుణానుకూల శివధర్మమతప్రతిపాల నిత్యస
ల్లీల యశోవిశాల చరలింగసుఖోదయకాల జియ్య దే
వా లలిఁ బ్రోవుమయ్య బసవా... 17

ఉ. కామితభక్తిభామ గతకామ మహాగణసార్వభౌమ ని
స్సీమయశోభిరామ సవిశేషవిముక్తిలలామ సద్గుణ
స్తోమ శివైక్యధామ సుఖదుఃఖవిరామ ప్రమోదసీమ దే
వా మముఁ గావు మయ్య బసవా... 18

ఉ. సాధితజన్మబాధ గతసర్వనిషేధ ♦ హతాపరాధ దు
ర్బోధకళావిరోధ పరిపోషిత శాంభవవేధవర్జిత
క్రోధనిరాకృతాఖిలవిరోధ శివైక్యసుబోధ యీభవ
వ్యాధికి నీవె మందు బసవా... 19

ఉ. శ్రీవిలసత్ప్రభావ * ప్రవిశిష్టపరాజితయన్యదైవ స
ద్భావయుతస్వభావ శివతత్త్వవిశిష్టమహానుభావ యం
హోవనదావ పాలితమహోద్ధతశైవ విభుండ వీవ దే
వా వరదానశీల బసవా... 20

ఉ. ఆద్య సమర్పితాఖిలపురాతనభక్తగణానువేద్య సం
పాద్యగుణానవద్య యనుభావశివాంకితగద్యపద్య ని
ర్భేద్యగణైకవేద్య యురరీకృతవాద్య భవాదిరోగస
ద్వైద్య శరణ్య మయ్య బసవా... 21

ఉ. నాదకళావినోద యభినందితవేద హృతాపవాద సం
పాదితభక్తిమోద బుధవందితపాద చిరప్రమోద యా
స్వాదితసుప్రసాద యవిషాద శిలాదసుతావిభేద దే
వా దయఁ జూడు మయ్య బసవా... 22

ఉ. కాయగుణావిధేయ జితకాయ విసంభ్రమజగన్నికాయ యా
మ్నాయవచాప్రమేయ యసమానసమంచితగేయ భక్తిధా
రేయ సదానపాయ సుచరిత్ర సహాయ జితాంతకాయ దే
వా యొడయండ వీవ బసవా... 23

ఉ. స్వీకృతభక్తలోక యవశీకృత కర్కశపాపధూక యూ
రీకృతసద్వివేక యురరీకృతజంగమభక్తిశూక దూ
రీకృతదుష్టపాక యధరీకృతవేదవిరుద్ధబౌద్ధచా
ర్వాక శరణ్య మయ్య బసవా... 24

ఉ. నిత్య యుదాత్తసత్య యతినిశ్చలజంగమభృత్య సజ్జన
స్తుత్య కృపాకటాక్షపరిశోభితచైత్య మహిష్ఠభక్తి సం
గత్యభిరామసత్య గురుకార్యపరాయణకృత్య వర్జిత
వ్రాత్య శరణ్యమయ్య బసవా... 25

ఉ. ధన్య మహావదాన్య గతదైన్య విధూతజఘన్య భక్తిచై
తన్య గుణైకమాన్య హతదర్పకసైన్య నిరస్తమాతృకా
స్తన్య జితారిఘోరభవజన్య శరణ్యము చిత్సుఖాత్మభా
వన్య శరణ్య మయ్య బసవా... 26

ఉ. చర్వితశృంగిగర్వ గుణసంపదఖర్వ యపూర్వగీతగాం
ధర్వ దిగంతపూర్ణసముదాత్తయశఃకృతకర్ణపర్వ యం
తర్వినివిష్టశర్వ విదితస్ఫురణాంచిత *దర్వకావుమో
పర్వఘనప్రపాద బసవా... 27

ఉ. ఖ్యాతదయాభిజాత విపదంబుధిపోత యజాతతత్త్వని
ర్ణేత వినీతభక్తిపరిణేత మనోరథదాత జంగమ
స్తోత ముముక్షుగీత పరిశోభితనీతిసమేత సద్గుణ
వ్రాత శరణ్యమయ్య బసవా... 28

ఉ. మారమదాపహార సుకుమారశరీర గణప్రసాదవి
స్తార వృషావతార సముదారవిహార *నముద్దయాపరి
ష్కార శుభప్రకార యవికార మహాజగదేకవీర దు
ర్వార శరణ్యమయ్య బసవా... 29

* దర్పకోటమాపాద. పర్వఘనప్రపాద, వర్వఘనప్రమ. ♦ సముద్దయా.

ఉ. దేశికజన్మదేశ యవిదేశయనావృతపాశ సంహృత
క్లేశ మహాప్రకాశ కృతకిల్బిషనాశ జయానివేశ నం
దీశనికాశ జంగమసమీహితకారిగుణావకాశ దే
వా శరణయ్యవయ్య బసవా... 30

ఉ. ఉద్ధతభక్తవృద్ధ వినుతోత్తమసిద్ధ పరీతజంగమ
శ్రద్ధ సదాత్మశుద్ధ గుణరాజసమృద్ధ విముక్తపాశస
న్నద్ధ మహాప్రసిద్ధ యగుణత్రయబద్ధ శరణ్యమయ్య భా
స్వద్ధతచిత్త్వము బసవా... 31

ఉ. నందితభక్తబృంద యవినాశిరదాంశుముఖారవింద *సా
నంద వినీతికంద కరుణామకరందరసోపలాలిత
స్పంద యుదాత్తభక్తితరుకంద యశోజితకుంద నాకరా
డ్వందిత నీవె దిక్కు బసవా... 32

ఉ. లాలిత్యసరాయణాత్మగుణలౌల్య యమూల్య సదోపయుక్తని
ర్మాల్య వినీతికల్య యసమానదయారసకుల్య నిత్యనై
ర్మల్య యమూల్య దుష్టజనమానసశల్య పదాబ్జలబ్ధకై
వల్య శరణ్య మయ్య బసవా... 33

చ. గురుపదపద్మసద్మ యవికుంఠితజంగమశీలఖేల సు
స్థిరమృదుపాదమోద సముదీర్ణవిశేషమహత్వతత్త్వ ని
ర్భరభుజశౌర్యధుర్య పరిరంభితభక్తికళత్రగోత్ర మ
ద్వరద శరణ్య మయ్య బసవా... 34

చ. భువనహితారతీర్థ భవభూరుహశాతకుఠారధార గౌ
రవసముదాత్తవృత్త యనురాగరసామృత సారపూర శాం
భవమయవేదబోధ శివభక్తహృదబ్జవికాసభాస దే
వ వరద కావుమయ్య బసవా... 35

చ. వినుతనవీనగానగుణవిశ్రుతభక్తవిధేయకాయ య
త్యనుపమగణ్యపుణ్య నయనాంచల♦దూరభవోపతాప స
ద్వినయవికాసభాస సముదీర్ణశివైకసుఖైకపాక దే
వ నను భరింపుమయ్య బసవా... 36

ఉ. అంచితభక్తియుక్త యసహాయవిశృంఖలవీరపూర ని
శ్చంచలశైవభావ శ్రితజంగమపాదకిరీటకూట హృ
త్సంచితసత్త్వతత్త్వ దురితవ్రజశైలకదంబశంబ ని
ర్వంచన నీవెదిక్కు బసవా... 37

---

* యానందవిలీయమానకరుణా. ♦ మారమదోపతాప...భావసముదీర్ణవిశాలశివైక్యపాల.

ఉ. నిర్గతధర్మకర్మ యవినీతపునర్భవయంత్రతంత్ర దు
ర్మార్గవిహీనమాన గుణమాన్య మహావృష*సామ్య సౌమ్యష
డ్వర్గవిరక్తసక్త మదడంబరవర్జితవేషభూష నీ
వర్గము నేఁజుమయ్య బసవా... 38

చ. సరసవచస్క నిర్మలయశస్క శివైక్యమనస్క భక్తహృ
త్సరసిజగేహ క్లృప్తభవదాహ దయాపరివాహ చిత్సుఖో
త్తరనిజశిల్పభక్తపరతల్ప మహావృషకల్ప మన్మనో
వరద శరణ్య మయ్య బసవా... 39

చ. హరసమసౌఖ్య యాదివృషభాఖ్య పురాతనముఖ్య తత్త్వవి
త్పరిషదుపాస్య వీతగుణదాస్యత్రిలోకనమస్య తార్కికో
త్కరజయశౌండ దీర్ఘభుజదండ మహాగుణషండ మన్మనో
వరద శరణ్య మయ్య బసవా... 40

చ. వరగుణదీప్ర భక్తజనవప్ర తృణీకృతవిప్ర తాత్త్వికాం
కురపదపద్మ భక్తిరసగుంభ నిరాకృతదంభ సద్గుణ
స్ఫురితవిశిష్ట శాంతగుణపుష్ట నిరస్తనికృష్ట మన్మనో
వరద శరణ్య మయ్య బసవా... 41

ఉ. లింగనిరూఢ సంచితవిలీఢ పరాక్రమగాఢ మానసా
సంగివృషాంక నిర్గళితశంక నిరస్తకళంక సంతతా
భంగురపుణ్య శీలమణిపణ్య త్రిలోకవరేణ్య దేవ నీ
వంగడమేఁజుమయ్య బసవా... 42

చ. ఉరుతరభాగ్య మన్మహితయోగ్య జగత్త్రయమృగ్యపాపసం
హరణసమర్థ నమ్రచరితార్థ లసద్గుణసార్థ భావభా
స్వరనయసాంద్ర కీర్తిజితచంద్ర వివర్జితతంద్ర మన్మనో
వరద శరణ్య మయ్య బసవా... 43

చ. విరచితశుద్ధసాళగనవీనమృదుస్వరమంద్రమధ్యతా
రసుచిరదేశిమార్గమధురస్వరగీతసుధాతరంగిణీ
తరలతరంగజాలసముదంచితకేళి విలోల సంగమే
శ్వర శరణయ్య నాకు బసవా... 42

చ. అసమవదాన్యమాన్య ప్రణుతార్యయవార్య రసజ్ఞతజ్ఞ దు
ర్వ్యసనవిదూర శూర గణవంద్య యనింద్య యమాఢ్య యాఢ్యభ
క్తిసుఖసమృద్ధ వృద్ధ చిరదీప్తిపవిత్రచరిత్రపాత్ర నా
వసిగని ప్రోవుమయ్య బసవా... 45

* సైన్యధన్య.

చ. అసమశిలీముఖస్ఫురదహంకృతికర్తనకర్మకర్మఠా
భ్యసనధురీణవిభ్రమ గణాధిపపాదసరోజసంతత
ప్రసృమరసాంభోసమకరందకసిక్తవనక్రియాకళా
వ్యసన శరణ్యమయ్య బసవా... 46

చ. అసదృశవిస్ఫురద్గుణనృగంచల కల్పితసృష్టిపాల న
గ్రసనకళాకలాప ఘనకౌశలఖేలన లింగమూర్తి మా
నసకలనావశీకరణ నైపుణ తత్పరశీల జంగమ
శ్వసన శరణ్యమయ్య బసవా... 47

చ. ప్రమథగణాధినాథ సముపాసనభాసురపార్వతీమనో
రమరమణీయహృత్కమలరాజితనవ్యపతంగ సౌరభ
భ్రమరవిలోలతామధుకరాయితదివ్యశరీర సత్ప్రభా
వ మహిత నీవె దిక్కు బసవా... 48

ఉ. కందళితాత్మయంత్రితవికర్తనశీల మరీచిమన్మనో
మందవిహారవిస్ఫురితమధ్యమమాన చిదంబకేందుని
ష్యందసుధారసానుభవ సంతతదివ్యశరీర యోగిరా
డ్వందిత నీవె దిక్కు బసవా... 49

ఉ. ఖ్యాతయశఃప్రపూరితజగత్త్రితయాయ నమోనమో మహా
పాతకసూతకఘ్న పదపద్మయుగాయ నమోనమో సము
ద్ద్యోతవృషాయ తే యనుచు నుత్సుకతన్ బ్రణుతింతు సంయమి
వ్రాతశరణ్యమయ్య బసవా... 50

ఉ. ఆప్తగణప్రవిష్టసకలార్తిహరాయ నమోనమో సుఖా
వాప్తికరస్మితాంచితకటాక్షదయాయ నమోనమో సము
ద్దీప్తగుణాయ తే యనుచు దీనగతిన్ బ్రణుతింతు నిన్ను ని
ర్వ్యాప్తజగత్ప్రపంచ బసవా... 51

ఉ. కల్పితలింగజంగమసుఖస్ఫురణాయ నమోనమో యసం
కల్పవికల్పమార్గకథితప్రథితాయ నమోనమో గుణా
కల్పవరాయ తే యనుచు గౌరవలీల నుతింతు నిన్ను స
స్వల్పతరప్రభావ బసవా... 52

ఉ. తర్జితదుష్కృతాయ భవతాపనికృంతనకల్మషాయ భ
క్త్యార్జితమానసాయ సుగుణోత్తమరత్నకరండకాయ తే
యార్జితసత్క్రియాయ సదయాయ నమోయని సన్నుతింతు నా
వర్జితభక్తలోక బసవా... 53

ఉ. మూ_ర్తితమన్మథాయ పరిశోభితభస్మవిలేపనాయ సం
పూర్ణమనోరథాయ గతపూర్వభవాశ్రితవ_ర్తనాయ తే
వర్ణనిరాసకాయ సశివాయ నమో యని సంతతంబు ని
న్వర్ణన సేయువాఁడ బసవా... 54

ఉ. హృన్నలినే స్మరామి భవదీయపదద్వితయం భవాటన
స్విన్నతనుశ్రమాపహ మశేషజగత్ప్రణుతం మదీశ ని
ష్పన్న దయానిధే యనుచు సంస్కృతభాష నుతింతు నిన్ను వి
ద్వన్నుతనామధేయ బసవా... 55

చ. పరమనె యన్నెయాండవనె పన్నగతానె యనాథనాధనే
పెరియవనే పులిందవనె పేరుడయానె పిరానె యప్పనే
తరిమురియయ్యనే యనుచు ద్రావిడభాష నుతింతు మన్మనో
వర కరుణావిధేయ బసవా... 56

చ. హసుళెయరెన్నరక్షి సువుదారయలెన్న వనీతనెందుమ
న్ని సువుదు నిమ్మడింగెరగ నిమ్మప్రసాదియె నిమ్మదాత్మవే
కసిగతి యంచు భక్తి నిచుఁ గన్నడభాష నుతింతు షడ్గుణ
శ్వసన పురాతనాత్మ బసవా... 57

ఉ. దేవపరీతు మ్హాచగురుదేవమణూనుతరీతు మ్హాచగో
సావితరీతుమ్హాచతుమచాచప్రసాదమ్హాచకృపాకరా
హేవరదా యటంచు నుతియింతెఁ నిన్నును నారెభాస దే
వా వినుతార్యలీల బసవా... 58

చ. అనయముఁ జేతులందు భవశంఘ్రిసరోజయుగం నమామి నె
మ్మనమున సంస్మరామి యనుమాటల నిర్వరివస్క_రోమ్యహ
మ్మనుచు మణిప్రవాళమున నంకన సేయుదు భక్తలోక హృ
ద్వనజవిహారలోల బసవా... 59

చ. అరళుగిరిప్రసాదముదయానె భవద్గుణవర్ణసల్పి నా
కొరువనినేస్మరామి సురయేశ్వరు రేగణవర్యయంచు ని
ట్లరుదుమణిప్రవాళమున నంకనసేయుచు నిన్ను మన్మనో
వరకరుణావిధేయ బసవా... 60

ఉ. హాయువుపొందు యీవిగతవావ అమాపరహాంబభో (?)
న్యాయవిధేయమీశతరి యన్యనబాణుకళాభిదంచువా
గ్దేయమణిప్రవాళమునఁ దెల్లము నిన్ను నలంకరింతు దే
వా యమిబృందవంద్య బసవా... 61

చ. బలుపొడతోలు చీరయును పాపపేరుల్ గిలుపారుకన్ను వె
న్నెలతలఁజేఁదుకుత్తుకయు నిండినవేలుపుటేఱు వల్గుపూ
సలు గల తేనితెంక వని జానుఁదెరుంగున విన్నవించెదన్
వలపు మదిన్ దలిర్ప బసవా... 62

చ. (?) తిరువడిసన్నుతినంబునను నేహ్యసయేశ్వర కింపరీయతా
బరికరితంబురాణి నినుబాహిరిఁబోలుటశాసితాహతా
వరనెగిన్లెయంచునినుఁ బ్రస్తుతిసేయుదుఁ బెక్కుభాషలన్
వరవివేకశీల బసవా... 63

ఉ. (?) హాళువెదానుహారసదినంబ్రమీయుగభ్రమగొండుసద్గుణా
మాడువదర్చనంబిడె సమగ్రనుతి త్వయిసత్క్రియల్ దగన్
గూడ మణిప్రవాళమునఁ గోరి నుతింతును సంచితార్థముల్
పాడిగ నివ్వటిల్ల బసవా... 64

ఉ. రుద్ర గణాదిరుద్ర వినిరూపితలింగ సుఖాదిసద్రయ
చ్ఛిద్ర దయాసముద్ర నవిశేషపరాక్రమవీరభద్ర య
త్క్షుద్రజనావలీభవనిషూదనరౌద్ర సమస్తభక్తదే
వద్రుమ నీవె దిక్కు బసవా... 65

చ. ఇహపరసిద్ధ సిద్ధవృషభేశ్వర ఈశ్వరభక్త భక్తహృ
ద్గహనవిలోక లోకహితకారణ కారణజన్మ జన్మదో
షహరణదక్ష దక్షరిపుసన్నిభ సన్నిభరూప రూపని
ర్వహన శరణ్య మయ్య బసవా... 66

ఉ. సన్నుతజంగమాగమము స్వాతిజలంబులు భక్తనిమ్నగం
బెన్నగ నీదుచూడ్కు లనుచిప్పల జొన్నలు ముత్తియంబులై
యున్న నొకయ్య మ్రుగ్గు నియమోన్నతి నిల్పినధన్య నిన్ను శ
శ్వన్నుతులన్ భజింతు బసవా... 67

ఉ. బల్లహునొద్ద నున్న నినుఁ బట్టణవీథులఁ జల్లలమ్మఁచో
గొల్లతఁ జీరువాటి కడుఁగూర్మి మెయిన్ బసవా యనన్ భువిన్
ద్రెళ్లఁగనీకపట్టిన యతిస్థిరసర్వగతైకభావ మ
ద్వల్లభ నీవె దిక్కు బసవా... 68

ఉ. వేఁడినమిండజంగమును వెక్కసమందఁగఁ దత్సభాస్థలి
న్వాఁడట నారివల్వొలువ నైజపుమానము దూలకుండఁగాఁ
బోఁడిమిఁ బట్టుపుట్టములు ప్రోవులు పెట్టినపుణ్యమూర్తి నీ
వాఁడఁజుమయ్య జియ్య బసవా... 69

చ. అరయఁగ సిద్ధరాము రజితాద్రిపయిన్ బసవాఖ్యునిన్నుఁ జే
రరులునజంగమాజ్ఞ మెయి నారయ నప్పుడు భక్తి పెంపుసొం
పరుదుగఁ బార్వతీశుహృదయాంబుజకర్ణిక సత్తమిల్లు భా
స్వరుఁ డగు నీవె దిక్కు బసవా... 70

ఉ. వర్ణవిహీనుఁ డంచు ద్విజవర్గము దా గళమెత్తి పల్కుడున్
వర్ణములెల్లఁ జూడ శివనాగయగారికరంబులందు స
ద్వర్ణుఁ డితండనా నమృతధారలు చూపినభక్తిరూఢ నీ
వర్ణము నేఁజుమయ్య బసవా... 71

ఉ. బిజ్జలునర్థమంతయును బ్రీతిగ జంగమకోటి కిచ్చి నా
నజ్జగతీశ్వరుం డడుగ నక్షయబండరు వాక్షణంబులో
నిజ్జగమెల్ల జోద్యపడ నిచ్చినలింగసదర్థ నమ్ర వి
ద్వజ్జన నీవె దిక్కు బసవా... 72

చ. ఉరుశివయోగనిద్రమయి యున్నతఱిన్ ఫణిహారి యేఁగుడున్
మరచిచనంగ జంగమసమన్వితమై మునుప్రాణమేగి యు
ద్ధురగతి వారు వచ్చుటయుఁ దోడనెవచ్చిన జంగమాత్మ నీ
వరవుఁడ నేఁ జుమయ్య బసవా... 73

ఉ. సంగయదేవుఁ డర్థి నొకజంగమమై చనుదెంచి వేఁడ ను
ప్పొంగి లలాటలోచనము భోరున నద్దమువట్టి చూపుడున్
జెంగి యదృశ్యుఁడై నశివుఁ జేకొని యార్చిన యప్రతర్క్య నీ
వంగడ మేఁజుమయ్య బసవా... 74

ఉ. కర్ణవతంసమీశ్వాక పెనఁగన్ సతిచెక్కిలి వ్రేయుఁడున్ మహా
తూర్ణతఁ జెంది జంగమము దోర్థల మెత్తిపసిండియాకు సం
పూర్ణనికృష్టభక్తిమెయిఁ బొల్పుగ నిచ్చిన నిష్ప్రపంచ నీ
వర్ణము నేఁజుమయ్య బసవా... 75

ఉ. శృంగిపురోగముఖ్యలవిశేషవిషంబులు గూర్చి మండుచున్
బొంగి భుగిల్లుభుగ్గు రనుభూరివిషాగ్ని నిషాదు లార్తులై
చెంగి చనన్ శివార్పితము చేసి భుజించినసుప్రసాద నీ
వంగడ మేఁజుమయ్య బసవా... 76

ఉ. చిత్తజవైరివిక్రమముఁ జెప్పకు చెప్పకు త్రావ నోడి తా
గుత్తుక నిల్పెనంచుఁ గడుఁ గ్రూరతరం బగుకాలకూటమున్
గుత్తుకబంటిఁ గ్రోలిన యకుంఠితవిక్రమ చక్రవర్తి భా
స్వత్తమ నీవెదిక్కు బసవా... 77

ఉ. సంగెటిజున్న ముంగిటినిధానము పండినకల్పవల్లి ముం
గొంగున ముత్తియం బనఁగఁ గూర్మిమనంబునఁ దొంగలింపఁగా
జంగమకోటి కర్చనలుసల్పుచు నున్నయగణ్యపుణ్య నీ
వంగడ మేఁ జుమయ్య బసవా... 78

ఉ. భీమగజంబు డీకొనిన బిట్టరఁజంపుడు బిజ్జలేంద్రుఁ డం
ద్దామతఁ దక్కి ద్రొక్కుటయుఁ దత్కరి నెత్తినవిక్రమోద్ధతుం
డామడియాలుమాచనకు నగ్గల మైనమహానుభావ నా
స్వామిని వివె దిక్కు బసవా... 79

ఉ. శంక దలిర్ప నెంతయు వెసన్ బరదైవపతంగకోట్లకున్
బింకముతోడ ఫాలతటభీమవిలోచనవహ్ని నేర్చునా
శంకరదాసిదేవునకు సద్భటుఁ డంచు నుతించు నిన్ను నీ
వంకకుఁ ద్రిప్పుమయ్య బసవా... 80

ఉ. ఏఁడులు నూఱటంచు శ్రుతు లెన్నఁగ శ్రీగిరిమీఁద నాఱునూ
ఱేఁడులు సంచరించు సకలేశ్వరదేవరమాదిరాజు నా
నేఁడలనూఱుమన్న భువి నిష్ఠురకాలమహోగ్రదృష్టి క్రొ
వ్వాఁడులణంపు మయ్య బసవా... 81

ఉ. సూత్రము దప్పి గొఱ్ఱె గుడిఁజొచ్చిన మిండఁనిజంపి సాక్షిగా
నోత్రిపురాంతకా యనుచు నోయని పిల్చిన యల్ల *సద్యశః
పాత్రుఁడు కిన్నరయ్యకును బ్రాణసఖుండగు నిన్నుఁగొల్తు దే
వా త్రిజగత్పవిత్ర బసవా... 82

ఉ. ఒక్కఁడె రుద్రుఁడన్న శ్రుతులొల్లక పేర్లుపురాణభట్టులన్
ద్రక్కులుసేసి తత్తనువువావిరిలుబ్రువు గాఁగజూచునా
కక్కయగారిబిడ్డఁడనఁగా నుతికెక్కిననిన్నుఁ బూన్తుమ
ద్వాక్కలికాసమూహి బసవా... 83

ఉ. డంభమయూన్యదర్శనవిడంబనుఁ దష్టమదాపహారి యా
శుంభదుదాత్తకీర్తి యగుచోడలదేవరబాచిరాజు వి
స్రంభసఖుండ వీ వని ప్రశంస యొనర్తు జగత్ప్రపూత వి
శ్వంభర శంభుమూర్తి బసవా... 84

ఉ. దీప్రము నీమహామహిమ దివ్యము నీమహనీయవిక్రమం
బప్రతిమంబు నీచరిత మాద్యము నీనిజరూప మంచు న
ల్లప్రభుఁ డర్థితోడ నుపలాలన సేయఁగ నొప్పుచున్న దే
వా ప్రణుతింతు బసవా... 85

* నాదయా.

ఉ. మేదురభక్తి నీశ్వరుఁడు మెచ్చఁగ జిహ్వయె పళ్లెరంబుగా
నాఁకటఁ బ్రాచియంబలి సమర్పణచేసి సొగడ్త కెక్కునా
మాదరచెన్నలింగము కుమారుఁడ నిన్ను భజింతు సంతతా
స్వాదిత సుప్రసాద బసవా... 86

ఉ. బల్లిదుఁడై గణాధిపుల పాదజలంబులు కట్టెమోపుపైఁ
జల్లి కడానిగావుడును జంగమకోటికిఁ బంచియిచ్చుచున్
మొల్లపుభక్తిఁ బేర్కొనిన మోళిగమారయ కూర్మిబంట మ
ద్వల్లభ నీవె దిక్కు బసవా 87

ఉ. భీకరుసుద్రనేత్రశిఖిఁ బెద్దఁగఁ జేయఁగ వీరభద్రుని
దేకగజంబునా నితరదేవతలన్ బడఁదాఁకునుద్ధతుం
డాకలికేతబ్రహ్మయకు నర్మిలి భృత్యుఁడ నిన్నుఁ గొల్తు దే
వా కరుణింపుమయ్య బసవా... 88

చ. పసిగమెయిన్ *వృషాధిపుని ప్రాణము జంగమకోటి ప్రాణముల్
మసలక యెత్తుచున్ భువనమాన్య చరిత్రతఁ దేజరిల్లున
మ్మసిఁడిగ చౌడరాయనికి మున్నిటిభృత్యుఁడ నిన్భజింతు న
న్వసిగొని ప్రోవుమయ్య బసవా... 89

ఉ. ఎన్నఁగజంగమంబుఁ దనయింటికి నెప్పుడు వచ్చునప్డు దాఁ
గన్నముపెట్టి తెచ్చి యధికంబగు నర్థము వానికిచ్చు నా
కన్నడబ్రహ్మ సంయమికి గాదిలిభృత్యుఁడ వైననిన్ను శ
శ్వన్నుతులన్ భరింతు బసవా... 90

ఉ. ఆసురవృత్తిఁ జూపరుభయంపడి మ్రొక్కఁ బ్రసాదనహ్నిచే
భూసురు లిండులన్నియును బొగ్గుల ప్రోఁకలు సేయుఘూతసం
త్రాసుల బిబ్బబాచయల దాసి యనన్ విలసిల్లు సద్గుణా
వాస శరణ్యమయ్య బసవా... 91

సంకపుఁబైఁడి భక్తులకుఁ జూరలు విడ్వఁ బసిండిగ్రాగులన్
శంకరుఁ బూటవెట్టి నరనాయకుచేతను మ్రొక్కుగొన్న యా
సుంకరబంకిదేవునకు సూనుఁడ వైనప్రసాది దేవ నీ
వంకకుఁ ద్రిప్పుమయ్య బసవా... 92

• దివ్యవిమానపంక్తి దివిఁ దేజరిలన్ రజతాద్రికిన్ జగ
త్సేవ్యముగాఁగ మున్ను దనచే మృతిఁ బొందు మృగాలి బుచ్చుసం
భావ్యుఁడు తెన్నుబొమ్మయకుఁ బ్రాణసఖుండగు నిన్నుఁ గొల్తు దే
వా వ్యసనాదిదూర బసవా... 93

* గణాధిపుల.

ఉ. చెన్నగు పాల్గిణిలింగరతిచేఁ బ్రసాదము పుట్టిపిల్లు న
త్యున్నత భక్తిసీమ శివయోగ సమగ్రత కల్మియైన మా
యన్నకు నాదిచెన్నబసవన్నకుఁ సద్గురుఁ డైననిన్ను శ
శ్వన్నుతులన్ భజింతుబసవా... 94

చ. అడరఁగఁ గళ్ళుచేసి శుచిరాన్నము లాకట నందియిచ్చుచోఁ
గడిఁగడి నందుకొంచు నతికాంక్షమెయిన్ శివుఁ డారగింపఁ గా
సడిసనుభక్తుఁ డాసురియ చౌడయగారిప్రసాది దేవ నీ
వడుగఁ జుమయ్య జియ్య బసవా... 95

ఉ. జంగమ *మారగింపక విషంబును మీఁకు ననర్హ మంచుఁ దా
మ్రుంగల నారగించిన సముద్ధతభక్తియుతుండు సత్ప్రసా
దాంగుఁడు శృంగిబొప్పయకు నగ్గల మైనమహానుభావ నీ
వంగడ మేఁ జుమయ్య బసవా... 96

చ. కొఱటున లేఁత పత్తిరియు గొడ్డునఁ బాలును రేయి జంగమం
బఱిమఱి వేఁడినన్ బడసి యాక్షణమాత్రన యిచ్చినట్టి యా
మొఱటదవంక దేవునకు ముద్దుతనూజుఁడవైన నిన్ను నే
వఱలఁగఁ బ్రస్తుతింతు బసవా... 97

చ. అనయము భక్తులీడ్యకు లటంచును వేదములాద్విజోత్తముల్
విన నుతియింపఁ గుక్కఁ జదివించినహాలిన హాల్లికళ్ళిదే
వునకు ననుంగువాఁడ వని యుత్సుకతన్ నుతియింతు భక్తహృ
ద్వనజవిహారలోల బసవా... 98

ఉ. భక్తుని బ్రింగఁ జంప మును భర్గునకున్ జిరుతొండనంబికిన్
యుక్తమెయంచు వారిపయి నొక్కట నుద్ధతి ఘంటవ్రేసి యు
ద్రిక్తతనొప్పఁగా నలఘ దిట్టహలాయుధు కట్టనుంగ ప్ర
వ్యక్తము నీవెదిక్కు బసవా... 99

చ. ధరనుపలింగమూర్తి ధ్వజదండముగా నులగచ్చతోఁగ (?) శ్రీ
కరముగ భక్తికిం బడగఁగా శివుగర్భముఁ జొచ్చి పొల్చు మా
యరియమరాజగారి పరమాప్తుఁడ వైనమహానుభావ నీ
వరవుఁడ నేఁజుమయ్య బసవా... 100

ఉ. దండితవాది వై శివుఁడె దైవము గాకని కన్నులిచ్చి తా
నిండుమనంబుతోడ నెడ నిద్దపుఁగన్నులు దాల్చి పొల్చు మా
పండితమల్లికార్జునుఁడు ప్రస్తుతి సేయఁగ నేర్చు నిన్ను నె
వ్వండు నుతింప నేర్చు బసవా... 101

* నారగింపఁగ

చ. వసుమతిఁ జేకొన్న సహపత్తుఁడు మువ్వురి కూర్మిబంట ఛో
డసులసుతుండ తేరసుఁ భక్తినభృత్యుఁడ వీరలాదిగా
నెసఁగు మహానుభావులకు నెల్ల నసర్గళమైనభక్తినన్
న్వసిగొని ప్రోవుమయ్య బసవా... 102

చ. బసవనిధానమా బసవభవ్యనిధీ బసవామృతాంబుధీ
బసవ మహానిధీ బసవ ధర్మగిరీ బసవామరద్రుమా
బసవ మహాబలీ బసవబండరునా బసవోల్లసన్మణీ
వసిగని ప్రోవుమయ్య బసవా... 103

ఉ. నాయొడయండ నావిభుఁడ నాహృదయేశ్వర నామనోరమా
నాయిలువేల్పు నావరుఁడ నాగురులింగమ నాదుజంగమా
నాయధినాథ నావరద నన్నుఁ గృపామతిఁ బ్రోవుమయ్య దే
వా యమిబృందవంద్య బసవా... 104

ఉ. నోరికి వచ్చినట్టు నిను నూఱువిధంబులఁ బ్రస్తుతింతు నే
నేరుతు నేరఁ బొమ్మనక నీపయి నొచ్చెము లేనిమచ్చికన్
గారవమంక మత్ప్రిణుతిఁ గైకొనఁగాఁ దగు గౌరవంబునన్
వారనికూర్మి పేర్మి బసవా... 105

చ. బసవఁడు ప్రీతిఁ గైకొనియె భక్తిమెయిన్ రచియించె సోముఁడున్
బసవపురాణ మంచు మనుఁ బ్రస్తుతిసేయుదు రట్లు గాన నీ
యసమదయాధురీణతకు నంకిలిపాటు ఘటిల్లకుండ నన్
బసఁ గొని బ్రోవుమయ్య బసవా... 106

చ. (?) సురవరమల్ల మల్లలిత సూత్రసుధాంబుధి ఖేలఖేలనం
గరకలకంఠ కంఠమణి నాయకభీమ భుజంగ జంగమ
స్థిరతరనాథ నాధకనిధీకృత రూప విరూపసమ్మతా
వరకరుణాబ్ధి ప్రోవు బసవా... 107

చ. సురవరపూజ్య పూజ్యగుణ శోభిత శోభిత రూప రూప వి
స్ఫురతర శీల శీలగణపుంగవ పుంగవ సత్త్వ సత్త్వసం
వరపరవాద వాదభయ వర్జితపాపవిచార చార యీ
శ్వరసమ నీవె దిక్కు బసవా బసవా బసవా వృషాధిపా. 108

చ. అకుటిల లింగజంగమ సమగ్రదయాకలిత ప్రసాది పా
లకురికి సోమనాథుఁ డతి లౌల్యమునన్ బసవన్నదండనా
యకునకు *నొప్పనీకు నీశతక మర్పణచేసె ధరణ్ బఠించువా
రికి వినువారికిన్ గలుగు శ్రీయును నాయువు భుక్తి ముక్తియున్. 109

వృ షా ధి ప శ త క ము స ం పూ ర్ణ ము

*నికు. •ధరన్.



శ్రీ ర స్తు

# సూర్యనారాయణశతకము





మత్సర్వసుపర్వసేవితములై క్షేమాంకలక్ష్యంబులై
ధామధ్వస్తసమస్తలోకనిబిడధ్వాంతంబులై మించునీ
రామాంఘ్రుల్ గొనియాడి వృత్తశతకగ్రంథంబు నీకింపుగాఁ
బ్రేమన్ గూర్చెదఁ జిత్తగింపు మెలమిన్ శ్రీసూర్యనారాయణా. 1

శా. భారద్వాజపవిత్రగోత్రజుఁడ విప్రశ్రేష్ఠవంశ్యుండ వి
ద్యారక్తుండ వరాహవేంకటనృసింహాఖ్యుండ సద్భక్తి నిం
పారం గొల్చుచు నీకు వృత్తశతకం బర్పింతు వాగ్దోషముల్
చేరం జూచి కృపన్ సహింపు మదిలో శ్రీసూ... 2

మ. అరయన్ బావన మైనయీశతకపద్యవ్రాత మాలించినన్
బరమప్రీతిఁ బఠించినన్ బుధులు నీపాదాంబుజధ్యాతలై
దురితధ్వాంతవిముక్తిఁ గాంచి శుభముల్ తోడ్తోఁ బ్రవర్తింప నీ
చిరకారుణ్యమతిన్ సుఖింతు రెప్పుడున్ శ్రీసూ... 3

మ. శ్రితసంపత్సుమవల్లి యానరసవిల్లిన్ మల్లికాద్యుల్లస
ల్లతికావేల్లితసాలమూలకుసుమారామస్ఫురద్దేమని
ర్మితగేహంబునఁ బద్మినీముఖసతుల్ సేవింప ధాత్రీసురా
ర్చితలీలాకృతి నొప్పు నిన్నుఁ దలఁతున్ శ్రీసూ... 4

శా. శ్రీమత్పద్మసముద్భవాదితనువుల్ చేకొంచు నెవ్వాఁడు నా
నామాయల్ గనుపట్టు ముజ్జగములన్ గావించి రక్షాల్లయ
వ్యామోహంబున నొప్పునట్టి నిగమవ్యాలీఢపాదాబ్జునిన్
బ్రేమన్ గన్గొని సంస్మరింతు మదిలో శ్రీసూ... 5

శా. ఛాయాదిప్రియకాంతలన్ మధురభాషాలీలచేఁ దన్పుచున్
కాయం బుజ్జ్వలమై పరిష్కృతపరిష్కారంబునై మించ లో
కాయాసంబు లణంచి దుర్మదబలవ్యాసంగిదైత్యోత్కరా
జేయస్ఫూర్తి నెసంగు నిన్నుఁ దలఁతున్ శ్రీసూ... 6

శా. వేదప్రోక్తనమస్కృతు ల్సలుపుచున్ పృథ్వీసుర ల్మెచ్చి నీ
పాదాబ్జస్మరణైకనిత్యభజనాపారీణులై నిల్వఁగా
ఖేదంబు ల్తొలఁగించి వారలకు నుత్కృష్టాపవర్గం బవి
చ్ఛేదాసక్తి నొసంగు నిన్నుఁ దలఁతున్ శ్రీసూ... 7

మ. అకలంకస్ఫటికంబు నూతనజపోద్యద్దీప్తి నాగంతుక
ప్రకటచ్ఛాయఁ ధరించినట్లు జలగోళం బౌటఁ జందురుండు నీ
సకలోస్రంబులు దాల్చి షోడశకళాసంపూర్ణుఁడై ధ్వాంతమా
లిక లెల్లన్ బరిమార్పుచున్ దిరుఁగడే శ్రీసూ... 8

మ. అవనిన్ భూసురవర్యులవ్విధినిషేధాచారసంసక్తులై
సవనాది క్రియ లగ్నిహోత్రజపముల్ సంధ్యానమస్కారముల్
శివపూజాదికమున్ ఘటించి నిఖిలక్షేమంబు లర్థింపుచున్
శివరూపుండ వటంచు నెంతురు గదా! శ్రీసూ... 9

మ. భవదుస్రంబులు కాలవేగమున శుంభద్వ్యోమభాగంబునన్
బవనోద్ధూతము లై ఘనంబు లగుచున్ బాటిల్లి నిర్ఘాతభై
రవరావంబు లెసంగ భూరిజలధారావృత్తి రక్షింపవే
నృవరు ల్మెచ్చఁగ సస్యపంక్తి నెచటన్ శ్రీసూ... 10

శా. లోకాలోకము దాఁటి చండకిరణాలోకస్వకాయప్రభా
నీకం బొప్ప యనేకలోకతిమిరోన్మేషంబు వారించి య
స్తోకాసక్తి నశేషజంతుతతి నెంతో బ్రోచునిన్ జిత్తనా
ళీకాభ్యంతరసీమ నిల్పి కొలుతున్ శ్రీసూ... 11

మ. ఖనటత్త్వత్కరదీప్తమూర్తు లగుచున్ గన్పట్టుచంద్రాదులన్
గనుఁగొంచున్ గణకుల్ సుఖార్తిఫలసంధాతల్ గదా యంచు గొ
బ్బున నూహింతురు కూడునె భువనముల్ పుట్టించి రక్షించి త్రుం
చి నటించం గలకర్త వీవు గలుగన్ శ్రీసూ... 12

మ. హరిపాదంబునఁ బుట్టి దేవనది పూతాకారయై తామహే
శ్వరమౌళిన్ విహరించుచాడ్పునఁ జతుర్వక్త్రాననోత్థంబు లై
గిరు లై వేదము లాత్మమండలమునన్ గీర్తింపుచున్ నిల్వఁగా
సిరులన్ బెంపగుచున్న నిన్నుఁ దలఁతున్ శ్రీసూ... 13

మ. అనలప్రాప్తనిజోచితాహుతులు నీకర్పించి బర్హిర్ముఖుల్
వెనువెంటన్ గొనియాడి బ్రహ్మమని భావింపంగ వేఱొక్కఁడే
వునిఁగైవల్య మొసంగుమంచుఁ గుజనవ్యూహంబుతోఁ గోరినన్
వినువారందఱు నవ్వకుందురెననున్ శ్రీసూ... 14

మ. జలజిన్యాదినిజాంగనాముఖసరోజాతంబులం జెంది ని
శ్చలసారంగము లైనచూపుల గృపాసారంబు వర్షించి చం
చలభక్తోత్కరతాపపావకశిఖాసంఘంబుఁ జల్లార్చుచున్
జెలువొందన్ గనుపట్టునిన్ను గొలుతున్ శ్రీసూ... 15

మ. స్వకళాచాతురి నైంద్రజాలికుఁడు నాసారంధ్రమార్గావరో
ధకనాళంబులఁ గుంభనీరముఁ బలెన్ ధాత్రీజలం బెల్లది
వ్యకరౌఘంబునఁ బూని యభ్ర మయి యయ్యప్పున్ విసర్జించుచున్
వికృతు ల్మాన్చి వెలుంగు నిన్నుఁ గొలుతున్ శ్రీసూ... 16

మ. హరిసక్తిన్ జనవృత్తిఁ గాంచి యరుణోద్యద్దీప్తిఁ బెంపారి ని
ర్జరకోటుల్ జయశబ్దపూర్వకనమస్కారంబు లర్పింప యం
బరమార్గంబున నేగునీరథగతప్రస్ఫీతచక్రంబు సు
స్థిరతన్ మించు సుదర్శనంబుకరణిన్ శ్రీసూ... 17

శా. రక్తశ్వేతవినీలవర్ణములచే రంజిల్లు కాలత్రయ
వ్యక్తస్వాకృతి పంకజోదరపురార్యంభోరుహాక్షప్రభా
యుక్తిన్ దత్కృతవాసకాలమును దద్యోగంబుఁ దెల్పం గృపా
రిక్తస్వాంతముతోడఁ జూడఁదగునే శ్రీసూ... 18

మ. జలకుంభాంతరసీమలందు నభముం జందాన జంతూత్కరో
జ్జ్వలదంతఃకరణంబులన్ బ్రతినిధివ్యాపారమున్ జూపి పెం
పెలరన్ బ్రాణివితాన మై మునిమనోధ్యానార్హరూపంబు రం
జిలఁ గన్పట్టెడునీ కొనర్చెద నతుల్ శ్రీసూ... 19

మ. త్రుటి యైనన్ జెడకుండ షష్టిఘటికారుద్ధంబు లౌచున్ సము
త్కటవృత్తిన్ దినరాత్రముల్ సమము లై కల్పాంతపర్యంత మె
చ్చటఁ గానంబడు నెవ్విభుం డఖిలవిశ్వధ్యేయచిద్రూపుఁ డై
నిటలాక్షుంబున మించు నీవు గలుగన్ శ్రీసూ... 20

మ. జగతిన్ వార్షికవృష్టి నంకురతతిచ్ఛాయన్ జికీర్షోన్నతిన్
జగము ల్గ్రిక్కిన నీవయిం బొడముచున్ వర్తింపుచున్నన్ జిహీ
ర్ష గృశానుండు జలంబునంబలె నదృశ్యస్ఫూర్తి వాటింపుచో
నిగమంబుల్ దెలుపంగ శక్యమె నినున్ శ్రీసూ... 21

మ. మునిదిగ్భర్తలు విష్ణుశంకరు లనం బూజ్యుం డజుం డంబికా
వనజాతేక్షణయోగమాయఖచరవ్రాతాగ్రగణ్యుండవీ
వనుచుం బల్కుపురాణశాస్త్రములు సత్యం బంచు నార్యుండు కో
రినకోర్కెల్ కొనసాగ నిన్నుఁ గొలుచున్ శ్రీసూ... 22

శా. వేదంబుల్ భవదీయబింబగములై వెల్గొంది యేవేళ నీ
పాదధ్యానము సేయుచున్ గనుచు ని న్భావింపలేకున్నచో
భేదజ్ఞానముచేత నా కెటులకో వేద్యంబులై యుండు సు
శ్రీరాకారములైననీదుపదముల్ శ్రీసూ... 23

మ. కులిశాబ్జాంకుశఖడ్గచక్రజలరుట్కోదండమత్స్యధ్వజా
ద్యలఘుప్రస్ఫుటరేఖ లొప్ప విమలోద్యద్రక్తకాంతిచ్ఛటా
కలనోత్కృష్టములై యజాదిసుమనోగమ్యంబులై కూడి వ
ర్తిలు నీదివ్యపదంబు లాత్మఁ దలఁతున్ శ్రీసూ... 24

మ. ఉదయాద్రిన్ గనుపట్టి గిట్టి జలజవ్యూహంబుతో జంతువుల్
ముద మొందన్ భటవర్గమోహాతమమున్ లోకాంధకారంబుతోఁ
దుదిముట్టన్ విదళింపుచున్ భువనబంధుత్వంబు వాటించునీ
మృదుపాదాంబుజముల్ దలంతు మదిలో శ్రీసూ... 25

శా. ఆయుర్దాయ మణంచి మానవులు పుణ్యాపుణ్యరూపక్రియల్
సేయంజూచుచు సాక్షివై నిలిచి యక్షీణప్రభావోన్నతిన్
కాయంబుల్ పడఁద్రోచుచున్ యముఁడవై నాకాదిలోకస్థితుల్
దేయప్రక్రియ సంఘటింతువు గదా శ్రీసూ... 26

మ. సుతదారాద్యవనంబె ముఖ్య మని చూచున్ శాశ్వతం బంచు సం
తత మజ్ఞాని బుధుండు శోకరహితానందామృతోద్యోగసం
గతి కర్తవ్య మటంచు నాగమశిఖాగమ్యత్వదంఘ్రిద్వయా
ర్పితచిత్తంబున వర్తనంబు సలుపున్ శ్రీసూ... 27

మ. అరుణత్వంబును బంకజాతదళనవ్యాపారమున్ శ్రీమనో
హరరూపంబును దేవతామకుటరత్నౌఘప్రతిచ్ఛాయయున్
దరచక్రాసిధనుర్ముఖప్రబలనానాచిహ్నము ల్దాల్చి మిం
చిరి నీవున్ భవదంఘ్రు లొక్కకరణిన్ శ్రీసూ... 28

మ. సుసిదాఘవ్యథఁ జిక్కి చాతకము సంక్షోభించి నీలాభ్రద
ర్శనమున్ గోరినమాడ్కి భూరిభవసంజాతార్తి నే నెంతయున్
వనటన్ గుందుచు నిష్ట మొందక మదిన్ బ్రార్థించి తేవంకఁ జూ
చిన యుష్మద్దయ దక్క యొండు గలదే శ్రీసూ... 29

మ. ఇలఁ దీవ్రాతపబాధ కోర్వక నరుం డెంతే వడిన్ బాటి చెం
తల నున్నట్టికుజంబుఁ జేరుగతి నానాఘోరసాంసారిక
జ్వలనజ్వాలలఁ జిక్కి మానవుఁడు సంజాతార్తి నీపాదముల్
విలసద్భక్తిఁ దలంచి కొల్చును గదా శ్రీసూ... 30

మ. కలికాలంబున భక్తియోగమహిమన్ గైవల్య మర్థించి యా
ష్యు లమేయశ్రవణక్రియావిముఖులై యుష్మత్కథాజాలమున్
బలుమాఱున్ బఠియించి నిత్యము భవత్పాదాంబుజధ్యాన మ
ర్మిలిఁ గావింపుచు ముక్తు లౌదురుగదా శ్రీసూ... 31

మ. అరవిందప్రభవాభవప్రముఖసర్వామర్త్యవర్యుల్ భవ
త్పరమప్రాభవసాగరోర్మికలనాప్రాదుర్భవాంభఃకణో
త్కర మొక్కమ్మడిఁ గ్రమ్మినన్ వివశులై కల్పింతు రే నెంత చె
చ్చెరఁ గారుణ్యముతోడఁ బ్రోవఁ దగదే శ్రీసూ... 32

శా. మాయూపింఛికఁ దాల్చి కౌతుకముతో మాయావిచండంబునన్
ద్రోయన్ రానితమోవిభూతి జగతిన్ దోరంబుగా నింపి యే
చాయన్ మూల మెఱుంగనీక మహిమన్ సర్గాదికృత్యంబులన్
జేయం జాలిననీ కొనర్చెద నతుల్ శ్రీసూ... 33

శా. నీనామస్మరణంబుచేత దురితానీకంబు మాద్యద్బృహ
ద్భానుజ్వాలల శుష్కదావముగతిన్ భస్మీకృతంబై జనం
దా నత్యంతవిశుద్ధబుద్ధిఁ దగి నీదాసుండు హృత్సారసా
సీనుం జేయుచు నిన్భజించునుగదా ! శ్రీసూ... 34

మ. అమనోవాక్ప్రతిపాద్యుఁ డంచు శ్రుతు లుద్యచ్ఛక్తిఁ దెల్పంగ న
క్రమవృత్తిన్ మదిలో స్మరింపుచు నవార్యస్ఫూర్తిఁ గీర్తించినన్
సుమనీషుల్ దగ దంద్రదు దోషము ఘటించున్ గాన ని న్నెంతయున్
విమలజ్ఞానఫలోపలబ్ధిఁ గొలుతున్ శ్రీసూ... 35

మ. అభవేభాస్యహరీనచండికలలో నాద్యుండ వీవంచు నొ
క్కభవద్భక్తియె ముక్తిహేతు వని వేడ్కన్ గోరియుష్మత్పద
ప్రభవప్రాభవముల్ గణింపుచు మదిన్ బ్రార్థించి తెబ్భంగి భూ
రిభవాంభోధిఁ దరింపఁజేసెదొ కదా శ్రీసూ... 36

శా. కామక్రోధమదాదిశత్రువులు వీఁక న్మూకయై తాఁకి చే
తోమాలిన్య మొనర్పఁ దత్కలుషచిత్తుల్బోధనిర్ముక్తులై
నీమంత్రంబు జపించి నీచరణముల్ నిత్యంబు సేవింపుచున్
బ్రేమన్ బంధవిముక్తిఁ గాంతురుగదా శ్రీసూ... 37

శా. ప్రావృట్కాలము దోఁచువేళ నసితాభ్రశ్రేణు లభ్రంబునన్
భావింపం బ్రభవించుమాడ్కిఁ దరితో నానాప్రవృత్తుల్మదిన్
బ్రోవుల్గట్టి జనించు బద్ధు లగుజీవు ల్ముక్తులౌచున్ భవ
త్సేవన్ జేసి వడిన్ సుఖింతురు గదా శ్రీసూ... 38

మ. భ్రమ శుక్తిన్ గనుపట్టురాజితములీలన్ దోఁచె నీయందు లో
కము లజ్ఞానసమృద్ధి నంచు బుధవర్గం బెంచి తత్త్వప్రబో
ధము రంజిల్ల భవత్పదాంబురుహమున్ ధ్యానించి నీలోన వా
రి మహాబ్ధిం బలె నైక్య మొందునుగదా శ్రీసూ... 39

మ. మృగతృష్ణ ల్మరుభూములంబలె భవల్లీలాస్వరూపంబునన్
జగము ల్గన్పడఁ జూచి యజ్ఞుఁడు సదా సత్యం బటంచున్ మృగం
బు గతిన్ నమ్మి భవాంబురాశిఁ గడవన్ బోలేక తాపత్రయా
ర్తిఁ గడున్ స్రుక్కుచు నిన్నుఁ జెందఁడు గదా శ్రీసూ... 40

మ. గరిమన్ వహ్ని జనించి తచ్ఛమనమున్ గావించు నీరంబువై
ఖరిఁ జిత్తంబునఁ బుట్టి తన్మలినమున్ గన్పట్ట బాధించు మ
త్సరముఖ్యారులఁ గూడఁబట్టి యపరోక్షజ్ఞానఖడ్గంబునన్
శిరముల్ ద్రుంచినవాఁడె ముక్తుఁడుగదా శ్రీసూ... 41

మ. అకలంకద్యునదీతరంగముల నుద్యత్పంకమున్ బోలెఁ దా
వక కారుణ్యముచేఁ దమం బణఁగి సత్వం బుద్భవంబైనచో
నొకయద్వైతవిశిష్టవృత్తిఁ గనుచున్ యోగప్రభావంబు దా
ల్చి కడున్ భక్తుఁడు ముక్తి నొందునుగదా శ్రీసూ... 42

శా. కీలాలంబున బుద్బుదంబుగతి నగ్నిన్ ధూమముంబోలె ను
ద్వేలం బైతగు నీస్వరూపమున నావిర్భూత యైనట్టిమా
యాలీలన్ గాని సృష్టిరక్షణలయవ్యాపారము ల్సేయుచున్
గేలీవృత్తి నెసంగునిన్నుఁ దలఁతున్ శ్రీసూ... 43

మ. భువనంబుల్ ముకురంబునంబలె మదిన్ బోలేక చూపట్టు నం
చవలోకింపుచు భక్తియోగమున నార్యవ్రాత మత్యంతమున్
భవదంఘ్రు ల్భజియించి సైంధవ ముదన్వద్వీచికం బోలె నీ
శివరూపంబున నైక్య మొందును గదా శ్రీసూ... 44

మ. మధుమాసంబునఁ బుష్పరాజి వనసీమన్ బోలె నీసత్కృపన్
శిథిలీభూతతమస్కుఁడై సుగుణము ల్సేవింప నీసేవకుం
డధికోత్కృష్టనదీనదప్రతతి యయ్యాదోధిత్రోవన్ బలెన్
పృథివిన్ యోగపదంబు గాంచునుగదా శ్రీసూ... 45

శా. నీతేజఃపటలం బశేషభువనానీకస్థమై ప్రాలుచో
భీతిన్ గూటికిఁ జేరుఘూకమటులన్ విజ్ఞానసంభావ్యమై
నీతత్త్వం బలరార నజ్ఞుఁ డెలమిన్ వీక్షింపఁ గాలేక నిన్
జేతోవీథిఁ దలంచి కొల్చునుగదా శ్రీసూ... 43

మ. ద్విజరాజప్రభచే సుమార్గమటులన్ విద్యావికాసోన్నతిన్
భజనీయస్ఫుటయోగవై భవగతుల్ భావింపఁ గన్పట్టుదా
సజనుం డుత్తమకాంత నాథునిబలెన్ భావంబులో నిల్పి నిన్
సృజనాద్యేకమనీషుఁ గొల్చునుగదా శ్రీసూ... 47

మ. క్షితి సర్వజ్ఞత నీకు జీవునికిఁ గించిజ్ఞత్వముం గూర్చియు
న్నతి నమ్మాయ యవిద్యయున్ బెరుగ నానావేషముల్ గట్టి మీ
రతులజ్ఞానసమృద్ధి నేకమయి జన్మాదు ల్విసర్జింపుచున్
గృతకృత్యవ్రతులై సుఖింతురు గదా శ్రీసూ... 48

మ. తమి శుల్బంబునఁ దోఁచుపాముకరణిన్ ద్వద్రూపమం దోలి వి
శ్వము గన్పించునటంచుఁ జిత్తసరణిన్ భావింపుచో స్వప్నతు
ల్యములై లోకము కాలముల్ క్రియలు కర్తల్ కల్ల లౌనంచుఁ గూ
రిమితోఁ దెల్పరె తత్త్వబోధకలితుల్ శ్రీసూ... 49

శా. లోకంబు ల్గల లొక్కభంగి మది నాలోచించు తత్త్వప్రబో
ధాకల్పుం డటులన్ భవత్పదయుగధ్యానోచితస్వాంతనా
ళీకుం డెవ్వడు యుష్మదీయకృప కోలిన్ బాత్రుఁ డౌచున్ సము
త్సేకం బొప్పఁగ ముక్తిఁ గాంచునుగదా శ్రీసూ... 50

శా. వైరాగ్యంబును దత్త్వబోధమును శశ్వద్యోగముం గల్గి సం
సారాసక్తిఁ దొలంగుచుం బుడమి నిస్సంగాత్ములై నట్టివా
రారూఢాక్షరభావమున్ గనుచు నందానందమున్ గాంచుటల్
చేరన్ రానిభవత్కృపామహిమగా శ్రీసూ... 51

మ. క్షమయున్ సత్య మహింసయున్ సమతయున్ సర్వేంద్రియోత్థానమున్
శమమున్ ద్యాగము గల్గి నిశ్చలతపశ్శక్తిన్ బ్రవర్తింపలే
క మదిన్ భక్తి జనింప నీచరణసక్తధ్యానబుద్ధిన్ జరిం
చి మహానందము నొందఁ గంటి జగతిన్ శ్రీసూ... 52

మ. సగుణుం డంచును నిర్గుణుం డనుచు శాస్త్రజ్ఞుల్ వివాదింపుచో
సగుణవ్యక్తియె నీకు నిత్య మయి సత్యస్ఫూర్తిఁ గన్పట్టు కా
క గుణశ్రీకలితుండ వేని జగముల్ గన్గొంచు మెచ్చన్ దయా
దృగనీకావృతుఁ జేసి నన్మనుపవే శ్రీసూ... 53

మ. శ్రుతిశాస్త్రంబు లెఱింగి బోధమహిమన్ శుద్ధాంతరంగుండునై
మతిమత్సంగతి గాంచి యోగసరణిన్ మన్నింపుచున్ సోహమం
చతులప్రౌఢిని నిన్భజించు విబుధుం డంబోధి నప్పాయసా
కృతి దోఁపన్ భవదైక్య మొందును గదా శ్రీసూ... 54

శా. యోగస్యందన మెక్కి సత్త్వగుణసూతోపేతుఁ డై యీషణ
త్యాగాస్త్రాసన మెక్కువెట్టి హృదమోఘాస్త్రంబు సంధింపుచున్
యోగు ల్మెచ్చఁగ నీపయిం బరపుమ ర్త్యుం బట్టి నిర్వాణల
క్ష్మీస్త్రీగేహంబునఁ గట్టివై తువుగదా శ్రీసూ... 55

మ. మునిసభ్యు ల్వెలఁగందిచూడఁ దమితోఁ బూర్వక్రియాపాశముల్
గొని యజ్ఞానపరంపరాయవనికన్ గొట్టాడఁగా నిల్పి జీ
వనికాయోచితసాలభంజికల భాస్వత్ప్రీతి న ర్తింపఁజే
సినని న్నెంచి భజింప శక్యమగునే శ్రీసూ... 56

మ. జలధిన్ గ్రుంకినవాఁ డశేషతటినీస్నానవ్రతోద్భూతస
త్ఫలముల్ గాంచినమాడ్కి సర్వదివిషద్వర్యాకృతిన్ మించుని
న్నలఘుప్రీతిభజించువాఁ డఖిలదేవాగణ్యకారుణ్యదృ
ష్టిలతాబద్ధముఖాబ్జుఁ డై తిరుగఁడే శ్రీసూ... 57

శా. సంతానద్రుమమర్థి కిం బలె నశేషస్వీయభ క్తాళిక
త్యంతేష్టార్థ మొసంగుని న్విడిచి యన్యాదిత్యునిం గొల్చుచున్
భ్రాంతిన్ భూపతిఁ జేరఁ బోక సుభటున్ బ్రార్థించువాఁ డట్టులన్
జింతింపంగతమేమి మోహవశుఁ డై శ్రీసూ... 58

మ. మును నీపాదసరోజభ క్తుఁడగు రాముం డా ర్తవిప్రాంగనా
మునిదై తేయవనాటముఖ్యుల మదిన్ మోదంబు రెట్టింపఁ గ
న్గొని కైవల్యపదం బొసంగె భవసంఘ్రముల్ వేడ్కఁ జింతించువా
రి నుపేక్షించుట నీకుఁ బాడి యగునే శ్రీసూ... 59

మ. ధనదారాత్మజస క్తి లేక మదిలోఁ ద్వత్పాదపంకేరుహా
ర్చనముం గోరి యొనర్చువాఁ డెపు డుదంచత్కర్ణరంధ్రంబులన్
వినునే కాలులులాయకంధరవిలంబిస్వర్ణఘంటావళీ
నినదాసహ్యాతదీయకంఠరవమున్ శ్రీసూ... 60

శా. శాంతిన్ గ్రోధము లోభ మస్థిరమతిన్ సత్సంగతి న్మత్సరం
బంతర్మోహము ద త్త్వగోష్ఠిని నిదిధ్యాసప్రవృ త్తి న్మదం
బెంతే కామము దేహధర్మకలనాదృష్టి న్విదారించి నీ
చింత న్వ ర్తిలువాఁడె ము క్తుఁడుగదా శ్రీసూ... 61

మ. హరిసంరక్షణమున్ సుధాకరధరుం డంతంబు సర్గంబు వా
క్తరుణీభ ర్తయు సల్పుటల్ బుధులు వక్కాణింతు రాకృత్యముల్
బరమేష్ఠిప్రముఖాకృతి ప్రభలు దోఁపన్ జేతు వీవంచు నెం
చిరి వేదాంతవిశారదుల్ నిజముగా శ్రీసూ... 62

శా. నే నెంతే మదిఁ జింతఁ జెందుటకు నై నీవిట్టు లంతంతకున్
నానాసూనుధనాంగనాదిభవబంధశ్రేణి బంధించినన్
దీనత్వంబున భీతి గాంతునె భవద్భృత్యుంకు మీఁదన్ సమీ
చీనస్ఫూర్తిఁ బునర్భవంబు గనునే శ్రీసూ... 63

శా. నేనేరత్ముఁడ రక్షకుండ వెవ్వరున్ నీవే యటం చన్యులన్
గానంబోక భవత్పదాంబురుహముల్ గాంక్షించి సేవింపుచున్
నానాత్యాగముఁ జేసినాఁడ నిఁక న న్పాలింపకున్నన్ మనో
లీనాస్మత్పరితాప మెన్నవశమే శ్రీసూ... 64

మ. స్మరణం బెప్పుడు సేయుచున్ మనుజు లస్మత్పాదము ల్గొల్చినన్
గరుణం బ్రోచుచు వారికెల్ల నపవర్గం బిత్తు నేనంచు మేల్
బిరుదోక్తు ల్వచియించు ని న్విడిచి పేర్మిన్ బీదలన్ వేఁడఁగా
సిరి లాభించునె ముక్తియున్ గలుగునే శ్రీసూ... 65

మ. అనుభోక్తవ్యముగాక కర్మసముదాయం బార పోదంద్రు భూ
జను లట్లైనను జన్మముల్ చనునె తత్సంరక్షణార్థంబుద
ప్పునె కృత్యంబులు ముక్తిలభ్య మగునే మువ్మాఱు నిన్నెంచి ప
ల్కిన వేదోక్తులు నిల్వకున్నె మృషలై శ్రీసూ... 66

శా. తూలం బై భవదాగ్రహంబున మరుద్గోత్రంబు తూఁగాడు న
త్తూలం బైన సుమేరులై నిలుచు నీతూర్ణప్రసాదోన్నతిన్
గాలాదు లనియింప నెల్లజగముల్ గావించి రక్షించువా
రే లోకేశముఖుల్ ద్వదన్యులగుచున్ శ్రీసూ... 67

శా. లోకంబుల్ గలిగింపఁ బెంపఁ జెరుపన్ లోలుండవై చిత్తమం
దాకాంక్షించినమాత్ర మక్షణమె సత్యస్ఫూర్తి వర్తింపు నో
నేకాలంబు రణేచ్ఛ మాన కెదురై హింసించుమందేహు లె
చ్చోకా కొందరు వధ్యు లౌదురె భటుల్ శ్రీసూ... 68

శా. నీకారుణ్యము లేక ప్రాగ్భవకృతానిత్యక్రియారాశి బ్ర
హ్మాకారంబు వహించి మానవుల కత్యంతార్తిసౌఖ్యోన్నతుల్
చేకూరంగ నటించుతావకమరీచివ్యాప్తి లేకున్న సు
ద్రేకస్ఫూర్తిఁ దమిస్రముల్ పెరుగవే శ్రీసూ... 69

మ. శితనారాచపరంపరన్ దెరల కక్షీణప్రతాపోన్నతిన్
బ్రతిబాణంబుల నిక్కద్రికాలములు నొంపన్ జూచు మందేహులై
తృతతిన్ విప్రవిసర్జితార్ఘ్యమహిమన్ దాటించి నీమంత్రమూ
రితశక్తిన్ నిను మించి వర్తిలుఁ గదా శ్రీసూ... 70

శా. పాపంబు ల్పచరించె నం చలుక నన్భావింపవేమో కృపా
లోపంబున్ గనుపింప నీపదపయోజధ్యానాసక్తి న
ప్పాపంబు ల్గలవే యపథ్యవికృతుల్ భైషజ్యసేవాగతిన్
రేపు న్మాపును గాక యెట్లు నిలుచున్ శ్రీసూ... 71

మ. కపటప్రక్రియ సేవకున్ మనుప కే కాలంబు నేకాకృతిన్
జపలస్వాంతులు కాక తావకపదాబ్జాతార్చనల్ సేయు మం
చుపదేశించితి వస్మదాదులకు నట్లూహింప శక్యంబె నీ
కృప లేకబ్బునె ముక్తి పౌరుషగతిన్ శ్రీసూ... 72

శా. ఖిన్నుండై స్వభటుండు బ్రోవు మనుచున్ గేల్మోడ్చి ప్రార్థించుటల్
గన్నారం గనుగొంచు లేశమయినన్ గారుణ్యమున్ దాల్ప వా
పన్నత్రాణపరాయణుం డనుచు సంభావించి యామ్నాయముల్
ని న్నెబ్బంగి నుతించి పల్కఁబోడఁగెన్ శ్రీసూ... 73

శా. నీవే దిక్కని నమ్మి వేఁడుకొనుచున్ నీదివ్యపాదాబ్జముల్
భావింపం దొరకొంటి న న్నిఁక దయన్ బాలింపు లేకున్నచో
దేవా ! నాగతి కేమి నిన్ను జను లుద్దేశించి నిందించినన్
సేవాసంగతి నాలకింపవశమే శ్రీసూ... 74

మ. అనుకంపారసదృష్టి ము న్నఖిలభృత్యశ్రేణి రక్షింపవే
నను రక్షింపకయున్నచోఁ గలుగవే నైర్ఘృణ్యవైషమ్యముల్
జను లెంచన్ సమవర్తివై నిలిచి కాంక్షన్ బక్షపాతంబుఁ జే
సిన ని న్నుత్తములెల్ల మెత్తురె మదిన్ శ్రీసూ... 75

శా. యోగజ్ఞానవిరక్తి సత్త్వగుణసత్కోర్వీసురశ్రేణికిన్
రాగం బొప్పఁగ ముక్తిసౌఖ్య మిడినన్ రక్షింపకున్నన్ గృపా
యోగు ల్మెత్తురె బీదలన్ విడిచి భాగ్యోదారులన్మన్నఁగాఁ
గ్రీగంటన్ గనుఁగొంచుఁ బ్రోవ నగునే శ్రీసూ... 76

మ. ద్విరదంబుల్ రథముల్ ధనంబులు మణుల్ తేజీలు రాజ్యంబు మం
దిరము ల్భూషలు చేలము ల్నినువడిన్ దెమ్మంచుఁ గాంక్షింప లే
దురుసంసారసముద్రతారణవిధానోద్యుక్తయుష్మత్పద
స్థిరబుద్ధిన్ దయసేయు మంటి నెపుడున్ శ్రీసూ... 77

. ఏలా వేదపురాణశాస్త్రములు ని న్నేప్రొద్దు సేవింపన
బ్బాలేందుప్రభఁ జీఁకటుల్ బలె నఘవ్రాతంబు నిర్మూలమై
వ్రాలన్ ముక్తిపదంబుఁ గాంతు రనుచున్ వాక్రుచ్చునే నగ్గతిన్
శీలం బొప్ప భజింతు నీచరణముల్ శ్రీసూ... 78

మ. ఘనము ల్నీచము లైనజన్మములు మత్కర్మానుకూలంబులై
వెనుకన్ గల్గినఁ గల్గనీ హృదయ మేవేళన్ భవత్పాదచిం
తనమున్ దప్పకసల్పుచుండుటకు నానోఁటన్ బ్రసాదింపవే
చెనఁటు ల్గన్గొని చిత్తవీథి వగవన్ శ్రీసూ... 79

మ. తనువు ల్వీడుచు ము న్న శేషనిరయస్థానస్థితోనేకయా
తనలన్ బల్మి భుజించినాఁడ నిఁకఁ దద్బాధ ల్విజృంభించినన్
గని చింతింపనుగాని నీభటుఁడు నానాదుర్గతుల్ చేరఁగాం
చె నటంచున్ జనులాడుచుండ వగతున్ శ్రీసూ... 80

మ. నిగమాంతంబు లనేకరూపసులచే నీతత్త్వ మూహింపుచోఁ
బొగడం జొచ్చితి మం బుద్ధి నకటా బోధ్యుండ వెట్లుందువో
తగ బోధం బెటు లబ్బునో తెలియ దీతత్త్వంబు గాంక్షింపుచున్
మిగులం గొల్చెద నీపదంబు లెలమిన్ శ్రీసూ... 81

మ. జననీగర్భగుహాంతరాళనిరయస్థానంబులం దున్నయా
తన లొక్కుమ్మడిఁ బాయునంచు మదిలోఁ దర్కించి నీపాదచిం
తనము న్మానక చేయుచుంటి నిఁక నన్గారుణ్యదృక్సింధువీ
చినికాయంబు నటింపఁ బ్రోవఁదగదే శ్రీసూ... 82

మ. శ్రుతిశాస్త్రంబులు సత్యమంచు భవదస్తోకాద్యమంత్రంబు దు
ష్కృతవిచ్ఛేదక మంచు నీదుపదముల్ సేవ్యంబు లంచున్ దిర
స్కృతదేవుండవు నీవటంచు మదిలోఁ జింతించి నిన్నొక్కసం
స్మృతిబంధం బెడఁబాపు మంచుగొలుతున్ శ్రీసూ... 83

శా. కాయంబెల్లఁ గృశించె వాతకఫరోగం బెంతయున్ దుస్తరం
బై యుండెన్ మదికిన్ జడత్వ మొదవెన్ వ్యాపించెఁ జిత్తంబు దు
ర్వ్యాయామంబుల నక్షము ల్దరగతిన్ బ్రాపించె నీభృత్యునిన్
జేయన్ రాదె విదేహముక్తికలితున్ శ్రీసూ... 84

మ. జలజాక్షున్ గనకాంబరున్ సకలభూషాభూషితాంగున్ మహో
జ్జ్వలతూణాసిధనుర్ధరున్ గమలనీసంసేవ్యపాదాబ్జుఁ బు
ష్కలతేజోనిధి నాదిదేవు నిను సాక్షాద్బ్రహ్మమంచున్ దలం
చి లసద్భక్తి భజింతు మాన కెపుడున్ శ్రీసూ... 85

మ. కలలో దాఁచినచిత్తవృత్తులగతిన్ గన్పట్టునజ్ఞానభా
వ్యులు జీవుల్ఘటియించుకృత్యములు నీ వొక్కింత కర్తృత్వబ
ద్ధు లటంచున్ గని వారికన్యఫలముల్ దోడ్తోఁ బ్రసాదింప క
ర్మ్మలిఁ బ్రోవందగదే యవార్య లనుచున్ శ్రీసూ... 86

మ. హరి తేజోమయ పద్మినీరమణ లోకాధ్యక్ష పద్మాక్షభా
స్కర మృత్యుంజయ శంకరా శ్రుతిశిఖాసంభావ్య విశ్వంభరా
సురవర్యా నిటలాక్ష కేశవ మునిస్తుత్యాంఘ్రిపంకేజ సు
స్థిర సంజ్ఞారమణీశ లోకనయనా శ్రీసూ... 87

శా. ఛాయావల్లభ దుష్కృతాంతక మహేశా భద్రసంధాయకా
ధ్యేయాకార శివస్వరూప సుభటా రిస్తోమ విచ్ఛేదకా
మాయాతీత ముకుంద వాసరమణీ మార్తాండ నక్తంచరా
జేయా ద్వాదశరూప చండకిరణా శ్రీసూ... 88

శా. అంతా దేవతలా హరిత్కరికరోగ్రాఖండదోర్దండసం
క్రాంతేష్వాసవిముక్తకాండజలధారాధ్వస్తమందేహక
ల్వాంతవ్యక్తహుతాశనోజ్ఝితసమస్తామర్త్య మర్త్యావళీ
చింతాసంతతి నిర్గణించెదుతటిన్ శ్రీసూ... 89

మ. కలరే నీసరివేల్పు లిజ్జగములన్ గంగాధరాంభోజభూ
బలభిద్వామనముఖ్యనిర్జరశిరోభాస్వత్కిరీటాగ్రభా
గలసద్రత్నసమంచిత శ్రుతిశిఖాగమ్యప్రభాభూషితాం
ఘ్రిలుఠత్సేవకభూరిదుష్కృతగణా శ్రీసూ... 90

మ. సరివేల్పెచ్చట లేఁడు నీకు శుచిమచ్ఛాస్త్రాగమాభ్యాసభా
సురవిజ్ఞానకళావిలోలహృదయక్షోణీసురాలోక్యదు
ర్భరభానూత్కరచండమండలవిని ర్యద్దివ్యరుగ్వార్పిత
స్థిరకాండోదరపూరితోరుతిమిరా శ్రీసూ... 91

మ. మెరుపుల్పొడ్పున సంపద ల్పొదలు నెమ్మేనుల్ ఘనచ్ఛాయలై
పరగున్ సంసృతిసౌఖ్యముల్ బహువిధస్వప్నంబులై తోఁచు బం
ధురభోగంబులు బుద్బుదంబులగతిన్ బొల్పొందు నెవ్వార ల
స్థిరరూపంబులు వీని నమ్మనగునే శ్రీసూ... 92

మ. శరణం బంటి భవత్పదస్మరణదీక్షావృత్తి నాల్గొంటి మ
త్సరమోహాదుల నంటకుంటి మతిమత్సాంగత్య మిమ్మంటి నే
మరుపా టెంతయుఁ గానకుంటిఁ దొలికర్మశ్రేణి పోఁగంటిఁ జె
చ్చెరఁ దాపత్రయిఁ బాపుమంటి నెపుడున్ శ్రీసూ... 93

మ. ధనలుబ్ధత్వము దీఱెఁ గామముఖచేతశ్శత్రువుల్వాఱె స
జ్జనసాంగత్యము మీఱెఁ బుత్రతతివాత్సల్యంబునుం జాఱెఁ ద
క్కినకాంక్షల్ గడ తేఱె నెల్లపుడు సత్కృత్యంబులెల్లన్ ఘటిం
చి నినుం గొల్చితి నన్నుఁ బ్రోవవలదే శ్రీసూ... 94

శా. విత్తప్రాప్తిగతు ల్దలంపక సదా విద్యావినోదంబునన్
మత్తుండై దినకృత్యముల్ సలుపుచున్ మాన్యద్విజేంద్రాళిచేఁ
జిత్తస్థైర్యము గల్గి నీదుపదముల్ సేవించుభూదేవుఁడు
ద్వ్యత్తిన్ ముక్తిపదంబు గాంచును గదా శ్రీసూ... 95

మ. మనుజుం డర్థముఁ గోరి నీచరణముల్ మన్నింప కర్థింపుచున్
ధనికశ్రేణుల నాశ్రయించి పిదపన్ దైన్యంబు దీపింపఁ ద
న్ననయంబున్ జనులెల్ల హాస్యములు సేయన్ బ్రాప్తిలేదంచు నే
చినవంతన్ బలుచింతఁ జెందునుగదా శ్రీసూ... 96

మ. తనయుల్ తమ్ములు నన్నలున్ సతియు మిత్రశ్రేణియుం గొల్వఁగా
ధనికత్వంబునఁ దత్సుఖంబు తనకున్ దక్కోలటంచున్ మనం
బున హర్షింపుచు మూఢుఁ డంతకభటుల్ పోరాడువేళన్ జనిం
చినభీతిన్ గడుదుఃఖ మొందునుగదా శ్రీసూ... 97

మ. నృపులం గొల్చుచు వేషధారి యగుచున్ బేరంబు లశ్రాంతమున్
జపలత్వంబున సల్పుచుః పరిగృహస్థానేచ్ఛ వర్తింపుచున్
విపులద్రవ్యముఁ గూర్చి మోదమున బృథ్వీదేవవంశ్యుండు దాఁ
గృపణుండై చెడుఁ గాదె నిన్నెఱుఁగమిన్ శ్రీసూ... 98

మ. కృతపాపంబులు లెక్కపెట్టక మహాహీనాకృతిన్ దాల్చి దా
నతతిన్ గైకొనుచున్ దురన్నముల నంతఃప్రీతి భక్షింపుచున్
వ్రతము ల్గోరక యాహ్నికక్రియ లొగిన్ వర్జించి విప్రుండు సం
చితవిత్తంబునఁ దృప్తిఁ జెందక చెడున్ శ్రీసూ... 99

మ. మతిమద్ధ్యేయు నచింత్యకాయు సుమహామాయున్ రణాజేయు ని
ర్జితదైతేయు నతాదితేయు ధృతకాషేయున్ జగద్గేయు సం
భృతతిగ్మాంశు నికాయు సద్గుణగణామేయున్ హృతాపాయు స
త్కృతరాధేయు నహేయు నిన్నుఁ గొలుతున్ శ్రీసూ... 100

మ. ధృతచక్రాబ్జనిషంగచాపు విలసత్కీర్తిప్రభావంచితా
మృతసంతానకలాపు ఖండితభటశ్రేణీబృహత్పాపు ధీ
రతతిధ్యేయసురూపు సత్యమధురాలాపున్ నతశ్రీపు వ
ర్జితకోపున్ సుకలాపు నిన్నుఁ గొలుతున్ శ్రీసూ... 101

మ. అవితాంభోజభవాండుఁ గిల్బిషకదళ్యారణ్యవేదండు ర
త్నవిచిత్రార్జునకుండలద్యుతిసముద్యద్గండు మందేహదా
నవసేనాదళనోన్ముఖప్రబలనానాకాండుఁ గాండాదిభూ
రివిహారార్హ్వపిచండు నిన్నుఁ గొలుతున్ శ్రీసూ... 102

మ. నతశక్రాదికిరీటకోటిమణిసంతానస్ఫురత్పాదు దా
రితభక్తాఖిలఖేదు మానిజనతాశ్రీదున్ మహామోదు భా
లితమర్యాదు విపక్షహృద్భయదమార్త్వనాదు దివ్యాస్త్రని
ర్జితనానాపలలాదు నిన్నుఁ దలఁతున్ శ్రీసూ... 103

మ. సురవర్యస్తుతనాము భవ్యసుగుణస్తోమున్ సమస్తాశ్రితో
త్కరసంతాపవిరాము లోకభయకృత్సంగ్రాము నానావిధా
భరణోద్దాము సుధాము సత్కులసరస్వత్సోము నిష్కాము భూ
రిరమాలంకృతధాము నిన్నుఁ దలఁతున్ శ్రీసూ... 104

మ. శతపత్రాయతనేత్రు సర్వసుమనస్సంస్తుత్యచారిత్రు దు
ష్కృతసంఘాతలతాలవిత్రు మునిరాడిష్టాటవీచైత్రు ని
ర్జితమందేహనిశాటగోత్రు గిరణశ్రేణీలసద్గాత్రు సం
శ్రితలోకావనసూత్రు నిన్నుఁ దలఁతున్ శ్రీసూ... 105

మ. కుతుకం బొప్ప నమస్కరింతు మఱి నీకున్ సేవకశ్రేణికిన్
ధృతదివ్యాయుధపాణికిన్ మణిగణోదీర్ణప్రభాపుంజరం
జితగాంగేయశతాంగమాళికి సరోజిన్యాదికాంతాళికిఁ
గృతకృత్యుం డని వేడ్క నన్మనుపవే శ్రీసూ... 106

మ. ఈమీఁదన్ భవదీయభూరిదయ నే నెంతే సుఖశ్రేణిచే
నామోదించి నిరామయప్రకృతి నై హర్షింపుచున్ బాపచిం
తాముక్తిం గనిముక్తికాంక్ష మదిలో స్తంభింప నీపాదముల్
వేమారెంచి భజింపుచున్ దిరిగెదన్ శ్రీసూ... 107

శ్రీసూర్యనారాయణశతకము సంపూర్ణము.





# శ్రీ భద్రాద్రి రామ శతకము



శ్రీమద్రఘువంశార్ణవ
సోమా శ్రీరామనామ సువ్రతకామా
కోమలదేహశ్యామా
శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 1

క. వామాంకమందు సీతాభామయు సౌమిత్రికుడిని భరతుఁడు గొల్వన్
సామీరితోడ నొప్పిన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 2

క. స్వామీ నీదేభారము పామరుఁడను పాతకుఁడను పతితుఁడ సీతా
రామా నీపదములె గతి శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 3

క. రామ ద్వయాక్షరమంత్రము నామనమున నిల్వనిమ్ము నారాయణ యో
శ్రీమంతుఁడ స్మితవక్త్రుఁడ శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 4

క. ఏమయ రామబ్రహ్మమ నీమహిమోక్తులును నెన్న నీశునితరమా
తామరసగర్భుతరమా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 5

క. రామా నీదయ రాదుగ నామీఁదను నాదిదేవ నారదవినుతా
మోమైనఁ జూపవైతివి శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 6

క. రామా దైవశిఖామణి సామజరాడ్వరద సత్యసంధవ్రతుఁడా
యేమని పొగడుదు నిన్నున్ శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 7

క. రామా నీస్మర ణెప్పుడు నేమరకన్ సర్వకాల మేర్పడఁ దలఁచే
నామనవి చిత్తగింపుము శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 8

క. రామ యభిరామ రాఘవ తామరసదళాయతాక్ష తాపసరక్షా
కామారిధనుఃఖండన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 9

క. రామా రఘుకులతిలకా కామాదులఁ గడకుఁ జిమ్మి కడతేర్చెడి శ్రీ
స్వామి వని నిన్ను నమ్మితి శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 10

క. రామయనువర్ణయుగ్మము నేమముతోడను జపించునియతాత్ములకున్
గామితమోక్షము లిత్తువు శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 11

క. భీమప్రస్తుతనామా హైమవతీజపన్యామ యచ్యుతరామా
కోమలమేఘశ్యామా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 12

క. రామా రమణీయగుణస్తోమా సమరజితరామ సుందరరామా
భీమపరాక్రమ దివ్య శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 13

క. శ్రీమంతం బగుతారక నామజపం బనిలసుతుఁడు నాగాంతకుఁడున్
వేమరు నెదురుగఁ జేతురు శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 14

క. రామ యనుమంత్రరాజము నా మాధుర్యము మృదుత్వ మా యద్భుతముఁ గా-
ఏమహనీయుల కబ్బునో శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 15

క. రామా యనునీనామము ప్రేమన్ బఠియించినట్టి ప్రీతాత్ములకున్
శ్రీమత్పదగతి యిత్తువు శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 16

క. రామా కల్యాణాంచితధామా శ్రీరంగధామ దశరథరామా
భూమిసుతాధిప రామా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 17

క. రామ యహల్యాశాపవిరామా వైకుంఠధామ రవిపుత్రబల
స్తోమ రణరంగభీమా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 18

క. శ్రీమ జ్జితవిద్యుద్గణధామా దుర్మదవిరామ తాపసరామా
హేమహరిణమును ద్రుంచిన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 19

క. రామా కల్యాణప్రదనామా కోదండరామ నవ్యభుజంగో
ద్దామదశకంఠలుంఠన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 20

క. రామా రక్షక మ్రొక్కెద రామా నన్నేలుకొఱకు రాజకుమారా
శ్రీమహనీయ దయానిధి శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 21

క. రామా నీదగునామము సామప్రియ శివునిపత్ని సరవిన్ జపమున్
గామితమతి నొనరించెను శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 22

క. రామా యెల్లప్పుడు మీరామతో నావెంటనంటి రమ్మా విలస
త్ప్రేమను మోక్షం బిమ్మా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 23

క. రామయ్యా రామ సీతారామా పట్టాభిరామ రాఘవరామా
శ్రీమృత్యుంజయపూజిత శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 24

క. శ్రీమహిత రామభద్రా కామితకరుణాసముద్ర కార్ముకహస్తా
హేమశరాసనవందిత శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 25

క. రామ శ్రీమదయోధ్యారామా రాజీవనాభ రవికులసోమా
హేమమణికాంచిదామా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 26

క. రామ రాజాధిరాజ శ్రీమణినూపురపదాబ్జ శ్రీరవితేజా
వామన వరకుశశయనా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 27

క. రామ జగదేకవీరా శ్రీమదయోధ్యావిహార శివజపితగుణా
సామోద సార్వభౌమా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 28

క. రామా రాత్రిరి వేకువఝామున నినుఁ బ్రస్తుతింతు జన్మఫలముకై
రామా రాక్షసనిగ్రహ శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 29

క. రామా ననువిడనాడకు రామా ననుఁ గన్నతండ్రి రఘుకులముఖ్యా
రామా నను రక్షింపుము శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 30

క. రామా రవినుతపాలక రామా భక్తాంతరంగ రమ్యశుభాంగా
చామరఛత్రాలంకృత శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 31

క. రామా రాజకులాగ్రణి రామా నాచక్కనయ్య రఘునాథయ్యా
రామా నాప్రియదైవము శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 32

క. రామాభరతాగ్రజ నీనామము నాజిహ్వయందు నటియించుత శ్రీ
రామ రాజ్యాభిరామా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 33

క. రామా సకలామరనుతధీమణి శ్రీరామదేవ దివిజస్తుత్యా
నామొర మది నాలింపుము శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 34

క. రామా రాజానన రఘురామా నాతోడు నీడ రారా రామా
శ్రీమహితసింధుబంధన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 35

క. రామా దశరథనందన రామా రాజీవనేత్ర రాఘవరామా
శ్రీమించునీచరిత్రంబు శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 36

క. రామా పరమదయాకర రామా రాకేందుముఖవిలాసా భాస
చ్ఛ్రీమకరాబ్జత్రిపద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 37

క. రామా సీతావల్లభ రామా దాశరథి వాసరాధిపభాసా
శ్రీముఖచంద్రచకోరా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 38

క. రామా మీతిరువడిఘులు చామంతిసుపుష్పములను చంపకములచేఁ
గామించి పూజఁ జేసెద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 39

క. రామా దాసజనార్చిత రామా రంజితపదాబ్జరతి నాకిమ్మా
శ్రీమహిళామానసహార శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 40

క. రామా పవనజవాహన రామా లోకాభిరామ రాజవరేణ్యా
శ్రీమాధవ శ్రీరామా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 41

క. రామ రాజేంద్ర రాఘవరామా నాగారితురగ రాక్షసభంగా
శ్రీమత్ఫణీంద్రశయనా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 42

క. రామా త్రిభువనరక్షక రామా దీనజనబంధు రఘుకులసింధూ
స్వామి దయాపరమూర్తీ శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 43

క. రామా నాయిలువేలుప రామా హరి రామ ఘోరరావణహరణా
రామ సాకేతరామా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 44

క. రామా శ్రీజగతీధవ యేమిర శ్రీరామచంద్ర యిల నీవాఁడన్
నీమీఁదితలఁపు నిమ్మా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 45

క. రామా కరుణాంభోనిధి రామాత్మారామ లోకరక్షణరామా
రామ కౌసల్యనందన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 46

క. రామా రఘునందన శ్రీదామోదర తార్క్ష్యవాహ తాటకహరణా
రామ ఖరదూషణాంతక శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 47

క. రామా శాశ్వతబాంధవ రామా నను గన్నతండ్రి రామనృపాలా
రామ నాపెన్నిధానమ శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 48

క. రామా నను మన్నింపఁగ రామా నీకన్నఁ బ్రోచురా జిఁక నేడీ
రామా రాజలలామా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 49

క. రామా యిదిగో సమయము రామా రక్షించు నన్ను రామ దయాళూ
రామార్తదీనపోషక శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 50

క. రామా సుందరమందిర శ్యామాంగా హేమవస్త్ర చక్రాసిధరా
కోమలకుసుమపదయుగళా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 51

క. రామా గోవింద విష్ణూ వామన పరవాసుదేవ వసుధారమణా
కామశతకోటిరూపా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 52

క. భీమభయంకరబాణస్తోమా సాకేతవాస సూనృతవాక్యో
ద్దామా నిను నెంచెద విను శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 53

క. నీమహిమ లెన్ని పురుషులు ఈమనివిత్తంబు లడుగ నియమేమి హరీ
నే ముఖ్యుఁ డౌట యెట్లను శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 54

క. రామా నాస్వాంతములో నేమముగా నిరత మేను నిన్నర్చింతున్
హేమకుసుమములచేతను శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 55

క. రామా వాలిని గూల్చిన రామా సుగ్రీవరక్ష రాజేంద్రనుతా
ప్రేమను వందన మిదిగో శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 56

క. రామా కరుణాంభోనిధి రామా శ్రీపుండరీక రాజితచరణా
రామాంజలి నేఁ జేసెద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా, 57

క. రామా రావణుతమ్ముని రామా లంకాధిపతిగ రమ్యతఁ జేయన్
సామర్థ్యము నీకేతగు శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 58

క. భూమిజవర పురుషోత్తమ నామది నెడ బాయకుండు నలినదళాక్షా
వేమరు వినుతించెద నిను శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 59

క. రామా విశ్వామిత్రుని కామితయజ్ఞంబు ఘనతఁ గాచిన దేవా
నీమహిమ లెన్న శక్యమె శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 60

క. కోమలవర్ణము గలిగిన భూమిజఁ గైకొనినభూరిభుజబలసాంద్రా
శ్యామలకోమలకరపద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 61

క. రామ శ్రీరంగనాయక యీమహిలోపలను గోర్కెలింపున నిచ్చే
రాముఁడని కోరి వేడితి శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 62

క. కోమలశ్యామలతులసీ దామము ధరియించినట్టి దశరథసుత శ్రీ
రామ మదాత్మారామా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 63

క. శ్రీమన్ మంగళవిగ్రహ నీమంగళవర్ణనీయనిచయము మదిలో
నేముందుగ సేవించెద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 64

క. కామితఫలదుఁడ వంచును నే మిమ్ముల నాశ్రయించి నిరుపమభక్తిన్
నామోచ్చారణఁ జేసెద శ్రీమద్భద్రాద్రిరధామ శ్రీరఘురామా. 65

క. రామా నీదయచేతను రామా నీపాదభక్తి రంజిలుచుండున్
రామా ననుఁ బోషించుము శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 66

క. స్వామీ నీవే ప్రభుఁడవు స్వామీ నీనామజపము సర్వసుపర్వుల్
వేమరు సన్నుతిఁ జేతురు శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 67

క. రామా నాకలుషంబులు నామోచ్చారణముచేత నాశము నొందున్
నామనమునఁ జింతించెద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 68

క. రామా త్రిభువనపూజిత రామా నీపాదపద్మరజమును మదిలో
రామా యెపుడు స్మరించెద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 69

క. రామా విమలాత్మ సీతా భామానవమదన కదనభంజితదైత్య
స్తోమ ఘనశ్యామా యో శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 70

క. రామా నినుఁ గొనియాడెద నీమృదుపదములును మోము నీమస్తకమున్
దామరలఁ గేరు కరములు శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 71

క. రామ కర్పూరంపుహారతి నామక్కువ పళ్లెరమున నంచితభక్తిన్
నే మీకిచ్చెదఁ గైకొను శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 72

క. రామేంద్ర నీలనీరద శ్యామా గుణరుచిరరామ చంపకనాసా
ఆమోదకర విహారా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 73

క. రాముఁడు తండ్రియు సీతారామయు తల్లియని మదిని బ్రస్తుతిఁ జేతున్
నామనవి వినుము రామా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 74

క. శ్రీమత్పరమేశ్వరకరు ణామధురస యురగలోకనాయక కృష్ణా
ప్రేమను నిను నమ్మితిరా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 75

క. శ్రీమత్పరమదయానిధి శ్రీమత్పంకేరుహాక్ష శ్రీయుతవక్షా
శ్రీమానినీమనోహర శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 76

క. శ్రీమధురాపురి వెలసిన శ్రీమృదుశ్రీపాదములును జెన్నలరంగా
నామనమున సేవించెద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 77

క. భీమనకులధర్మార్జున స్తోమము పరిపాలనమున సొంపునహించెన్
సామివనిఁ బ్రస్తుతించెద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 78

క. శ్రీమధుసూదన ధర్మ శ్రీమద్వసుదేవతనయ శ్రీకర కృష్ణా
యేమిర యిఁక నను బ్రోవర శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 79

క. శ్రీమురళీధర హేలా శ్రీమద్గోపాల భక్తసేవితశీలా
శ్రీమునిరాడర్చితపద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 80

క. సోమకుఁడు వార్ధిలోపల ధీయుతితో నుండువానిఁ ద్రుంచి శ్రుతుల నా
తామరసగర్భు కొసఁగవె శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 81

క. ప్రేమతో నమృతము దరచఁగ నీమంబుగ కమఠరూపు నీవెత్తవె యా
భీమమహీధ్రముకొఱకై శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 82

క. కామమున హిరణ్యాక్షుం డామహిఁ గొనిపోవ నప్పు డాతని ద్రుంపఁ
బ్రేమ వరాహమవైతివి శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 83

క. భీమబలోద్ధతి విజయస్తోమా నరసింహరూప సురవైరిబలో
ద్ధామా జయవిక్రమ నయ శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 84

క. వామనరూపముతోఁ డుత భూమాంతయు నేఁచుచున్న భూరిబలీంద్రున్
నీమాయచేతఁ ద్రొక్కవె శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 85

క. ప్రేమ ముయ్యేడు మాఱులు భూమిం జరియించి రాజపుత్రుల ద్రుంచా
భూమి బుధకోటి కిచ్చిన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 86

క. భూమిజను పంక్తికంఠుఁడు ప్రేమం గొనిపోవ నతనిపృథుతరశిరముల్
భీమముగఁ ద్రుంచి మించిన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 87

క. భూమిజనసస్యవృద్ధికి నేమముతో హలము వట్టి నేతలఁ బ్రోచే
యామహిమ నీకె తగునయ శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 88

క. నీమహిమ లెన్న శక్యమె యామహిలో త్రిపురవిజయులై తగు స్త్రీలన్
గామితులఁ జేసి వెలసిన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 89

క. భూమీంద్రులెన్న జగముం ధీమహిఁ బాలించి యవనధీశులఁ జంపన్
గామముతోడుత వెలసిన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 90
క. శ్రీమందిర వరరమణా కామితకమనీయ గరుడగమన మురారీ
నే మీకు మ్రొక్కెదనయో శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 91
క. రామ నవమోహనాంగా రామా సీతాంతరంగ రమ్యశుభాంగా
రామ భవవర్గభంగా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 92
క. రామానుజ నన్నేలిన స్వామీ శ్రీకృష్ణదేవ సకమలనామా
రామా జనకామ జయ శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 93
క. రామా కస్తురిరంగా సోమ శరచ్చంద్ర గాంగ శుభ్రయశశ్శ్రీ
కామా నను గరుణింపుము శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 94
క. రామ మిము సన్నుతించెద నామానసవీథియందు నగధర కృష్ణా
దామోదర యని సతతము శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 95
క. రామ కరుణాలవాలా శ్యామలరుచిజాల భక్తజనయోగీంద్రా
ద్యామరసన్మునిపాలా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 96
క. రామ సామ్రాజ్యధుర్యా ధీమహిత సుమేరుధైర్య దితిజావార్యా
స్తోమామరగణవర్యా శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 97
క. రామునికన్నను రెండవసామియు లేఁడనుచు నీవె సర్వం బనుచున్
వేమారు విన్నవించెద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 98
క. రాముఁడునువినా దైవము భూమిన్ లేఁడనుచు మదినిబొందుగ నే నీ
నామామృతంబు గ్రోలెద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 99
క. శ్రీమదయోధ్యా నాయక కోమలనీలాభ్రదేహ గోధ్వజవినుతా
శ్రీమారుతసుతు నేలిన శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 100
క. రామ వరపావులూరి స్వామివి నీవనుచు నమ్మి శతకము భక్తిన్
ప్రేమ రచియించితిని గొను శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 101
క. శ్రీమహితపావులూరి సుధాముఁడు రామన్న మంత్రితనయుఁడ కవి
సుత్రాముఁడ మల్లనసచివుఁడ శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 102
క. సోమార్కనేత్ర విను నే నీమహి వాసిష్ఠగోత్రహిమకరుఁడను సు
శ్రీమీర నిన్నుఁ గొల్చెద శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 103
క. స్వామీ ధర శాపమకున్ రామనకుం బుత్రకుఁడను రమణీయగుణో
ద్దాముఁడ నాపస్తంబుఁడ శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 104
క. ఈమహిలో నీశతకం బేమనుజుఁడు వ్రాయుఁ జదువు నీప్సితఫలమున్
ప్రేమ నొసంగుము దయచే శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 105

భద్రాద్రిరామశతకము సంపూర్ణము.

---



శ్రీ ర స్తు

# మా రు తి శ త క ము



మద్రామకథాసుధారసము లేసీమం బ్రవర్తించుఁ ద
ద్భూమిన్ హర్షపయఃపరీతనయనంబుల్ కంటకాంచత్తను
శ్రీమీఱన్ దృఢభక్తితోడ శిరమున్ జేదోయి జోడించి నా
నామాసీంద్రులు మెచ్చ నిల్చి తగు నిన్ వర్ణించెదన్ మారుతీ! 1

శా. కంజాప్తాన్వయదుగ్ధవారినిధి రాకాచంద్రు సద్వాక్యముల్
కంజాక్షీమణి యైనసీతకును దత్కాంతాను తల్లీవచః
పుంజంబుల్ రఘుభర్తకున్ దెలుపుచున్ బుత్త్రాకృతిన్ వారిచెం
తం జెల్వారఁ జరించి మించిననినున్ ధ్యానించెదన్ మారుతీ! 2

శా. సీతారాముల కగ్రనందనుఁడు కిష్కింధాపురస్వామికిన్
జేతశ్శుద్ధికరుండు లక్ష్మణునకున్ జీవానుసంధాత దు
ర్దైతేయాళికి దండపాణి యపవర్గశ్రీకి నాథుం డనా
భాతిన్ భాసిలుభవ్యభవ్యు నిను సంభావించెదన్ మారుతీ! 3

శా. రామస్వామి నినున్ స్వకీయపరివారంబందు నగ్రేసరుం
గా మన్నించుటఁగాదె ముందు భవదాఖ్యం బల్కి సీతాసతిన్
సౌమిత్రిన్ భరతాదులన్ బిదప నెన్నంజొత్తు రుర్వీజను
ల్నీమహాత్మ్యముఁ దెల్పుపాటినరు లేరీ భూస్థలిన్ మారుతీ! 4

శా. పారావారము గోష్పదంబు మశకప్రాయు ల్నిశాటుల్ హిమా
నీరూపంబులు వాలవహ్నిశిఖ లున్నిద్రాలి దివ్యాస్త్రముల్
పూరేకుల్ జయలక్ష్మి భార్య సమరంబుల్ కేళు లబ్జాన్వయా
ధారున్ గొల్చుట కృత్య మైతగు నినున్ ధ్యానించెదన్ మారుతీ! 5

శా. శైలోన్మూలనలోహపాశము రణోత్సాహిద్విషత్ప్రాణవా
తూలవ్యాళము భానునందనచమూదుర్గంబు ధూమ్రాక్షకం
తాలోలాయస చండవాగురు దశాస్యాంచత్పురీదాహకో
త్తాలాలాత మనంగభాసిలు భవద్వాలం బహో మారుతీ ! 6

శా. భీమాకారభుజంగరాజవపురాభీలంబు దుర్దాంతసం
గ్రామస్ఫూర్జితశౌర్యమూలము హతాక్షప్రాణవాతూల ము
ద్దామశ్రీయుతపంక్తికంఠపురసద్మప్రేషితాగ్నిచ్ఛటా
దామోద్దీప్తదిగంతరాళము భవద్వాలం బహో మారుతీ ! 7

శా. సరసీజాప్తకులావతంసుని యశస్సమ్యక్సుధాపూర మం
బరభాగంబున దిక్తటంబులను శుంభద్వృత్తితోఁ బూయ ని
ర్ఝరసంఘంబులు గూర్చుకూర్చకరణిన్ రాజిల్లు యుష్మన్మహా
గరభృత్సన్నిభవాల మెంచి పొగడంగా శక్యమే మారుతీ ! 8

శా. జలజాతాప్తకుమారసైన్యపటలీజాతార్భటీకోటిచేఁ
జలితం బైనసతారకాగ్రహవిరాజద్వ్యోమభాగంబు భూ
స్థలిమీఁ దంబడకుండ రాఘవుఁడు సంస్థాపించు మేలైనబం
గరుకంబం బన నీదువాల మమరున్ గాఢవ్రతీ మారుతీ ! 9

శా. గూఢపదోపమానశరకోటుల రావణముఖ్యదైత్యులన్
గాఢగతిన్ వధించి తగఁ గంజహితాన్వయుమ్రోల వానరుల్
ప్రౌఢిమ నిల్వఁ బో గెలుపురాటగతిన్ భవదీయవాల మా
రూఢవియత్పథం బగుచు రూఢి వెలుంగుఁగదయ్య మారుతీ ! 10

శా. లంకావల్లభుతోడ రాముఁడు రణారంభంబుఁ గావింపుచోఁ
బొంకంబొప్పఁగ నీవు వాహనము వై పొల్పారి తద్వేళ ని
శ్శంకన్ నీదగువాల మభ్రపటలీచంచత్పటోపేతతా
ర్క్ష్యాంగం బౌచు వెలింగ నిన్బొగడ శక్యం బేరికా మారుతీ ! 11

శా. శ్రీరామాంఘ్రిసరోజభక్తిభరితున్ సీతాంగనాస్తుత్యసం
చారున్ రావణసైన్యదావదహనున్ సావర్ణ్య ధాత్రీధరా
కారున్ భానుతనూజమంత్రివగు లంకాపట్టణధ్వంసకున్
వీరున్ నిన్ను భజింతు నన్ను దయతో వీక్షింపుమీ మారుతీ ! 12

శా. వ్యాళాధీశ్వరభోగసన్నిభలసద్వాలాగ్రబద్ధాసురీ
చేలగ్రాసవివర్ధమానఘనరోచిష్కేశనిర్దగ్ధలం
కాలంకారుని జంబుమాలిముఖదైత్యగ్రావవజ్రాయుధున్
ఫాలాక్షుస్తుతు నిన్నుఁ గొల్చెద ననున్ బాలింపుమా మారుతీ ! 13

శా. మైనాకాచలతుండభంగచయసమ్మర్దోత్థితాంభోనిధి
ధ్వానగ్రాసవివృద్ధకంఠనినదధ్వస్తాఖిలక్రవ్యభు
క్సేనాకర్ణుని హేమవర్ణుని దమక్షేమక్షమాకీర్ణు సీ
తానాథాశ్రమపూర్ణు నిన్నుఁ గొలుతుర్ ధన్యాకృతీ మారుతీ!

శా. కటిసూత్రంబును జన్నిదంబు జడలున్ గాశేయకౌపీనముల్
పటుశృంగారపలాశదండములు సారంగాజినంబుల్ శిఖో
ద్భటదర్భాంకురముష్టియున్ భసితలేపం బెంతయున్ భాసిలన్
వటురూపంబున రామునిన్ గనిననిన్వర్ణించె నెవ్వన్ మారుతీ!

శా. అపశబ్దంబు నిరర్థకంబు విపులం బన్యాయ మాక్రోశ మ
వ్యపదేశం బనిమిత్త మత్యధిరవం బస్పష్ట మప్రాప్తకా
ర్యపరం బైననికృష్టవాక్కు భవదాలాపంబునన్ లేమి ని
ష్కపటస్ఫూర్తి నుతించె నిన్ జనకజాకాంతుం డహో మారుతీ!

శా. హితమున్ సత్యము సాధువాక్యవినుతం బిష్టంబు విస్పష్ట మం
చితకంఠస్వర మల్పవర్ణ మఖిలశ్రేయస్కరం బర్థవి
స్తృతమున్ బ్రస్తుతకార్యకారి యగుచున్ శోభిల్లు నీవాక్యసం
తతికిన్ రాముఁడు సంతసించెను భళీ! ధర్మాత్మకృతీ! మారుతీ!

శా. తపనాకారఘనద్యుతీ! నగధృతీ! దైతేయకాలాకృతీ!
జపహోమాధికృతీ! బృహస్పతిమతీ! సంతుష్టసీతాపతీ!
కపిరాజాప్తనుతీ! మహాగుణతతీ! కాకుత్ససేవారతీ!
విపులానందయుతీ! ప్రభంజనగతీ! విశ్వోన్నతీ! మారుతీ!

మ. అవితాశేషకపీంద్రసైన్యవితతీ! హార్యక్షతుల్యాకృతీ!
దివిజవ్రాతకృతస్తుతీ! మహదనాదిబ్రహ్మచర్యవ్రతీ!
జవనిర్ధూతసదాగతీ! దివసకృత్సంప్రాప్తసర్వస్మృతీ!
స్తవనీయాహవహార్షి తామరపతీ! శాంతిక్షితీ! మారుతీ!

ఉ. సత్యము దానమున్ దపము శౌచము శాంతము రామభక్తి సాం
గత్యము బ్రహ్మచర్యము సుఖస్థితి మార్దవమార్జవంబుఁ శాం
డిత్యము శ్రద్ధ నీతి దయ ధీరత ధర్మముఁ బుణ్యకర్మముల్
నిత్యము నీకడన్ నిలుచు నిన్ను నుతింపఁ దరంబె మారుతీ!

చ. విరతి వివేకమున్ సమత వేదసమాదరణంబు యోగమున్
కరుణ దమంబు మైత్రి మురఘస్మరుపూజన మార్జవం బుపా
యరుచి యకామ మోరిమి మితాశన మాదిగ సత్త్వధర్మముల్
నిరతము నిన్నుఁ గొల్చుటను నీకు సమానులు లేరు మారుతీ!

మ. విలసత్థైర్యము విక్రమక్రమము ప్రావీణ్యంబు గాంభీర్య ము
జ్జ్వలశౌర్యంబు జవంబు నీతి ప్రతిభాసాంగత్యదాక్షిణ్యముల్
బలమున్ ధైర్యము సాహసంబు విజయోపాయంబు నీయందు ని
ర్మలవృత్తిన్ వసియించె నిన్నుఁ బొగడన్ మాశక్యమే మారుతీ! 22

మ. పరుషత్వంబు మదంబు నాస్తికత దంభం బీర్ష్య మోహంబు మ
త్సర మన్యాయము కామలోభములు దౌర్జన్యంబు రోషంబు ద
ర్పరుజల్ భీతి దురాశ నిర్దయ వివాదం బార్తి జాడ్యంబు ము
ష్కరతన్ నీభటునైనఁ జెందవు నినున్ గాంక్షింతునే మారుతీ! 23

చ. విపులతపోధనుండవు పవిత్రచరిత్రుఁడ వాహవక్రియా
నిపుణుఁడ వబనాభపదనీరజభక్తియుతుండ వాగమాం
తపటురహస్యవేదివి దృఢవ్రతశాలివి బ్రహ్మచర్యవి
ఘ్నపతివి మృత్యుశూన్యుఁడవు గర్వవిహీనుఁడ వీవు మారుతీ! 24

మ. గణనాతీతము లైన సద్గుణతతుల్ కంజాతమిత్రాన్వయా
గ్రణియందుం బలె నీకడన్ గలుగుటన్ రామున్ బలెన్ నిన్విచ
క్షణు లర్చించి యనిష్టవర్జనము లిష్టప్రాప్తులం బొంది యు
ల్బణసౌఖ్యంబులఁ బండియుండెదరు భూభాగంబునన్ మారుతీ! 25

శా. శ్రౌతస్మార్తపురాణపాశుపతదీక్షాపాంచరాత్రాగమ
ద్వైతాద్వైతకథాశ్రుతిస్మృతులు వార్తాదండనీతిక్రియా
జ్యోతిర్దర్శనసాంఖ్యయోగవచసోయున్యాయశాస్త్రాదులున్
సీతానాథునయున్ భవద్రసన రంజిల్లుంగదా! మారుతీ! 26

శా. క్రూరాకారచమూభృత్ప్రచురరక్షోరాజధానీమహా
వీరంబందు నిశాటశోణితఝరావిక్షీరముల్ వేల్చు దు
ర్వారాగ్నేయశిఖల్ సృజించి సమరారంభప్రవర్గ్యక్రియన్
శ్రీరామేశ్వరుఁ దృప్తుఁ జేసితివి కర్మిష్ఠాగ్రణీ! మారుతీ! 27

శా. అక్షాద్యప్రభుగంగరక్షసమిధాజ్యాదుల్ ప్రతాపాగ్నిలోఁ
బ్రక్షేపం బొనరించి రావణపురప్రాగ్వంశశాలాదులన్
దక్షత్వంబునఁ గాల్చి వేల్పులఁ బ్రమోదస్వాంతులం జేసి వి
శ్వక్షేమం బొనరించు నీక్రతువు మెచ్చన్ శక్యమే మారుతీ! 28

చ. గరుడునికంటె మారుతముకంటెఁ దటిల్లతకంటె నిర్జరే
శ్వరుభిదురంబుకంటె హరిచక్రముకంటె శరంబుకంటె భా
స్కరుహరికంటెఁ గృష్ణమృగికంటె విమానముకంటె జారసుం
దరిచలదృష్టికంటె బలితంబు భవజ్జవ మెన్న మారుతీ! 29

మ. జలధిధ్వానము భేరికాధ్వనులు గర్జానాదముల్ ఝల్లరీ
విలసద్రావము వజ్రపాతభవగంభీరస్వనంబుల్ జగ
త్ప్రళయారంభవిజృంభమాణపురజిద్భవ్యాట్టహాసార్భటుల్
బలిమిన్ నీవు రణంబులోఁ గొలుపుబొబ్బం బోలునే మారుతీ!

మ. హిమవంతంబు మహేంద్రమున్ మలయమున్ హేమాద్రియుం జక్రిః
ళముఁ గైలాసము మందరంబును మొదల్గాఁ గల్గుశైలేంద్రముల్
సమరాభీలవిజృంభమాణవిపులోత్సాహప్రవృద్ధత్రివి
క్రమదేహోపమ తావకాంగమున నెంచం బోలునే మారుతీ!

మ. భుజగాధీశ్వరభోగిభోగనిభముల్ భూభాగధౌరేయ ది
గ్గజతుండప్రతిమానముల్ దనుజదుర్గద్వారబద్ధారర
వ్రజవృత్తార్గళరూపముల్ దివిజసాలప్రాజ్యశాఖాభముల్
త్రిజగత్స్తుత్యము లైననీభుజము లర్థిన్ గొల్చెదన్ మారుతీ!

శా. మేరున్మూలనయోగ్యశక్తియుతముల్ మిత్రాత్మజస్తుత్యముల్
వైరాన్వీతనిశాటకోటిదళనావార్యంబు లార్తార్తిసం
హారణోదారము లుజ్జ్వలత్కనకభూషాంతస్థరత్నప్రభా
పూరాపూర్ణములైన నీకరములన్ భూషించెదన్ మారుతీ!

మ. ఘనకాఠిన్యసమేతముల్ జలజరాగచ్ఛాయముల్ సాయకా
సనచక్రాంబుజశంఖమత్స్యముఖభాస్వత్సౌమ్యరేఖావళుల్
వనజాప్తాన్వయపాదపద్మయుగసేవాజాతవైదగ్ధ్యముల్
జనసంస్తుత్యములైననీదుకరముల్ వర్ణించెదన్ మారుతీ!

ఉ. రావణువక్షముం బొడిచి రాక్షసులన్ వధియించుదార్ఢ్యమున్
శ్రీవరుఁడైన రాముపదసేవ యొనర్చెడిమార్దవంబు భ
క్తావళిదైన్యదుఃఖముల నన్నిటిఁ బాపెడిభూరిశక్తియున్
తావకపాణిపద్మముల దట్టములై వసియించె మారుతీ!

మ. చటులధ్వానము భీషణాననముఁ జంచద్భూరివాలంబు వి
స్ఫుటదంష్ట్రాంకురముల్ మహోగ్రనఖముల్ సూక్ష్మావలగ్నంబు ను
ద్భటశౌర్యంబు మనోజవం బతులసత్త్వం బొప్పుచున్నట్టిమ
ర్కటసింహు న్నిను విన్న భీతిలుఁ జుమీ! రక్షస్తతు ల్మారుతీ

మ. తనకున్ శక్రుఁ డుపాయనం బొసఁగుముక్తాహార మారాముఁ డి
చ్చెను సీతాసతి కాసతీతిలకమిచ్చె న్నీకు నీవప్పు డా
ఘనహారంబు ధరించి దేవతటినీకల్లోలసందీప్తకాం
చనశైలంబువలెన్ వెలింగితివి భాస్వద్భారతీ! మారుతీ!

మ. మణిహారంబులు రత్నకుండలములున్ మాణిక్యకోటీరకం
కణముల్ కాంచనమేఖలల్ జలజరాగస్ఫారమంజీరముల్
ప్రణుతాశేషవిభూషణావళులు దీప్యచ్చేలముల్ రాఘవా
గ్రణిచేఁ గైకొని తాల్చుని న్ననుఁగొనన్ గాంక్షించెదన్ మారుతీ! 38

చ. కనకముకంటె మానికముకంటె హుతాశనుకంటె బాలసూ
ర్యునిరుచికంటెఁ బల్లవసరోరుహపల్లకపంక్తికంటె భూ
తనయునికంటె సాంధ్యజలదంబులకంటెను శోణకాంతులన్
దనరెడినీముఖాబ్జము గనన్ మది వేడుకపుట్టె మారుతీ! 39

ఉ. మండితరత్నకుండలసమంచితగండయుగంబు బాలమా
ర్తాండనిభారుణచ్ఛవియుతంబు విలోలవిశాలనేత్ర మా
ఖండలరత్నరాజదలకంబు సుధాంశునిభంబుఁ జంద్రికా
పాండురమందహాస మయి భాసిలు నీవదనంబు మారుతీ! 40

మ. కమలాప్తాన్వయమంత్రరాజపదదీక్షాస్పందదూర్ధ్వాధరో
ష్ఠము నాసాగ్రగతావలోకనము సంధ్యాకాలపంకేరుహ
క్రమయుక్తార్ధనిమీలితాక్షియుగ మారమ్యస్మితాంకూరము
త్తమతేజం బగునీముఖంబు సరి పద్మం బెట్లగున్ మారుతీ! 41

మ. భరితక్రోధవిఘూర్ణ మాననయనాబ్జాతంబు భీభత్సరౌ
ద్రరసాకీర్ణము వజ్రవజ్రనిభదంష్ట్రాదుర్నిరీక్ష్యంబు దు
ర్ధరనిర్హ్రాదభయంకరం బగుభవద్వక్త్రంబు వీక్షించి సం
గరభూభాగముఁ బాసి పర్వుదు రహో క్రవ్యాశనుల్ మారుతీ! 42

చ. అనిలునకుం గుమారుఁడ వహర్పతిసూతికిఁ బెద్దమంత్రి వం
జనకుఁ దనూభవుండవు నిశాచరవీరుల కంతకుండ వ
ర్జునునకుఁ గేతనస్థుఁడవు సూర్యకులాగ్రణికిన్ భటుండ వై
తనరెడినీకు వందన ముదంచితభక్తి నొనర్తు మారుతీ! 43

చ. భ్రమణము సేయువేళ మురభంజనుచక్రమురీతి నభ్రభా
గమునకు నెత్తువేళ లయకాలునిదండముమాడ్కి నంసదే
శమున ధరించువేళ విలసజ్జలధీశుని పాశమట్లు నీ
విమలినవాల మొప్పు బ్రతివీరభయంకర మాచు మారుతీ! 44

మ. దనుజశ్రేణికిఁ గర్ణమంత్రములు సీతాదేవికిన్ జాటువా
క్యనిరూఢుల్ రఘుభర్తకున్ విజయవాద్యధ్వానము ల్కేశవా
హిని కాహ్వానరవంబు లర్కజునకున్ హేలాస్పదంబుల్ భవ
ద్ఘనసాంగ్రామికసింహనాదము లహో ధన్యాకృతీ! మారుతీ! 45

శా. మైనాకాచలవర్యశీర్షమునకున్ మాణిక్యకోటీరమై
నానామౌనిహృదంబుజాతములకున్ మార్తాండబాలాతపం
బై నిర్ణిద్రసరోజహల్లకనిభంబై సౌమ్యరేఖావళీ
స్థానంబై తగు నీదుపాదములకున్ దండంబు లో మారుతీ! 46

ఉ. పాపములం దొలంచు బహుబంధము లూడ్చును రామభక్తికిన్
ప్రాపగు దైన్యదుఃఖములఁ బాపు సమగ్రసమస్తసంపదల్
చేపడునట్లు సేయు రణసీమ జయంబు లొసంగుఁ దావక
శ్రీపదపద్మసేవ యిఁకఁ జెప్పెడిదేమిటి వీర! మారుతీ! 47

మ. కలనం దావకముష్టిఘాత మఖిలక్రవ్యాశిరాణ్మస్తకా
వళికిం బైఁబడువజ్రపాత మిఁక నీవాలంబు దైత్యాంగక
స్థలులం జుట్టిన కాలపాశము భవత్సందర్శనంబు ల్సురా
రులకున్ యామ్యభటప్రదర్శనము లై రూఢిన్ దగున్ మారుతీ! 48

మ. యమసంబంధిగుణప్రపూర్తి నియమవ్యాపారమున్ ప్రాణసం
యమనం బక్షనిరోధమానసగతుల్ న్యాసాధ్యమున్ ధారణ
క్రమమున్ భూరిసమాధినిష్ఠయును నంగంబుల్ దగం గల్గుయో
గము భాగంబుగఁ గొన్న నిన్నుఁ గని లోకం బెన్న దే మారుతీ! 49

శా. ద్రోణాద్రీంద్రమహౌషధుల్ పెరటిమందుల్ భూరిలంకాపుర
క్షోణీచక్రము హోమకుండము దినేశుం డొజ్జధాత్రీధ్రముల్
పాణిం బూవినపుష్పగుచ్ఛములు శ్రీరాముండు జంభారిసా
పాణస్యూతకిరీటమైననిను మెచ్చన్ శక్యమే మారుతీ! 50

మ. సరసీజాప్తవిభావిభాసితనవాబ్జశ్రీలకుం దావులై
యరవిందాంకుశశంఖచక్రముఖరేఖానేకదీప్తంబులై
దురితవ్రాతమదేభమర్దనచణస్తుత్యర్హ్యసింహంబులై
తరుణప్రాయము లైననీచరణముల్ ధ్యానించెదన్ మారుతీ! 51

మ. పటుభూమీరుహగాఢ్రిపక్షములు శుంభద్బాహుశాఖాగదల్
కుటిలాకుంచితపాదచాపము నఖక్రూరాసిపుత్త్రుల్ సము
ద్భటదంష్ట్రోగ్రకుఠారముల్ పదతలప్రాసంబు లొప్పన్ విశం
కటవృత్తిన్ రణభూమిఁ ద్రుంచితివిగా క్రవ్యాదులన్ మారుతీ! 52

ఉ. పాణితలోరుతాడనము బ్రాహ్మ్యశరంబుగఁ దన్నుటన్ జగ
త్ప్రాణశిలీముఖంబులుగ దంతనికృంతన మెంచ హవ్యభు
గ్బాణము గాఁగ ముష్టిహతి పాశుపతాస్త్రము గాఁగ దానవ
శ్రేణుల యుద్ధభూమి జముఁ జేర్చి వెలింగితి వీవు మారుతీ! 53

ఉ. మౌక్తికతుల్యకల్యనఖమండలముల్ తరుణారుణాంగుళీ
యుక్తము లూర్మికాగతసమున్నతరత్న మరీచిజాలసం
యుక్తము లబ్జరాగమణిసంయుతనూపురనాదవంతముల్
రక్తరుచు ల్భవదంఘ్రులు తిరం బగుభక్తి భజింతు మారుతీ ! 54

చ. తరువులకెల్లఁ బల్లవవితానములౌచు మహేంద్రముఖ్యభూ
ధరములకెల్ల ధాతుసముదాయము లౌచు దశాస్యుప్రోలికిన్
సురుచిరవహ్నికీల లగుచున్ దగుతావకపాదదీధితుల్
మరువక మన్మనోగతతమం బణఁగించును గాక మారుతీ ! 55

ఉ. బంధుర మైనభీతిఁ గొని పర్వతకంధరడాగుతజ్జగ
ద్బంధుకుమారవర్యునకు భానుకులాగ్రణిబాంధవంబు వే
సంధిలఁ గూర్చి వాలిని విసంజ్ఞునిగాఁ బొడిపించి మించి కి
ష్కింధకు రాజుఁ జేసితివి కీర్తిఘనుండవు నీవు మారుతీ ! 56

చ. అడవులఁ గొండలం దిరిగి యాకులుఁ గాయలుఁ గోసి తించు నే
ర్పడ నదులం గొలంకుల జలంబులు గ్రోలుచు నున్న క్రోతులం
జడులను భానుజుండు గొని చక్కఁగఁ ద్రిప్పుచుఁ గార్యసిద్ధులం
బడయుట చూడ నీదు ప్రతిభామహిమంబునఁ గాదె మారుతీ ! 57

శా. సౌమిత్రిప్రబలప్రతాపశిఖిచేఁ జాకుండ సుగ్రీవునిన్
గామాంధున్ రఘునాథుపాదములవేడ్కన్ వ్రాలఁగాఁ జేసి త
త్ప్రేమాధిక్యముచేతఁ బ్రాణసహితున్ శ్రీమంతుఁ గావింపవే
నీమంత్రిత్వము వర్ణనీయము గదా నిత్యోన్నతీ ! మారుతీ ! 58

శా. నీవొక్కండవు తక్క భానుఁ డయినన్ దేవేజ్యుఁ డైనన్ మహా
దేవుం డైనను బ్రహ్మదేవుఁ డయినన్ దేవేశ్వరుం డైన సం
భావింపంబడు రామముద్రిక భరింపంజాలరాదాట నీ
ప్రావీణ్యాదులు విశ్వతోధికము లై భాసిల్లు నోమారుతీ ! 59

శా. లంకాపట్టణదుర్గపాలనసముల్లాసాన్వితన్ గీకసా
లంకారాన్విత నీలతుందిలశరీరప్రోజ్జ్వలన్ లంకిణిన్
శంకాతంకము లేక ముష్టిహతిచే శాసించి కార్యార్థి వై
పొంకం బొప్పఁగ లంకఁ జొచ్చిననినున్ భూషించెదన్ మారుతీ ! 60

మ. జలధిప్రేరితుఁ డై హిమాద్రిసుతుఁ డుత్సాహంబుతో వచ్చి నీ
జలజాతప్రతిమానపాదములు శీర్షంబందుఁ గోటీరముల్
బలె భక్తిన్ ధరియించి తత్క్షణమె జంభద్వేషికిన్ మాన్యుఁ డై
యలరెన్ నీభజనంబు రామభజనం బట్లేకదా మారుతీ ! 61

మ. గగనాధ్వంబున వార్ధిమీఁదఁ జనుజాగ్రద్గండభేరుండ దై
త్యగణాదిత్యవిమానసంఘములఛాయం బట్టి భక్షించి హే
యగుణగ్రాహిణి యైనసింహికను వజ్రాంచన్నఖశ్రేణిచే
జగమెన్నన్ వధియించునీబలము మెచ్చన్ శక్యమే మారుతీ! 62

శా. క్షోణీచక్రము దిర్దిరం దిరుగ నాస్ఫోటించి రామున్ జగ
త్ప్రాణున్ సన్నుతి చేసి భూరితనువర్ధాకుంచితం బై తగన్
బాణిద్వంద్వము సాచి భూధరముపై బాదంబులం బూనిగీ
ర్వాణాధ్వంబున వార్ధిపై నెగయు నిన్ వర్ణింతు నే మారుతీ! 63

మ. స్వతనూత్పాదిత మారుతభ్రమణముల్ భాసిల్ల శౌర్యంబు నా
ద్గతిలో మేరువు పక్షిణాళకుఁ జనంగాఁబోలు నంచున్ సుర
ప్రతతుల్ చూడ నిజాంగపింగళరుచిభ్రాజద్ఘనాళీకృతో
త్థితరుఘుంపాచయ మొప్పదాటితి వహో! యామ్యాంబుధిన్ మారుతీ! 64

ఉ. కాంచనపక్షముల్బలె స్వకాయరుచిద్ధగితాభ్రకోటి రా
ణించఁగఁ బాదసంగతఫణిప్రభువై ఖరిఁ బుచ్ఛ మొప్పఁగాఁ
జంచువు లట్లసాచినభుజంబులు మీఱఁగ వైనతేయు న
ట్లంచితశక్తితోడ లవణాంబుధి దాఁటితి వౌర మారుతీ! 65

శా. రంగద్భంగితురంగముల్ ఘనరథగ్రామంబు జీమూతమా
తంగంబు ల్మకరోగ్రవీరతతి రత్నస్వర్ణముల్ గల్గుటన్
నింగిన్ ముట్టి యెదుర్చుసింధువిభునిన్ నీకంటె నన్యుండు దా
టంగా శక్తుఁడు లేఁడటంచు నిను వేడ్కన్ మెచ్చెదన్ మారుతీ! 66

ఉ. రావణు పేరు చెప్పిన సురప్రభుఁ డైన వడంకు దుష్టస
త్త్వావిలగర్భ మైనలవణాంబుధిఁ జూచిన భీతిపుట్టు నీ
వావనరాశి దాఁటి దనుజాధిపుగేహముఁ జొచ్చి జానకీ
దేవిని గాంచి వచ్చుట మదిం దలపోసితి విట్టిసాహసం
బీవిధ మైనధైర్యము మహిం గలదే యొరునందు మారుతీ! 67

శా. ఫాలాక్షోద్భృతచాపఖండనకలాప్రౌఢిన్ విజృంభించునీ
తాలోలారుణపాణిపద్మమున నిత్యం బుండి భాస్వన్మయూ
ఖాళిం గేరెడివజ్రకాంతుల నమూల్యం బైన శ్రీముద్రికన్
గేలం బట్టినరామభక్తుని నినున్ గీర్తించెదన్ మారుతీ! 68

ఉ. రావణు నిష్కుటంబున ధరాతనయం దగఁ జూచి రాముగో
త్రావరుఁ డానవా లొసఁగురత్నమయోర్మికభక్తి నిచ్చి యా
దేవుని మంజువాక్యములఁ దెల్పి తదంబుజనేత్రిచేత మే
ల్దీవన లొందినాఁడ విక దివ్యులకైనఁ దరంబె మారుతీ! 69

చ. అతులితరామముద్రిక ధరాత్మజ కిచ్చి తదీయమౌళిసం
గతరమణీయరత్నముఁ దిరంబగుభక్తిని గొంచు రాఘవ
క్షితిపతి కింపుతో నొసఁగు కీశవరుం డితఁడంచు దేవతల్
నుతు లొనరింప నొప్పితి వసూనచరిత్రుఁడ వీవు మారుతీ! 70

ఉ. స్యందనవాజిదంతిభటసంఘసమేతు వినీలభూమిభృ
త్తుందిలదేహు సింహనిభదోర్బలు శక్రిముఖాఖిలామరా
క్రందనకారి దివ్యశరగర్వితు నక్షకు నొక్కగ్రుద్దుచే
మందఁగఁ జేసినాఁడ వతిమానము తావకశక్తి మారుతీ! 71

ఉ. రావణుమంత్రిపుత్త్రుల పరాక్రమసింహుల భూరిగర్వరో
షావిలచిత్తులన్ సమవయస్కుల ఘోరచమూసమేతులన్
బావకతుల్యశస్త్రయుతపాణుల నేడ్వుర నాహవస్థలిన్
దేవత లెన్నవాలనిహతిన్ వధియించితి వౌర మారుతీ! 72

ఉ. జంభవిరోధికిన్ హృదయశల్యము రావణువీటికిన్ జయ
స్తంభము దైత్యవాహిని కుదంచితదుర్గము సంగరక్రియా
రంభమునన్ మృగేంద్ర మన రాజిలుచున్న నరాంతకున్ సమి
త్కుంభినిఁ గూలఁజేసితివి ఘోరపదాహతి వౌర! మారుతీ! 73

చ. అశనిసమానసాయకు దవానిలసన్నిభసైన్యసంయుతున్
ప్రశమితదేవతాస్మయుఁ బ్రభంజనవేగు నృసింహవిక్రమున్
దశముఖనందనున్ విపులధైర్యవినిర్జితమందరాచలున్
ద్రిశిరుని నొంటిగ్రుద్దున వధించితి వౌర! మహాత్మ మారుతీ! 74

ఉ. రావణు నెమ్మనంబునఁ దిరంబుగ నున్నజయాశ త్రుంగ సు
గ్రీవనలాంగదద్వివిధకేసరిముఖ్యకపు ల్చెలంగ దే
వావళు లెల్ల బొంగ దివిజారిబలంబు కలంగ సాంపరా
యావని నయ్యకంపనుఁ బదాహతిఁ గూల్చితి వౌర! మారుతీ! 75

శా. శంభున్ జంభరిపున్ జయించి శమనున్ శాసించి యక్షేశు సం
రంభం బూడ్చి జలేశపావకమరుత్క్రవ్యాదచంద్రార్కులన్
శుంభద్వృత్తి జయించి మించినదశాస్యున్ ఘోరయుద్ధక్రియా
రంభం బందుఁ గఠోరముష్టిహతి మూర్ఛంబుచ్చితౌ మారుతీ! 76

శా. క్షోణీనాథుల గెల్చి యక్షతతులం జూర్ణంబు గావించి గీ
ర్వాణవ్రాతము నొంచి కింపురుషులన్ వారించి విద్యాధర
శ్రేణిం బాఱఁగఁ దోలి భోగివరులన్ శిక్షించి దైత్యాళికిన్
బ్రాణం బైననికుంభునిన్ రణములో మ్రందించితౌ మారుతీ! 77

మ. జలధుల్ రొంపి యొనర్చ శీతకరభాస్వద్బింబముల్ మ్రింగ భూ
తలమాకాశముఁ గేలఁ బట్టి కడిమిన్ దాళంబు వాయింపఁ గొం
డలు పాదంబుల గుండ సేయఁ గనునుద్యత్తేజు ధూమ్రాక్షునిన్
గలనన్ ద్రుంచిన నీకు మ్రొక్కితి ననున్ గావన్ వలెన్ మారుతీ! 78

మ. మయునిన్ శంబరు నింద్రజిత్తు నముచిన్ మారీచు వైరోచనున్
రయమొప్పన్ గెలువంగఁ జాలు కుహనారాశిన్ మహామాని వే
షయుతున్ ధీరుని గాలనేమిఁ గని వజ్రక్రూరవాలాహతిన్
లయమున్ జేసిన నీకు మ్రొక్కెద ననున్ రక్షింపుమీ మారుతీ! 79

మ. అనలాధానము సోమమున్ జయవబార్హస్పత్యముల్ వైశ్రవం
బును సౌత్రామణి రాజసూయసవనంబున్ బౌండరీకంబు నా
గనివాసంబుఁ దురంగమేధము మొదల్గాఁ గల్గుయజ్ఞంబు లె
ల్లను నీసేవకు సాటిగా వని బుధుల్ వాక్రుత్తురో మారుతీ! 80

శా. గంగన్ గౌతమి నర్మదన్ జలనిధిన్ గావేరిఁ జర్మణ్వతిన్
దుంగన్ భద్రను గండకిన్ సరయువున్ దోషాపహన్ శోణభ
ద్రన్ గాళిందిని గృష్ణ వేత్రవతి శిప్రన్ మున్గకంటెన్ భవ
న్మాంగళ్యాన్వితపాదసేవ బుధసంభావ్యం బగున్ మారుతీ! 81

మ. సుమదానంబు సువర్ణదానమును వాసోదానమున్ రౌప్యదా
నము గోదానము గేహదానమును గన్యాదానమున్ ధాన్యదా
నము భూదానము రత్నదాన మవిదానం బాదిగాఁ గల్గుదా
నములన్ జేరుఫలంబు నిన్ గొలిచినంతన్ వచ్చునో మారుతీ! 82

మ. పటువేగంబును వజ్రసారనఖముల్ భర్మప్రభాదేహ ము
ద్భటశౌర్యంబు ముకుందుజాటనుటవియస్సంభారమున్ జాలఁగ
ల్గుటకున్ నీసరి గాని భక్తులకు మేల్గూర్పంగఁ బక్షీంద్రుఁ డా
దట నిన్ బోలఁ డటంచుఁ జూచెదను మద్భావంబునన్ మారుతీ! 83

మ. ప్రణవోపేతనమఃపదంబు మొదలై పై చతుర్థ్యంతష
డ్గుణవన్నామకవాయునందను లోగిన్ గూర్పన్ ద్రివేదర్తుసం
గణనన్ వర్ణము లొప్పు మంత్రమగుచున్ గన్పట్టు దానిన్ విచ
క్షణు లెల్లన్ జపియించి కోరెదరు నీకారుణ్యమో మారుతీ! 84

మ. ఘనసేనాచరణోత్థితోరురజ మాకాశంబునన్ నిండఁ దూ
ర్యనినాదంబుల దిక్తటంబు లదరన్ రాజద్రథారూఢు డై
ధనురాద్యాయుధపాణి యై సమరగోత్రం జేరుత జ్జంబుమా
లిని లీలన్ వధియించు నిన్నుఁ బొగడన్ లేరెవ్వరున్ మారుతీ! 85

మ. కరిసింహాదులు నీరుఁ ద్రావుటకునై కాసారమున్ జేరుచో
గరిమం బట్టి వధింపుచుండెడిమహోగ్రగ్రాహిణీవ్రజబం
ధురదృప్యన్నఖకోటిచేత మకశార్దూలంబు లేడిం బలెన్
స్థిరశక్తిన్ విదళించి మించు నిను సద్భక్తిం గొల్చెదన్ మారుతీ! 86

మ. మురజిత్ప్రహ్మముఁ దాఁకి సంగరములో ముక్కాఁకలం దీరి ని
ర్జరసేనం బహుమాయ లాలములఁ బాఱందోలి శార్దూలదు
ర్ధరతేజుం డగుమాల్యవంతు ననిలో లాంగూలవిక్షేపవి
స్ఫురణన్ వారిధివైచి నాగభవనంబున్ జేర్చితో మారుతీ! 87

శా. ఖర్వాఖర్వచమూసమేతు లయి వేగన్ జిత్రసేనాదిగం
ధర్వుల్ ద్రోణనగంబుసన్నిధి నినున్ దాఁకంగ వారందఱిన్
గర్వం బొప్పఁగ వాలతాడనములన్ బాహాప్రహారంబులన్
బర్వం జేసి జయంబుఁ గొన్న నినుసంభావించెదన్ మారుతీ! 88

మ. సమరములో నిశాచరులఁ జంపుతఱిన్ లయరుద్రుపోలికన్
గ్రమమున వేదము ల్చదువు కాలమునన్ బరమేష్ఠికైవడిన్
శమయుతులైనభక్తులకు సంపద లిచ్చెడివేళ జానకీ
రమణునివైఖరిన్ జగతి రాజిలునిన్ను భజింతు మారుతీ! 89

ఉ. ధైర్యముచేత మేరుగిరి దానముచేత ఘనాఘనంబు గాం
భీర్యముచేత వారినిధి భీషణతేజముచేత సూర్యుఁడున్
స్థైర్యముచేత భూమిసతి ధర్మముచేత జముండు నుజ్జ్వల
చ్ఛౌర్యముచేతసింహమును సామ్యమువత్తురు నీకు మారుతీ! 90

ఉ. వాలము గల్గుమేరుగిరి వాక్కులఁ బల్కెడిమత్తదంతి యా
భీలము దాల్చు సింహము విచిత్రగతిన్ రణమాచరించుశా
ర్దూలము క్రోతిరూపుఁ గొనురుద్రుఁ డితండని వేల్పు లెన్నఁగా
నాలములో వెలింగి దనుజావళిఁ ద్రుంచితి వీవు మారుతీ! 91

శా. నీకున్ మాముకమంత్ర మిచ్చెదను దీనిన్ నిత్యముల్ బల్కుచోఁ
గాకుత్స్థాన్వయమంత్రరాజముగతిన్ గళ్యాణసంధాతవై
శోకంబుల్ దొలఁగించు స్వర్గమిడునంచుం జెప్పి స్వప్నంబులో
నా కామంత్ర మొసంగునిన్ను మదిలోనం గొల్చెదన్ మారుతీ! 92

మ. కదళీభూరుహషండమండితవనిం గళ్యాణగేహంబులోఁ
ద్రిదశాధీశ్వరరత్నసంఘటితవేదిన్ నిల్చి సీతాధిపున్
హృదయాబ్జంబున నుంచి సంయమిచయం బెన్నంగఁ బూజించి త
త్పదభక్తిన్ దగునీకు మ్రొక్కెద ననున్ బాలింపుమీ మారుతీ! 93

శా. లీలానిర్జితమన్మథుండ వగువర్ణిశ్రేష్ఠు నిన్నెన్నబో
నాలుంబిడ్డలు గేహముం గలిగి హేమాశన్ సమస్తావనీ
పాలవ్రాతము నాశ్రయించుజనులన్ బల్కింప నేమంచు నే
నాలోచించి వచించినాఁడ నిది నీ వాలింపుమీ మారుతీ! 94

మ. మును దాక్షాయణి కైకొనెన్ బిడప జీమూతాత్మజున్ బెండ్లియా
డెను గంగాసతి భారతం గలసెఁ గంతేకాలుఁ డవ్వేల్పు కా
ముని నిర్జించు టదెట్టిదో తెలియ దామూఢాంగజున్ బ్రహ్మచ
ర్యనిరూఢిం దగునీవు గెల్చుట యథార్థంబౌఁ జుమీ మారుతీ! 95

చ. పలుక వసత్యవాక్యములు పావనమూర్తివి బ్రహ్మచర్యని
ర్దళితమనోభవుండవు నితాంతదయామతి వాశ్రితావనో
జ్జ్వలఘనశక్తిశాలివి ప్రసన్నముఖాంబుజుఁడవుండ వైననిన్
దలచి నుతించినాఁడఁ బ్రమదంబునఁ గావుము నన్ను మారుతీ! 96

ఉ. దండము చండముష్టిహతిఖండితదానవచక్రవర్తికిన్
దండము వేదచోదితవిధానసమర్చితరామమూర్తికిన్
దండము భానుసూనుసముదంచితసైన్యచయాగ్రవర్తికిన్
దండము భర్జితాశ్రితజనప్రకరార్తికి నీకు మారుతీ! 97

చ. అరినివహంబుచేతను గదార్తులచేతను లేమిచేతఁ ద
స్కరతతిచేతఁ బన్నగపిశాచగణంబులచేత దుర్జనో
త్కరములచేత నేఁటియధికారులచేతను గల్గుబాధలన్
గురుతుగఁ బాపి బ్రోవు మిదె కోరి భజించితి నిన్ను మారుతీ! 98

చ. జయజయ హేమకూటనిభసన్నిభదేహ నిశాటవాహినీ
చయఘనగంధవాహ జవసత్వజితాంబుజబంధువాహ దు
ర్జయయుతరావణాసురపురస్థగితోజ్జ్వలహవ్యవాహ ని
ర్భయభరితోహ రామపదభక్తిసమంచితగేహ మారుతీ! 99

శా. సీతాభర్తకు మన్మనీషితములన్ జిత్తంబులో జాలి సం
జాతం బయ్యెడురీతిఁ దెల్పుచుఁ దదాజ్ఞ ముందుగాఁ బొంది కం
జాతస్ఫీతతదీయపాదయుగళీసద్భక్తియున్ ముక్తియున్
బ్రీతిన్ గూర్పఁ గదయ్య నీశరణ మర్థిన్ బొందితిన్ మారుతీ! 100

మ. హరిపాదాంబుజభక్తిసంయుతుఁడ దీవ్యజ్జ్యోతిషామ్నాయవి
ద్గురుఁడన్ గొట్కలపూఁడివంశభవుఁడన్ గోదండరామాఖ్యుఁడన్
విరతిజ్ఞానయుతుండ నన్నుఁ గరుణన్ వీక్షించి తాపత్రయ
స్ఫురణంబుల్ తొలఁగించి బ్రోవు మరుణాంభోజద్యుతీ మారుతీ! 101

మారుతీశతకము సంపూర్ణము



శ్రీరస్తు

# శ్రీవసుదేవనందనశతకము



శ్రీకలితోరువక్షు సరసీజదళాక్షు సమస్తలోకర
క్షాకరణైకదీక్షు యళికాక్షుబుభుక్షువిపక్షశిక్షు గో
పీకమనీయమందిరనవీనపయోదధిచౌర్యదక్షు ల
క్ష్మీకరసత్కటాక్షునతశీలవసూ వసుదేవనందనా. 1

ఉ. రంగదరిప్రభంగ ఖగరాజవిరాజతురంగ భక్తహృ
త్సంగ భవాంధకారసముదగ్రపతంగ సురారిపద్మమా
తంగ విదర్భజాహృదయతామరసభ్రమమాణభృంగ స
ర్వాంగ కరీంద్రతాపపరిభంగ హరీ వ... 2

ఉ. శ్రీకరుణానిధాన విధిసృష్టినిదాన ఫణోపధాన స
ల్లోకసుఖప్రదాన మునిలోకతపఃప్రణిధానభక్త ర
క్షాకరణైకతాన గతకామవితాన ఘనోజ్జ్వలత్తటి
త్ప్రాకటదివ్యపీతపరిధాన హరీ వ... 3

ఉ. యాదవవంశభూషణ నిజాశ్రితభక్తజనానురాగ ప్ర
హ్లాదవిభీషణాదికమహాజనరంజన వైరిభంజనా
శ్రీద సమస్తసద్గుణసుశీల యశఃప్రతిపాదసజ్జనా
హ్లాదకరాంతరంగ దనుజారినుతా వ... 4

ఉ. నారద శారదాధిపసనందనవందితదాసభూత బృం
దారక తారకామదనా మృదువాచన తత్త్వబోధనా
నారదశారదాబ్జముఖనాదరణాంగ విలోకయాగ కృ
ద్దారకతారకా ఖగరథా సుకథా వ... 5

ఉ. రాజధరాదిసర్వసురరాజనుతాతురమంత్రరాజ గో
రాజవిజేత రూపకపరాజితభవ్యమనోజ తేజ భూ
రాజశిరఃప్రకీర్ణమణిరాజితపాదసరోజ శౌర్యరా
రాజ దరాత్యజేయ యదురాజముఖా వ...

ఉ. రాజనిభాననా విహగరాజతురంగ దయాంతరంగ గో
రాజ నిశేశమౌళిసురరాజసరోరుహ మిత్రభీష్మ రా
డ్రాజసుతా హరీ యసురరాజభయంకర భక్తశంకరా,
రాజసహోదరీహృదయరంజన శ్రీవ...

ఉ. శ్రీకమలాసనాదిసురసేవితపాదసరోజ దివ్యవా
సా కమలాధిరాజ కలుషామయభేషజ యండజధ్వజా
శ్రీకమలాభహస్త నుతిసేయుదు నెప్డు నధోక్షజా హరీ
నాకమలామృతం బొసఁగ నారతమున్ వ... 8

ఉ. శ్రీధరభూమి వేంకటగిరి న్మదిరంజిలఁ బ్రాంతకోట నా
రాధితుఁ డౌచు శ్రీవరదరాజని పేరువహించియున్న నా
నాథుఁడ వంచు నెంచితి ననాథునిఁ బ్రోవు శమాదిపుష్ప సా
రాధనఁ జేసెదన్ వరదరాజ హరీ వ... 9

ఉ. నాకుజబాదరాయణుల నన్నయ భీమన కాళిదాసులన్
బ్రాకటభక్తిమ్రొక్కి శివభక్తునిఁ దిక్కనఁ బోతనార్యులన్
శ్రీకరవందనంబులను జిత్తమునం దలపోసి భక్తిన
స్తోకత నిన్ను గొల్చెదను సూరినుతా వ... 10

ఉ. సారసనేత్ర నీవిమలచారుచరిత్రము సేయబూని బ
ల్సారముగల్గు పద్యశతసంఖ్యను మీకు సమర్పణంబుగా
సారెకు నీదురూపగుణసన్నుతిఁ జేసెదఁ జిత్తమందు సం
సారముఁ బాపవే దయను సాంమతీ వ... 11

ఉ. ఆదిని సోమకుండు చతురాననవేదచయంబుఁ దెచ్చి యు
న్మాదిత నంబుధిం జొరఁగ మాధవ వాని ఝషంబవై సురా
హ్లాద వధించి వేదనిచయంబును బ్రహ్మకు నిచ్చినట్టి యో
వేదగవేషణామనుపవే శకు నన్ వ... 12

ఉ. సౌధభవార్థమై సురనిశాటులు కంధిని మందరాద్రిచే
సాధనఁజేయ నబ్ధి నది జారిన యోశరణార్థి కావవే
నాథ యనంగఁ గూర్మమయి నాఁడెముగా గిరిమోచి కాచి శ్రీ
నాథుఁడ వైతిగాదె బుధవంద్య హరీ వ... 13

ఉ. భూమినిఁ జంకఁబెట్టుకొనిపోయిన దైత్యుని హేమనేత్రునిన్
భీమముతోడఁ జంపి పృథివీస్థలిఁ గొమ్మున నెత్తినట్టి యో
తామరసాక్షుయాదికిటి తాపసవందిత యోమురాంతకా
కామునిఁ గన్నతండ్రి ననుఁ గావు దయన్ వ... 14

ఉ. మాధవ భీకరోగ్రపటుమాఢితయుక్త నృసింహరూప స్వ
ర్ణోదరుఁ జంపి నైజచరితోక్తులఁ బానము సేయునట్టి ప్ర
హ్లాదునిఁ గాచినట్లు శరణార్థినిఁ గావఁగదే మహాత్మ నీ
పాదము లెప్పుడున్ దలఁతు బ్రహ్మనుతా వ... 15

ఉ. ఇంద్రుని రాజ్యలక్ష్మిఁ గొని యేఁగినదానవుఁ జేరి గుజ్జవై
మంత్రశుభోక్తులం ద్రిపదమండలిదానముఁ బొంది యంతవై
సాంద్రత నిండి యాబలి రసాతలికిం బడఁద్రొక్కి రాజ్యమా
యింద్రుని కిచ్చినట్టి జగదీశ హరీ వ... 16

ఉ. ధారుణిలోన రాజుల సుదారత యిర్వదియొక్కసారి యు
ప్పార వధించి రక్తమున మాన్యత దండ్రికిఁ దర్పణంబుఁ బ
ల్మారు నొనర్చి విప్రులకు భూమిగ నిచ్చితి ధారుణిన్ మహో
దారక రేణుకాతనయ దండమయా వ... 17

ఉ. తాటకఁ గూల్చి శంకరునిధర్మముఁ ద్రుంచి ధరాసుతాకళా
పాటవ మొంది యింద్రిజుని భండనమందు వధించి వానల
ల్కోటులుగూడ రావణు సకూటముఁ జంపినరామ బ్రోవు నీ
చాటునఁ గింకరుండ నను శౌరి హరీ వ... 18

ఉ. రాముఁ డనంగఁ బుట్టి ధర రాక్షసులం బడఁగొట్టి యాత్రతో
నైమిశముం జొరంగ మునినాథులు సూతుఁడు దక్కలేవఁగా
నేమము నాకమున్నతని నిం కెఱఁజావడువన్ బ్రబోధచేఁ
బ్రేమను జీవిఁ జేయవె హరీ ముసలీ వ... 19

ఉ. దానవకోటులం దునిమి దానవవైరుల నాదరించి యా
శానునకున్ సుతీవ్రతరసాయకమై మఱి మూఁడులోకముల్
పూనికతోడ మోహమును బూర్ణముఁ జేసిన బుద్ధమూర్తి యో
మానధనాఢ్య యేలు నను మన్ననతో వ... 20

ఉ. అశ్వముఖుండవై జనులయజ్ఞతఁ బాపి మహావిభూతివై
శశ్వదమోఘుమై విబుధసౌఖ్యదమై శ్రితసేవ్యమై మహా
శాశ్వతమైనజ్ఞానమును స్థాపనఁ జేసిన కల్కిమూర్తి యో
విశ్వధరా ననున్ మనుపవే కృపణున్ వసుదేవనందనా! 21

ఉ. యాదవవర్య మీన ధుని యజ్ఞవరాహనృసింహవైదుషీ
వేదనిరూఢవర్ణి భృగువీర నరాధిపరామ బుద్ధ సా
మోదవిశిష్ట కల్కిభవముల్ ధరియించిన బాలకృష్ణ నీ
పాదుకవాహుఁడన్ మనుపు భర్గసుతా వ... 22

ఉ. సంగరమందుఁ బుణ్యజనసంఘముకోడి సుర ల్మహోత్సు ఖ
ట్వాంగునిఁగూడి మోములను వాని విరోధులు బాఱఁబోరి యా
సంగడికాని కాయువును సార్థతఁ దెల్ప ముహూర్తమందు ని
స్సంగత ముక్తిఁ గాంచెఁ బ్రజ్ఞానమునన్ వ... 23

ఉ. గోపకులంబునందు మదిఁ గోరికదీరఁగ నుద్భవించి యా
గోపవరాంగనామణులకోరికఁ దీర్చినముద్దుకృష్ణ యో
గోపకులాబ్ధిచంద్ర నను గూర్మినిఁ జేరఁగదీసి యేలుమా
కాపరివంచునమ్మితిని గావఁగదే వ... 24

ఉ. ఆసురభామఁ బూతన జనాంతకగంసుఁడు పంపనం దన
ద్వాసురగేహమందుఁ దనపాలచనుంగుడిపింప దానిమాం
సాసువులన్నియుం గుడిచి యాసురి వేగమె జంపినట్టి యో
శ్రీసనకాదివందిత విరించినుతా వ... 25

ఉ. మూఁడునెలల్ చనంగ మఱి మోదముచేతఁ దృణాచరాఖ్యునిం
గాడుపుసూపునిన్ గగనగామినివై వధియించి యుయ్యెలం
గూడినప్రోడ నీమహిమగుంఫనమెన్న నరంబె యేరికిన్
నేఁడిదెదండమయ్య కరుణింపఁగదే వసుదేవనందనా. 26

ఉ. పిన్నతనంబునందు మఱివీధులనాడుచునుండ నమ్మతో
మన్ను దినెన్ జనార్దనుఁడు మాధవుఁడంచు వచింప నర్భకుల్,
మన్ను నదేలతింటి విటు మాధవయన్న చరాచరాండ సం
పన్నజగంబుఁ జూపవె స్వవక్త్రమునన్ వ... 27

ఉ. గోపులఁగూడి కానలను గోవుల మేపుచునుండ బ్రహ్మ యా
గోపులగోవులన్ మఱుఁగఁగూర్చిన తత్క్షణమందు నీవ యా
రూపము లెల్లఁదాల్చిమునుగూఢినటింపఁగ నీపదార్తికిన్
దాపురమిచ్చి మ్రొక్కి చనె ధాత హరీ వ... 28

ఉ. కొండికనాఁడు గోపకులఁగూడి వనంబుల నాలమేపుచున్
గండనిఁ గాళియోరగుని గండఱఁ గాండమునందు దూక నీ
దుండగ మవ్వకుం దెలిపి తోడ్కొనిరా ఫణిఁ ద్రొక్కి యంతఁ గ
న్పండువుగాఁ గనంబడవె భవ్యగుణా వ... 29

ఉ. కాననమందు గోపకులు గంజనఁ కేతుఁణ కారుచిచ్చుచేఁ
ప్రాణములన్ నుదిన్‌విడచి రావముతోడఁ గృపాబ్ధి కావవే,
దీనులమంచు వేడఁ బటుతీవ్రగతిన్ శిఖ మ్రింగినట్టి యో
దీనశరాయణా మనుపుదీనుఁడనో వ... 30

ఉ. పల్లవకాంతలెల్ల మునువస్త్రచయంబును విప్పిపెట్టి సం
ఫుల్లసరోజవాహిని సుమోహముతో జలకేళులాడ నా
గొల్లలపట్టముల్ నగుచుఁ గొంచుకపో మఱివారు వేఁడ నీ
వుల్లసమాడి యీవె పురుషోత్తమ యో వ... 31

ఉ. మానవజన్మమెత్తి యతిమాయల బాలురఁగూడి ప్రీతితోఁ
గానలయందు గోవులను గాచుచు వారికి లీలఁజూపుచున్
మానుగ విప్రభార్యలకు మాన్యత మోక్షమొసంగినట్టి యో
దీనశరణ్య యేలుము సుధీవినుతా వ... 32

ఉ. వాసవుఁ డల్గి గోపకులపై మఱిరాళులవానగుర్వ నా
యాసముగల్గి గోపహితయాదవులందఱు నిన్ను వేఁడ నా
యాసములేక కొండను రయంబునఁ గేల నమర్చి గొల్లలు
ల్లాసమువొందఁ బ్రోచితి విలాసముఖా వ... 33

ఉ. నందుఁడు సార్ధరాత్రి యమునానదికింజని స్నానమాడ నా
నందుని దైత్యులు స్వగుణనాథునిసన్నిధిఁ జేర్చ నీవు సా
నందముతోడఁ బోవ మఱి యాతఁడు బూజలొనర్చఁ దృప్తుఁడై
నందుని దోడితెచ్చితివి నాథ హరీ వ... 34

ఉ. నీలపయోధరం బనఁగ నీతనువొప్పగు నందునిందు నిన్
బోలెడునీదు మోము నలమూసినకల్వల గండ్లఁజూడ గో
బాలురు వారలు నమునిబాల్పుడకం గళలూని నిల్పి వే
యేలిననాదుతండ్రి హరి యీశ్వర యో వ... 35

ఉ. దుర్మతియైనకంసుఁడు వధూగురుబాలవినాశకృత్యముల్
పేర్మినిజేయువాని హరి భీకరనాగముబోలెఁ జంపి త
చ్ఛర్మను భూమిఁ దాతకిడి సౌఖ్యముచేసిన చిన్నికృష్ణయో
నర్మకమంగహాస నినునమ్మితి శ్రీ వ... 36

ఉ. శ్రీపతి నీవు రాముఁడును శిష్యకుచేలసమేతుఁడై నసాం
దీపునియొద్ద శాస్త్రసమితిన్ సుమతిన్ గణుతించి నేర్చి వి
జ్ఞాపితులైనభంగి ననుజ్ఞానకళాపరిపూర్ణుఁ జేయవే
శ్రీపృథివీపతీ వరదశిష్యుఁడ నో వ... 37

ఉ. తాపవిదూరమున్ గురువు తన్మృతపుత్రుసజీవిఁజేసి సం
తాపముదీఱఁ దెచ్చి గురుదక్షిణనిచ్చినవల్లెయంచు నా
పాపనిఁ గంధి దైత్యయమపట్టణముల్ చని రోసి తెచ్చి సాం
దీపునకిచ్చిమ్రొక్కినసుధీర భళీ వ... 38

ఉ. నారదచోదితోగ్రయవనప్రభుదాడి బుధిన్మసుంగని
పౌరులద్వారకం బనిచి పాఱుచుఁ దోఁకొనివాని భూమిభృ
ద్ఘోరగుహన్ సనిద్రి ముచికుందునిచేఁ జెడఁజూచి యాబుధో
ద్ధారున కీవెముక్తి విబుధస్తుత యో వ... 39

ఉ. బాలవయస్సునందు నినుఁబాయక నందునిచెల్లెలిచ్చతోఁ
బాలనఁజేసి పెంచి పరిపక్వవయస్సున నిన్నుఁజూచి గో
పాలకనన్నుఁ బొందుమనఁ బాలనఁజేసితి రాధికాసతిన్
లోలతతోజనార్దన త్రిలోకనుతా వ... 40

ఉ. పన్నగవైరి యింద్రునిసభాసదులందఱగెల్చి యాసుధన్
గొన్నవిధాన భూపతులకోటులగెల్చి రమాలలామఁగై
కొన్నమహానుభావ ననుఁగూరిమితోఁ గృపఁజూడుమయ్య యాఁ
పన్నుఁడనయ్య దీనజనపాల హరీ వ... 41

ఉ. ఏమనివిన్నవింతు నిఁకనేమిదలంచెద నీమహత్త్వమున్
బామరు లాడునింద విని పాపుకొనన్ గుహఁజొచ్చి బన్మి భా
మామణియున్ శమంతకము మానుగఁదెచ్చినయట్టికృష్ణ యో
త్తామరసేవ్య కైకొనవె జాంబవతిన్ వ... 42

ఉ. దేవజగన్నివాస జగతీధవ దూరితినంచు భీతితోఁ
గావుమటంచు నిన్నుజుఁడు గానుకనిచ్చెను సత్యభామ నీ
వావనితన్ గ్రహించి మఱి యాతనిఁ గాచినభంగి కావు మో
పావనమూర్తి యోపతితపావన నన్ వ... 43

ఉ. ఇందునిభాననా నురల నింపుగఁ బ్రోచినప్రోడ దేవకీ
నందన గోపికాహృదయనందన లక్ష్మణ భానుపుత్రిఁ గా
ళిందినిఁ బెండ్లియాడి మురళీప్రియగానముఁ జేసితౌర గో
విందన మోయటంచు నిను వేడెద శ్రీ వ... 44

ఉ. రాధకు నల్లుఁడై యిలను రమ్యముతోడ వివాహమొంది యా
యాదవవంశమెల్ల భువి ఖ్యాతిగఁజేసిన చిన్నికృష్ణ యో
మాధవ కేశవాయసురమల్లురఁగూల్చిన నిన్నుగొల్తు నీ
పాదములన్ మదిన్ దలఁతుఁ బార్థనుతా వ... 45

ఉ. నారదమౌని దివ్యకుసుమంబు సమర్పణఁజేయ రుక్మిణీ
నారికి నీయఁగా నతఁడు నవ్వుచు భామకుఁ దెల్ప సత్య హృ
ద్రోహుఁడ వైతివా యనుచు దూరిన నాకుల నొడ్డి పారిజం
బూరఁట దెచ్చియీవె శ్రుతిసూక్త హరీ వ... 46

ఉ. దానవరాజపుత్త్రి వనితామణి దెల్పఁగఁ జిత్రరేఖయున్
మానినిఁ గూడియున్న సుకుమారుని నెత్తుకపోయి యాయుషా
మానినికిచ్చె నాతియును మారుని కేళిని గూడియుండఁగా
బాణుఁడు కోపగించుకొని బాలుని ద్రాడునఁ గట్టివైవ నా
దానవు బాహులుం దునిమి దైత్యుల శంకరుఁ గెల్చి తెచ్చితో
మానినినిం గుమారకుని మాధవ శ్రీ వ... 47

ఉ. ఈవసుధన్ మహంబునను నీశుఁడ నేనని క్రూరభావలన్
నీవలె చిహ్నములూనిన యనీతునిఁ బౌండ్రకవాసుదేవునిన్
గావరమొల్లఁ బోనణఁచి కయ్యము నన్వధియించినట్టి యో
దేవర నన్నుఁ బ్రోవవు గదే తగదే వ... 48

ఉ. నారదుఁ డొక్కనాఁడు నళినాక్ష త్వదీయసువర్తనార్థమై
ద్వారకకుం జనంగ సురతన్ జరియించి పదారువేలగో
నాములతో సమాఖ్యతను నైజసుచాతురిఁ జేసినట్టి నీ
చారువిలాసముల్ నుడువ శక్తుఁడనే వ... 49

ఉ. శ్రీపతి మున్ను ధర్మజుఁడు చిత్తమునం దలపోయ వేగ నా
భూపతి రాజసూయమును బూర్ణముగాఁగ నొనర్చి ధర్మపృ
థ్వీపతి సేయుపూజఁ గొని ధీరత సంతసమందినట్టి భ
ద్రాపతి బ్రోవుమా ద్యుమణిధామ హరీ వ... 50

ఉ. నీవును భీమపార్థులును నెమ్మది భూసురవేషమూని యా
భూవిభునాజ్ఞచే మగధభూవిభునిన్ రణభిక్ష వేఁడి యా
కావరపోతు మాగధునిఁ గయ్యమునన్ వధియింపఁజేసితో
దేవదయానిధీ గుణనిధీ మృదుధీ వ... 51

ఉ. మానధనుండు ధర్మజుఁడు మాన్యతఁ జేసిన రాజసూయమున్
బూనికఁ దీర్చి భీష్మకురుపుంగవులంతయు జూచుచుండఁగా
మానవనాథుఁడైన శిశుపాలునిఁ జంపిన యట్టిజెట్టి యో
దానరణప్రవీణ గుణధామ హరీ వ... 52

ఉ. పాండవమధ్యముండు నినుఁ బ్రార్థనఁ జేసిన సూతుఁడై మఱిన్
ఖాండవముం దహింప ఘనగాండివచాపము వహ్నియీయ నా

ఖండలు గర్వముం జెఱచి కయ్యమునన్ విజయంబు నిచ్చితో
చండతరప్రకాశ గుణశాలి హరీ వ... 53

ఉ. బాలసుహృత్కుచేలునికి భాగ్యములిచ్చితివంచుఁ గుబ్జకున్
లాలనఁజేసి రూపము విలాసముఁ జేసితివంచు ధర్మజుం
బాలనఁజేసి రాజ్యవిభవంబుల నిచ్చితివంచు రుక్మిణీ
లోల నుతింతు నిన్ను మదిలో నెపుడున్ వ... 54

ఉ. పన్నగశాయి నీవు మును పార్థుఁడు యాత్రకు వెళ్లివచ్చినం
దిన్నఁగ ద్వారకన్ నిలిపి తెంపునఁ జెల్లెలి నిచ్చిపంప నీ
యన్న హలాయుధుండు విని హాయని యోర్వక కోపగించినన్
మన్ననఁ జేసితౌర మతిమంత భళీ వ... 55

ఉ. శంభువరంబుఁ బొందియు నృశంసతఁ దచ్చిరమున్ స్పృశేష్టసం
రంభు వృకాసురున్ నిజకరంబుల స్నాతనుజేయఁ గూల నా
శంభుని ప్రాణముల్ నిలిపి సన్నుతికెక్కిన కృష్ణ దేవకీ
డింభక కావు కాంచనపటీసుకటీ వ... 56

ఉ. భూరమణుండు ధర్మజుఁడు వొమ్మన హస్తిపురంబుఁ జయ్యనం
జేరి ముదంబునంది కలసేమములారసి బు జెప్పినన్
గౌరవనాథుఁడున్ వినక క్రౌర్యముఁ జూపఁగ విశ్వరూపమున్
వారికిఁ జూపినట్టి భగవంత హరీ వ... 57

ఉ. కౌరవరాజధానికిని గార్యముసంఘటనంబు సేయధీ
సారుఁడు భక్తుఁడౌ విదురుసద్మముఁ జేరి భుజించి ప్రేమతోఁ
గోరినగోర్కెలిచ్చితి వకుంఠితచిత్తము నీకు నిచ్చితిన్
సైరణనేమియిత్తువో వశంకర యో వ... 58

ఉ. నీరజనాభ నిన్ను మును నెయ్యముతోడ ధనంజయుండు వే
సారి రణంబులోఁ దనకు సారథి గావలెనంచు వేఁడఁగా
సారథివై కిరీటికిని జాతురిఁ జూపిన పార్థసారథీ
నీరుచిరాంఘ్రిపాళి నను నిల్పఁగదే వ... 59

ఉ. పార్థుఁడు దొల్లి యుద్ధమున స్వాంతవిషాదముఁ జెంద మోహతా
నర్థముఁ బాప యోగగతి నంతయుఁ దెల్పి సువిశ్వరూపముం
బ్రార్థనఁ జేయఁ జూపిన మహాత్మ గురుండని గొల్తు సర్వదా
యర్థినిఁ బ్రోవు శిష్యసుజనార్తిహరా వ... 60

ఉ. వారిజబాంధవుం డపరవారిధిఁ గ్రుంకకమున్న సైంధవుం
జేరి శిరంబుఁ ద్రుంతునని చేసె ప్రతిజ్ఞ ధనంజయుండు నీ

వారవిబింబమున్ మఱియవారితచక్రముగప్పి సైంధవుం
జేరి వధింపఁజేసితివి శీఘ్రమునన్ వ... 61

ఉ. కౌరవకోటినెల్ల నతికౌశలమొప్ప వధింపఁజేసి యా
కౌరవరాజ్యమిచ్చితివిగా కరుణించి యజాతవైరికిన్
గౌరవమైనకీర్తి జయగణ్యత గాండివికిచ్చినట్టి యో
శౌరి దయాపయోధి గుణశాలి హరీ వ... 62

ఉ. ద్రౌణి యపాండవంబుగను బ్రహ్మశిరంబను నస్త్రమేయఁగాఁ
బ్రాణభయంబుగాఁ గవియ బాండవరక్షణఁజేసియున్ గదా
పాణివియై తదస్త్రపరిబాధితు నార్తుని నుత్తరోదరుం
ద్రాణనఁ జేసినట్టి సువిధాన హరీ వ... 63

ఉ. భాసురసూనుకై పతితపావను నీశు సమాధినుండ ఘం
టాసురుఁడీశుఁగొల్చి యమృతార్థము వేఁడఁగఁ గృష్ణుఁ డీగలం
డా సనుఁ గోరుమన్న నిను నార్తిస్మరింపుచుఁ గాంచి యర్చతో
భూసురప్రేతమీాయ నగి భూతపతి న్నవ్రశుఁజేసి సాత్వికా
భ్యాసము ముక్తినిచ్చిన దయాంబునిధీ వ... 64

ఉ. దేవతలన్ రిపుల్ గెలువ దీనతతో నినువేఁడ వారికిన్
దావకవర్మమంత్రమును దథ్యముగా నెఱిఁగించి యంతఁ బ్రా
గ్దేవగణంబుఁ బోరునవధింపఁగఁజేసిన దివ్యమూర్తి నీ
సేవకసేవకుండఁ బ్రియశిష్యుఁడ నో వ... 65

ఉ. కాండములన్నియున్ స్వజఠరాంతరమందు ధరించుజెట్టి యీ
పిండమునందు జీవతను బేర్మివహించి పిపీలికాదికా
ఖండలదేహము ల్భలితకాంతులఁజేసి రమించుప్రోడ యో
ఖండితదానవా జడుఁడఁ గావఁగదే వ... 66

ఉ. దేహావరత్రయంబునను దృశ్యపదార్థసమూహముల్మహో
మోహతనూర్ణనాభిక్రియ మోదముచే సృజియించి బద్ధుఁడో
దేహివిగాఁ గనంబడుచుఁ దీక్ష్ణతమంబును జేయు నీశ నన్
దేహవిహీనుఁజేయవె సుధీరనుతా వ... 67

ఉ. సారసనాభ దుర్మల మసారకుదుఃఖమయస్వరూపసం
సారపయోధి నుత్కటరసక్రిమిజాలగతాగతాదిసం
చారముపోలె భ్రాంతిలయజన్మములందుదురయ్య నిర్ద్వయా
కార పరాత్మ నీదు విముఖత్వమునన్ వ... 68

ఉ. ఉద్ధవుఁడేఁగుదెంచి మఱియొక్కతఱిన్ సఖయంచు వేఁడ శ్రీ
బుద్ధసుమార్గముం దెలిపి బూరికృపం గరుణింపలేదె నా
బద్ధతఁబోవఁద్రోచి నను బాలనఁజేయఁగదే పరాత్మ యా
యుద్ధవునూడ్కి బ్రోవు మొడయుండవుగా వ... 69

ఉ. శ్రీవిధివందనా వరద సేవిత యోగ్యుఁడవంచు నెంచి నా
యావరణాదులన్నియును నావలఁ ద్రోచి త్వదీయరూపునన్
భావము నిల్పినాఁడ భవబంధముఁ బోవఁగజేసి వేగ మే
యేవిధిఁబ్రోతువో యభవ యిత్తఱి నన్ వ... 70

ఉ. కాలునికింకరుల్మఱి సకల్మషచిత్తవిధేయుఁడైన నా
పాలికివచ్చి దుఃఖమయబాధలు వెట్టెదరంచు నిప్పుడే
యేలికవైన నీభజన నింపుగఁజేసెదనయ్య యయ్య నీ
బాలుఁడనయ్య వేఁడెదను బార్థసఖా వ... 71

ఉ. బాలురతప్పులన్ గురుఁడు బాలనఁజేసినభంగి నాదు పా
పాళిని బాఱఁదోలి కృపఁ బాలనఁజేయఁగదే మహాకృపా
శాలివటంచు నెంచి నిజసౌధరసోపమదివ్యనామముల్
గ్రోలితి దైత్యఖండన త్రిలోకనుతా వ... 72

ఉ. పావనమైన మీకథలు భాగవతుల్పఠియించుచుండ బల్
పావనమూర్తి వంచు నినుఁ బల్మఱుఁ జిత్తమునందుఁ గొల్చెదన్
శ్రీవర నాదు జన్మమున సిద్ధి వహింపఁగఁజేయ మ్రొక్కెదన్
గావఁగదయ్య యీశ విభు కంసహరా వ... 73

ఉ. సుందరమైన నీభజన శోభను గాంచ సుశక్తిలేనివా
రందఱు జన్మదుఃఖనిచయాంబుధియందు నిమగ్నులౌచు నెం
దెందు సుమార్గులేగద సురేశ్వర దాసుఁడఁ బ్రోవు నన్ గృపా
కంధినితాంతశాంత నరకాంతక యో వ... 74

ఉ. నాగధరాదిదేవతలు నారదపర్వత దివ్యమౌనులున్
యాగముసేయుకర్మఠులు వ్యాసముఖార్య మహానుభావులున్
యోగిశిఖామణుల్సనకవు లూహఁగలంగి భవత్పదాబ్జసం
యోగముఁజెందలేరు శుకయోగినుతా వ... 75

ఉ. అజ్ఞుఁడ మూఢుఁడన్ జడుఁడ సద్విహీనుఁడ దుష్టచిత్తుఁడన్
బ్రాజ్ఞత లేనివాఁడ బహురాగవశీకరుఁడన్ శఠుండఁ గాని
ర్వజ్ఞుఁడనన్ భవద్భజనరక్తుని జేసి యిఁకైనఁబ్రోవు స
ర్వజ్ఞ కృపాసముద్ర భవభంజన యో వ... 76

ఉ. శ్రీరమణీమనోరమణ శ్రీహరి కృష్ణమదీయపాపముల్
బారఁగఁదోలి నాదునుది వ్రాయకయుండెనవంచు నిన్ను నే
సారితిఁ గావవే దయను సంస్తుతిఁ జేసెదనయ్య వేగమే
భూరిదయానిధీ సుగుణపూజిత యో వ... 77

ఉ. సారసనాభ యార్యజనసన్నుత నీపదసేవఁ జేసెదన్
గోరినకోర్కులిచ్చి ననుగొబ్బున నేలుము సేతుఁ జేసిసన్
గౌరవమైన నీమహిమకౌశలమెల్ల హరించుఁ గాన నే
మారకుమా యశస్సువినుమా కనుమా వ... 78

ఉ. లోకములెల్ల నీకడుపులోన జనించె నటంచు ధీయుతుల్
శ్రీకమలాసనాదిమునిసేవ్యులు సన్నుతి సెక్కలేదె ము
న్నీకమనీయరూపమును నిల్పి మనంబునఁ గాదె దేవ యే
కాకిని నన్ను నేలి దయఁ గావఁగదే వ .. 79

ఉ. చేసితినయ్య పాపములు సేసితిఁ బెద్దలనెల్ల హాస్యము
ల్జేసితి నన్యభామలను జేరి సుఖించినవారిపొందు నేఁ
జేసితి నన్నియు న్మఱచి చిక్కులు పెట్టకుమయ్యయయ్య నీ
దాసుఁడనయ్య యార్తజనతాపహరా వ... 80

ఉ. పాపము లెన్నిఁ జేసితినో పంకజహాక్ష మదీయచిత్తము
న్నీపదయుగ్మమందునికి నిల్వదు కర్మవశంబునన్ మహా
పాపములందుఁ జొచ్చు నికఁ బాలనఁ జేయఁగదే మహాత్మ నా
పాపము లెంచకోవరద భక్తనుతా వ... 81

ఉ. ఆదర మొప్ప మ్రొక్కెదగదాగ్రజ సంసృతిఘోరసాగరం
బీఁదఁగ లేక విశ్రమవిహీనతఁ జెందెనయ్య యీవృథా
వాదములఁ జేసనయ్య యతిపామరుఁడయ్య శరణ్యుఁడయ్య యం
భోదనిభా భయం బుడిపి బ్రోవఁగదే వ... 82

ఉ. శంకలనన్నియు న్విడచి శంకరనాథుగ నన్యదేవతల్
పొంకముతోడఁ బోవిడచి పొందుగ నీభజనంబు సేతు నా
వంకకువచ్చి యూరటలు వంచనలేకవచించి బ్రోవు నీ
కింకరుఁడయ్య దండమిదె కృష్ణహరీ వ... 83

ఉ. ధాతవటంచు నీవిమలతారకమంత్రము సర్వలోక వి
ఖ్యాతమటంచు నెంచి వినయంబున జోతలుసేసి యెప్పుడున్
ధాతను గన్నతండ్రి నిను ధ్యానము సేసెదఁ గృష్ణ వేగమే
యాతతి నేలుమాదయను నీశ్వర యో వ... 84

ఉ. ఓపరమాత్మ యోవరద యోకమలాసనవంద్యపాద గౌ
రీపతి బాదరాయణ కరిప్రముఖస్తుతదివ్యనామ ల
క్ష్మీపతియంచు భక్తులకు క్షేమము నిచ్చెదవంచు వేఁడెదన్
బాపుఁడ నీదుభక్తుఁడను బాపహరా వసుదేవనందనా. 85

ఉ. ఏగతిఁ జేరవచ్చు మది నెప్పుడుజూతును నీవిలాసమున్
రాగము ద్వేషమెప్పుడు హరంబగునెప్పుడు మోహలోభముల్
రోగము వాసిపోవునను రోయక బాయక బ్రోవుమయ్య నీ
వే గతివంచు నమ్మితిని వేగమె రా వ... 86

ఉ. ఎన్నిభవంబు లొందితినో యెన్ని ప్రతాపము లొందినాఁడనో
సన్నుతికెక్కునీభజనసౌఖ్యము నిప్పుడు కాంచినాఁడ నా
యన్న క్షమింపుమన్న శరణాగతుఁడన్న ననుం గృపన్ సదా
మన్ననఁ జేయుమన్న హరి మాధవ యో వ... 87

ఉ. శ్యామలవర్ణ నాదుమదిసత్వముతో నినుఁబూజజేసెదన్,
గోమలమైన మీపదముఁ గోరి సదా భజియించుచుండెదన్
దామరసాక్ష నీవిమల తారకమంత్రమునిచ్చి వేగ ని
ష్కామునిఁజేయుమా త్వరితకాలమునన్ వ... 88

ఉ. నెట్టితి వైరివర్గముల నేర్చిన మీగుణవర్ణనంబు చే
పట్టితి యుష్మదంఘ్రి గురువర్యుఁడవంచుఁ ద్వదర్చనాన్యమున్
మెట్టితి వేదశాస్త్రవిధి నేర్పరినై భవదన్యమార్గముల్
గొట్టితిఁ గావుమావరద గొబ్బున నన్ వ... 89

ఉ. కర్మము లెన్ని జేసినను కంజదళాక్షవికారదూరమై
శర్మదమైన మీస్మరణ జాలుముదంబునఁ జేయునట్టి దు
ష్కర్మతుఁడైన సద్గతినిఁ గాంచునటంచ్రు త్వదంఘ్రియుక్తుఁడేఁ
గర్మవిభేదసద్గతిని గాంచఁడొకో వ... 90

ఉ. వారిజలోచనా వినుము వారణమున్ గృపఁ గానలేదె పా
కారిసురాదులం గృపను గావఁగలేదె భయంబుఁబాపి వే
మారుభజించుభక్తుఁడను మన్ననఁ బోషణఁ జేయరాదె నన్
శౌరి కృపానిధీ ప్రబలశౌర్యహారీ వ... 91

ఉ. శ్రీధవ మున్ను నీకృపఁ గరిప్రభు ద్రౌపది వాయసాధమున్
యోధవిభీషణున్ శబరి యోగికుచేలుని భీష్మపార్థులన్
మాధవ నారదాదిమునిమాన్యులఁ బ్రోచినపుణ్యమూర్తి న
న్నీధరఁ బ్రోవుమా కరుణ నీశ హరీ వ... 92

ఉ. భూమి ననేకజన్మముల బూనితి నోర్వను జన్మమెత్తనీ
నామకథాసుధారసము నాలుకఁ గ్రోలితి సేవఁ జేసితిన్
వేయుఱు వేఁడికొంటి నను వేసనఁ బెట్టకుమంటి నీయవే
ప్రేమను నిత్యమైనపదవిన్ గృపతో వ... 93

ఉ. దోషము పేరి యుగ్మతకుఁ దోయజనేత్ర త్వదంఘ్రిభక్తి సి
ద్ధాషధమున్ భుజింపఁగ నిరామయ దివ్యపదంబు నొంది సం
తోషము జెందితిన్ మనుష్యు తొందరఁ బెట్టకుమయ్య పాప ని
శ్శేషతఁ జేయుమయ్య నిజసేవకుఁడన్ వ... 94

ఉ. భుక్తియు భక్తియున్ మఱియు భూరికటాక్షముచేత ముక్తియున్
శక్తుఁడవంచు నిచ్చుటకు శైశవకాలమునుండి కొల్తు నా
రిక్తతఁ బాఱఁదోలి బహురిద్ధునిఁ జేసి యిఁకైన బ్రోవవే
భక్త మనోభిలాషద శివస్తుత శ్రీవ... 95

ఉ. ఏలర జాగుఁ జేసెద వదేలర నీవు కృపారసంబుతో
నేలవె మూడులోకముల నేలవె యార్యుల గోపబాలురన్
బాలుఁడ నీకు మ్రొక్కెదను బాగుగ బ్రోవవె గోపకామినీ
లోల హరీ యటంచు మదిలోఁ దలఁతున్ వ... 96

ఉ. రార గమావినోద వినరా సుగుణాకర కోటిమన్మథా
కార సురేంద్రవంద్య యరిఘాతుక పాండుసుతోపకార రా
రా రవికోటిధామ రణరంగభయంకర గోపికాన్వయో
ద్ధారక నన్ను నేలుమి యుదారమతిన్ వ... 97

ఉ. కుంజరు నేలి కుంజరునిఁ గూలిచి వానరు నేలి వానరున్
భంజనఁ జేసి యండజునిబండియు నండజుఁ జెండియున్ ధరన్
రంజనఁ జేసియున్ ధరను రాళులవానకుఁ గేలనెత్తియున్
సంజయు నేలినట్టి గుణసాంద్ర హరీ వ... 98

ఉ. ఎన్నిక లెన్న నంటి మఱియెగ్గు లసత్యము లాడనంటి సం
పన్నత లేకటంటి పరభామలపొందులఁ గూడనంటి యా
పన్నుఁడనంటి నీవిమలపాదుకసేవను జేసెదంటి నే
నెన్నివచించినన్ గరుణనేల వహో వ... 99

ఉ. అండజకాండుఁ డార్తసుజనార్తివిఖండుఁ డరిప్రఖండకో
దండకళాప్రచండగసుదర్శనవర్తికిఁ గృష్ణమూర్తికిన్
రెండవసాటిదేవుఁ డిఁక లేఁడనిసాటెద భద్రనెక్కి బ్ర
ద్ధండడఘాండఘాండ నినదంబుల శ్రీవ... 100

ఉ. పూనికతోడఁ జేసితిని పూర్తిగ నుత్పలవృత్తమాలికన్
దీనిధరించి నాదుమది దీనతఁబాపి విముక్తినీయవే,
దీనదయాళు కృష్ణ జగతీధవమాధవయంచు వేఁడెద
న్మానకనారదాది మునిసన్నుత శ్రీవ... 101

ఉ. శ్రీలలితంబునైన కృపచేఁ గరుణింపుము శీలమైన వె
ల్లాలసగోత్రజాతుల విలాసముతోడ మదీయవంశముం
బాలనఁజేసి తద్భవుల బంధువులన్ దిలకించి బ్రోవుమా
శ్రీలలనామనోంబుజవశీకరణా వ... 102

ఉ. శ్రీరమణీయమైన కృపచేతను బ్రోవుడు నాదుమిత్రులన్
వారిని వారివారి మఱివారిని జేరినవారి నెప్పుడున్
భూరివివేకసంపదసపుణ్యసముక్తులఁజేసి యేలుమా
భూరిగుణాఢ్య వేఁడెదను పూజ్యపదా వ... 103

ఉ. ఆగమవేద్య దీనసుజనాశ్రిత మన్నవ లక్ష్మణార్యవి
ద్యాగురువర్యశిష్యుఁడ గదాగ్రజ సుబ్బమయాదినార్లకున్
శ్రీగుణశీలపుత్రుఁడను శ్రీధవ రంగయనామధేయుఁడన్
బాగుగఁ గొల్చెదన్ మనుపు భర్గనుతా వ... 104

ఉ. శ్రీపతి నీకు వందనము శ్రీలలనామణియైన లక్ష్మికిన్
గోపసతీలలామలకు గొబ్బున మ్రొక్కులు దాసదాసుఁడన్
నాపతివంచు నమ్మితిని నామదివాంఛలుదీర్చి కావుమా
పాపినటంచు నెంచకు మపారకృపా వ... 105

ఉ. మాధవ నీకు నిత్యశుభమంగళ మెప్పుడు నీదు భార్యకు
న్నాధకు సత్యభామకును నందకశార్ఙసుచక్రశంఖకౌ
మోదకికిన్ శుభంబులగు మోదముగల్గు ఫణీంద్రవైరికిన్
యాదవవంశభూషణ మహాత్మ హరీ వ... 106

ఉ. ఏవసుదేవనందనునియింగిత మాదలఁ దాల్తు రెల్లవా
రావసుదేవనందనునియాజ్ఞ రచించిన యుత్పలంబులన్
భావనఁజేసిన న్వినిన వ్రాసిన వారి కభీష్టసంపద
ల్పావనముక్తినిచ్చు దయ భవ్యుఁడు కృష్ణుఁడు సుస్థిరంబుగన్. 107

వసుదేవనందనశతకము సంపూర్ణము

---



శ్రీరస్తు

# కీరవాణిశతకము





భీష్మజామనస్సీమనివాసుఁడై భక్తపెన్నిధి యనఁ బరగు నెవఁడు
కమలాప్తకోటిసంకాశుఁడై జగముల వెలుఁగొందుచున్నట్టి బలియుఁ డెవఁడు
లలితకౌస్తుభరత్నవిలసితద్యుతులచే నక్షీణసౌందర్యవక్షుఁ డెవఁడు
కల్యాణగుణసముత్కరశోభితాంగుఁడై యానందమయజగదాత్మ యెవఁడు
గీ. కరముఁ జెలువంద మాండవ్యపురమునున్న సరసపాండిత్యవాగ్జాలసముదయుండు
వనరుహాక్షుండు యదుకులవర్ధనుండు, కేశవుఁడు వానిఁ దేఁగదే కీరవాణి. 1

సీ. నందనందన శరదిందునిభానన యిందీవరాక్ష గోవింద రార
కమనీయజలధర కాయసంకాశ రా శారదాపతిఁ గన్నజాణ రార
గోపికాజనమనఃకుముదచంద్రమ రార మానినీజనలోకమదన రార
యక్షీణప్రాభవాధ్యక్ష మాధవ రార పక్షిరాడ్గమన శ్రీవక్ష రార
గీ. దండి యొసఁగెడు బంగరుకొండ రార కొండగొడుగెత్తి బ్రోచినతండ్రి రార
యనుచు నందునిసతి పిల్వ మనము జెలఁగు, కేశవుఁడు... 2

సీ. సిరికరపంజరచరరామచిలుక రా మహనీయతరరూపమదన రార
భక్తజలార్ణవప్రాభవసోమ రా నిరతిశయానంద నిత్య రార
ముఖజితశశి రార మఘవారిహిత రార పాలితయదుకులబాల రార
నానోముఫలమ రా నానిధానమ రార నాపుణ్యపరిపాకనటన రార
గీ. వెన్నఁ బెట్టెద రార నన్గన్నతండ్రి యెవ్వ రెవ్వరిగృహరాజి కేఁగినావొ
యనుచు గోపిక పిలిచెడుఘనుఁడు వరుఁడు, కేశవుఁడు... 3

సీ. కమనీయవిరిలతల్ గ్రాలుపందిళ్లలో మేలగుకలధౌతశాలలందుఁ
గృతకాద్రికందరప్రతతిలో వనములో నాడెమై వెలుగొందుమేడలందు
కాంచనసోపానకలితకుండములలో జలరాశిసైకతస్థలములందు
అదనైనమల్లెపూబొదలలో నదులలో మహనీయతరపట్టెమంచమందు

గీ. వరుస నాతోడఁ గ్రీడల వాళి మెలఁగు జాణ పూబోణి యదుకులచక్రవర్తి
సరసగుణరక్తి మేఘవిస్ఫురణమూర్తి, కేశవుఁడు... 4

సీ. భామ యెట్లోర్తునే కామునిశరవృష్టి నామనోహరుక్రీడ లేమి కిపుడు
చక్కనిసవతులు వెక్కిరించుట కెట్లు నొప్పుదు పతిదయ గప్పనపుడు
వరభాషలకు మాఱుబలుక నెట్లు సహింతుఁ బద్మాయతాక్షుఁడు పలుకనపుడు
నొంటిగా శయ్యపై నుంట కేగతి బూఁదు నందసూనునిపొందుఁ జెందనపుడు
గీ. కంటి కెలమిని నిదురంట గానవైతి వెతలపాలైతి గన్నీరు వెలపనైతి
కాంత నీవేఁగి గోపికాయింతిసుతుఁడు, కేశవుఁడు... 5

సీ. మక్కువ నామీఁద మిక్కిలై యొకవేళ చక్కనికెమ్మోవి నొక్కుఁ బెలుచ
పొదరుగుబ్బలమీఁద బొందుగాఁ బవళించుఁ జెక్కుటద్దములపైఁ జేర్చు మోము
కనుదోయి ముద్దాడు కడువేడ్క మదనుని కదనంబు చౌసీతిగతుల నెఱపుఁ
జనువిచ్చు ఘనమిచ్చు సతులలో నను మెచ్చు కోరికకొలఁదిని గూడనిచ్చు
గీ. నట్టికరుణాసముద్రుండు నమలసుగుణ గణగరిష్ఠుండు సన్నుతాఖండలుండు
శారదాపతిజనకుండు శాశ్వతుండు, కేశవుఁడు... 6

సీ. వనజబంధుఁడు లేనిదినమాయె నామనః కంజవిలాసంబు కనకగాత్ర
కమలసంతతి లేనికమలాకరంబాయె నాకోర్కె జలరాశి శ్రీకరాంగి
కుసుమహీనమునొంది వసియాడుతీఁగాయె నామేనిసొబగువిన్నాణ మబల
ఫలములు గోసినయెలమావితీరాయె నాపుణ్యధరణిజ మేపు రమణి
గీ. యెట్టులోరుతు సవతులబెట్టిదంపుఁ బలుకులెల్లను జెవులకు ములుకులయ్యె
మగువ నీ వేఁగి యదుకులమండనుండు, కేశవుఁడు... 7

సీ. వననిధికన్యకాఘనకుచగిరియుగి మొనలపైఁ గ్రమ్మెడుఘన మతండె
కమలాసతీమనఃకమలమరందంబు ప్రియముగాఁ గ్రోలెడు భృంగ మతఁడె
భార్గవీకరయుగపంజరమున నాడు చెలువంబు గలరామచిలు కతండె
మంగళదేవతాశృంగారసరసిలో రసికతఁ దిరుగుమరాళ మతఁడె
గీ. సరససంపూర్ణుఁ డాపంచశరునిఁ గన్న మేటి రాధావధూటియాబోటితోటి
నాటలాడెడులీలావిహారి యతఁడు, కేశవుఁడు... 8

సీ. సారముల్ భవరోగహారముల్ నిరుపమాకారముల్ హరిపదసారసములు
కీరముల్ సురల కాధారముల్ మంగళాచారముల్ హరిపదసారసములు
తారముల్ పుణ్యవిస్తారముల్ నిగమార్థపూరముల్ హరిపదసారసములు
హారముల్ భక్తమందారముల్ జగదుపకారముల్ హరిపదసారసములు
గీ. గాన నామ్రొక్కులెల్లను ఘనత జేసి నన్ను రక్షించు తెఱఁగెల్ల విన్నవించి
భాసురుండైన నందగోపాలసుతుఁడు, కేశవుఁడు... 9

సీ. శ్రీకృష్ణ గోవింద చిన్మయానంద రా సుందరచరణారవింద రార
సారబృందావనసంచార వేగ రా కరుణారసాంబుధికంజ రార
సురనదీభవపాదశోభిశోభన రార రమణీయరాధికారమణ రార
నలకూబరులశాపనాశన వే రార ధేనుకాసురహతదివ్య రార
గీ. నందసుత రార సద్గుణబృంద రార కొడుక వే రార పరమతుందుతుక రార
యనుచు గోపెమ్మ బిలుచుపద్మాక్షుఁ డతఁడు, కేశవుఁడు 10

సీ. క్రొన్ననవింటివా స్నన్నవన్నెల నెన్న పన్నగపతికైనఁ జెన్ను గలదె
కమలజాండవిలాసకల్పనగతు లెన్న పార్వతీపతికైనఁ బటిమ గలదె
చతురతమాయావిశారదత్వం బెన్న నబ్జసంభవునకునైనఁ గలదె
యార్తరక్షణబిరుదతిశయ మెన్నంగ శక్రునకైనను శక్తిగలదె
గీ. రాజముఖి విను యదుకులరాజవరుఁడు కమలధరుఁడును నజ్ఞానతమసతరణి
ధనుఁడు ఘనుఁడును సరససద్గుణుఁడు వరుఁడు, కేశవుఁడు... 11

సీ. భువనత్రయంబులు భూరిమోహాక్రాంత వశవర్తులై భ్రాంతి ముసురుకొనఁగ
నేడువారాసులు వేడుక నుప్పొంగ దిగ్గజంబులమద మగ్గలింప
నిగురుజొంపములచే నొగి వృక్షపంక్తుల నరుణారుణద్యుతు లతిశయిల్ల
కాంతాజనంబు లాక్రాంతప్రద్యుమ్నార్తి వలగొని కూనల తలఁపు విడువ
గీ. కమలగర్భాదిసురకోటి గణుతిసేయ జాలు గరుగంగ మునుల విరాళిఁ బొంగ
వేణునాదము చేసినజాణగాఁడె, కేశవుఁడు... 12

సీ. నాలవఋతునెలనడిమిదినంబున నొప్పెడుశశికళ నొప్పు మోము
మృగరాజమధ్యము సొగసును గెలిచెడు కడువిలాసము జూపఁబడెడునడుము
ఫుల్లారవిందసంపూర్ణాభిరామంబుఁ గడువడి నిరసించుకన్నుదోయి
యిభపుంగవునియాన మభినుతింపమికైన వలనుమీఱినయట్టి కలిమినడక
గీ. గలిగి వేణువు చేఁ బూని కనకపటము పైని దూఁగాడ గోపికాపటలి గొలువ
నాలఁ గాచుచుఁ గానను గేళి సల్పు, కేశవుఁడు... 13

సీ. విరహసాగరఘనవీచీపరంపర నెమ్మది ముంచెను ముమ్మరముగఁ
బతివిడనాడినభారంబు పెంపుచేఁ గనులను బాష్పంపుఁగణము లొలికె
మదనబాణాహతిమర్దితమై మేను బాలమారుతముకుఁ జాల వణఁకె
కీరశారికరవాకీర్ణమై కర్ణముల్ చిందరవందర చెవుడుకొనియె
గీ. నెటుల భరియింతు నీకష్ట మెటు తరింతు మదవతీ నీవు జని వేగ నద నెఱింగి
వాసవార్చితపదయుగభాసురుండు, కేశవుఁడు... 14

సీ. గోపాంగనామనఃకుముదకదంబముల్ వికసింపఁ జేసెడు విధుఁ డతండె
వైదర్భిమొదలగువనితలయౌవన కాన మెలంగు మేల్గజ మతండె

వసుదేవదేవకీవరహృత్సరోజము ల్లాసిల్లఁ జేసెడుభానుఁ డతఁడె
వల్లవీజనముల వరగేహతతులలో దూరి వెన్నలు దినుచోరుఁ డతఁడె
గీ. నీకుఁ దెల్పితి నిన్నియుఁ బ్రాకటముగ లోకముల నున్న జీవులలోన మెలఁగు
సూక్ష్మరూపుఁడు ఘనుఁడును సుస్థిరుండు, కేశవుఁడు... 15
సీ. జలముపైఁ జిక్కిన వలనగులిపివోలు చెలువునివలపుమే లిలను గలికి
తనకుమారుని దాడి తమక మగ్గల మైన రమణుపైఁ బ్రేమల నమరునపుడు
లాలించి రతులచేఁ దేలించి సొగసులు గీలించి చతురత మేలు లెంచి
చాయజాల నటంచు బాసలెన్నో చేసి మఱచునే యంత సమ్మతిఁ జెలంగి
గీ. మదచకోరాక్షి పురుషునిమనసు తెరఁగు గడియ కొకరీతి వర్తిల్లు గాదె జగతి
దీనిఁ దెలిసియు నీవేఁగి దివ్యుఁడైన, కేశవుఁడు... 16
సీ. కటిపైని నటియించు కనకపటం బెన్న తొలిబాము నేమోను జలిపెనొక్కొ
మస్తకంబునఁ జేర్మి మసలుకిరీటంబు వెనుక నేవిభ్రులఁ దనిపెనొక్కొ
వక్షమందు బెనంగువరకౌస్తుభంబును మున్నె మితపములు గొన్నదొక్కొ
ముక్కున నాడెడుచక్కనిముత్యము వాసిపుణ్యము లేమి జేసెనొక్కొ
గీ. హరిశరీరసమాగమ మంది ధాత్రి కొదువలేనట్టి సత్కీర్తి గొనుట కివియు
నాదుతప మిట్టిదా యె సమ్మోదయుతుఁడు, కేశవుఁడు... 17
సీ. సిబ్బిగుబ్బలు గోరఁ జిదిమి దగ్గర దీసి యురము నురంబున నొరయునమ్మ
మిక్కిలి మది మోహ మక్కజమైమోవి నొక్కుచుఁ జెక్కిలి నులుమునమ్మ
బిగియించి కౌఁగిలి సొగయించి వేడుక లెగయించి మక్కువ నించునమ్మ
మరునియుద్ధమునందు మాటికిమాటికి బెలుచ నన్గెలిచి మెప్పించునమ్మ
గీ. సొగసు లలరించి మాటికి వగలు నించునమ్మ నేఁజెల్ల నీవేఁగి కమ్మవిలుతుఁ
దమ్మిచూలిని గన్నమాధవుఁడు ప్రభుఁడు, కేశవుఁడు... 18
సీ. విమలవారితరంగకమనీయవిభవంబు నుడుమండలంబుపైఁ బొడవుఁ జూప
కాంచనసైకతకాంతివిలాసంబు పద్మబాంధవతేజపటిమ నమర
హేమసారసములయేపు సంధ్యారాగ సౌందర్యకళలతో సరసమాడ
బాలమారుతలీల కేలిగతులు జల్వ పుష్పగంధచయంబు బొల్పు లొప్ప
గీ. మదమరాళవిహారము కుదురు లమర ఘనత లొప్పెడునాకాశగంగఁ గన్న
చరణసారస మమరినచక్రిధరుఁడు, కేశవుఁడు... 19
సీ. వ్రజకామినీమనోవనజనభోమణి భక్తహృత్పంజరపావురంబు
యదుకులాంభోరాశి మురమందఁ బుట్టిన సంపూర్ణకళల నిశాకరుండు
దివ్యయోగికదంబభవ్యతపస్సార జనితకల్పద్రుమఘనఫలంబు
వైదర్భినిజమనోవాంఛ లొసంగెడు తేజంబు గలకామధేనువరము

గీ. లలనశృంగారదేశంబు లాలితంబు భూరికరుణాలవాలంబు భోగిపాన్పు
గలిగి పర్ధిల్లు నుడురాజకులవరుండు, కేశవుఁడు... 20

సీ. శరనిధు లేడు వావిరినాదమునఁ బొంగ గిరివరంబులు సురవరులుతరులు
మణులు మౌక్తికములు మహనీయదిశలును ఫణు లణిమాదులు పరమమునులు
కల్పద్రుమంబులు కాంతారములు నష్టగజములు నిగమము ల్కమలభవుఁడు
మృగములు ఖగములు నగచరజలచర సంతతు ల్తమతమసత్వగతులఁ
గీ. బెరుగ ముదమంద విరిఫలసరళిఁ బెనయఁ గఱుగ వెలుగొంద నాడ నీగతులఁ జెలఁగ
వేణునాదము చేసినవీరవరుఁడు, కేశవుఁడు... 21

సీ. మేలుచుక్కలమధ్య మేఘంబుకై వడి వ్రజసుందరీజనవ్రజము నడుమ
వేణురవామృతవిభవదిగంతుఁడై రచన మెరయ మోహరజ్జువలన
రమణులహృదయసారసముల బంధించి విరిశరుమేలుసంగరము కదను
గఱపుచు వృషభంబుగతి చతురత దోఁప వలపల దాపలఁ గలయదిరిగి
గీ. రతుల దేలించి కామినీతతులతోడ నతిముదంబున నాడుకల్యాణగుణుఁడు
ఘనుఁడు వరదుఁడు నామానఘనుఁడు వరుఁడు, కేశవుఁడు... 22

సీ. దండిఘనంబు లుద్దండతఁ జెలరేగి గగనభాగం బెల్లఁ గలయఁ గ్రాఁక
ధళధళద్ధళద్ధళధళమెఱుపులు మేఘమండలిలోన మిగులఁ జెలఁగ
నురుములు బహుఘోరతరములై దిగ్దంతి కర్ణరంధ్రంబులు ఘనము బగుల
గ్రావవృష్టియు గోపగణముపై నింపెడు నాకాధిపుఁడు సిగ్గునను దొలంగఁ
గీ. గేల నగమెత్తు బాలగోపాలుఁ డాల బాలమును జాలఁ బ్రోచినమేలుకీర్తి
కామినీకలితాంశుండు ఘనబలుండు, కేశవుఁడు... 23

సీ. కాంచనరంభలకమనీయమాధవీ తక్కోలవిరిజాజిధరణిజములఁ
బున్నాగచంపకగన్నేరుదాడిమ ద్రాక్షకుద్రాక్షహింతాలతరుల
నారికేళకపిత్థనవరసాలనుసాల బింబకదంబజంబీరజంబు
భూరుహంబులగిరిపుంజంబు లనుఘోష కామినీజనమహోత్కరము గరము
గీ. బెంపు తంపరయై క్రీడఁ బెలుచ సేయు నవఘనోజ్జ్వలకాంతుల నమరువాఁడు
సోముకళలను నిరసించు మోమువాఁడు, కేశవుఁడు... 24

సీ. కమనీయసుందరకలితాంగదీధితు ల్గాంతారమున మహోఘనత మెరయ
గమనభరంబున గడలుమధ్యంబులు కుచయుగళకి జోగుఁ గ్రుమ్మరింప
సల్లాపచతురత లెల్ల కొల్లగ నొప్పి వాగ్విలాసములోన వన్నె లమర
గోపికాజనములఁ గూడి రాసక్రీడఁ జెలిపి యాకాంతలఁ గలిసి మెలసి
గీ. వలను మీఱెడురుక్మిణీవల్లభుండు మారజనకుండు యదుకులమండనుండు
కంసహరణుండు భవలతాఖండనుండు, కేశవుఁడు... 25

సీ. నీలఘనంబుసన్నిధి నొప్పు క్రొక్కారు మెఱుఁగు తెఱఁగున మేనితోడ
రాకాశశాంకుని శ్రీకరనునుకాంతి చెలువంబుగల మోము కలిమితోడ
చక్రవాకద్వంద్వసౌందర్యకళలచే మించెడు చనుదోయి మేలుతోడ
మృగరాజమధ్యము సొగసు సొంపు జెలంగు కడుసుందరం బగునడుముతోడ
గీ. నురమునం దొప్పు క్షీరసాగరతనూజ వన్నె గ్రొన్ననమిన్నయై జెన్ను మీఱ
సరసతలఁ దేలు దేవకీవరసుతుండు, కేశవుఁడు... 26

సీ. భూరిసుందరపదాంభోజరాజత తేజ గరిమ లెన్నుటకును గిరిజ కగును
భక్తరక్షణకళాప్రావీణ్యతలు సెన్న క్షితిని దానవరాజసుతుని కగును
శరణాగతత్రాణబిరుదుపంతము లెన్న సరమహృత్సరసిజహంసన కగును
వరదయాంసనుహావైభవ మెన్నంగ వడి నిసుకనువొప్పు నుడుత కగును
గీ. గాని నితరుల కలవడరానియట్టి మహిమగలవాఁడు యదురాజమండనుండు
పరమయోగులహృదయాబ్జపంజరుండు, కేశవుఁడు... 27

సీ. పద్మరాగప్రదీప్తంబులై వేదిక లిరువంకలను వేడ్కఁ మెరయుచుండ
సంతానసంతతిచ్ఛాయ లావృతమైన గోడలవేడుకల్ గూడియాడ
నిర్మలజలముల నిండు మెండుగ నొప్పు కొలను విలాసంబు కొమరు మిగుల
నవరత్నఖచితమై నవవిలాసద్యుతుల్ దొంతరలై వింత గంతు లిడఁగఁ
గీ. బరగు సౌధములోన శ్రీభామపైఁట చెరఁగుఁబట్టియు నాడంగఁ గరివరంబు
ఆర్తిచేఁ బిల్వ విని బ్రోచె నాథుఁడుండు, కేశవుఁడు... 28

సీ. ఫుల్లారవిందశోభోత్తుంగతరనేత్ర వసుధాకళత్ర పావనచరిత్ర
నగజాధిపతిమిత్ర నగరిపునుతిపాత్ర వివిధదానవవనవీతిహోత్ర
మాయాకలితసూత్ర మహనీయతరగాత్ర వసుధపాలనకళావరవిచిత్ర
గోపికావరపుత్ర గోపాలవనచైత్ర మునిజనహృదయాబ్జవనజమిత్ర
గీ. రార యని పిల్చు దానవరాజసుతునిఁ గరుణ నేలిన ద్వారకాపురవరుండు
భక్తహృదయాబ్జపంజరభాసురుండు, కేశవుఁడు... 29

సీ. అపుడు గోపార్భకుల్ నెపములు ఘటియించి తల్లితో ననిరి యుత్ఫుల్లనయన
మన్ను దిన్నాఁడె నీచిన్నిముద్దులసుతుం డన్న యామానిని గన్నతండ్రి
మన్నె మిరుచిర సంపన్నకుమారక యన్న నే నెఱుఁగ నీచిన్నివాండ్రు
నీవు నన్గొట్టంగ నిట్లు చెప్పిరిగాని వెట్టినే తినుటకు వినుము తల్లి
గీ. వదనవారిజవాసనవాసి జూడు మనుచు నోరటు దెరువంగ నఖిలభువన
జాల మొప్పినకుక్షి గోపాలవరుఁడుఁ కేశవుఁడు... 30

సీ. బ్రహ్మాండభాండసంపత్తి వే చెదరంగ వచ్చినజలరాశివహ్ని యనఁగఁ
గురురాజు కోపాగ్ని గూడి పాండవులను నిలఁ గూల్పవచ్చినబలిమి యనఁగ

వనమాలిసత్కృప ఘనతను దెలియంగ శక్రుఁ డంపఁగవచ్చు శక్తి యనఁగ
గర్వదుశ్శాసనుఁ గడ తేరునప్పుడు విడిచినకపటపువిష మనంగ
గీ. గురుసుతుం డేయుబ్రహ్మాస్త్రశరము గోడి విరటసుత వేఁడుకొన్న న్నావెల్వడి కడుపు
భంగపడకుండఁ గాచిన భద్రమూర్తి, కేశవుఁడు... 31

సీ. గురుకుచయుగళ మావరణకొమ్మ్మనఁ గ్రమ్మ హారముక్తిమ్మఁద విహారమొప్ప
ముఖబింబజనితసముజ్జ్వలఘర్మాంబుకణజాల మతనిపై ఘనతఁ బ్రోక
నాసికాగ్రమునందు నాడుమౌక్తికకాంతి చెక్కుటద్దములపైఁ జక్క మెరయ
కాలాహిచందము బోలెడుమేల్జడ గుప్పించి భుజముల గునిసియాడ
గీ. నూరువుల్ గూడి చప్పట్లు మీఱి తాళగతులధ్వనులీన కేళిసంగతుల వేడ్క
నాకు నుపరతి యొసఁగెడు శ్రీకరుండు, కేశవుఁడు... 32

సీ. ఏసతి కబ్బెనో శ్రీసతీనాథాధరోష్ఠబింబామృతం బొప్పమీఱ
నేకాంత కమరెనో యోకాంతకాంతుని ముఖకాంతిచెక్కిళ్ల మొనసియాడ
నేచెలికాయెనో యోచెలి నాచెలికానివక్షమునందుఁ గలసి మెలఁగ
నేయింతి కొనఁగూడెనో యింతి నాజీవితేశ్వరుతోఁ గ్రీడ దేలుటలును
గీ. కలికి యెట్లోర్తు మారుని ములుకులకును భరమె మాధవుదయలు శ్రీకరమె వరమె
తరుణి నీ వేఁగి దేవకీవరసుతుండు, కేశవుఁడు... 33

సీ. తలదువ్వి కొప్పిడి తాటంకములదిద్ది పలుమారు పాపిటఁ బరపునమ్మ
కస్తూరితిలకంబు కాటుకకుంకుమ వరుసగా దిద్ది తా మురియునమ్మ
విరులును సరులును వేణిని నురమున దిద్ది వద్దిక కను లద్దునమ్మ
మంచిగంధము కుచమండలిపైఁ బూసి మించి వేడ్కను గాఁగలించునమ్మ
గీ. యధరబింబఫలామృతం బానియాని చెఱకువిలుకాని ములుకులకఱకు మాన్పి
మోహ మొసఁగెడునందునిముద్దుకొడుకు, కేశవుఁడు... 34

సీ. అతిమధురం బగునాతనివాతెఱఁ గొసరిన బలుమాఱు గ్రోలనిచ్చు
తగుహంసతూలికాతల్పమందునఁ జేర్చుఁ దమలము తమ్మిఁ బెండయు నొసంగు
వడి పోఁకముడివిప్పి కడువేడ్కఁ జనుదోయి పయి గిలిగింతలఁ బటిమ నెరపు
కందర్పసంగరకలితకేళి యొనర్చుఁ జతురత నతులచౌసీతిగతుల
గీ. నతనిప్రేమలు నాదరణాదివిధులు దలఁచుకొన్నను నాకెట్లు వలపు నిలుప
వశమె నీవేఁగి మానినీరసికవరుఁడు, కేశవుఁడు... 35

సీ. కరుణాపయోరాశి కమనీయవీచులఁ దడుపును భక్తకదంబములను
లలితసౌందర్యవిలాసాభిరాముల కొసఁగు మన్మథకేళి కొసరి కొసరి
రమణీయమునిమనోరాజీవములకును నిచ్చు మచ్చిక హెచ్చు లచ్చుపడఁగ
శరణని వేఁడిన సురరిపులకు నైన వరమిచ్చి రక్షించు కరుణ నెన్న

గీ. నిరతిశయగుణసంతానవిపుణఘనత పద్మజాండంబులను వేడ్కఁ బరిఢవిల్లు
విజయగోపాలకాఖ్యత్రివిక్రముండు, కేశవుఁడు... 36

సీ. ప్రథమార్కుఁ దోతెంచుభానుబింబంబన నురమున గౌస్తుభం బొప్పువాఁడు
మణిరత్నకాంచనమహనీయకాంతుల నొప్పుకిరీటంబు నొప్పువాఁడు
వరశంఖచక్రలావణ్యసంవృతమైన భుజయుగళంబుచేఁ బొలుచువాఁడు
నవనీతకంఠమై నవమహానందమై భాసిల్లుహృదయాబ్జవాసివాఁడు
గీ. కలిమిలేములకెల్లను బలమెవాఁడు బలుకరానట్టి మూర్తిసంపదలవాఁడు
మేలొసఁగువాఁడు ప్రేతల నేలువాఁడు, కేశవుఁడు... 37

సీ. ఏల నాపైఁ జలం బేలనే జాలనే తాళనే సుమశరుకోలలకును
రాఁగదే విడెము గైకోఁగదే మధురకుఁ బోఁగదే మ్రొక్కెద వేగ మీావు
సారసానన పుణ్యనారీమణీ కీరవాణీమహాంబ శోభనచరిత్ర
యిత్తునే వరహాలు మెత్తునే నీకు నే గ్రొత్తనే విడువ మత్తేభయాన?
గీ. కరము రంజిల్ల గోపికావరకుటీర సారగోక్షీరనవనీతచోరుఁడైన
భూరిగుణశాలి వసుదేవపుత్రకుండు, కేశవుఁడు... 38

సీ. సుందరకలితమై శోభిల్లు నురమును గరిమచే మోహించె గమలవాసి
సరిలేని కరుణారసాంబుధివీచుల తాకు వలసెను భక్తతండమెల్ల
భుజబలాటోపసంపూర్ణవిలాసకు నాస జెందెను బాండవాగ్రజుండు
కురుసభ నాడెడు వరవాక్సుధారస మాధురి కర్థించె మానిగణము
గీ. మానితం బగునాతనిమహిమ లెన్నఁ గలదె చతురత ఫణిరాజుకైన నిలను
సరసగాంభీర్యకరుణాప్రసాదుఁడైన, కేశవుఁడు... 39

సీ. రా భక్తమందార రా గోపికాజార రా జగదాధార రార సూర
రా ఘనాఘనసార రా రాజదాకార రా గిరిభరధర రార వీర
రా యాదవాన్వయ రాకానిశాకర రా కృష్ణ మురహార రా సుధీర
రార గోపాలక రా యదుకుంజర రా చక్రధర ఫణిరాజశయన
గీ. రార నీకయి వలచినరాజముఖిని విడువఁదగదని ధర్మము విన్నవించి
రసికవరుఁడైన యాదవరాజసుతుఁడు, కేశవుఁడు... 40

సీ. హరుఁడు మాయామహానారూఢుఁడై సాధిఁ గననేరకను మోహకలితుఁడయ్యె
కమలాసనుఁడు మదకాంతాసమేతుఁడై పరిపరిగతులను భంగపడియె
మానులు మదనాస్త్రమర్దితులై గోర్కె లలరంగఁ బ్రేమతో నలముకొనిరి
కంసాదులందఱు సంసారి యనిచేరి వైరబుద్ధిని ముక్తి వాసికొనిరి
గీ. కాన మహనీయచాతుర్యఘనవిలాస లాలితాకార సుకుమార జార చోర
ధీర ఘనసార గుణగణోద్ధారుఁ డెన్న, కేశవుఁడు... 41

సీ. కొమ్మా మనోహరు దెప్పమ్మ ముఖంబు నాకిమ్మ మనోజార్తి కిమ్ముఁ జెలువ
లెమ్మా నినే నమ్మితమ్మా దయన్ బ్రోవవమ్మా ఘనతంబు గావుమ్మ విడువ
కమ్మా మహాపుణ్య మమ్మా విడెమ్ము నై కొమ్మా వెరా లిత్తు వైభవాల
సుమ్మా విరోధ మేలమ్మా మహాముగ్ధనమ్మా సుపుణ్య నానమ్మకంబుఁ
గీ. జాతుఁగానియు వే బోయి ఖ్యాతిమీఱ విషము గుడిచినదానవ వేణు ద్రోఁచు
ఘనుఁడు రసికుఁడు సుందరతనుఁడు ముద్దు, కేశవుఁడు... 42

సీ. కలలోననై నను గమలావరునియాజ్ఞ జనఁదాటవెఱతునే చంద్రవదన
పదియాఱువేల శోభనకీరవాణులతో నెన్నఁడైన సంతోష మిడుచు
బంధువర్గమునకుఁ బరివారజనముకు నన్న మొసఁగెడువేళ జెన్నుదొలఁగఁ
బలికినసన్నల ప్రాభవగతులను నటియింతు నేర్పుచేఁ బటుతరముగఁ
గీ. ప్రాణనాథుని సత్కృపఁ బడయుటకును నిన్నిగతులను జరియింతు నింతెకాని
విరస మెఱుఁగను నెన్నఁడు వేణుధరుఁడు, కేశవుఁడు... 43

సీ. క్రూరుఁడు డామదనుని ఘోరబాణానల కీలల కెటులోర్తు నీలవేణి
నరకీరశారికావర్గరవోద్ధూత మెటు భరింతు భరంబు నిగురుబోఁడి
కాలకంఠనుకంఠకలరవభీకర మెటుదాల్తు నిభరాజపటిమగమన
ఘనమృంగాకుని కళాగరిమవేఁడిములకు నెటులసహింతు మృగేంద్రమధ్య
గీ. ఘనత లొప్పార భక్తహృత్కంజపుంజ రంజనాభ్యుదయాంచిత లాలితాంఘ్రి
కమలయుగళుండు త్రిభువనగౌరవుండు, కేశవుఁడు... 44

సీ. కుటిలకుంతలి మృగాంకుఁడు వానిమోముతో గరిమ యొప్పక కళంకమునఁబడెను
కలకంఠిమృగరాజు కాంతారమునఁ జేరె ఘనునిమధ్యము సరిగానరాక
పడఁతిరో భూరతీపతి యనంగుండాయె వానిసొబగు కెనగానలేక
మధురవాణిరో కంబుమాధవుకంఠరంబుతోఁ బోలలేకను జాల మొరఁగె.
గీ. సుదతి వినవమ్మ త్రిభువనసుందరుండు కమలవిమలాంతరంగ సంకల్పసిద్ధి
వద్దికను జేయు రాధికావల్లభుండు, కేశవుఁడు... 45

సీ. రమణీసుభూషణరాజి నీ కిత్తునే విరిశరజనకుఁడు విడువనపుడు
ఇమ్ముగా నరహాలు కొమ్మ నీ కిత్తునే బలభద్రుననుజుఁడు పాయనపుడు
పైతిణీరవికెలు పణఁతి నీ కిత్తునే గోపికాజారుఁడు గూడినపుడు
జలతారుచీరెలు కలికి నీ కిత్తునే నందసుపుత్రుండు బొందినపుడు
గీ. గాన మదగజగమన నీయానసుమ్మ యప్పకను నిట్లొసంగుదు దయ ఘనంబు
గాఁగ నీవేఁగి శ్రీరమాకాంతవరుఁడు కేశవుఁడు... 46

సీ. జలజాక్షి వినుపారిజాతాపహారుఁ డే కలికి కొసంగెనో కంతుక్రీడ
మదహంసగమన నీరధిమాయ యేగోపరమణి కిడెనో యధరామృతంబు

శరదిందువదన సాగరశాయి యేవ్రజపణంతి కొసంగెనో బాహులయుగళి
నీలనీరద వేణి శ్రీలోలుఁ జేగోపలలన కొసంగెనో చెలిమి బలిమి
గీ. యెట్లు వేగింతు జలజాక్షుఁ డేలరాఁడు మన్మథునివాఁడిశరముల మహిమకోర్వ
భామ నీవేఁగి వైకుంఠధాముఁడైన, కేశవుఁడు... 47

సీ. పర్వేందుముఖపతి పర్వేందుముఖులతో వలరాజుక్రీడలు సలిపె ననుచు
వింటి నామొకలుగాఁ గంటికి నిదురంటఁ గాన నైతిని జలకణములూరి
ముంచెనే కగులు క్రోధించిరే సవతులు పొంచి సాధించెనే పంచశరుఁడు
వంచనఁ బడితినే పంచుబోడులలోన నించుకైనను ఘన మెఱుఁగనైతి
గీ. నేమిసేయుదు నాబ్రదు కిట్టులాయెఁ దొల్లి నే నోఁచునోములు కల్లలాయె
భామ నీవేఁగి సుగుణాభిరాముఁడైన, కేశవుఁడు... 48

సీ. బాయఁజాలనుగదే పోయి వే రాఁగదే పోయెనే సాయము తోయజాక్షి
మాయఁ జేసెకవేమొ మదనాంధకారము బాయదే నన్నది వేయుగతుల
తోయజాక్షుఁడు భక్తతోయధి నన్నెడఁ బాయ నేరములేమొ డాయరావె
ఈయెడ నాయార్తి గోయవే మోదసంధాయివే హరిపదతోయజములు
గీ. నాకు నర్చన కిచ్చిన నపుడె నీకుఁ గమ్మలిత్తును మేలైన సొమ్ములిత్తు
గాన వే బోయి సద్గుణగణపయోధి, కేశవుఁడు... 49

సీ. వింటివే యొకటపూవింటిదంటనుగన్న దంతీశవరదుఁడు సంతసమున
వ్రజసుందరీజనవ్రజకుచాద్రులమీఁదఁ గరుణరసము లుంచి కరుణమించి
చెక్కులు జక్కుల జక్కగా గీలించి మక్కువగాఁగిలి నొక్కినొక్కి
యధరామృతంబుల మధురము గ్రోలుచు మదనగృహంబులు పదనుగాఁగ
గీ. జక్కిలింతలు సొగసులు చెక్కుగతుల సలిపె నేనందు కెట్లోర్తు కలికి నేఁడు
కరుణ నాయందుఁజేసి శ్రీకరుఁడు నరుఁడు, కేశవుఁడు... 50

సీ. కూకఁటిముడికినై కురులుగూడనినాఁడు బలుమీసకట్టెరుపడనినాఁడు
మారుని శరవృష్టిభార మంటనినాఁడు వయసు నిండని బాలవరుసనాఁడు
ఆరామసీమల నాడఁబోయెడునాఁడు దాఁగుడుమూతల కేఁగునాఁడు
నాలుగుస్తంభాలనడుమ నాడెడునాఁడు గుజ్జనగూళ్ళొండుకొనెడునాఁడు
గీ. బాల నినుబాయ నని చాల బాసఁజేసె విమలకమలాక్షికళలతో వియ్యమందు
వదన మమరిన దేవకీవరసుతుండుఁ, కేశవుఁడు... 51

సీ. కేళీసరోవీథి దేలి ముదంబుచేఁ దూలి మనోజార్తి దోలితోలి
పనిబూని యుద్యానవనసమూహంబుల బాలలీలల శుభప్రదము లొసఁగి
సాలరసాలహింతాలతమాలభూజాళి ఘనాద్రులఁ జాల దిరిగి
కోలాహలోద్రేకశాలాలసద్రత్న కేళీమణిస్తంభ కేళి దేల్చి

గీ. కోర్కె లొసఁగు నిశాకరకులపయోధి కబ్జుఁ డనఁ నొప్పు మహాధవాహ్వయుఁడు నేఁడు
రాక నన్నేఁచె నీవేఁగి లోకమెఱుఁగ, కేశవుఁడు... 52

సీ. మహనీయశృంగారమహిమఁ బెంపెసలారు కాయంబు నిర్మలకాంతి నొప్ప
వికసితాంభోరుహవిధము సిగ్గిడఁజేయు కన్నుదోయి విలాసగరిమ లమరఁ
జిన్నివెన్నెలమిన్న చెన్నుసన్నుతు లొప్పు లాంగూలసుందరలలిత మెసఁగ
నిడుదయేపు దొలంగి కడువేడ్క కిరవుచే మెరయు పక్షద్వయి సరళిఁదోఁప
గీ. జలధి నుగమీనమై పంకజాసనునకుఁ గోర్కె లలరంగ సోమకుఁ గూల్చి వేద
సమితి నిచ్చిన యదుకులచక్రవర్తి, కేశవుఁడు... 53

సీ. లలితమై శృంగారకలితమై తమ్ములవన్నె మిన్నను మీఱు కన్నుదోయి
కులచయమై బ్రహ్మాండకోటులు పైఁబడ భరము నాగెడునట్టి పాదయుగము
వెలికి లోనికి జను విపులతుండసుయాన గరిమంబు వేడుక గలుగనడక
కఠినమై నిరుపమకలితమై వట్రువై బెట్టిదc బగు వెన్ను దిట్టతనము
గీ. లొప్ప నుదధిని గమఠమై దెప్పరముగ నగము నెత్తినవసుదేవనందనుండు
నాగ వరదుండు కూర్మి జనార్దనుండు, కేశవుఁడు... 54

సీ. తిన్ననై కంఠంబు క్రొన్ననై పదములు వన్నెనై రోమాళి మిన్న లొప్ప
వాఁడిమై దంతముల్ నాడెమై తనుకాంతి రూఢియై జోడ్కల వేఁడి యొప్ప
సొంపునై వాలంబు దెంపునై హృదయంబు తంపరై క్రోధంబు తెంపుగదుర
దండియై శౌర్యప్రచండమై కిటిరూపు మెండునై కనకాక్షుభండనమున
గీ. మొండెములుజేసి ధారుణి దండి మెరయ నిలిపి జగములకెల్లను నెలమి యొసఁగి
భాసురుం డైనదానవభంజనుండు, కేశవుఁడు... 55

సీ. కమనీయరత్నసంఘటితహేమస్తంభ జృంభణోద్రేకవిజృంభణముగ
జననమహోద్రేకఘనచటచ్చటలసంభరితనాదము దిశల్ బ్రబ్బికొనఁగ
ఘోరదంష్ట్రాంకురకోపపావకశిఖల్ సౌదామినులపోల్కి సందడింప
రోషభీకరమెల్ల రోదసీకుహరంబు నిండి భూతంబుల బెండుపఱుప
గీ. దనుజసుతుఁ బ్రోచువేడుక మనమునిండ నఖసమంచితవాఁడిమి లఘువు లిడఁగఁ
బట్టి దితిపట్టిఁ జీరినజెట్టిమగఁడు, కేశవుఁడు... 56

సీ. పొట్టియై యదితికిఁ బట్టియై వాక్కులదిట్టయై భువనాలపొట్ట యగుచు
కల్లయై సద్గుణవల్లరై నిజములతల్లియై కరుణకుఁ గొల్ల యగుచు
విద్యుఁడై జగదేకవేద్యుఁడై భవరోగవైద్యుఁడై ఖండితచైద్యుఁ డగుచు
సారమై నిరుపమాకారమై మునిజనాధారమై భూతసంచారుఁ డగుచు
గీ. బలిసమూఁడుపదంబుల నిలను గోరి దివియు భువియును గొని వేడ్కలవిరళముగ
మఘువు నేలినదానవమహిమహరుఁడు, కేశవుఁడు... 57

సీ. ఘనతపోనియతిచేఁ గమలాప్తుఁ గను నంబు నిల్పఁజాలెడునట్టి నిశ్చయంబు
బాహుపరాక్రమపటిమచేఁ ద్రిపురారి విక్రమ మెన్న నివీరతయును
శౌర్యరసోదయధైర్యసామగ్రిచే వసుధేశులను ద్రుంచు వైరబుద్ధి
తండ్రియాజ్ఞను గన్నతల్లి నైన వధింప నోరకొను సాహస మురిమెములును
గీ. గలిగి జమదగ్నిసూనుఁడై యిలను బరగి సురనదీసూనుఁ డాదియౌ కురునృపాల
కోటి దునుమాడు నర్జునుకూర్మికాఁడు, కేశవుఁడు... 58
సీ. గాధేయుజన్నంబు గాచి బ్రోచుటకునై వెలసినవిక్రమకలితరసము
భూజాతపరిణయం బొనరించునప్పుడు హరునివిల్దునిమెడు సరసరసము
పట్టాభిషేకసంభ్రమ మొప్పునప్పుడు వనము కేఁగుట శాంతఘనరసంబు
దశకంఠుకంఠవిదారణం బొనరించువేళ మహాద్భుతవీరరసము
గీ. గలిగి యినకులజలనిధి నలినవైరి తారకబ్రహ్మమంత్రసుధారసంబు
గిరిజకును శంభునకు నిచ్చు పరమగురుఁడు, కేశవుఁడు... 59
సీ. కమనీయగోపికాసమితికుటీరముల్ కాంచనమణిమయాగారములును
ధేనుకదంబముల్ దివ్యవారణహయ ఘనసముత్కరము ప్రధానఘనము
లలితవ్రజాంగనావిలసితరుచిరంబు శ్రీభూసతుల దేహశోభనములు
వనములోపల నాలవర్గసంరక్షణ నొప్పగు లీలావినోదక్రీడ
గీ. లనఁగ విలసిల్లు శ్రీకృష్ణుఁ డనుజుఁ డనెడు శుభము లందుచు రేవతీసుదతిహృదయ
పద్మపంజరమున నున్న వరశుకంబు, కేశవుఁడు... 60
సీ. చోరదురాచారసారసంగ్రహులైన ధారుణీశుల భుజదర్ప మడఁచ,
పాపసంచయధనోపార్జితజనముల దుర్నయవృత్తులు దొలఁగ ద్రోయ
మదమత్సరాదిసమావేశహృదయుల నడవళ్ళడంచియు నిడుము సేయఁ
బుణ్యధనార్జితభూసురకోటికి నపకృతు లగువారి నుపమ జెఱుప
గీ. కాల మరయుచు బౌద్ధమై నీలగిరిని విహరణముసల్పు క్రొన్ననవింటివానిఁ
గన్నవన్నెలచిన్నదై చెన్ను మీఱు, కేశవుఁడు.. 61
సీ. దురితకర్మము జేయఁ దొడరి వర్తన వావి విడనాడి యజ్ఞానవివశు లగుచు
వేదార్థపటుతరవిత్తవిహీనులై క్షుద్రమంత్రప్రౌఢి శోభ మెరసి
కుటిలశేముషీసారపటుతరవిద్యల విహరణోద్రేకులై బహువిధముల
నార్పుల నిరసించి యతివలమతముల దిరుగుచుఁ బుణ్యంబు తెరువుఁ బోక
గీ. యున్న జగమెల్లఁ గనిక్రోధమెన్నికగుచు హయము నెక్కి యునసిబూనినయము మెరయ
ఖలుల దునుమాడి ధర్మము నిలను నిల్పు, కేశవుఁడు... 62
సీ. శ్రీరమాహృదయపంజరమధ్యసంచారి చాతుర్యశారికా సార్వభౌమ
నిగమసారపయోధి నిండి యఖండమై యుండు బ్రహ్మాండభాండస్వరూప

ఖండితశిశుపాల కమనీయతరచేల సత్యప్రధాన భాసావిలాస
మామాముదితవిక్రమాటోపధనరాశి సురనదీజన్మపాదారవింద
గీ. సుందరానందకంద గోవిందభక్త చందనా నందనందన యిందురార
యనుచుఁ బిలిచెడు దేవకీవనితసుతుఁడు, కేశవుఁడు... 63
సీ. కూసెనే కోయిల ల్గాసెనే వెన్నెల డాసెనే మరుఁడు బెన్గాసిజేయఁ
గేరనే కీరము లీమ్మతె భృంగసునాద భార మంతంతకు ఘోరముగను
వీచెనే కరువలి దోఁచకుండఁగ మెల్ల మెల్లన గంధంబు వెల్లివిరియఁ
బండెనే చెలిశయ్య నిండువేడుకమహో దండిదాసి కొసంగి దయజెలంగ
గీ. నేమిసేయుదు తాళ నాకెటుల దరము భరము శరదిందువదనుని చరణసరసి
జములశరణంటినని మ్రొక్కి సరసగతులవనితనీవేఁగి ద్రౌపదీవరునిసఖుఁడు కే... 64
సీ. మహనీయమోహాసమావేశమై మది కత్యంతకష్టము లమరఁజేసె
నిరతంబు కోరిక శరధితరంగము ల్గలయ బ్రాఁకుచు జిహ్వ నలముకొనియె
జక్కనిరవికెలోఁ బెక్కునిక్కెడుచన్నుదోయి మదాంధతఁ దోఁపఁజేసె
పతిరతి లేమిచే భవమందు వేసన పొడవుచే సంగము నొడిలె మిగుల
గీ. మదవతీ యేమిసేయుదు మమతలేని విరహపరిపాటి కోర్వ నాతరముగాదు
త్వరితముగఁ బోయి దనుజవిధ్వంసనుండు, కేశవుఁడు... 65
సీ. అంచిత మగువిష మాని కుచంబులఁ బాలిచ్చుపూతనన్ బట్టి చంపె
మాయాశకటమైన మనుజాశనుని ద్రుంచెఁ జెలఁగి తృణావర్తు బల మడంచెఁ
గారాగ్నిశిఖలసంకాశ మెల్ల హరించె నజగరంబునుబట్టి విజయమొందె
ధేనుకాసురుఁ డాదిదివిజారులను గూల్చె వనమందు వేడ్క గోవ్రజముగాచె
గీ. నట్టిబలవంతు ధీమంతుఁ డఖిలజంతు హృదయవిహరణశోభి యావృతదిగంతుఁ
డనఁగ విలసిల్లె నందుని కాత్మజుండు, కేశవుఁడు... 66
సీ. నందకుమార గోవింద మందరధర సుందరతరచరణారవింద
కనకాచలసుధీర కనకసుందరచేల ఘనమునిజనపాల కలితశీల
జలధరసంకాశ జనపాలకాధీశ జయపరాక్రమకీర్తి సతినివేశ
వననిధిగాంభీర్యవైభవ ధీమంత వ్రజకామినీవనవ్రజవసంత
గీ. రార నాపెన్నిధానమ రార యనుచు నందసతి బిల్వ వేడుక లంద మొప్పఁ
గనుఁగొనఁగ నేఁగు యదుకులకల్పకంబు, కేశవుఁడు... 67
సీ. మీనకేతనుఁడవై మేటియై శరవృష్టి నింపెను ఘనతరవృష్టిపోల్కి
నళులు ఝుమ్మనివేడ్క లలరి షడ్జమగీత విభవవారిధిలోన విఱ్ఱవీగె
శుకపికతతు లతిశోభ శోభిల్లంగ రవములుజేసెఁ బ్రాభవము దూల
విమలమరీచులు వెదజల్లుచును బంధు వెన్నెలల్ ఘటియించె విధుఁడు బెలుచ

గీ. నెట్లు వేగింతు విరహాబ్ధి నెటు తరింతు మదము నేరీతి నార్జింతు ముదిత నీవు
ఘనముగా నేఁగి నామానధనము గొన్న, కేశవుఁడు... 68

సీ. శ్రీవిదర్భతనూజాశృంగారసరసిలో నోలలాడెడుభక్తలోలుఁ డెవఁడు
వారణపతి పదవనజముబట్టిన మకరిని ద్రుంచినమహిముఁ డెవఁడు
సారంగికిని బాధ సంహరించి కటాక్షవర్షధారలు నించు వరుఁ డెవండు
మాయావిలాససమ్మానచతురభూతి చయహృదయాంబుజసార మెవ్వఁ
గీ. డట్టిమహనీయమూర్తి నాయాత్మ నిలిపి సన్నుతించితి యదుకులచక్రవర్తి
భూరిగుణశక్తి యాశ్రితభువనకీర్తి, కేశవుఁడు... 69

సీ. హరునికన్మంటచే హతమైననాటితోఁ దీరదే మదనవికారమెల్ల
కళలు హరించెడు ఘనశాపవశముచేఁ దీరదే కమలారి తేజమెల్ల
పెనుబాములను భక్తిప్రీతి నొనర్చినఁ దీరదా యెనె బాల మారుతంబు
బహుకోపమున సత్యభామ దిట్టిన నంతఁ దీరదే చిలుకలు గేరుటలును
గీ. ఏమె యీయింత వీటి కింతేమె బలము విరహజనులకు నివి ఘోరవిషము గాదె
నాకు నీబాధ మాన్పంగ శ్రీకరుండు, కేశవుఁడు... 70

సీ. వనిత నావయసెల్ల వలరాజుపాలాయెఁ గోరికవల్లులు కుఱుచలాయె
మెయికాంతి శయ్యకే మిగుల నర్పితమాయెఁ జూడ్కుల పతిరాకఁ జూడనాయె
గబ్బిగుబ్బలపొగ రుబ్బురైకకునాయె మురిపెమెల్లను చింతమూలమాయె
నాసలెల్లను విరహాగ్ని కర్పితమాయె వలపెల్ల నార్తికి పాలువడియె
గీ. కలికికొలకులజలములు వెలపనాయె భారమాయెను నిద్దుర దూరమాయెఁ
గాన నీవేఁగి భక్తులఁ గాచువాఁడు, కేశవుఁడు... 71

సీ. హరుఁడే నవఘనాకారుఁడే జగతి కాధారుఁడే కాలాగ్నిహారుఁ డతఁడు
శూరుఁడే దనుజసంహారుఁడే వార్ధిగంభీరుఁడే ఘనధైర్యసారుఁ డతఁడు
మారుఁడే గోపికాజారుఁడే నవనీత చోరుఁడే భూతసంచారుఁ డతఁడు
వీరుఁడే ధర్మనిస్తారుఁడే గుణగణోదారుఁడే రసికతాచారుఁ డతఁడు
గీ. లలనకలుములచెలిపజ్జ మెలఁగ నిలను గలిమి బలిమియుఁ దనభక్తగణము కొసఁగు
ఘనదయారసకలితుండు కంసవైరి, కేశవుఁడు... 72

సీ. తొగలరాయనికళల్ నగుమోమునందొప్పు మేఘసంకాశంబు మేననొప్పు
వరశంఖచక్రశోభనము గరములొప్పు భుజకీర్తులందంబు భుజములొప్పు
వరకిరీటప్రభల్ శిరమునఁ గడునొప్పు పలుకులకలిమియుఁ జెలిమినొప్పు
గమలాభ లెల్లను ఘనవక్షముననొప్పు కనకచేలద్యుతుల్ గటినినొప్పు
గీ. వేణువిభవంబు నధరసువీథినొప్పుఁ గమలములతీరు కన్నులగలసి యొప్పుఁ
గాన నీవేఁగి సుందరాకారవరుఁడు, కేశవుఁడు... 73

సీ. శృంగారకలిత నీలాపాంగలతికలు బెనసి దిక్కులకెల్లఁ గొనలు ప్రాఁక
దరహాసచంద్రికావరవిలాసరసంబు వృష్టికై వడి ధర వెల్లివిరియఁ
చరణసరోజసంచరణకింకిణికాలి ఝుంకృతి మేఘగర్జనము గాఁగ
వ్రజసుందరులమీఁద బ్రచురించు మోహాబ్ధులు వలపొప్ప మదనవిభ్రమము లనఁగఁ
గీ. కరుణ వెదజల్లుచును దల్చిఁ గాన నేఁగు పూర్ణకాముండు జగదేకపూజితుండు
పరమసంతోషభరితగోపార్భకుండు, కేశవుఁడు... 74

సీ. నరకాసురుని గెల్చి వరకరిగమనల కోర్కె లొసంగిన కోవిదుండు
మునిశిఖామణి నారదుని గాన ఘనతకు మెచ్చి మచ్చిక నిచ్చు లచ్చిమగఁడు
బిసరుహాళంబు వెసఁ జొచ్చి దాఁగిన పౌలోమిపతిఁ బ్రోచు భద్రమూర్తి
పన్నగపతిశిరఃపుంజంబుపై వేడ్క నటనసల్పిన యమునాదనుండు
గీ. నన్ను విడనాడినది యొక్క గన్నుదోయి మూసి నిమిరెంప నెఱుఁగఁ బెన్గొసి యొకవె
మదచకోరాక్షి వేబోయి మామమామ, కేశవుఁడు... 75

సీ. బోటిరో సౌందర్యమేటిరో రతనాల కోటిరో ముద్దులమూటరావె
లేమరో వరగుణధామరో ముఖజిత సోమరో పరిపూర్ణకామరావె
యింతిరో కంతుచేబంతిరో తేనియ దొంతిరో కీర్తిచేమంతిరావె
కొమ్మరో కలధౌతబొమ్మరో మదనాగ్ని జిమ్మవే కనులనె త్తిమ్మరావె
గీ. మానినీ రావె మదగజయాన రావె బాల వేరావె మరునిపూగోల రావె
యనుచుఁ బిలిచెడు వనమాలి దనుజహరుఁడు, కేశవుఁడు... 76

సీ. పంచశరార్తిచే వంచనబడలేను మించుబోఁడిరో పతి గొంచరావె
నించవే కరుణ నవ్వించవే వరహాల నెంచవే తములము గొంచబోవె
మంచిదే సతుల సాధించెదే వెతతతిమ్రుంచెదే నిపుడు బో చంచలాక్షి
కొంచకే నాతప్పు లెంచకే పగ యెద మించకే క్రొత్తవి కంచుకములు
గీ. తీర్చి నీకిత్తు పతి నను గూర్చినపుడు జేర్పు మోదము మ్రొక్కెద నేర్పుకొలఁది
పలికి సలలితతేజుఁడు భద్రమూర్తి, కేశవుఁడు... 77

సీ. రార వనమాలి రార యోగుణశాలి రార యోప్రద్యుమ్న రార కృష్ణ
యేర గోపికయిండ్ల కేఁగఁ బాడిర తండ్రి యింతులమతులు నీ వెఱుఁగ వయయొ
విరహసముత్పన్నవేదన కోర్వక తమకు వగిరులచేఁ దరుచు నిన్నుఁ
బొడుతురు కెమ్మోవి నొడుతురు శయ్యకుఁ గడువడి దార్తురు గాముకేళి
గీ. తమకు నిమ్మని గోరిక తమక మొప్పఁ గాన నీవందు బోకుర గానలోల
యనుచు గోపెమ్మ పలుక బెన్ఘనత నమరు, కేశవుఁడు... 78

సీ. చిన్నిక్రొన్ననవన్నెమిన్నసన్నుతు లొప్పు నంగదీధితి గలయంగ నొకతె
భ్రమరశోభావృతకమనీయతరవేణి వద్ధిక కలిగినముద్ది యొకతె

మల్లిమొగ్గలపొల్పుకెల్ల తుల్యం బగు రదనసంతతి గలముదిత యొకతె
కుంకుమనిర్మితకందుకములంబోలు చనుదోయి గలిగిన సఖియ యొకతె
గీ. పతికి నిపువంకలనుగూడి చతురవితతి గానములు చేయఁ జూచినకాంత జెప్పె
దాళఁజాలను నీవేఁగి దంతినేలు, కేశవుఁడు... 79

సీ. నిన్నటిరేయిని పున్నమవెన్నెల వన్నెలో నొకగొల్లచిన్నిపడుచు
చీరె విసర్జించి మీఁటినవేడుక రెండిండ్లసందునఁ గుండలోని
జలక మాడఁగఁ జూచి కలికిదగ్గిరఁ జేరి మాధవతీ మానసునిమందిరంబు
దాన నియ్యవె నాకు మానినీ సమయమై వచ్చిన వచ్చితి వరముగోరి
గీ. యనుచుఁ బలికినమాటలు వనిత వినక పాఱె నని వింటి నీరీతి భావ్య మటవె
నందతనయుండు త్రిభువనసుందరుండు, కేశవుఁడు... 80

సీ. అత్తింటికోడలు క్రొత్తగావచ్చిన నత్తయు మామయు నతిముదంబు
చేఁ గడునొప్పుచు శీతాంశుముఖికిని సకలభూషణములు చక్కదిద్ది
పడకటింటికిఁ జేర్చి కొడుకునుగూర్చినఁ బవ్వళించిరి వారు భద్రముగను
నది జూచి తానేఁగి పదిలముగాఁ దేలు నార లిద్దఱిమధ్య వై చెననుచు
గీ. వెలఁది యొక్కతె చెప్పిన వింటినమ్మ యిదియుఁ దగునటె యాభక్తసదయునకును
వనిత నీవేఁగి యదువంశవర్ధనుండు, కేశవుఁడు... 81

సీ. దధిభాండమున గోపతరుణియొక్కతె కవ్వ మమరిచి తరువంగ నపుడు వెన్న
గట్టిన యాపిట్టపట్టి తీసియుఁ జిన్నిచట్టిలోఁ బెట్టుట మట్టుదెలిసి
యుట్టిమీఁదివిపాలు పొట్టనిండగఁ గ్రోలి పట్టెడు పట్టెడు పట్టువట్టి
వెన్నంత దిని దానివన్నెలచన్నులు గన్నులు ముద్దాడి గదసి మూతి
గీ. కెంత కొంతయు రాసి యానంతిగమున తిన్న దనిచెప్పె నత్తతో వెన్నుఁ డనుచు
వింటి నీవింత జేసిన దంటకాఁడు, కేశవుఁడు... 82

సీ. రమణి కొక్కతెపుత్రి రాజీవదళనేత్రి కపుడు వివాహశోభాతిశయము
సమకట్టి బంధుల సతులఁ బెద్దల విప్రవరులను వాద్యాదిసరసగతులు
సమకూర్చి పతితోడఁ జక్కగాఁ గూర్చున్న సమయము గని వచ్చి రమణిపతిని
ధరద్రోచి తాఁ గన్యధారకుఁ గర్తను ననుచుఁ బల్కెనటంచు వనితజెప్పె
గీ. కలికి యిటువంటితగవులు గలవె భువిని నమితచతురతగలశౌరి కమరెగాక
సరసిజానన నీవేఁగి మరునిగురుఁడు, కేశవుఁడు... 83

సీ. వాటమై రత్నకవాటమై వజ్రాల వాడయై చెలువొందు మేడలోన
నేటియై శృంగారకోటయై విరిలతల్ తేటయై మెరసెడుతోటలోన
హాసమై లక్ష్మీనివాసమై జనమనోల్లాసమై యొప్పునివాసములను
ఖించునై తరిగొల్లు సంచునై సుఖము కాసించినై నాపట్టెమంచమందు

గీ. సరసగతులను నాతోడిమరునికదన వరసుపాండిత్యవైభవసరళి దేలు
రసికవరుఁడును సంపూర్ణరాజముఖుఁడు, కేశవుఁడు... 84

సీ. బాలుఁడై సుగుణాలవాలుఁడై రాధికాలోలుఁడై గోపరిపాలుఁ డగుచు
శూరుఁడై పాండవాధారుఁడై జగదేకవీరుఁడై సారగంభీరుఁ డగుచు
ధాముఁడై సుగుణాభిరాముఁడై నిజభక్తకాముఁడై దనుజవిరాముఁ డగుచు
మాన్యుఁడై సత్యవదాన్యుఁడై యరివర్గశూన్యుఁడై జగముల కన్యుఁ డగుచు
గీ. దనకుఁ దానైన మహిమ దేఁ దనరి నిరుపమానచాతుర్యవిభవసమ్మాన్యుఁ డగుచు
వెలసి కలుములచెలిపజ మెలఁగుప్రోడ, కేశవుఁడు... 85

సీ. అదెచూడు పూర్వాద్రి నుదయించె నుడురాజు గొప్పైనచిచ్చులకుప్ప యనఁగ
నిదెగనుంగొను ముద మొదవనిపయ్యెర వీచెను విరహాగ్ని వేఁడిపోల్క
నల్లదె వడివచ్చె నల్లనయ్య సుపుత్రు బలరమోద్రేక ముపద్రవముగఁ
జూడు ఝుంఝుమ్మని పాడుచు రోలంబ తతిచేరె ధ్వాంత మతిశయముగ
గీ. నెట్టులోర్తుము గోపాలుఁ డేలరాఁడె యనుచుఁ దల్లడమందు వ్రజాంగనలకు
గోర్కెలొసఁగెడు యదులోకకుంజరుండు, కేశవుఁడు... 86

సీ. చేడియ చూడవే వాఁడిమి దొలఁగియు భాస్కరుం డస్తాద్రిపజ్జ కరిగె
గోధూళి యాకాశవీధుల గమనించె గోపాలకులరొదల్ గొమరుమిగిలె
నంతకంతకుఁ గోడె సంతతిరంకెలు దిశలు బీఁటలుగాఁగ దేజరిల్లె
వేణునాదవినోదరాణిమనాణెమై కర్ణపుటంబులఁ గలయఁ బ్రాఁకె
గీ. వచ్చెఁ జూడుము నామది మచ్చికిచ్చు సుందరుండును నందునిమందిరుండు
ననుచు నెదురేఁగుమానినీజనులఁ బ్రోచు, కేశవుఁడు... 87

సీ. తలిరుబోఁడిరో ప్రభాతం బేలదోఁచెనే కుక్కుటధ్వనులతో నెక్కసముగ
నక్కరో తగచాలు జుక్కేలబాడిచెనే పూర్వదిశాంగన పొల్పు లలర
నుదయాద్రిరక్తిమ యిదివేల గన్పడ ఖగకులరవములగరిమ మెరయ
శీతవాతము మేలు పాతరవేలాడె నుదయకాలాంచితవిధులు జెలఁగ
గీ. కలికి కలకాలమును నిశిగలుగ నజుఁడు జేయఁడాయనె హరితోడఁ బాయకుండఁ
గలుగు ననిపల్కు వ్రజకులచెలుల నేలు, కేశవుఁడు... 88

సీ. కలికిరో గోవులగాయ కాననముకుఁ బయనమాయెనె గోపబాలకుండు
మదవతి రవియస్తమయము దాఁ బడకుండ రాఁ డెట్టులోర్తుమే కూడఁబోయి
వనమధ్యమున పశువర్గము గాతము పోదము రాఁగదే మాధవునితో
తలిదండ్రు లన్నలదమ్ములఁ బుత్రుల బంధువు లాజ్ఞలోఁ బడఁగనేల
గీ. గడుపలేమమ్మ దినిమేర గడువ నరిది యింతకును రాఁడె దేవకీయింతికొడుకు
అనుచుఁ దలపోయు వ్రజకామినినుల నేలు, కేశవుఁడు... 89

సీ. చల్లమ్మ నొకగొల్ల పల్లవాధరి యేఁగి చల్ల చల్లో యని పెల్లుకేక
వేయంగ విని దానిడాయంగఁ జనుదెంచి యోయంగనా చల్ల బోయు నాకు
నని కుండ డించి యావంతపయ్యెదచెంగు దొలఁగించి చనుదోయి గలయఁజూచి
యెంత ఖరీదు చన్బంతులు చెప్పవే యింతి నేగొందు బల్ సంతసమున
గీ. ననుచు మకరధ్వజునిక్రీడ కనువుజేసి గజిబిజి యొనర్చెఁ బంకజగంధి నపుడు
నంచు వింటిని నీవేఁగి మంచిగలుగు, కేశవుఁడు... 90
సీ. పాలో యనుచు గోపబాలికామణి వీథులందు పాలమ్మఁగ సందునుండి
యావిధ మరసి తా నచటి కేఁగియు దాని వద్దికనుద్దులు పెద్దఁజేసి
సుందరీ నీపతి మంద కేఁగుచుఁ జెప్పె బొందుగా నీతోడఁ బొందు మనుచు
నొక్కతె బవళింప నోపదు మానకు మానకుమా యని మరలఁ జెప్పె
గీ. గాన యీరేయి ననుదగఁ గలియుమనుచు, గంచుకము విప్పి కుచములు గదసిపట్టె
ననుచు వింటిని నీవేఁగి యబ్జకులుఁడు, కేశవుఁడు... 91
సీ. ఓరామనో కాంత లారామసీముల నారాము ననుజు జా డరయుటకును
మందారకురువిందమాధవిపున్నాగతాలతమాలహింతాలతరుల
నడుమను గొండలవడివాగువంతల సరయూతలప్రాంతధరణిజముల
వెదకి యొహోకృష్ణ సుదతుల నీరీతి వదలిపోవుట గడువాసిగాదు
గీ. అనుచు మొఱపెట్ట గాచె తా ననుచు వింటి వరగుణోదారు మాయావిహారసారు
మంజుభాషణు సుకుమారు మావిహారు, కేశవుఁడు... 92
సీ. లలనా దయారసకోలనా సువీక్షణ చలనా సుశీలతవలన రావె
బాలా మహాచిత్రచేలా ఘనకీర్తిజాలా రతీనాథుకోల రావె
భామా సుసౌందర్యసీమా శుభోదయధామా వినోదహృత్కామ రావె
నారీ మహాకార్యకారీ విరోధసంహారీ నితంబశృంగారి రావె
గీ. అనుచు వ్రజకామినుల మహాఘనత బిలిచి సారమృదురత్నకేళికాసౌధములను
నలరువిలుకాని కేళిలోపలను దేల్చె, కేశవుఁడు... 93
సీ. వారిజాక్షుఁడు నీళ్లదారిలోపల వ్రజనారీమణులఁ బట్ట మీరు వేడ్క
గాపుండి మదగజకామినుల్ గాజూచి నాగుబామును దెచ్చి నడుమవైవ
బెదరి వారందఱు బృథివిపైఁ గడవలు విడిచియు దెసలకుఁ బడిగఁబారఁ
గలకలనవ్వి యాకమలాక్షులను దొడ్డికెల్లఁ దోలియు పైఁటలెల్లఁ బట్టి
గీ. రవికెముడులెల్ల విప్పి చన్గవలుగప్పి గొప్పపనిచేసె నని నాకుఁ జెప్ప వింటి
నిప్పు డేఁగియు నామది కొప్పుకాఁడు, కేశవుఁడు... 94
సీ. ఖగరాట్తురంగ శ్రీకామినీహృద్రంగ కదనదానవభంగ ఘనశుభాంగ
రంగత్తరంగవిరాజితపదగంగ మామానసాంభోజ మహాపతంగ

యంగనావేషశోభాంగ మహోత్తుంగ రంగుబంగరుపట మంగురంగ
గంగాసుతుం డాదికౌరవకులసాంగ నిన్ను బ్రోయ చుటంచు చిన్నెవన్నె
గీ. వెన్నసన్నుతి మిన్నగువన్నెలాండ్ర మనసు లలరంగఁ బ్రోచిన మాధవుండు
నన్ను దలఁపక మఱచియున్నాఁడు గాన, కేశవుఁడు... 95
సీ. పోకురా పొరిగిండ్లఁ దేకురా వెన్నలు లోకు లేమందురు రాకుమార
నీకు రావలసిన శ్రీకరాంగనతతి జోకుగాఁ గాచిరి రాకుమార
రాకురా మాట నీవాకురా సిరిమాట జేకురురా తేట రాకుమార
గాకురా వెఱ్ఱిచికాకురా నీపోక మాకురా మంచివో రాకుమార
గీ. అనుచుఁ గనుదోయి ముద్దాడిచనులుగుడుపఁ దల్లితోడమిాఁదఁ బవళించువల్లనయ్య
చిన్నివన్నెలమొలనూలు జెన్నువాఁడు, కేశవుఁడు.... 96
సీ. రాకొమ్మ నీతోడి యేకొమ్మ లికసాటి జేకొమ్ము నన్ను నిజేశుపగిది
నాకిమ్ము నను గూడ నీకిమ్ము జేతును లోకమ్ము మెచ్చ విలోలనయన
నాకమ్ము మంగము నోకొమ్మ నీనెమ్మి లేకిమ్ము చెడె మది లోక మెఱుఁగ
ఆకొమ్మలందఱుఁ జేకొమ్మనఁగ వచ్చి తేకొమ్మ మదనాగ్ని వీఁకఁజిమ్మ
గీ. ననుచు వనితలగృహముల కనుదినంబు దిరిగి యరికట్టి ధనమిచ్చి మురిపె మొసఁగి
చతురవితతిని దిరిగెడుచక్రధరుఁడు, కేశవుఁడు... 97
సీ. చింతామణీవ్రజకాంతామణులమార సంతాప మణఁచినసాహసుండు
రాఁడాయె దిన మొకయేఁడాయెఁ బరులతో జోడాయె పుణ్యము లేదబోయె
సతతంబు మారునివెతలకే పాలాయె శృంగార మగునాదునంగమెల్లఁ
బొంగారుమనముతో రంగాధిపుడు వచ్చి తొంగిచూచినయట్లు దోఁచె మదికి
గీ. చాన వాఁడెందు నాకును గానరాఁడు పోయి వేసివు మధురకుఁ దోయజాక్షి
రజతగిరిధాముచెలికాఁడు రాధవరుఁడు, కేశవుఁడు... 98
సీ. మన్మథా నీరూపు మంటపాలైపోవు పవనుఁడా నిను ద్రాచుపాము మ్రింగఁ
గోయిలా నీకూఁత మాయమై నడుగంట జలజారి నిను రాహు వెలమి ద్రెంగఁ
గీరమా నీరవ మారిసార మడంగ మధుప నీగీతము మాఱ్ఱినుగలవ
కేకి నీకేఁకల రాకడ నశియింప శారికా నీపల్కు బేసుద్రుంప
గీ. ననుచు విరహానలార్చులఘునత కోర్వలేక పల్కినభామను లోక మెఱుఁగ
నేలు వలరాజజనకుఁడు నీలవిభుఁడు, కేశవుఁడు... 99
సీ. కమనీయసుందరాకారఘనద్యుతుల్ నవకళాకలితమై దివినిగప్ప
దరహాసచంద్రికావరవిలాసము దిశల్పరిపూర్ణనిర్మలపటిమ మెరయ
భక్తుల కభయంబు బలుకునాదోర్ధతి మధురమై జగతికి సుధను గురియ
వినతాసుతుసివేడ్క వనజభవాండము లుప్పధినాదముగతి ముసి మెలర

గీ. వడిగఁ జనుదెంచి సురలకు వరమొసంగి గిరిని నిరవుగ శరధిలో మరల దేల్చు
వరవితరణుండు యదుకులవర్ధనుండు, కేశవుఁడు... 100

సీ. ఘనుఁడు నీయిలమంత్రిగణములోఁ బూజ్యుండు శుభగుఁ డాపస్తంబసూత్రుఁడైన
పట్టాభిరామునిభార్య రాజమసతి కాత్మసంభవుఁడు విజ్ఞానమతియు
వరమృదువాగ్విరిసరసమాలికగాఁగ సీసపద్యశతంబు జేసి వేడ్క
నారుక్మిణీపతి కర్పణఁ జేసెను కవివరు ల్మెచ్చ వే ఘనతహెచ్చ

గీ. నట్టి గంగాధరునిబ్రోవ పట్టురమ్మ యనుచుఁ దెలిపియు సన్నుతు లమరఁజేసెఁ
గువలయాత్ముండు యదులోకకుంజరుండు, కేశవుఁడు వాని దేగదే కీరవాణి. 101

కీరవాణిశతకము సంపూర్ణము





శ్రీ రస్తు

# శివముకుందశతకము



శ్రీవరగిరిజానాయక
గోవింద లలాటనేత్ర గోకులతిలకా
భావజసంహార హరిహర
భావాత్మక శివముకుందపరమానందా.

క. దైవము లిద్దఱు నేకో దేవాది శ్రుతులవల్ల దెలియఁగ నొకటే
భావించెద మిము నేకీభావంబుగ శివ... 2

క. భక్తులపరిపక్వములకు వ్యక్తులు రెండౌటగాక వర్ణింపఁగ న
వ్యక్తం బని తెలియుట నిజభక్తి గదా శివ... 3

క. పరమానందయతీంద్రుఁడ సురుచిరముగ మిమ్ము వాక్ప్రసూనంబులచేఁ
గరమర్థిఁ బూజచేసెద పరమాత్మా శివ... 4

క. ఒకటై రెండై మూఁడై సకలంబై యేమిగాని సహజము బయలై
యకలంకమతికిఁ దోఁచును ప్రకటముగా శివ ముకుంద పరమానందా! 5

క. తనమహిమ తనకుఁ దెలిసిన దనయందే తోఁచి యణఁగుఁ దత్త్వములెల్లన్
దనమహిమ తెలియఁ దనకే పనుపడవలె శివ... 6

క. తనుఁ దాఁ దెలిసెడిమార్గం బనువుగ సద్గురులవలన నతిసులభంబౌ
వనయుక్తుల శాస్త్రంబుల బనిగొన దది శివ... 7

క. గురువాక్యము శాస్త్రార్థము గురుతుగఁ దనయనుభవంబుఁ గుదురుగ నొకటై
మది నిల్చునేని యదిగా పరమార్థము శివ... 8

క. మితిమేరలేనిజన్మము లతికష్టము లనుచు నెంచి యంతటఁ దత్త్వం
బతివిశదముగాఁ దెలియని బ్రతు కేటికి శివ... 9

క. అలతత్త్వము గురుకృపచే నలవడు నని నమ్మి మిగుల నాసక్తుం డై
తలపడవలె గురుభజనకుఁ బలుమారును శివ ముకుంద పరమానందా! 10

క. అల సద్గురుకృప లేకను తలపడి చదివితి ననుచుం దటపటసుద్దుల్
పలుకుచు తిరిగినఁ దెలివికి ఫల మౌనా శివ... 11

క. కంటెసఁగఁ గర్మజాలములుంటే బంధంబు దీరదో గురుపదముల్
కంటే మోక్షము చేరువవంటగదా శివ... 12

క. కొండఱు తత్త్వపుమాటల సందడిఁ బడి తెలిసినట్లు సద్గురుకృప లే
కుండు రనుభూతిఁ గానని పండలవలె శివ... 13

క. తాటాకులు ద్రిప్పుచు పదికోటులు చదువంగ నేమి గురువాక్యంబుల్
పాటించి తెలియ కది యేర్పా టౌనా శివ... 14

క. నిజమైనముక్తికొఱకై సుజనుఁడు సద్గురుని వెదకి సుస్థిరమతియై
భజియింపక గలదే గతి ప్రజలకు నిఁక శివ ముకుంద పరమానందా ! 15

క. గురుభజనఁ బాపములు చెడు గురుభజనను గర్మ ముడుగుఁ గోరిక లుడుగుం
గురుభజన యుక్తికర మగు పరమాత్మా శివ... 16

క. నాటినయామిక విడిచి పటాటోపము లేక నమ్రుఁడై గురుభజనం
బాటించక ననుభవ మేర్పా టౌనా శివ... 17

క. ఆదట గురుమతమున దేహాదులఁ దొలఁగంగ నేర్చునాతనిమదిలో
షో దిఁక సహజానందము పాదుకొనుఁ శివ... 18

క. వినినప్పుడె కనవచ్చును యనుభవి యాయోగివాక్య మాదరమునఁ దా
వినఁగూడనియహమికచేఁ బనుపడ దది శివ... 19

క. మాటల వినుకులఁ దగులను నూటిగ సద్గురుఁడు చూపఁ జూచినఁ గా కే
ర్పాటును గా దది కుజనులు పాటింపకు శివముకుంద పరమానందా ! 20

క. అతిచంచలమై తిరిగెడి మతి మీఁదయవల్ల నిపుడు మట్టుకు వచ్చెన్
గతిచెడి రెక్కలు విఱిగిన పతగమువలె శివ... 21

క. ఇలు వెడలి బయలుదేరక గెలిచే దేలాగు మాయఁ గినియుచు రాఁగా
నిలు సొచ్చి తలుపు మూసిన బలిమేదీ శివ... 22

క. బైలుగ మాయాభూతము హేలాగతి నొప్పఁ గాక యేలా తొలఁగున్
జాల వివేకపుఁజబుకుల పాలాడక శివ... 23

క. ఏయెడఁ బెద్దలసంగతి సేయంగా నిత్యసుఖము చేకొనవచ్చున్
మాయాభూతము తొలఁగు నుపాయం బిది శివ... 24

క. చాలం గర్మపుఁదొట్లన్ సోలంగా నుంచి మాయ జోలలు వాడున్
లాలీయని జీవులనే బాలుర గని శివ ముకుంద పరమానందా ! 25

క. తానే పరదైవంబని కానక తనకన్న వేఱు గాఁ దలఁచేదే
యూనినమాయారూపము భానునుతా శివ... 26

క. తను నే నెఱుఁగనిమునుపే తనమాటలు చెల్లెఁగాక తా మా యనఁగా
నను నే నెఱిఁగినపిమ్మట పనిగలదా శివ... 27

క. అంతా నేనై యుండఁగ నింతైనన్ మాయ కునికి యెక్కడి దయ్యా
యంతటఁ దొలఁగక నాతోఁ బంతంబా శివ... 28

క. కట్టిడిమాయ యనంగా రట్టుకు లోనాయెఁగాక భ్రమ యనికాదా
పట్టఁ బసలేని దని యే పట్టున నీఁక శివ... 29

క. ఔరౌర మాయ కంటే యేరీతిని తనగుణంబు లెఱుఁగ రటం చా
నేరమి జీవులపై నిడి పారెడి నీఁక శివముకుంద పరమానందా! 30

క. నలుదిశల నిక్కడక్కడఁ దలచూపఁగ లేక మాయ దాగెను కంటే
యలపూర్ణుఁడ నేఁ గాఁగాఁ బల ముడిగెను శివ... 31

క. కడుకబ్బురలకు నెల్లను నొడిగట్టిన మాయగుట్టు లొంగి నేఁ గనఁగాఁ
బొడచూప వెఱచి తానే వడిపోయెను శివ... 32

క. ఇది కల్లర ఛీయన్నా! వదలక యీమాయ కదియవచ్చిన నేమో
ముదిలంజెవలపు చాలును పదివే లీఁక శివ... 33

క. అవిరళతత్త్వం బెఱిఁగెడు సువిచారం బొకనిపాలిసొమ్మా మనుజుం
డెవఁడైన నేమి తెలివికి భవమోచన శివ... 34

క. ఏపాటు లేక తనలోఁ జూపట్టుచు వెలుఁగుచుండు సూక్ష్మబ్రహ్మం
బేపారఁగఁ దెలియ రయో పాపాత్ములు శివ ముకుంద పరమానందా! 35

క. శాంతంబై పూర్ణంబై యెంతయు బ్రహ్మంబు తెలివి కేర్పడ మాయా
క్రాంతముగా మదిఁ దలఁచుట భ్రాంతిగదా శివ... 36

క. పోషించి తత్త్వరచనల భాషించినఁ దెలియ లేక పామరమతులై
దూషణచేతురు కొందఱు పాషండులు శివ... 37

క. మెంచుకొనుతత్త్వవాసన లుండదు పరిపక్వహృదయమొగిఁ గాకుంటే
యెండినకసుగా యైనది పండౌనా శివ... 38

క. పుట్టించనిసుద్దులు చెవిఁ బెట్టిన నది లెస్సగాక పిమ్మట ధరలోఁ
బుట్టించెడిసుద్దులఁ జెవిఁ బట్టుదురా శివ... 39

క. వారక సంసారంబునఁ బోరాడిన నేమి విరతిఁబొందిన నేమీ
యారూఢ యోగి కది వ్యాపారంబో శివ ముకుంద పరమానందా! 40

క. ఘోరతరకర్మవాసన లేరీతిని జుట్టి పట్టి హీనులఁ జేయన్
మీఱిన యజ్ఞానుల కది భారంబో శివ... 41

క. వేషములవలన జనులఁ బ్రమోషించి మనీషివరుల మోదము జెరిచే
దూషకులఁ గూడి పెద్దలు భాషింపరు శివ... 42

క. అచ్చట నచ్చట నేర్చిన తచ్చన లోకకొన్ని యరచి తత్త్వం బని తా
మెచ్చిన నేమగు మాటల పచ్చళ్లది శివ... 43

క. అలయంగ భూమి నుదధిస్థలి కృష్ణనివాసమైన ద్వారక నడుమన్
లలిఁ దను గను శివయోగియె బలవంతుఁడు శివ... 44

క. నెల పొద్దులోన గట్టిగ నెలకొని చూడంగవలయు నీలజ్యోతిన్
వెలి **లో**ను గానిచూపున బలిబంధన శివ ముకుంద పరమానందా! 45

క. పరకార్యపరులు లోకులు పరమజ్ఞానులు స్వకార్యపరులై ధర**లో**
నిరతిశయసుఖముఁ గాంతురు పరమాత్మ శివ... 46

క. మేలైన బ్రహ్మవిద్యకు మూలై తగు రాజయోగసుస్థిరు లెచటన్
బూటకపుమంత్రవిద్యలఁ బాటింపరు శివ... 47

క. నలుగురి నొక్కటిఁ జేసిన నలుగురిలో బ్రతుకవచ్చు నాణెముగాఁ దా
నలుగురిపనులకుఁ దిరిగిన ఫల మంటదు శివ... 48

క. నలుగురి**లో**ఁ దలవంచుక నలుగురి**లో**ఁ గూడి మాడి నడవక వేఱై
పలుపోకలఁ దిరుగును ఛీ! బలహీనుఁడు శివ... 49

క. నలుగురికిం దా గుఱియై మెలఁగిన నది ముక్తిగతికి మేలై రాదే
నలుగురితో గూడనిదే పలుచనయా శివ ముకుంద పరమానందా! 50

క. తనయింటం దా నుండినఁ దనయిల్లే తనకుఁ జేటు దాఁ దెచ్చునయా
తనయిల్లు కాలవేసిన పనిమే లది శివ... 51

క. అద్దిర యనుభవ మెఱుఁగక వద్దనువా రెవరులేక వదరుచుఁ దిరిగే
పెద్దలసుద్దులు గిద్దులు బద్దలునా శివ... 52

క. తలఁపు చెడఁ గర్మములు చెడుఁ దలఁపు చెడన్ మాయచెడును దా నసుట చెడున్
తలఁపు చెడినతఁడె ముక్తికి బలవంతుఁడు శివ... 53

క. భావంబుఁ దలఁచుటెల్ల నభావము తలఁపుడుగు టెల్లఁ బన్నుగ భావా
భావాతీతము సహజము పావన మది శివ... 54

క. అసమానరాజయోగాభ్యసనంబునఁ బడమటింటఁ బదిలుండై తే
దోసఁ గేమిలేనిముక్తికిఁ బస వట్టిది శివ ముకుంద పరమానందా! 55

క. కలపండ్రెండు పదాఱును నలువదిరెండైన చోట నయముగ నొక్కటై
తెలివొందు వెరను గూడిన ఫలసిద్ధా శివ... 56

క. ఇల బొమ్మరిండ్ల**లో**పల నలువున మఱి చిన్ని పాప లాడుచునుండే
సులు వెఱిఁగి యచటఁ దనుఁ గన పలసిద్ధా శివ... 57

క. మీఱిన దుర్వాసనలను గూరిన మతి నణఁపనేర్చుఁగుశలుఁడు ధరలో
నారూఢియోగవిద్యా పారీణుఁడు శివ... 58

క. లోవెలి చూపులు రెండును బోవిడువఁ బదంతరమున బొలుపగుతత్త్వం
బావిధ మెఱుఁగును నిర్గుణ భావజ్ఞుఁడు శివ... 59

క. తలఁచినయది జడిమం బగు తలఁపుడిగిన శూన్యమగును దలఁచిన తలఁపే
సలలిత మగు చిద్బ్రహ్మము బలిబంధన శివ ముకుంద పరమానందా! 60

క. కన్నుల ముందఱఁ దెలివై కన్నది యదికాన్పటంచుఁ గన్న యతండే
పన్నగ నిజవిద్యాసం పన్నుఁడగున్ శివ... 61

క. కను వెలుఁగుననే చూచినఁ గనవచ్చును జీకటైనఁ గానఁగ వశమా
గను గంటనె తనుఁ గనవలెఁ బనివడి తా శివ... 62

క. లో వెలిఁ జూచిన నొకటే లో వెలిఁ గాకుండఁ జూడ లోనగు నొకటే
లో వెలిఁ దానై కనుఁబో భావజ్ఞుఁడు శివ... 63

క. ఒకటే రెండై తోఁపఁగ నొకటిని జెప్పంగ వలసె నొకటై యున్నన్
యొకటి నొక టేల సేయను బ్రకటముగా శివ... 64

క. తన్నెఱుఁగనిదియు నొకటే తన్నెఱిఁగినయదియు నొకటె తానన రెండై
యున్నది యొకటే సత్యము పన్నుగ నిఁక శివ ముకుంద పరమానందా! 65

క. మఱచినయదియును నొకటే మఱపున నెఱిఁగెడిది యొకటె మరువని దొకటే
మఱ పెఱుకగాని దొకటే పరమాత్మ శివ... 66

క. చూడఁగఁబడినది యొకటే వేడుకఁ జూచెడిది యొకటె వీటికి వెలియై
చూడఁగవలసిన దొకటే పాడి యిదే శివ... 67

క. కానఁగఁబడినది కాన్పను మానుగఁ గనుఁగొన్నవాఁడు మఱివీటికి లోఁ
గానియతండును దానే భానునుతా శివ... 68

క. ఇలఁ బసిఁడి లేక యేసొమ్ములు గలుగునె తాను లేక మునుకొని జగముల్
పొలుచునె యది తాఁ గాదా బలిబంధన శివ... 69

క. జీవునికిఁ గాక దేవుఁడు దేవునికి న్వేఱె యొక్క దేవుఁడు గలఁడే
దేవుడు తానే యనఁ గను భావజ్ఞుఁడు శివ ముకుంద పరమానందా! 70

క. మొదటను విత్తే జగమై యదియే లేనట్టు దాని కగునాధారం
బది దీనియందె నిలుచును పదిలముగా శివ... 71

క. అతులితసుజ్ఞానముచే క్షితిలోపల జీవముక్తిఁ జెందకయుంటే
వెతగాదె తాను బ్రతికిన బ్రతుకెల్లను శివ... 72

క. తనువెత్తఁ జేటు కింకా తను వెత్తఁగఁ జూతురేమొ తామసులు భువిన్
దనువు చెడి ముక్తి దొరకే పని బూనరు శివ... 73

క. తలఁపునఁ గలిగినబంధము తలఁపున నూడంగఁగొట్టి తా నుంచవలెన్
ములు ముంటఁ బుచ్చువిధమున బలిబంధన శివ... 74

క. యాగంబులు మంత్రంబులు యోగంబులు మగుడజన్మ మొసఁగును సకటా
యోగులకర్మము లుడుగఁగ బాగాయెను శివ ముకుంద పరమానందా! 75

క. దానంబులు సత్క్రియలును బూని మఱెన్నైనఁ జేయఁ బుట్టుక చెడునే
దానికి వైరి వివేకము భానునుతా శివ... 76

క. చేయఁగవలసినపని విధి సేయుటగా కనుచు నెంచి సేయుచుఁ జేసీ
జేయనియాపని యదియును బాయరయా శివ... 77

క. సృష్టికి గలిగినతను విది నష్టం బని తొలఁగి తన్ను నయముగ నంత
ర్దృష్టిఁ గనలేనిమనుజుఁడు భ్రష్టుఁ డయా శివ... 78

క. ఊనము జడమును విత్తును గానిది చైతన్య మెట్లు గానేర్చునయా
తానే దానికి మూలము భానునుతా శివ... 79

క. తానెఱుఁగనిపని యైనన్ బూనఁగ మది కెట్టు లింపు పుట్టును జెపుమా
దానికి నేరం బే దిఁక భానునుతా శివ ముకుంద పరమానందా! 80

క. అన్నియుఁ దానై యుండఁగ నన్నియుఁ దాఁగాక తోఁచె నణఁగక వేఱా
యన్నియుఁ దనలో నైక్యము పన్నుగ నిఁక శివ... 81

క. ఎఱిఁగెడి యెఱుకను గొని తా నెఱుఁగుదుననువాఁడుజడుఁడు యెఱిఁగెడునెఱుకన్
మఱచినయెఱుకే తా నగుఁ బరమాత్మా! శివ... 82

క. ఒండెఱుఁగక తనుగంటే పండినకాన్పగుచు సర్వపరిపూర్ణం బై
యుండును నదియే కన్నుల పండు వయా శివ... 83

క. యెఱిఁగినయది జడిమంబగు యెఱుకవిడన్ శూన్య మగును యెఱుకే యెఱుకై
నిరతిశయానందం బగు పరమాత్మా! శివ... 84

క. కన్నది కన్నట్టే చనె విన్నది విన్నట్టె యణఁగె వినకే కనకే
యున్నది యే నై యుంటిని బన్నుగ నిఁక శివ ముకుంద పరమానందా! 85

క. కన్నది విన్నది గాకే యున్నది తుదముట్టఁ గంటి నోహో! యిది నే
నెన్నఁడు నెఱుఁగనిదే సం పన్నత యో శివ... 86

క. మాటల నందెడు నిడఁగను తాటోటులు గాక దానఁ దత్త్వంబగునే
మాటలతత్త్వము లవి పరి పాటిగదా! శివ... 87

క. మేదినిఁ గుజనులు ఘనులతో వాదింతురు నిజముఁ గన్నవారింబలెనే
యేదైనను దూషణ సం పాదింతురు శివ... 88

క. కోటివగవిద్య లెల్లను కూటికిఁ గా కాత్మ విద్యకును సరియగునే
బూటకము లనక కుజనులు పాటింపరు శివ... 89

క. యోగంబంచురు కొందఱు యోగముగా జ్ఞానమంచు రొగిఁ గొందఱిలన్
యోగాజ్ఞానంబులు సమ భాగంబులు శివ ముకుంద పరమానందా! 90

క. జ్ఞానం బన యోగం బనఁ గానఁగవలె నొకటికొకటి కావడికుండల్
పూనిక నొక్కటి నిలువదు భానునుతా శివ... 91

క. ఏకంటఁ జూడ లేఁడట యేకాంటను జూచుటింక నెఱుఁగుట యేలా
గాక న్నే యీకన్నా ప్రాకటముగ శివ... 92

క. ఏకనుచూ పాకనుచూ పేకంబై నిండి నిండి హెచ్చిన సుఖమా
వాకునఁ జెప్పఁగ వశమా ప్రాకటముగ శివ... 93

క. దృశ్యము కూడిన తెలివి య వశ్యము బంధంబుసుమ్ము వర్ణింపంగా
దృశ్యముఁ బాసిన తెలివి యు పాస్యం బది శివ... 94

క. బంధములగు కర్మంబులు సంధింపక దృశ్యములను జ్ఞానాగ్నికి దా
నింధనములు సేయఁగవలె బంధురగతి శివ ముకుంద పరమానందా! 95

క. చెన్నుగ దీపముఁ జూడఁగ నెన్నఁగ వేఱొక్కదీప మేటికిఁ జెపుమా
తన్నుండే తనుఁ గనవలెఁ బన్నుగ నిఁక శివ... 96

క. అజ్ఞాని యొకఁడు గల్గఁగ సుజ్ఞానిఁగఁ జేయవలసె సుజ్ఞానై తే
సుజ్ఞాని నేల చేయను ప్రాజ్ఞుఁడనా శివ... 97

క. ధరలో విధియు నిషేధము నెఱుఁగఁడు తద్‌జ్ఞుండు మింటి కెగిరెడు తురగం
బెఱుఁగునె మిట్టయుఁ బల్లముఁ బరమాత్మా శివ... 98

క. దూషణ యసూయకొఱకే భాషాంతరరచన లెల్ల బ్రతుకులకొఱకే
వేషము వంచనకొఱకే పాషండము శివ... 99

క. మెండుగ లోకులవలెఁ దా నుండఁగవలెఁ గూడకున్న నొక్కెఁడ మానై
యుండఁగవలె నేర్పరియగు పండితునకు శివ ముకుంద పరమానందా! 100

క. ఇద్ధర నయ్యష్టమహా సిద్ధులు వలె ననుచు భ్రాంతిఁ జెందుదురేమో?
సిద్ధం బగుము క్తికిఁ బ్రతి బద్ధంబులు శివ... 101

క. అణిమాదిసిద్ధపురుషులు గుణవంతులుగాఁగజనులు కొనియాడుదు రా
గుణహీనులఁ బొగడుదురే ఫణిశాయీ శివ... 102

క. ఒకతుచ్ఛసిద్ధిఁ జూపిన సకలజనుల్ వానిఁ జూచి సన్మానముగా
నకలంకజ్ఞా నందురు ప్రకటముగా శివ... 103

క. అణిమాదిసిద్ధు లెల్లను గణుతింపఁగ మోక్షవిధము గా దెట్లంటే
నణిమాదులు సగుణంబులు ఫణిశాయీ శివ... 104

క. సిద్ధులు జ్ఞానం బగునా సిద్ధియు దృశ్యంబు లవియుఁ జేపట్టుదురా
శుద్ధములు గానిసిద్ధు ల బద్ధంబులు శివ ముకుంద పరమానందా! 105

క. మహిమఁ గనలేరు లోకులు మహిలో బోధం బపారమహిమ యదె గదా
మహిమవలె నందు రజ్ఞులు బహుళముగా శివ... 106

క. ఇహమందలిమంత్రౌషధ విహితము పీవిధులను వివేకములేకే
మహి మని చూతురు మూఢుడు బహువనితిగా శివ...

క. సుజ్ఞాన మహిమ యెప్పుడు సుజ్ఞానియె యెఱుఁగనేర్చు సుస్థిరమతి యై
యజ్ఞాని తెలియనేర్చునె ప్రాజ్ఞునిగతి శివ...

క. పరమానందయతీశ్వర విరచిత మీశతక మిలను విఖ్యాతముగా
కరుణింపుత్రిజగధీశ్వర పరమాత్మా శివ...

క. పరతత్త్వం బిది శతకము పరమరహస్యంబు ముక్తిభాజన మిలలో
వరయోగివిలాసం బిది పరమాత్మా శివ ముకుంద పరమానందా !

క. హరి హర గిరిధర పురహర గరుడధ్వజ నీలకంఠ కనకాంబర శం
కర మాధవ గౌరీధవ పరమాత్మా శివ ముకుంద పరమానందా !

శివముకుందశతకము సంపూర్ణము





శ్రీరస్తు

# కవిచౌడప్ప శతకము



కారము పద్యాదిని
ప్రాకటముగ నుండెనేని బహుదోషములన్
రేకడఁచి శుభము లొసఁగును
గాకోదర కుండవరపుఁ గవిచౌడప్పా॥ 1

క. శ్రీపతి పుల్లూరి పట్టణ గోపాలుఁడు సదయుఁడగుచుఁ గుంతీసుతులం
గాపాడినటుల మమ్మును గాపాడును గుండ॥ 2

క. ఉండఁగనిచ్చును నీపై బాండవమధ్యమునిమీఁది పక్షము గోపా
లుండగు పుల్లూరివాసుఁడ ఖండితయశ కుండ॥ 3

క. ఎంతెంతో దీర్ఘాయుష్మంతుఁడవై మిగుల బుద్ధిమంతుఁడవై శ్రీ
మంతుఁడవై మను లక్ష్మీకాంతునికృపఁ గుండ॥ 4

క. వెయితల లొక వెయికన్నులు వెయిచేతులు పదము లొక్క వెయిగల పురుషుం
డియ వలయును దీర్ఘాయువు గయికొమ్మని కుండ॥ 5

క. మందరగిరిధర సనకసనందన ప్రహ్లాదవరద నారదనుత గో
విందయనువారు ముక్తిం గందురుగద కుండ॥ 6

క. వనజభవాదులుఁ దారొక పనిఁబూనినవేళ మొదటఁ బ్రార్థన గణనా
థునిఁ జేయకున్న సాగుట కనము వినము కుండ॥ 7

క. పండితముఖ్యులు ధారుణి దండియు భవభూతి కాళిదాసులు; నుతియొ
వ్వండును నిడుఁ గృతులవారి కఖండితయశ కుండ॥ 8

క. నిను భారవిభట్లను నాచనసోముని మాఘుకవినిఁ జతురుని శ్రీనా
థు నుతింతు సుకవితకుఁ దిక్కనఁ దలఁతును గుండ॥ 9

క. పెద్దనవలెఁ గృతిఁజెప్పినఁ బెద్దనవలె, నల్పకవిని బెద్దనవలెనా?
ఎద్దనవలెఁ మొద్దనవలె గద్దనవలెఁ గుందా॥ 10

క. అందములై వినఁబడినఁ జెవి కందములై మంచి నీతికందములై తే
లందఱు చదువుదు రభినవ కందర్పా కుందా॥ 11

క. ముందటి దినములలోనం గందమునకు సోమయాజిఁ ఘనుఁడందురు నేఁ
డందఱు నిను ఘనుఁడందురు కందమునకుఁ గుందా॥ 12

క. కందము నీవలెఁజెప్పే యందము మఱిగాన మెవరియందునఁ గవిసం
క్రందన యసదృశనూతన కందర్పా కుంద 13

క. కందములఁ బ్రాసగణయతు లందముగాఁ గవిత చెంద అల్లరు విను నీ
కందంబులు రసవన్మాకందంబులు కుందా॥ 14

క. కందంబులు సకల జనానందంబులు సరసమధుర నవరసఘుటికా
బృందంబులు నీ కవితా కందంబులు కుందా॥ 15

క. మునుపటి సుకవుల నీతులు జననుతములు కుందవరపు చౌడుని నీతుల్
వినవినఁ దేట తెనుంగై కనుపడుఁగద కుందా॥ 16

క. నీతుల కేమి యొకించుక బూతాడక దొరకు నవ్వుపుట్టదు ధరలో
నీతులు బూతులు లోకఖ్యాతులురా కుందా॥ 17

క. బూతని నగుదురు తమతమ తాతలు ముత్తాత మొదలు తరతరముల వా
రే తీరున బూ తెఱిఁగిరి ఖ్యాతిగ మఱి కుందా॥ 18

క. పదినీతులు పది బూతులు పది శృంగారములు గల్గు పద్యములు సభం
జదివినవాఁడే యధికుఁడు గదర్పా కుందా॥ 19

క. లంజలు రాకుండిన గుడి రంజిల్లదు ప్రజలమనసు రాజిల్లదుగా
లంజల నేల సృజించెను గంజజుఁ డిలఁ గుందా॥ 20

క. పడఁతుకయును వంకాయయు నడగు సమూలంబు మధుర మందులలోఁగా
మెడ మొదలుఁ దొడిమ మొదలుం గడు మధురము కుందా॥ 21

క. వేయాఱు వగల కూరలు గాయ లనేకములు ధాత్రిఁగల వందులలో
నాయకములురా కాఁకరకాయలు మఱి కుందా॥ 22

క. అంభోజాక్షుల లోపల రంభయె కడు నందగత్తె రాగంబులలో
గాంభీర్యము గల రాగము కాంభోజియె కుందా॥ 23

క. నానీతి విననివానిని భానుని కిరణములు మీఁద బారని వానిన్
వానను దడియనివానిని గానమురా కుందా॥ 24

క. కాకులు వేవే లొక్కతుపాకిరవము విన్న నులికిపడవా మఱి నా
ఢాకకునగు నాలాగే కాకవులకుఁ గుందా॥ 25

క. వేడుకపడి విన వలదా నాడోడు కవిత్వమైన నలుగిరిలోనం 26
గోడిగము సేయునాఁడే గాడిదరా కుంద॥

క. విద్దెల మే లెఱుఁగని నరుఁ డెద్దేసరి గడ్డితినెడి దెద్దా పసులం 27
దెద్దుకుఁ గొంత వివేకము కద్దప్పా కుంద॥

క. పెద్దలమంచును రాజులవద్దను గూర్చుండి నీచవాక్కులు పలికే 28
పెద్దలు భువిలోఁ బీతిరి గ్రద్దలుగా కుంద॥

క. తా రాజసభల మెలఁగుట తా రసికతఁ జెలఁగు టెల్లదన బ్రదుకునకా 29
పూరే డేఱుక తినదా కారడవులఁ గుంద॥

క. కుక్కుటము లూరఁబందులు కుక్కలు తమకడుపు పెంచుకొనవా ధరలోఁ 30
బెక్కండ్ర మనుపఁజాలమి కక్కుఱితి కుంద॥

క. ఉందు రుపకారహీనులు కొందఱు దొరవద్ద శివునిగుడిపై నుండే 31
నందులవలె బిగియించుక కందములను గుంద॥

క. బుద్ధి గలుగు దొరయైతే ఇద్దరి కొక పారుపత్య మీఁదగదు సుమీ 32
ఇద్దఱి యెడలను నష్టము కద్దప్పా కుంద॥

క. దొరవద్ద నెవఁడు చనవరి నరు లతనికిఁ బ్రియముసేయు న్యాయంబరుదా 33
హారివాహనమని మ్రొక్కరె గరుడుని గని కుంద॥

క. దొరయెంత ప్రౌఢుఁడయ్యును సరసను నియ్యోగిలేక సాగదు; వలదా 34
శరమెంత వాఁడియైనను కరవైఖరి కుంద॥

క. కరణముగావలె సరసుఁడు కరణ మవశ్యంబు సకల కార్యంబులకుం 35
గరణము ముల్లోకవశీకరణముగద కుంద॥

క. కరణంబని తను నడిగినఁ గరుణఁబిలిచి యొక్కకాసు కవి కియ్యనిచో 36
గరణము పేరు సపిండీ కరణమురా కుంద॥

క. ధరఁ గవిభట మాన్యంబులు హరియింపఁగ లెక్కకవిలె నటించెడి యా 37
కరణము పేరు సపిండీకరణముగద కుంద॥

క. దేవుఁడు దేవుండనఁగా దేవుం డాదివినుండి దిగివచ్చేనా 38
ఈవిగల దొరయె దేవుఁడు కావంగను కుంద॥

క. ఎన్నఁగల యడవిమృగముల కన్నీరేమైన వేటకానికి ముద్దా? 39
మన్నాపుదొరకుఁ బేదల కన్నీరటు కుంద॥

క. సముఖము దొరకక దొరకిన సుముఖుండై తమ్ముఁ గండ్లజూడని దొరతో 49
నమరునె పేదలు మనవికి గమకించుట కుంద॥

క. రాచతనానకు జందెపుఁ బోఁచటరాగుఱుతు రిపులఁబొరిగొనుటయుఁ జేఁ 41
జాచిన నిచ్చుట శరణనఁ గాచుటరా కుంద॥

క. ఇయ్యఁగ నిప్పించఁగల యయ్యలకేగాని మీసమందఱ కేలా
రొయ్యకు లేదా బారెడు కయ్యమునకుఁ గుంద॥ 42

క. తగుపాటి కవుల కియ్యని మగముండలమూతిమీఁద మంగలియేలా
దిగఁ గొఱుఁగడయ్యె మీసము ఖగరాడ్బల కుంద॥ 43

క. బండగులాములు యాచకతండంబుల కియ్యలేరు తము దండించే
మిండల కిత్తురు ధగడీగండలు మఱి కుంద॥ 44

క. మొండిగులాములు యాచక తండంబులకీరు లంజతమ్ములకైతే
దండిగ నియ్యంజూతురు ఖండితముగఁ గుంద॥ 45

క. బియ్యమున మెఱికయుండిన వెయ్యాఱున్నట్టు దోఁచు విను దాతలలోఁ
గొయ్యగులా మొండుండును గయ్యమునకు గుంద॥ 46

క. ఏమియ్యని దొరపద్యము నామంబిడి చదువుచెల్ల నాలుకతీఁటా
రామకథా భారతమా కామింపఁగఁ గుంద॥ 47

క. అత్తమొలకోక దొలఁగినఁ దత్తఱపడి రాజు నీతిఁదప్పిన సుజనుం
డత్తఱిఁ గడఁ దొలఁగవలె జగత్తున మఱి కుంద॥ 48

క. నాఁడయినఁ బొగడుగను మఱునాఁడయినను నుచితమెఱిఁగి నాణె మొసంగే
వాఁడు త్రిలోకవదాన్యుఁడు గాఁడా మఱికుంద॥ 49

క. వేసరక యిచ్చు దాతకుఁ గాసుసుమీ మేరువంత కనకంబైనన్
గాసే మేరువ లోభికి వాసిగ మఱికుంద॥ 50

క. అతిలుబ్ధు వేడఁబోయిన వెతనొందుచు వానిమోము వెలవెలఁ బాఱున్
అతిసారరోగ పీడితుగతి నప్పాకుంద॥ 51

క. ఆఁకొనివచ్చిన యతిథిని వాకిట నిలఁబెట్టి యింటివాఁ డశనము దా
నే కుడువ మన్ను గుడుచుట గాకేమిర కుంద॥ 52

క. తినఁజాలక యేధర్మము గనఁజాలక పరమలోభి కట్టెలుకూర్చె
ధనమెల్ల నేలపాలని గనుమప్పా కుంద॥ 53

క. మిండలకొడుకులసిరి పెసుదండుగులకెగాని దానధర్మములకు రా
కుండు మహీమండలమున నఖండితయశ కుంద॥ 54

క. ముద్దుల కొడుకులు కలిగినకొద్దిని ధర్మంబు చేసికొనరు తరించే
బుద్ధినెఱిఁగి తమపిండము గ్రద్దలు దినఁ గుంద॥ 55

క. కులశీలమానుషాదులు గలనరులకుఁగాఁక కీర్తికత్తరి కేలా
తలుపేల చాఁపగుడిసెకుఁ గలదే భువి కుంద॥ 56

క. అనయము పేదలపట్లన్ వినయముగలవాఁడు భువిని వెలయుచు నూఱేం
డ్లును నిండ మనుచుఁ బరముం గను నప్పా కుంద॥ 57

క. అతిథుల బంధుజనంబుల యతులను సము నడుగవచ్చు యాచకతతులన్
క్షితిఁ బూజించి నరుఁడు సద్గతిఁ బొందును గుంద॥ 58

క. తనసతి యిడఁగా మనుమలు తనయులు తలిదండ్రు లన్నదమ్ములు బంధుల్
దినదినమును భుజియించుట ఘనవిభవము కుంద॥ 59

క. తనయునికి బరదేశికిఁ బెనిమిటికిని నొక్కరీతి విందిడియెడు నా
వనితను బుణ్యాంగన యని ఘనులందురు కుంద॥ 60

క. చోరకైనఁ బేదకైనను వేరవరి యిల్లాలికైన వేశ్యకునైనన్
గరగరికతనము బాగగుఁ గరుణాంబుధి కుంద॥ 61

క. మునుపాడి వెనుక లేదను పెనుగొంటుగులామునోరు పెంటలగుంటే
యని తలఁచి ఘనుఁడు సత్యమె కనవలెరా కుంద॥ 62

క. ఆడినమాటలు తప్పిన గాడిదకొడుకంచుఁ దిట్టఁగా విని మదిలో
వీఁడా కొడుకని యేడ్చును గాడిదయును గుంద॥ 63

క. మూలిక క్రియకొదిగినదే నాలిక సత్యంబుగలదె నడపినవాఁడే
యేలిక వరమిచ్చినదే కాళికరా కుంద॥ 64

క. పరవిత్తము గోమాంసము పరసతి తనతల్లి యనుచు భావించిన యా
నరుఁడు నరుండా రెండవ కరివరదుఁడె కుంద॥ 65

క. కొండవలెఁ బెనిమిటుండఁగ మిండనిఁ జవిమరగి కడల మీఱుచుఁదిరిగే
రండను యమపురిఁ జీల్తురు కండలుగాఁ గుంద॥ 66

క. వగలాఁడి చెంతనుండిన మగవానికి సూరకుండ మనసయ్యేనా
తగుసరసమ్ముల నాడక ఖగపతిబల కుంద॥ 67

క. వగలాఁడికి ముసలాతఁడు మగఁడైతే దానిచింత మఱి యింతంతా
జగదీశుఁడు తానెఱుఁగును ఖగపతిబల కుంద॥ 68

క. సారములేవి సంసారికి, భారములేవి గోపురంపుఁ బ్రతిమకుఁ, బిప్పిన్
సారములేవి, గుడిసెకుఁ బ్రాకారములేవి, కుంద॥ 69

క. అప్పయినను ముప్పయినను నొప్పియయినఁ జెప్పికొనఁగ నోరాడేనా
అప్పటి తహతహ యా రంగప్పఁ డెఱుఁగుఁ గుంద॥ 70

క. పులి నాకివిడుచు దైవముగలనాఁటికి, దైవబలము గలుగని వేళం
గలహించి గొఱ్ఱెకఱచును గలియుగమునఁ గుంద॥ 71

క. పాండవు లిడుములఁబడరే మూఁడవ్యుఁడు కోఱుతఁబడఁడె మహిఁ బ్రాకృతమె
వ్వండోపు మీఱిచనఁగ నఖండితయశ కుంద॥ 72

క. లంజకు ధన మీఁదలఁతురు రంజనగలదైన; మూఢురాలేయైనన్
గింజలుపడె డీఁజాలరు గంజికి మఱికుంద॥ 73

క. లంజెయును బీరకాయయు ముంజెయుబాల్యమునఁ జాలమోహముగొలుపున్
రంజన చెడిముదిరిన వెనుకంజూడరు కుంద॥ 74

క. పొగడ్రాగని నరుబ్రతుకును పొగడంగా నియ్యలేని భూపతిబ్రతుకున్
మగఁడొల్లని సతిబ్రతుకును కగడుసుమీ కుంద॥ 75

క. మారునిఁగేరెడు రూపము సారస్యముఁ గల్గు విభులు సమకూఱుటకున్
వారిజగంధుల పూజలుకారణముర కుంద॥ 76

క. గుడిసెయు మంచముఁ గుంపటి విడియమును బొగాకుఁ దన్ను విడనొల్లనిమేల్
పడఁతియుఁ గల్గిన జలియెక్కడిదప్పా కుంద॥ 77

క. మనుజుఁడు నేర్పరియైతే కొనవలెరా మంచి ముద్దుగుమ్మను లేదా
మునివృత్తినుండి మోక్షముగనవలెరా కుంద॥ 78

క. అప్పయినఁ దీసి తినవలెఁ బప్పును వరికూడు, వయసు భామామణులన్
మెప్పింపఁగవలెఁ, జలువలె కప్పఁగవలెఁ, గుంద॥ 79

క. పండుగ పండుగ యందురు పండుగదినమేమి వయసు పడుచులకడఁ దా
నుండినదినమే పండుగ ఖండితముగఁ గుంద॥ 80

క. దినములలోపల నుత్తమదినమే తద్దినము; నాఁటితిండికి సరియే
దినములను వెదకిచూచినఁ గనమప్పాకుంద॥ 81

క. పప్పేపస బాపలకును ఉప్పే పస రుచులకెల్ల నువిదలకెల్లన్
గొప్పే పస దంతములకుఁ గప్పే పస కుంద॥ 82

క. బట్టలు పస తురకలకును గిట్టలు పస గుఱ్ఱములకు క్షితినాథులకున్
బొట్టలు పస చెరువులకును గట్టలు పస కుంద॥ 83

క. అంగీ పస వేపార్లకు బంగేపస సాహెబులకుఁ బసిగాపులకున్
జంగిలి పస రవికలకును కంగులు పస కుంద॥ 84

క. మాటలుపస నియోగికిఁ గోటలు పస దొరలకెల్ల ఘోటకములకున్
దాఁటులు పస బెబ్బులులకుఁ గాటులు పస కుంద॥ 85

క. వానలు పస పైరులకును సానలు పస వజ్రములకు సమరంబులకున్
సేనలు పస మృగజాతికిఁ గానలు పస కుం॥ 86

క. కొమ్ములు పస మదకరికిని సొమ్ములు పస వారసతికి సుదతికి వాగ్జా
లమ్ములు పస దోవతులకుఁ గమ్ములు పస కుంద॥ 87

క. ఆకులు పస వృక్షములకు నీఁకెలు పస పక్షితతికి నింతులకెల్లన్
వాకులు పస పిండములకుఁ గాకులు పస కుంద॥ 88

క. వెన్నెలపస రాత్రులకును వెన్నులుపస సస్యములకు వెలఁదులకెల్లన్
గన్నులుపస యందున్ వాల్గన్నులు పస కుంద॥ 89

క. మీసము పస మగమూతికి వాసముపస యిండ్లకెల్ల వనితలకెల్లన్
వేసము పస బంట్రౌతుకు గాసముపస కుంద॥ 90

క. పయ్యెద పస పడఁతులకును వియ్యము పస పెండ్లికెల్ల విందులకెల్లన్
నెయ్యము పస నెఱరౌతుకుఁ గయ్యము పస కుంద॥ 91

క. ఇంటికిఁ బదిలము బీగము ; వింటికిఁ బదిలంబు నారి, బిగియొడ్డాణం
బుంట నడుమునకుఁ బదిలము, గంటికి బదిలంబు ఱెప్ప, కవి॥ 92

క. ఎడ్డెమగలు కొందఱు తమబిడ్డలఁ బెరుమాళ్ల పేరఁ బిలువక వేతే
యొడ్డారపుఁ బేరిడుదురు గడ్డలుదినఁ గుంద॥ 93

క. నారాయణ యని సుతునిం బేర నజామిళుఁడు వేగఁ బిలిచినముక్తిం
జేరిచెఁగద హరినామము గారవమునఁ గుంద॥ 94

క. చిత్తము శ్రీహరిపైఁ గించిత్తును నిలుపంగలేని చెడుగుల మడియన్
మొత్తి యమభటులు పొడుతురు కత్తులతోఁ గుంద॥ 95

క. తులసీదళముల హరిపదజలజంబులు పూజసేయు సరసుల యమదూ
తలుచూచి యేమిసేయంగలరప్పా కుంద॥ 96

క. ముంతెడుచమురున హరి కత్యంత మనస్సిద్ధి దీప మనుదినమిడు వాఁ
డంతమునఁ జేరులక్ష్మీకాంతునిపురిఁ గుంద॥ 97

క. అలసట వేసటనైనం గలనైనన్ నగుచునైన గరుడధ్వజునిం
దలఁచినవారలఁ జేరవు కలుషంబులు కుంద॥ 98

క. తనమదిలోపల దశరథతనయులలోఁ బెద్దవానిఁదలఁచిన జన్మం
బనయంబు పావనంబని ఘనులందురు కుంద॥ 99

క. దశమి నొకపూట నేకాదశి రేవగ లుపవసించి ద్వాదశి నొకపూ
టశనముగొను పుణ్యుఁడు లోకశరణ్యుఁడు కుంద॥ 100

శ్రీకవిచౌడప్పశతకము సంపూర్ణము.






శ్రీరస్తు

# గువ్వలచెన్నశతకము


పార్థసారథీ! నేఁ
బాపాత్ముఁడ నీదుపాలఁ బడినాఁడ ననుం
గాపాడుమనుచు నాంతర
కోపాదు లడంచి వేఁడు గువ్వలచెన్నా! 1

క. నరజన్మ మెత్తి నందున సరసిజనాభు నెదలోన స్మరియించుచుఁ ద
చ్చరణములు మఱవ కుండిన గురుఫలమగు జన్మమునకు గువ్వలచెన్నా! 2

క. ఎంతటి విద్యల నేర్చిన సంతసముగ వస్తుతతులు సంపాదింపన్
జింతించి చూడ నన్నియు గొంతుకఁ దడుపుకొను కొఱకె గువ్వలచెన్నా! 3

క. సారాసారము లెఱుఁగని పేరజులకు బుద్ధిఁజెప్పఁ బెద్దలవశమా?
నీరెంత పోసి పెంచినఁ గూరగునా నేలవేము? గు... 4

క. అడుగునకు మడుఁగు లిడుచును జిడిముడిపాటింతలేక చెప్పినపనులన్
వడిఁజేసి నంతమాత్రన కొడుకగునా లంజకొడుకు? గు... 5

క. ఈవియ్యని పదపద్యము గోవా? చదివించుకొనఁగఁ గుంభినిమీఁదన్
ఈవిచ్చిన పదపద్యము గోవామఱిఁజదువుకొనఁగ గు... 6

క. ఇరుగుపొరుగువా రందఱుఁ గరమబ్బురపడుచు నవ్వఁగా వేషములన్
మఱిమఱి మార్చిన దొరలకు గురువగునా? బ్రాహ్మణుండు గు... 7

క. అనుభవము లేనివిభవము లనుభావ్యయకానియాలు నార్యానుమతిన్
గనని స్వభావము ధర్మముఁ గొనని సిరియు వ్యర్థమెన్న గు... 8

క. పదుగురికి హితవు సంపత్ప్రదమును శాస్త్రోక్తమైన పద్ధతి నడువన్
జెదరదు సిరి హరిభక్తియుఁ గుదురునుగద మనెని నెన్న గు... 9

క. వెలకాంత లెంద ఱైననుఁ గులకాంతకు సాటి రాదు కువలయమందున్
బలువిద్య లెన్ని నేర్చినఁ గులవిద్యకు సాటిరావు గు... 10

క. కలకొలఁది ధర్మముండినఁ గలిగినసిరి కదలకుండుఁ గాసారమునన్
గలజలము మడువులేచిన గొలగొల గట్టు తెగిపోదె? గు... 11

క. తెలిసియుఁ దెలియనివానికిఁ దెలుపంగలఁడే? మహోపదేశికుఁడైనన్
బలుకం బాఱనికాయము గొలుపంగలఁడెవఁడు మడ? గు... 12

క. చెలియలిభాగ్యము రాజ్యంబుల నేలుచు జనుల ద్వేషమునఁజూచుచుఁ గ
న్నులమత్తతఁగొన్నాతఁడు కొలసికిగాపున్న వాఁడు గు... 13

క. అపరిమితవాహనాదిక మపూర్వముగనున్న యల్పుఁడధికుండగునా?
విపులాంబరవాద్యంబులఁ గుపతియగునె గంగిరెద్దు? గు... 14

క. పందిరి మందిరమగునా? వందిజనం బాప్తమిత్రవర్గంబగునా?
తుందిలుఁడు సుఖముఁగనునా? గొంది నృపతిమార్గమగున? గు... 15

క. మిత్రుని విపత్తునందుఁ గళత్రమును దరిద్రదశను భ్రాతలగుణముల్
బాత్రాది విభక్తంబున గోత్రను గనుగొనఁగవలయు గు... 16

క. అంగీలు పచ్చడంబులు సంగతిఁగొనుశాలుజోడు సరిగంచుల మేల్
రంగగు దుప్పటు లన్నియు గొంగళి సరిపోల వన్న! గు... 17

క. స్వాంతప్రవృత్తిఁ గార్యా నంతరమున మిత్రలక్షణంబు సుదోర్యహో
గాంతరమున బంధుత్వముఁ గొంతైనంతటన చూడు గు . 18

క. పురుషుండు తటస్థించిన తరుణమునం దరుణిగుణముఁ దరుణిననంతన్
దొరికినఁ బురుషుని గుణమును గురుబుద్ధీ! తెలియవలయు గు... 19

క. కలిమిఁగల నాఁడె మనుజుఁడు విలసనముగ కీర్తిచేత వెలయఁగ వలెరా!
గలిమెంత యెల్లకాలము కులగిరులా కదల కుండ? గు... 20

క. బుడ్డకు వెండ్రుకలున్నన్ గడ్డముకానట్ల కార్యకరణుల సభలన్
దొడ్డగఁ జూతురె? తలపై గడ్డలు బుట్టంత లున్న? గు... 21

క. వనజజకులులును శూద్రులు ననియెడి భేదంబు లేక యందఱు నొకరీ
తిని గొని యాచారాదుల గుణముల సరి సుంద్రుముందు గు... 22

క. కల్లుఁద్రావి నంజుడుం దిను ఖలుసుతుఁడు వకీలెయైన ఘనమర్యాదల్
తెలియవు బ్రాహ్మణుఁడైనను కులపాంసనుఁ డనఁగఁదగును గు... 23

క. వారిది వారిది ధనమొక కారణమున వచ్చిపడఁగఁ గన్నులుగన కె
వ్వారినిఁ దిరస్కరించును గోరెఁడు ధర్మంబు లేక గు... 24

క. ఇలుఁగలఁడె? పరివ్రాజకుఁ డెలమింగొనునెట్లు వేశ్య? యీనివిటునెడన్
గులకాంత విత్తమడుగునె? కొలఁదిఁ గలదె అంకులాడి గు... 25

క. ధన మతిగఁ గల్గి యున్నను దనయులుఁ దనయులును గల్గి తనరుచున్నన్
ఘనలోభియు నిఱుపేదయు గుణముల సరియగుదు రెన్న గు... 26

క. చండాల కులుఁ డొసంగిన తండులముల బ్రతికినట్టి ధాత్రీశకులుల్
నిండుతనం బెఱుఁగుదురే? కొండికలఁ జరింత్రు గాక గు... 27

క. సిరిఁగలిగినంత బంధూత్కరములలో నెవరురారు ప్రవ్యాసూయా
పరతాశాపసులయి పదుగురు చూచి హసింతు రంచు గు... 28

క. సంపద గలిగిన మనుజుని కొంపకు బంధువులు కుప్పకుప్పలుగాఁగన్
సొంపుగ వత్తురు పేదకుఁ గుంపటు లన సుంద్రువారె గు... 29

క. నీచునకు ధనము గల్గిన వాచాలత గల్గి పరుషవాక్కు లఱచుచున్
నీచ కృతి యగుచు మది సంకోచము లేకుండఁదిరుగు గు... 30

క. అల్పునకు నెన్ని తెల్పినఁ బొల్పుగ నిల్వవవి పేడబొమ్మకు నెన్నో
శిల్పపుఁ బనులొనరించినఁ గోల్పోక యలారుచున్నె గు... 31

క. పిత్రాద్యైశ్వర్యముచేఁ బుత్త్రిలుఁ బౌత్రులును ధర్మబుద్ధిఁ జరింతుర్
చిత్రగతి నడుమఁగల్గిన గోత్రంబు చిత్రగతిఁదిరుగు గువ్వలచెన్నా! 32

క. ధర నాఁడుపడుచు సిరిచే నిరతంబును బొట్టు నించి నీల్గెడుమనుజుం
డొరులెఱుఁగకుండ జూతో గుఱుతుగ సీఁతఁబడు టొప్పు గు .. 33

క. గొల్లింటఁ గోమటింటను దల్లియుఁ దండ్రియు వసింప దానువకీలై
కళ్ళు మద మెక్కినతనకి గుళ్ళైనం గానరావు గువ్వలచెన్నా... 34

క. కాళ్ళం జేతులఁ జెమ్మట నీళ్లవలె స్రవించుచుండ నిరతము మదిలోఁ
గుళ్లక వకీలు నని తన గోళ్లం గొఱుకుకొను ద్విజుఁడు గు... 35

క. సవతితన మున్న చుట్టలు భువి నెఱనుగ నుండి సమయమున దూరంబై
నవుచుందురు రావేడినఁ గువచనములు పల్కుచుంద్రు గు... 36

క. తనవారి కెంతగల్గినఁ దనభాగ్యమె తనకు నగును దగువాజులకుఁ
దునతోఁకచేత వీఁచునె? గుణియైనఁ ఘోటకంబు గు... 37

క. అతి చనువిచ్చి మెలంగఁగ సుతసతులైన నిరసించి చులకనచేతుర్
మతమెఱిఁగి చరింపందగుఁ గుతుకముతో మనుజుఁడెపుడు గు... 38

క. "చెన్న" యనుపదము మునుగల చెన్నగుపుర మొకటి దీనిచెంతను వెలయున్
సన్నుతులు వేల్పునుతులును గొన్నాతని కరుణచేత గువ్వలచెన్నా! 39

క. ధర నీపేరపురంబును గిరిజేశ్వర పాదభక్తి కీర్తియు నీయు
ర్వర నుతులుఁగాంతు విని యొక గురువరముగ నెంచుకొనుము గు... 40

క. తెలుపైన మొగముగలదని తిలకము జుట్టును దృజించి తెల్లయిజారున్
దలటోపిఁగొనఁగ శ్వేతముఖులలో నొకఁడగునె ద్విజుఁడు గు... 41

క. వెల్లుల్లిఁ బెట్టి పొగిచిన పుల్లని గోంగూరరుచిని బొగడఁగవశమా?
మొల్లముగ నూనివేసుక కొల్లగ భుజియింపవలయు గు... 42

క. నీచున కధికారంబును బాచకునకు నాగ్రహంబుఁ బంకజముఖికిన్
వాచాలత్వము బుధసంకోచముఁగడు బాధకములు గు... 43

క. దుడ్డన నెఱుఁగవి తలిపాటొడ్డుగఁగొను విద్యచే మహోద్యోగము తా
నడ్డైనఁగనులకీఁగల గొడ్డువలెఁ జరించుచుండు గు... 44

క. బుడుతలు భోగంబులు సిరి యడరుకొలంది గనకార్యమందతిహితులై
తొడరికడుఁ జెడుదు రిలపైఁ గుడియెడమలు లేకముందు గు... 45

క. కసకసలు కాయగూరల బుసబుసలగు త్రొంపనుండు బుడుతలయందున్
రుసరుసలు కోపియందును గుసగుసలు రహస్యమందు గు... 46

క. కరకర నములుటయందును బరపరయగు నెప్పుడు చుఱుకు వ్రాతలయందున్
జురచుర కాలుటయందును గొరకొరయగుఁ గోపదృష్టి గు... 47

క. కలిమిగల లోభికన్నను విలసితమగు పేదమేలు వితరణియైనన్
జెలమైన మేలుకాదా ? కులనిధియంభోధికన్న గు... 48

క. విను మన్నీలశిఘార్సునఁ దనునమ్మినవానిపనులు ధ్వంసించువకీ
లైనమున్నవాఁడు తిరిపెముఁ గొనునాతఁడు చల్లవాఁడు గు... 49

క. సజ్జనులు సేయునుపకృతి సజ్జను లెఱుఁగుదురుగాక సజ్జనదూష్యుల్
మజ్జనమునైన నెఱుఁగరు గుజ్జగు నంబలినిగాక గు... 50

క. తడతడ భీతహృదయముల బెడబెడయగుఁ బట్టుబట్టవిడఁ గట్టు నెడన్
బడపడ బాదుటయందును గుడగుడయన్నముడుకందు గు... 51

క. పాగా లంగరకాలును మీఁగాళ్లనలారఁబంచె మేలిమికట్టుల్
సాగించుకండువాల్పయి కోఁగాయిఁకఁగానమెన్న గు... 52

క. వెలమాంధ్రవీథులంజనఁ దలఁపు లవారిఁగ జనించి తమమిత్రులతోఁ
గలిసి షికారునెపంబునఁ గులుకుచుఁ బోవుదురుముందు గు... 53

క. ఎన్నఁగలజీవరాసుల యన్నిఁటిగర్భమునఁబుట్టి యటమనుజుండై
తన్నెఱిఁగి బ్రతుకవలెరా కొన్నాళ్ళకు నెచటనున్న గు... 54

క. కామినులకు సంతుష్టియుఁ గాముకులకు వావివరుస కఠినాత్మునకున్
సామోక్తులు విశ్వాసము కోమటులకుఁ దలఁప సున్న గు... 55

క. లొడలొడయగు వదులందును బుడబుడనీళ్ళందుబుడ్డి మునుఁగుటయందున్
గడగడ చెవిబాధయెడన్ గొడగొడ లప్రస్తుతోక్తి గు... 56

క. సంకటములచే మెయిగల పొంకంబెల్లను నడింగి పొలుపరినడువన్
జంకుంగలిగియు మెల్లన కొంకకముండింటికేగు గు... 57

క. ధనమైనంతట భూముల తనఖాలును విక్రియములు తరువాతసతీ
మణిభూషణాంబరంబులు గొనుటయు విటలక్షణములు గు... 58

క. నిత్యానిత్యము లెఱుఁగుచు సత్యంబగుదానిఁ దెలిసి సత్కృత్యములన్
నిత్యముజేయుచు దశదిక్సత్యముగా మెలఁగుమన్న గు... 59

క. ధనమే మైత్రినిఁదెచ్చును ధనమేవైరమునుదెచ్చు ధనమేసభలన్
ఘనతనుదెచ్చును నెంతటి గొనముల కుప్పలకునైన గు... 60

క. జనకుని గుణవిద్యలుగల తనుజుఁడు తనుజుండుగాక ధారుణిలోనన్
దనుజుఁడు దనుజుండగుఁ దద్గుణవిద్యలు లేకయున్న గు... 61

క. అక్కఱకగు చుట్టములకు మ్రొక్కఁగవలెఁగానిచూచి మూల్గెడువారల్
లెక్కిడుట కొఱకెయోర్వని కుక్కలు మేఁకమెడచళ్లు గు... 62

క. నిజవారకాంతలైనన్ బూజుఁగులలారఁగమరసభుజులనధములన్
గజిబిజిలేక గ్రహించుచు గుజగుజ బిట్ట కలరింత్రు గు... 63

క. ప్లీడరులమని వకీళ్ళి వాడుకచెడ స్వేచ్ఛఁదిరిగి పాడుమోసములన్
గూడనివారింగూడుచుఁ గూడెముల జరింత్రుముందు గు... 64

క. ఇల్లాలబ్బెనటంచును దల్లింగని తిట్టికొట్టి తరమెడితనుభృ
త్తల్లజునకు భువిఁ గీర్తియుఁ గుల్లలుగద దివిసుఖములు గు... 65

క. తలపరువు నోరె చెప్పును లలికాయలపండుపరువు రంగే చెప్పున్
కలవారి జనమునడకయుఁ గులమును వేషంబు చెప్పు గు... 66

క. వేములఁ దినునలవాటును భామలగని పీడుటయును బరితోషమునన్
బాములమైత్రియునేర్చినఁ గోమటితోమైత్రివలయు గు... 67

క. ఇలఁగోమటి జెలికానిగఁ దలఁచుచుదద్ధితముగాఁగఁ దలన్నాల్కవలెన్
మెలఁగుట నేర్చినగడుసగుకులకర్ణిని గూడవలయు గు... 68

క. తనహితవుఁ గోరుసతిగల దనుకనె గృహనివసనంబు తగుఁ బురుషునకున్
దనుకడుపు శక్తికొలదిగ గొనవలయుఁ బదార్థములను గు... 69

క. తనతల్లియొక్కపటువును దన దగు నోరెపలికటించుఁ దథ్యంబనియే
సునృపులు ఘోషాఁబెట్టిరి గుణాఢ్యులన్యమగుచునను గు... 70

క. చుట్టఱికముఁ జేసికొనన్ గట్టడిగాఁ దిరిగితిరిగి కార్యంబైనన్
మిట్టిపడుచు మాట్లాడఁడు గుట్టించుని యోగివరుఁడు గు... 71

క. ఎంతధికారంబున్నను సంతతమును బాలయెడల సత్కులజాతుం
డెంతయు నమ్రతఁ జూపును గొంతైనను మిడిసిపడఁడు గు... 72

క. వేషములచేతనొకటను భాషాపతికులులు మొదలు పంజులవఱకున్
శేషించి యొకఁడు నుండఁడు ఘోషాయును బోవుముందుగు... 73

క. సధవయు విధవయు నొకటిగ బుధులీక్షింపగనుంద్రుపొంకముమీఱన్
అధమంపువేషభాషలఁ గుధరములనఁ గదలకుంద్రు గు... 74

క. నీతియెఱుంగని నీచున కాతతరాజ్యము లభింప నధికుండగునా
నాతివలెను నటియించునె కోఁతికి స్త్రీవేషమిడిన గు... 75

క. తక్కువతరగతిగలనరుఁ డెక్కువయగువానిఁగాంచియేడ్చుచునుండున్
జక్కఁగఁ గరి వీథిం జన గుక్కలు గని మొఱుగకున్నె గు... 76

క. పరువునకొకటగు బంధూత్కరమున ధనవంతునధికుగా నధనికునిన్
గరమల్పునిగాఁ జూతురు గురి నెన్న ధనంబుతిరమె? గు... 77

క. తొత్తునకే శివమెత్తఁగ నత్తఱి మ్రొక్కవలెననెడినార్యోక్తివలెన్
వొత్తుకొడుకైన రాజును గ్రొత్తగ సేవింపవలయు గు... 78

క. కంగాబుంగాగొట్టిన పొంగినమిరియాలనేతి మొనటిపిడుచత్తో
మ్రింగిననాఁకలి నడఁచుటకుంగలనజ్జును హరించు గు... 79

క. సంగీతము నాట్యము గణికాంగనలవిగాని యవి కులాంగనలవియా?
పొంగుచు వాద్యము అచ్చలకుం గొనిచని పాడఁగలరె? గు... 80

క. జాలివిడిన చెలికానిని మాలనిగా నెన్నవలయు మఱియును బనికిన్
నూలినదై చెట్టెక్కెడి గోలాంగూలమనవలయు గు... 81

క. ముట్టంచు మాసమునకొక కట్టడిచేయఁబడె దాని కట్టుఁదెలియకే
రట్టొనరింతురు గర్భపు గుట్టుం దెలియుటకుఁగాదె? గు... 82

క. ఆలికిఁ జనువిచ్చినచోఁ దేలికకులమందుదైనఁ దేలికచేయున్
లాలించిన కొలఁదిగ ననుకూలతఁ గొను నధికకులజ గు... 83

క. అవసరవిధిఁ బరువెఱుఁగని నివసనమున కరుగనగు ననేకావృత్తుల్
భువివిత్తముఁ గొనిపలుకని కువాక్కులు వకీళ్లెసాక్షి గు... 84

క. ధనవద్గర్వులు కొందఱు ఘనమనుచుం బఙ్క్తిభేద కలితమ్ముగభో
జనముం గావింతు రటులఁ గొను టఘమందురు బుధాళి గు... 85

క. చెడుబుద్ధి పుట్టినప్పుడు సడిచేయక తనదుహృదయసాక్షి యెఱిఁగి నీ
వుడుగుమిది తగదనుచు జనకుఁడువలెఁ గృపఁ జెప్పుచుండు గు... 86

క. మేడయొకటి కలదనికడు వేడుకలంబడుచు విఱ్ఱవీఁగుచు నీచుం
డాడకుఁ బరులెవ్వరు రాఁ గూడదనుచుఁ బల్కుచుండు గు... 87

క. లోభికి వ్యయంబు. త్యాగికి లోభిత భీరునకు యుద్ధలోలత్వమ్మున్
వైభవము పతికి బ్రాణ క్షోభంబుగఁ దోఁచుచుండు గు... 88

క. సిరిగలుగ సుఖము గలుగును సిరిసంపదలున్న సుఖము చింత్యము భువిలోఁ
దరువు చిగిర్చినగోమగు గురుతఁగొనదె కాయలున్న? గు... 89

క. తక్కువవానిని రమ్మని యెక్కువవానిఁగనొనర్ప నెంచినఁగాడ
మ్మక్కఁగ నందలముంచినఁ గుక్కకున కుఱుకకున్నె గు... 90

క. తబ్బిబ్బుగాఁడు క్షుద్రుఁడు సబ్బండుగ నిష్ఠబున్న సబ్బునఁగడుగం
బొబ్బలిడ నల్లశ్వానము గొబ్బున తెల్లనిది యగునె? గు... 91

క. జారిణి తనవగుపనులె హ్వారలుఁ జూడరనుబుద్ధి వర్తించు నిలన్
క్షీరముఁ దాగుబిడాలము కోరిక లోఁ దలఁచునట్లు గు... 92

క. వాకొనెద గూనమునుగల చాకలియధికారియైన జనములసుఖముల్
చేకొనిన కొఱవిచేఁ దలఁ గోకికొనినయట్లులుండు గు... 93

క. పక్కలనిడి ముద్దాడుచుఁ జక్కఁగఁ గడుగుచును దినముసబ్బుజలముచే
నక్కఱదని యస్పృశ్యపుఁ గుక్కలఁ బెంచుదురు ద్విజులు గు... 94

క. కాంచనచేలుని విడిచి ప్ర పంచమున న్నీచులిండ్ల పాలయ్యుఁగడున్
జంచలయగు సిరిపోశకుఁ గుంచితమతి యగుట తగదు గు... 95

క. చింతలఁ జివుకుచు నున్నను స్వాంతము నెపుడైనహరునియందుంచఁదగున్
అంతట నాఁచున్నసరసి గొంతట రేవైనభంగి గువ్వలచెన్నా!... 96

క. వెలయాండ్రవలెను బనిపా టలువిడి సంగీతమును నటన మభినయమున్
గులవిద్యలుగాఁ గైకొని కులసతులు చరింత్రు ముందు గు... 97

క. లోభికివ్యయంబు సోమరి యాభామకుఁ బనియు నిర్ధనాత్మునకునప
త్యాభివృద్ధియును బహు గోభర్తకు నఘము లురువు గు... 98

క. సరియైనవారితోడను నరుగఁగవలె నొక్కపనికి నటుకాకున్నన్
విరసఁపుఁబల్కులు పల్కుచు గురివిడి పొమ్మనఁగఁగలరు గు... 99

క. తన్నుమునుపు చదివించిన మన్నిని విలేఖనమున మాన్యజనునకున్
సున్నిడి యరిచే విత్తముఁ గొన్న వకీల్చల్లవాఁడు గు... 100

క. వెలయాలు లజ్జచేఁజెడు నిలఁబాఱుఁడు చెడుదురాశ నెదసంతుష్టిన్
విలసిల్లి భూధవుఁడు చెడుఁ గులసతిచెడు లజ్జలేమి గు... 101

క. భువినొకఁడు చెడును మఱియొకఁ డవిరళముగ వృద్ధిఁబొందు నదివిధివశమా
రవియుదయించును నొకదెసఁ గువలయపతి క్రుంకునొకెడ గు... 102

క. ఎవ్వరి కెయ్యదిచెప్పిన నెవ్వరువినరెయ్యదియును నెట్టైనరుల్
మవ్వముగఁ జూచు చుండును గువ్వలనఁ జరింత్రుముందు గు... 103

క. ఎప్పటికైనను మృత్యువు తప్పదని యెఱింగియుండి తగినచికిత్సం
దప్పింప నెఱుఁగకత్తఱి గుప్పున నేడ్చెదరదేల? గు... 104

క. జరయును మృత్యువు మొదలుగ మరలఁగ రాకుండునట్టి మార్గంబేదో
గురు తెలుఁగఁ జేయుమని శ్రీ గురుగురుని భజింపవలయు గు... 105

క. పరమార్థము నొక్కటెఱిఁగి నరుఁడు చరింపంగవలయు నలువురిలోఁ బా
మరుఁడనఁగఁ దిరిగినను దన గురియొక్కటి విడువకుండ గు... 106

క. చతురాస్యుని సృష్టియు ఘటకృతివర్యుని భఁగిగాన నేకగతి సర
స్వతిచర్య లల్లియుండును గుతుకముతోఁ జూచుచుండు గు... . 107

క. పాపము లంటఁగనీయక ప్రాపొసఁగి శరీర మొసఁగి పరమపదంబున్
జేపట్టియొసఁగి కృష్ణుఁడు గోపికలను గరుణఁగాచె గు... 108

క. మగవారి లక్ష్యపెట్టక తెగివీథుల నంగడులను దిమ్మరియెడి యా
మగనాలు దుర్యశంబునకుఁ నగుదురగు న్విడువవలయు గు... 109

క. గుడివడును నూయిపూడును వడినీళ్లకుఁ జెరువుదెగును వలమిలఖిలమా
చెడనిది పద్యముసుమ్మీ కుడియెడమలుచూడకన్న గువ్వలచెన్నా! 110

క. ఇప్పద్యము లన్నిఁటిలోఁ జెప్పిన నీతులను మదినిఁజేర్చి తెలిసినన్
దప్పక పదుగురిలోఁగడు గొప్పగ నీతిపరుఁడగును గువ్వలచెన్నా! 111

గువ్వలచెన్న శతకము సంపూర్ణము





శ్రీ ర స్తు

శ్రీసత్యానందసరస్వత్యైనమః

# సంపఁగిమన్న శతకము



శ్రీమానినీమనోహర !
సోమార్కవిశాలనేత్ర ! సురనుతగాత్రా !
దామోదర నీలమణీ
శ్యామా ! నను బ్రోవు మన్న సంపఁగిమన్నా ! 1

క. పరమానందయతీంద్రుఁడఁ బరిపూర్ణుఁడ వైననీదుభక్తుఁడ నెలమిన్
విరచించెద నొకశతకము శరణాగతసుప్రసన్న ! సంపఁగిమన్నా ! 2

క. నినుఁజెప్పనేర నైనను ఘన మగునుతి గనుక కూరగాయకవిత్వం
బనక కృపామతిఁ గైకొను సనకాదిమునిప్రసన్న ! సంపఁగిమన్నా ! 3

క. జిలిబిలిమాటలఁ బలికెడి యలశిశువును దండ్రి ముద్దులాడెడుపగిదిన్
బలికెద నను మన్నింపుము సలలితకాంతిప్రసన్న ! సంపఁగిమన్నా ! 4

క. తత్త్వజ్ఞానానంద మహత్త్వము రచియింతు నీదయన్ భువిఁ గృతకృ
త్యత్త్వము నిత్యత్వముగా సాత్త్వికవరయోగు లెన్న సంపఁగిమన్నా ! 5

క. తత్త్వము దా నెఱుఁగక బ్రహ్మత్వ ముపచరించువారిమాటలు ధృతకో
శత్వములను నిలిచియు నిస్సత్త్వము లగుఁ గన్న విన్న సంపఁగిమన్నా ! 6

క. వినవలె సద్గురువులచేఁ గనవలె నఱచేతియుసిరికాయయుఁబలెఁ దా
మనవలె బ్రహ్మము దానై సనకాదిమునిప్రసన్న ! సంపఁగిమన్నా ! 7

క. తాటాకులలో వ్రాసిన మాటలనా ముక్తి పాడిమర్మముఁ దెలియున్ ?
సూటి యగురాజమార్గము సాటి యగునె యెచట నున్న ! సంపఁగిమన్నా ! 8

క. సన్న్యాసుల మని శాస్త్రోపన్యాసముసేయ నందు ఫలమేమి ? మన
స్సన్న్యాసము దొరకని యాసన్న్యాసము కూటికన్న సంపఁగిమన్నా ! 9

క. గాముపలె సంచరించినఁ బాముపలెన్ గుహల నున్న బంధము తెగునా?
దీ మెంతేఁగి పసనిఁ గలసెడి సాముర్థ్యము గూడకున్న సంపఁగిమన్నా! 10

క. వాటమునుసరించి ముక్తికవాటము భేదింప నెట్లు వశపడుఁ దనలోఁ
నాటుకొనుమాయఁ దిగ నుచ్చాటన మొగిఁ జేయకున్న సంపఁగిమన్నా! 11

క. ఎక్కటిచదువులు బోధలు మక్కువ ననుభవములేనిమాటలు వినఁగాఁ
బుక్కిటిపురాణముల్కై జక్కులసంతోష మెన్న సంపఁగిమన్నా! 12

క. వాలాయము గురుకృపచే శ్రీలీలల రాజయోగ సిద్ధుఁడు గాఁగా
నేలా సంసారమునకు జాలింబడ సుప్రసన్న! సంపఁగిమన్నా! 13

క. శ్రీరాజయోగవిద్యా పారీణున కబ్బుఁ గాక పరమసుఖం బీ
ధారణి హఠలయమంత్రవిచారుల కది దొరక దన్న సంపఁగిమన్నా! 14

క. మాయాయోగతపంబుల నాయాసముతోడఁ జేయ నబ్బును దత్త్వం
బాయెన్ని కేలపెట్టన్ జాయలనా సుప్రసన్న! సంపఁగిమన్నా! 15

క. ఒండొరులఁ గూడి గొణఁగుచు దండము లిడికొనుచు బోడితలలుం దామున్
నిండిరి మహి తత్త్వము నహి చండితనం బధిక మన్న సంపఁగిమన్నా! 16

క. నానలు పస స్వైరుల కభి మానము పస వనితలకును మఱి యోగులకున్
ధ్యానము పస యామీఁదట జ్ఞానము పస సుప్రసన్న సంపఁగిమన్నా! 17

క. మాయ యనఁగ వేఱై యొక తోయము లే దయ్యె తన్నుఁ దోఁపనిచోటే
మాయ! తా రోసినను జూ చాయం జెడిపోవు నన్న! సంపఁగిమన్నా! 18

క. తామరసాక్షున కైనన్ శ్రీమించినసురల కైన సిద్ధుల కైనన్
నీమాయఁ దెలియవశమా సామాన్యమె! కఠిన మెన్న సంపఁగిమన్నా! 19

క. నిండికొను నిట్టిమాయ ప్ర చండగతిం గప్పుకొన్న సజ్జనుల బుధుల్
ఖండింప నేల మదపా షండులవాక్యములు విన్న సంపఁగిమన్నా! 20

క. మండితపూర్ణసుధాకర మండలశతకోటికాంతిమహనీయుం డై
నిండి తనలోన యోగి ప్రచండగతి న్వెలుఁగు నన్న సంపఁగిమన్నా! 21

క. పేరుకొనుమంత్రవాదము భారం బది కుక్కనోటి పాఁ తై రోఁ తై
పోరై యారై దూ తై జాఱఁగవలె సుప్రసన్న! సంపఁగిమన్నా! 22

క. బూటకములు వేషంబులు నాటకములు మంత్రతంత్రనటనలు మిథ్యా
పేటిక లవి యోగికి జం జాటము లివి యేటి కన్న! సంపఁగిమన్నా! 23

క. చలపట్టియు హఠయోగముఁ దలపెట్టిన వట్టిగొడ్డుతాఁక ట్టింతే
యలసిద్ధి దొరక దడియా సలుగా కిం దేమియున్నె! సంపఁగిమన్నా! 24

క. సంతతయోగానందా నంతసుఖాంభోధి నలరు నాతనిభాగ్యం
బింతింతనఁ దరమా ఘన సంతోషము జగతి నెన్న సంపఁగిమన్నా! 25

క. నావయగున్ భవజలధికిఁ ద్రోవయగున్ ముక్తికాంతతోఁ గూడుటకున్
కేవలనిజదేశిక రక్షావహ మగుయోగ మెన్న సంపఁగిమన్నా ! 26

క. అభ్యుదయంబుగ నీయోగాభ్యాసము సేయవలయు నతులితలీలన్
లభ్యుఁ డగుం బరమాత్ముఁడు సభ్యుల కది మార్గ మన్న ! సంపఁగిమన్నా ! 27

క. వ్యక్తావ్యక్తపదం బఁట ముక్తఁట గురుసేవ తనకు మును లేదఁట యే
యుక్తిని గనుఁగొనవచ్చు న శక్తులకును సుప్రసన్న ! సంపఁగిమన్నా ! 28

క. భావమునం గననేరని జీవుల కిది బీరకాయ చిక్కఁగుఁ దెలియం
గావశమే సద్గురు దీక్షావిధి యొనఁగూడకున్న సంపఁగిమన్నా ! 29

క. బోధింపఁదగినగురువుల శోధించి తదంఘ్రిఁ జేరి సుస్థిరమతి యై
యాధేయము నాధారము సాధించిన ముక్తుఁ డౌను సంపఁగిమన్నా ! 30

క. సాధింపఁగ నిరతులకున్ బోధింపఁగ నేర్పు గల్గుపుణ్యాత్ముల యా
యాధరఁ గల రొకకొందఱు సాధారణవిబుధు లెన్న సంపఁగిమన్నా ! 31

క. అనుభవము లేనిగురుచే వినునతనికి సంశయంబు వీడునె చిత్రా
ర్కునివలనఁ దమము వాయునె సనకాదిమునిప్రసన్న ! సంపఁగిమన్నా ! 32

క. బరువఁట యెవరికి గురువో హరిహరి తనుఁ దెలియలేనియాతఁడు గురువా ?
గురువనఁగా సిగ్గుగదే శరణాగతసుప్రసన్న ! సంపఁగిమన్నా ! 33

క. నేరనిగురుబోధలు సం సారము లై కూనలమ్మసంకీర్తన లై
దూరము లై ముక్తికి ని స్సారములై పోవు నన్న ! సంపఁగిమన్నా ! 34

క. బూటకపుయోగి నెఱుఁగక పాటింతురు డబ్బుఁ జూచి పస లేకున్నన్
దాటో టని జగ మెల్లను జాటింతురు లోకు లెన్న సంపఁగిమన్నా ! 35

క. కల్ల యగుజ్ఞాన మేలా చెల్లనికా సెచట నైనఁ జెల్లనికాసే
తెల్లమిగఁ దెలుపునాతఁడు సల్లలితజ్ఞాని యెన్న సంపఁగిమన్నా ! 36

క. గాడిదవలె బూడిదఁ బొ ర్లాడుచుఁ గొక్కెరయుఁ బోలె ధ్యానము సేసే
బేడిదపుఁగపటయోగుల జాడలు ఘను లెంచరన్న సంపఁగిమన్నా ! 37

క. కీడొనఁగెడుగురు డేలా గాడిదవాలంబుఁ బట్టి ఘననదు లీఁదన్
గూడునె గుండెలు పగులఁగ జాడింపరె ఱొమ్ముఁ దన్ని సంపఁగిమన్నా ! 38

క. అంగం బెఱుఁగరు ముక్తి తెఱం గెఱుఁగరు కపటధూర్తరావణవేషుల్
దొంగలగురువులవారల సంగతి దుర్బోధ లెన్న సంపఁగిమన్నా ! 39

క. చేతోగతిఁ దము నెఱిఁగిన యాతద్జ్ఞులు భువిని జనుల నందఱ సరిగాఁ
జూతు రసమరసభావనఁ జాతుర్యధురీణు లెన్న సంపఁగిమన్నా ! 40

క. వచ్చినవాసనవెంబడి విచ్చలవిడి యోగివరుఁడు విహరించినవాఁ
డెచ్చట నేక్రియఁ జేసిన సచ్చిన్మయు నంట దన్న సంపఁగిమన్నా ! 41

క. విత్తమదమత్తు లాయత చిత్తభ్రమ లెఱుఁగలేరు చిత్పురుషుని దా
నుత్తముఁ డితఁ డని సన్ముని సత్తముఁ డై యెఱుఁగు నన్న ! సంపఁగిమన్నా ! 42

క. తనవాసనయెట్లుండిన ఘనయోగికి బంధవృత్తి గానేరదు వాఁ
డనుభవముకతన నిర్వాసనుఁ డై మఱి పుట్టఁ డన్న సంపఁగిమన్నా ! 43

క. క్రమమున సుఖదుఃఖంబులు కమలినసుతినింద లాదిగాఁ గలయవియా
యమివర్యుఁ డన్నిక్రియలక సముఁడై వర్తించు నన్న సంపఁగిమన్నా ! 44

క. తలకొని దుఃఖము రానీ వలనొప్పఁగ నిత్యసుఖము వచ్చిన రానీ
నలఁకువను బడనిమనుజుఁడు చలియింపఁడు బోధ గన్న సంపఁగిమన్నా ! 45

క. చాలా లోకులు నగనీ వాలాయము కీడు మేలు వచ్చిన రానీ
యేలా గైనను బురుషుఁడు జాలిం బడఁ డాత్మఁ గన్న సంపఁగిమన్నా ! 46

క. బాలుఁడుగానీ భోగ స్త్రీలోలుఁడుగాని విషయశీలుఁడు గానీ
మేలైనబోధ గలిగినఁ జాలదె ముక్తిని గనంగ సంపఁగిమన్నా ! 47

క. విత్తపరాయణుఁ డయినన్ మత్తచకోరాక్షులందు మగ్నుం డైనన్
సూత్తమపురుషుఁడె గాదా సత్తామాత్రంబు గనును సంపఁగిమన్నా ! 48

క. పంచావస్థలఁ దగిలియుఁ బంచావస్థలను గడచు ప్రాజ్ఞుండు జగ
ద్వంచకుఁ డై లోకులవలె సంచారము సేయు నన్న సంపఁగిమన్నా ! 49

క. పిప్పలర నాత్మసుఖముల తెప్పం దేలేటియోగిఁ దెలియక తమలో
నప్పురుషుం గని కర్మలు చప్పనఁగాఁ జూతు రన్న సంపఁగిమన్నా ! 50

క. నిత్యానిత్యము లెఱుఁగక నిత్యముఁ జేపట్టుబుధుల నిందించిన నా
మృత్యువుపా లౌ మర్త్యుఁడు సత్యం బిది వినగదన్న సంపఁగిమన్నా ! 51

క. వేసాలెల్లయు భువిలో గ్రాసాలకెకాక ముక్తికాంక్షకు నేలా
వాసిగలుగుయోగి యథేచ్ఛాసంచారుఁడుగదన్న ఘనసంపన్నా! 52

క. ఊరెఱిఁగినబాపనికిని వారక జన్నిదముఁ జూపవలెనా తద్జ్ఞుం
డేరీతి నున్న నిస్సంసారిని ఘను లెంతు రన్న సంపఁగిమన్నా! 53

క. అద్వైతభావ మెఱుఁగక విద్వాంసుల మనుచు నాత్మవేత్తలవలెనే
యద్వాతత్వము లాడుచు సద్వర్తన మెంచరన్న సంపఁగిమన్నా! 54

క. వదలరు విషయము లెచటను మెదలరు సజ్జనులకడను మిథ్యాజ్ఞానుల్
చదివితి మని యజ్ఞులతోఁ జదువులుపచరింతు రన్న సంపఁగిమన్నా! 55

క. జడివాన కురిసినట్టులు విడువక వాదింతు రాత్మవేత్తల మనుచున్
గుడియెడ మెఱుఁగనిమాటల జడమతు లిలఁ గొంద ఱన్న సంపఁగిమన్నా ! 56

క. మన సనఁగా నెఱుఁగక దా మనసునకును సాక్షి యనఁగ మఱి బేలనఁగా
ఘనతరశూన్యం బనఁగా జనులకు నిది వాద మన్న! సంపఁగిమన్నా! 57

క. కొందఱు యోగం బనఁగాఁ గొందఱు జ్ఞానం బనంగఁ గొంద ఱఖండా
నందం బనంగ నందలి సందేహము లెట్లు తీఱు సంపఁగిమన్నా! 58

క. తుద మొద లెఱుగక బ్రహ్మం బిది యని యెఱుఁగంగ లేక యేర్పడ సభలన్
వదరుచుఁ దిరిగెడియయ్యల చదువులపస లెన్న సున్న సంపఁగిమన్నా! 59

క. చేతావాతాగొట్టెడి ఘాతుకు లవివేకు లనుచుఁ గని వారలతోఁ
నీతిపరు లడ్డ మాడరు చాతుర్యధురీణు లెన్న సంపఁగిమన్నా! 60

క. తనలో నెప్పుడు నుండెడు తనుఁ దెలియఁగలేఁడు నిన్ను దరమా తెలియం
దనుఁ దెలియుట నినుఁ దెలియుటె సనకాదిమునిప్రసన్న సంపఁగిమన్నా! 61

క. దేహమె తా నై యున్నెడ దేహముతోఁ గూడఁ గాలి తేనే నిజమా
దేహాత్మవాదిమాటలు సాహసములు బొంకులన్న సంపఁగిమన్నా! 62

క. దండకమండలులు శిరోముండనము ధరించి నంత మోక్షముగలదా?
మెండుకొనులోనిపగతుర చండిమఁ దెగటార్పకున్న సంపఁగిమన్నా! 63

క. సన్న్యాసుల మని శాస్త్రోపన్యాసముచేయు టెంతపాపము కాదా
యన్యోన్యాశ్రయ ముండిన సన్న్యాసము కూడదన్న సంపఁగిమన్నా! 64

క. వాదుల నడఁచెడిపెద్దలఁ గాదనఁ గా నేల వట్టికలహం బింతే
ఖేదం బని చాలించిన సాదరమతి జాణఁ డన్న! సంపఁగిమన్నా! 65

క. వాదము ఖేదముకొఱకౌ మేదినిఁ గలవిద్య లెల్ల మెతుకులకొఱకౌఁ
గా దది ముక్తిపథం బని సాదరమతిఁ దెలియ దన్న! సంపఁగిమన్నా! 66

క. వాదము లనఁగా దాత్మవివాదము మఱి యంత్రతంత్రవాదములును నీ
జూదము మేదిని మెత్తురె? సాదరమతు లెన్న రన్న! సంపఁగిమన్నా! 67

క. ప్రేమమున నాత్మసుఖమం దేమియుఁ బస లేక తత్త్వ మెఱుఁగుదు మనుచున్
నేమములు విడిచి తిరిగెడి సాములు నేమందు మన్న! సంపఁగిమన్నా! 68

క. చేతోగతి నెఱిఁగినవారే తీరున విధినిషేధ మెఱుఁగక యున్నన్
జాతురు సమరసభావనఁ జాతుర్యధురీణు లెన్న సంపఁగిమన్నా! 69

క. ఎప్పుడు కర్మముఁ జేసెడి యప్పురుషుఁడు తన్నుఁ గన్న నది చాలించున్
చప్పిడిగాదా నోటికిఁ జప్పనియూపిప్పిఁ దన్న సంపఁగిమన్నా! 70

క. మునిఁగితి మంచురు మునుఁగుట మనసో పంచేంద్రియములో మఱి యప్పుడో
మునుఁగుట యెవరో తెలియరు సనకాదిమునిప్రసన్న! సంపఁగిమన్నా! 71

క. తానై నం బరిశుద్ధుఁడు మేనైన న్మట్టి బొందికి మేనో తానో
పూనికఁ జేసెడితీర్థస్నానం బిఁక నెవరి కన్న సంపఁగిమన్నా! 72

క. సూతకము వచ్చె ననుచును నాతలఁ బడినాళ్లు జరపినంతనె తెగునా?
సూతకమే కాదా తన జాతకము నెఱింగికొన్న సంపఁగిమన్నా! 73

క. ముట్టిన దొలఁగుదు రేమో ముట్టుననే తనువుగాఁక మునుఁగుదు రేమో
ముట్టుకు వెలియై తే యొక చట్టా మతిదేహ మెల్ల సంపఁగిమన్నా! 74

క. కలలో నొక్కఁడు పులిఁ గని పులిచే నణఁగుటను దాను పులియుటబోంకా
కలవలెను జగమెల్లను సలలితభక్తిప్రసన్న సంపఁగిమన్నా! 75

క. భ్రమకృత్యజాల మెల్లను భ్రమ లోకములెల్ల మిగుల భ్రమ కర్మంబున్
భ్రమమూలమె యీసర్వము సమరసమా తత్త్వ మెన్న సంపఁగిమన్నా! 76

క. వంశము తన కెక్కుడిది చిదంశము లోఁ గాకయున్నఁ దగ జీవులకున్
సంశుద్ధి దొరకనేరదు సంశయములు విడువకున్న సంపఁగిమన్నా! 77

క. తనమనసే తా నాయెను తనమనసే తన్నుఁ దెలియ దత్త్వం బయ్యెన్
మనసునకు సాక్షి మనసే సనకాదిమునిప్రసన్న సంపఁగిమన్నా! 78

క. మనసే జీవుం డనగను మనసే తనచేష్ట లుడిగి మతితత్త్వమగున్
మనసుగలవాఁడె ముక్తుఁడు సనకాదిమునిప్రసన్న సంపఁగిమన్నా! 79

క. పురుషునకుఁ బ్రకృతి వేఱా సరిసమ మని తెలిసియుంట సహజము గాదా
పురుషవివర్తమె ప్రకృతియు శరణాగతసుప్రసన్న సంపఁగిమన్నా! 80

క. సత్తనఁ బరఁగును బురుషుఁడు సత్తనఁగాఁ బ్రకృతి తోఁచి సమసెడు కతనన్
సత్తునకే నిత్యత్వ మసత్తున కదిగూడ దన్న సంపఁగిమన్నా! 81

క. సత్తును నెఱుఁగ దస త్తాసత్తును నెఱుఁగంగలే దసత్తును నిఁక నీ
సత్తాసత్తలఁ దగ సదసత్తైకను జీవుఁ డన్న సంపఁగిమన్నా! 82

క. కనరా దన్నను శూన్యము కనవచ్చు నటన్న జడము గా దది వెలిగా
ననుభవవేద్యము బ్రహ్మము సనకాదిమునిప్రసన్న సంపఁగిమన్నా! 83

క. లక్షణ మెఱుఁగని యోగన లక్షణ మగు నతనిమాట లవి ప్రల్లదముల్
దక్షత నంతర్దృష్టివిచక్షణుఁడా కాఁడు సున్న సంపఁగిమన్నా! 84

క. సప్తపదార్థం బగునీ సృష్టిని నుపసంహరించి చిన్మయు నంత
ర్దృష్టిని గనవలె జనులకు స్రష్టతనం బేటి కన్న సంపఁగిమన్నా! 85

క. తారంబై యోగీంద్రవిహారంబై విమలచిన్మయాకారంబై
ధీరం బై చిద్రూపము సారం బై వెలుఁగు నన్న సంపఁగిమన్నా! 86

క. చింతించి యోగి మోక్షానంతసుఖం బొందువఁ జక్షుర్గంబునఁ దా
నంతర్దృష్టిని గనవలె సంతతమును నాత్మఁ గన్న సంపఁగిమన్నా! 87

క. తన కనుభవంబు చదువుల వినుకులనే కలుగు ననెడి వెఱ్ఱియుఁ గలఁడే
యనుభవవేద్యము బ్రహ్మము సనకాదిమునిప్రసన్న సంపఁగిమన్నా! 88

క. కడుధీరుం డై యోగము తొడిబడ, ద న్నెవ్వరైన దూషించినఁ దా
నొడలికి నేపో టాదవిన జడియక సాధించు నన్న సంపఁగిమన్నా! 89

క. తెఱచియుఁ దెఱవనికన్నులు మఱచియు మఱువనితలంపు మాన్పడుమేనున్
పరమచిదాకాశస్థితిఁ జరితార్థుఁడు నిలుతునన్న! సంపఁగిమన్నా! 90

క. నలుగురు నడచెడుత్రోవను బలిమిని లోకంబు నడచుఁ బ్రాజ్ఞుం డైనన్
నలువు రెఱుంగనిత్రోవలఁ జలియింపక నడచు నన్న! సంపఁగిమన్నా! 91

క. మన సెక్కడ మా యెక్కడ? తను వెక్కడ? ముప్పదాఱుతత్త్వము లెచటన్
ఘనరాజయోగ మెఱిఁగిన జనునకు దాసప్రసన్న! సంపఁగిమన్నా! 92

క. వెలిచూపును లోచూపును వెలిగాఁ దన్మధ్యమునను వెలిఁగెడితత్త్వం
బలవడఁ జూచినయతఁడే సలలితుఁ డగుముక్తుఁ డన్న! సంపఁగిమన్నా! 93

క. ఇద్దఱు నొక్కటైనను గడ మిద్దఱుఁ దా మేకమగుచు నేకాంతముగా
నిద్దఱు నిద్దఱు నొక్కటై స ద్దేమియు సేయ రన్న! సంపఁగిమన్నా! 94

క. మిక్కిలి సంసా రయినను నెక్కడియోగము రచించు నెక్కుడుశైత్యం
బెక్కినవోటికిఁ జేఁ దగు జక్కెరపొడిఁ దిన్న నెన్న సంపఁగిమన్నా! 95

క. నాలుగుత్రోవలనడుమను శ్రీలీలను వ్రేలుచున్న చిహ్నంబులఁ దా
నాలోచించినబుద్ధివిశాలుం డౌ ముక్తుఁ డన్న! సంపఁగిమన్నా! 96

క. పందలగుచెనటిమనుజుల కందంబుగ రాజయోగ మలవడు నేలా
పందలకును గాడిదలకుఁ జందనగుణ మేటికన్న! సంపఁగిమన్నా! 97

క. ఇప్పదవు లందనేరని మొప్పెలకుం దెలుప వశమె ముందఱగానే
తప్పులు పట్టుచు మఱి చేఁ జప్పట్లిడి నగుదురన్న! సంపఁగిమన్నా! 98

క. కను జెదర మనసుఁ జెదరంగను జెదరు న్సుఖము చెదరుఁ గాలియుఁ జెదరున్
గనుఁ జెదరక తనుఁ గనవలె సనకాదిమునిప్రసన్న! సంపఁగిమన్నా! 99

క. పాళ్లను బంపును దోడవులు నూళ్లను మును చన్నవారు నూర్జితులై రా
యో ళ్ళరిగి రోళ్ళ వెంటనె సాళ్ళని ఘను లెన్న రన్న! సంపఁగిమన్నా! 100

క. ముందువెను కెఱుఁగ కాటల సందడిఁ బడి మోక్షసుఖము సాధింపనియా
పందలబ్రతుకులు నిఁక నే చందంబో యెఱుఁగ మన్న! సంపఁగిమన్నా! 101

క. వెలిచూపును లోచూపును గలయంగా నొక్కచూపుగాఁ జూచిన యా
నిలుకడ గలయోగీంద్రుఁడె సలలితసుజ్ఞాని యన్న! సంపఁగిమన్నా! 102

క. చిత్తమునం ద మ్మెఱుఁగక తెత్తురు తమచేటు నత్త తిత్తు న్మత్తున్
మొత్తముగ నూడిపోయిన సత్తులవా! సుప్రసన్న! సంపఁగిమన్నా! 103

క. సంపద లెఱుఁగక తామే సంపదగలవార మనుచు జను లిలఁ దమలో
సంపదఁ గననేరక వెలిసంపదలే చూతు రన్న! సంపఁగిమన్నా! 104

క. నేరనిజనులను బట్టుక పోరాడఁగ నేల పల్కపోతారాటం
బేరీతిఁ దెల్ప గతికి విచారము మదిఁ బుట్టదన్న! సంపఁగిమన్నా! 105

క. శోధింపరు తత్త్వజ్ఞులు నీధరఁ దమతోడిసరికి నీదుర్మనుజుల్
మేధావంతులు పెద్దలు సాధువు లని యెంతు రన్న! సంపఁగిమన్నా! 106

క. పుత్త్రులు మిత్రులు బంధుకళత్రములనువారు ముక్తిలలనకు నరునిన్
బాత్రునిని గానీయరు హితశత్రులుగా వార లెన్న! సంపఁగిమన్నా! 107

క. సంకల్ప ముడిఁగి తా నిస్సంకల్పుం డైనఁ జాలు సద్గతి తడవా
సంకల్పమె బంధము నిస్సంకల్పమె మోక్ష మన్న సంపఁగిమన్నా! 108

క. జనుఁడుం జిదమృతరసవార్ధిని చెట్టునఁ గ్రీడ సల్పి తెప్పలఁ దేలున్
విను తుచ్ఛసుఖము లేలా సనకాది మునిప్రసన్న! సంపఁగిమన్నా! 109

క. కీ లెఱిఁగి జీవపదముల నోలిన్ సమరసము చేసి యోగానందుల్
బాలోన్మత్తపిశాచుల చాలుగ వర్తింతు రన్న! సంపఁగిమన్నా! 110

క. సర్వావస్థల నడఁచియు సర్వావస్థల నెఱింగి సర్వసముం డై
సర్వముఁ దా నని తెలిసిన సర్వోత్తముఁ డాతఁ డన్న సంపఁగిమన్నా! 111

క. తనవారి నెదుటివారిని దనవారిఁగఁ జూడ నేర్చుధన్యులు చాలన్
ఘనకీర్తులచే మింతురు సనకాదిమునిప్రసన్న సంపఁగిమన్నా! 112

క. నిత్యానిత్యవివేకము సత్యనుపమశీలుఁ డెఱుఁగు నాతఁడు సుజన
స్తుత్యుఁడు జీవన్ముక్తుఁడు సత్యం బిది వినఁగదన్న? సంపఁగిమన్నా! 113

క. కూడదు గతి సంసారికి బూడిదలో గచ్చకాయ పొరలినభంగిన్
వాఁడును వీఁడును దానై జాడ యెఱిఁగి నడువ రన్న! సంపఁగిమన్నా! 114

క. పాపపువాసనవిషయము కాపాడుచురాగ నరుఁడు గడఁవగఁగలఁడా?
యేపట్టున గుహ్యోదర చాపల్యము మానకున్న సంపఁగిమన్నా! 115

క. సాధనచతుష్టయంబున సాధారణలీలఁ దనరి సర్వేంద్రియముల్
శోధించి నిజసమాధిని సాధించినముక్తుఁ డన్న సంపఁగిమన్నా! 116

క. ఉద్యోగంబునఁ బురుషుఁడు సద్యోగముఁ జలుపవలయు సవిశేషముగా
విద్యానిధి యగునతఁడే సద్యోముక్తుఁడు గదన్న సంపఁగిమన్నా! 117

క. బోధించినగురువులచే సాధింపను నేర్పు గలిగి సన్నుతు లగుచున్
శ్రీధరుఁ గలియుదు రపుడే సాధకమున బుధులు సుమ్ము సంపఁగిమన్నా! 118

క. ఆతురుఁ డై తను నడిగిన యాతనికిం దెలుపవలయు నన్యులు వింటే
నా తలవంపులును సుహృజ్జాతులకే యోగ మన్న సంపఁగిమన్నా! 119

క. మందేహామందౌషధ మెందు న్సరిలేని దైవ మిలలో సత్యా
నందంబు జయమునందు తమందఱము సుఖంబు లంది యలరుద మెలమిన్. 120

సంపఁగిమన్నశతకము సంపూర్ణము



శ్రీరస్తు

# శృంగారరత్న శతకము



(అనేక శృంగారశతకములనుండి సంగ్రహించిన పరిశుద్ధములగు పద్యరత్నములు)

## కలువాయి శతకమునుండి

సీ. ప్రాణేశుఁ డిప్పు డెడఁబాసియుండుటఁజేసి కోవెలల్ తరు లెక్కి కూయుచుండఁగ
అలఘా.నిమరులున నతఁ డిందు రాఁడని యళుల ఝుంకారంబు లతిశయించె
ఉసురాది నాదెస నలిగిపోవఁగ శశి వేఁడివెన్నెలఁ గాసి విఱ్ఱవీఁగె
అచట బాసలనిచ్చె నని సూనశరముల మఱిమఱి వేసెను మన్మథుండు
గీ. తెలిసి యింకను పగలు సాధించుచుండ నింక నేఁ దాళ గలనఁటే యిందువదన
చెలియ నీ వేఁగి కలువాయ చిన్నికృష్ణుఁ దోడుకొని వేగ రాఁగదే తోయజాక్షి 1
సీ. ఆకుమడ్పులు మోవి కందియియ్యఁగ తాను విడెము సేయఁడుగదా పడఁతులార
మొనసి యిద్దఱము బొత్తున భుజింతుముగాని వేఱు భుజింపఁడే వెలఁదులార
పొంకమ్మగా నేను బూయక పరిమళగంధంబు నలఁదఁడే కాంతలార
పడకింటిజవ్వాదిబరిణఁ దేఁబోయిన వడి వెంబడించునే వనితలార
గీ. గడియ యెడఁబాయఁజాలఁ డేకారణంబొ రాకయున్నాఁడునన్నింతరట్టు సేసి చెలి॥ 2
సీ. కోయిల యూరక కూసేవు క్రొవ్వచే వట్టి కెంజిగురు నీవాతఁ బడను
జంతమయూరమా యింత గర్వంబచే విఱిసి మైపొంఅలెత్తి విచ్చఁబాఱ
జడియక కాసేవు జాబిల్లి నీరూపు పదియాఱు తునియలై పడఁగలియ
మదన నాయెద నాట మఱి తూపు లేయుదు చెదరి నీయస్త్రముల్ చెల్లఁ బట్ట
గీ. అనుచు నేనెన్ని తిట్టిన నాజ్ఞలేక యతఁడు రాఁడయ్యెనని యందఱజ్జఁగనిరి చెలి॥ 3
సీ. విరులు కొప్పునఁ జుట్టి వేడుకతోఁ జూచు సొమ్ములు మై నిడి చోద్య మందు
తిలకంబు చక్కఁగాఁ దిద్ది ముద్దిడుకొనుఁ గంచుకం బమరిచి కౌఁగిలించు

వలువ జగ్గుగఁ గట్టి వగఁ గని వెఱఁగందుఁ బైఁట సాగుఁగ ... ... పొగడు
గడెగడె కొకవింతగాను శృంగారించి తలయూఁచి ముజుసి స్తోత్రంబు సేయు
గీ. ఇంతి యతిమోహి మైన ప్రాణేశుఁడిట్లు నన్నుఁబాయుటకు ... ... ... చెలి.
సీ. కమలాక్షి యను వాలుఁగన్నులఁ గాంచి శశిరేఖ యను మోము ... జూచి
బింబాధరా యనుఁ బెదవి కెంపుఁ గనిఁ జూచి యలివేణి యనుఁ ... జూచి
జక్కవా యనును వక్షస్థలమ్మును జూచి హరిమధ్య యను సుమధ్యంబుఁ జూచి
గజయానయను మందగతుల చోద్యముఁజూచి లలితాంగి యను మేనిచెలువుఁజూచి
గీ. గడియ కొకపేరునం బిల్చి గారవించు వాని కిప్పుడు నేఁ గానిదాన నైతి చెలియ. 5
సీ. తిలకంబు తిన్నగా దిద్ది మో మటుచూచి బలుదర్పణముఁ ద్రిప్పి పారవైచు
కురులు కొప్పమరించి విరివిగా నటుచూచి విడినీలములఁ ద్రిప్పి విసరివైచు
కంచుకం బమరించి కడువేడ్క నటుచూచి పూలబంతులఁ ద్రిప్పి పుడమివైచు
సొమ్ముల శృంగారించి సుందరం బటుచూచి తెప్పున రత్నముల్ ద్రిప్పివైచు
గీ. ఇన్ని విధముల నన్ను మోహించి యేలు మచ్చికల నెట్లు మదిలోన మఱచినాఁడొ చె॥ 6
సీ. కడుమేలుగా జాతకములు వ్రాసిరిగాని పతి యొల్లఁడని ద్విజు ల్పలుకరైరి
సాముద్రికముఁ జూచి సంతసించిరిగాని నోచ్చుకొందు నటంచు నుడువరైరి
పొంతనంబులఁ జాలఁ బొందిక యందురుగాని యెప్పు డీశ్లేడయుట చెప్పరైరి
ప్రేమ నేలు నటంచుఁ బెండ్లి సేసిరిగాని యతిజారుఁ డని ప్రాజ్ఞు లాడరైరి
గీ. అందఱు భ్రమింప నతనికి నజుఁడు గూర్చె నిపుడు తలపోసినందున నేమిఫలము? చె॥
సీ. తరుణిరో నానిశ్చితార్థంబునకు రాఁగ ద్విజు లిద్ద ఱెదురైరి తెరువులోన
ఇంతిరో వసునిఁ దే నేఁగగా నవ్వేళఁ బూర్ణకుంభంబులు వొడమె నెదుట
సుదతిరో మంగళసూత్రంబు గట్టఁగా బహుశుభంబుగ గౌళి పలికె నపుడు
వెలఁది నేను గృహప్రవేశంబునకు రాఁగఁ దేవుగా గఱుడుండు తీర్చి తిరిగె
గీ. శకునదేవతలెల్ల నాశ్రితు లగుచు ఇట్టి నిర్దయునకుఁ గూర్చి రేమి సేతు చెలి॥ 8
సీ. విరు లేల ముత్యాలసరు లేల ప్రాణేశుఁ డూరక నన్నుఁ బాసి యున్నయపుడు
వగ లేల మెయినిండ నగ లేల విభుఁ డిట్టు లదయుఁడై రాక మారాడినపుడు
గృహ మేల మీఁయనుగ్రహ మేల నానాథుఁ డలుక నెమ్మదిలోన నిలిపినపుడు
జగ్గేల మేనికి నిగ్గేల సరసుండు మించుచు మది మచ్చరించినపుడు
గీ. మగఁడు చూడని సొగసేల మగువలకును పురుషుఁ డెడఁబాయ కేలు లే భూషణంబు చె॥
సీ. విభుఁడు దగ్గఱ లేని వెలఁది వాక్చాతురి పాడింట చిలుకలు వల్కినట్లు
పతి నెడఁబాసిన భామశృంగారంబు రాకబింబము లేని రాత్రియట్లు
ప్రాణేశుఁ డెడసిన పడఁతియొయ్యారంబు లడవికోనల నెమి ళ్లాడినట్లు
పురుషుఁ డొల్లనియట్టి పొలఁతిజవ్వన మెల్ల పొడవైన గిరిఁ బూలు పూచినట్లు

గీ. ఈవిధంబాయె నా బ్రదుకేమి సేతు నేల పుట్టించె నజుఁడు నన్నిట్టు లేఁచ॥చెలి 10
సీ. తిలకము చక్కఁగా దిద్ద నేరనివాఁడు జగ్గుగా సొగసులు సలుప నేర్చె
అతివలయెదుట మాటాడనేరనివాఁడు వేఁడ వేఁడఁగఁ జదురాడ నేర్చె
ప్రౌఢ్దఁ గోపించి యెంచనేరనివాఁడు మిన్నక నలుకల మెలఁగనేర్చె
లీల నొంటిగఁ బవ్వళింపనేరనివాఁడు తెగువమై రే లొంటిఁ దిరుగనేర్చె
గీ. ఎవతె నేర్చెనో నేఁజెల్ల యేమి సేతు మందు తలకెక్కి యలదాని మరగినాఁడు-చెలి
సీ. బాలప్రాయమునాఁడు పతి యన నెఱుఁగక యూరక కొన్నినాళ్లుంటినమ్మ
పూపప్రాయంబునఁ బురుషుచెంతకు రాక వెఱపుచేఁ గొన్నినాళ్లరిగెనమ్మ
కౌమరుప్రాయంబునఁ గోర్కులు దాఁచుచు నణఁకువ గొన్నినాళ్లరిగెనమ్మ
గబ్బిప్రాయంబున ఘనుఁడు నాయెడ నిట్టు లెనయక కొన్నినాళ్లేఁగెనమ్మ
గీ. అబ్బురంబైన జవ్వనం బడవిఁ గాయు నట్టి వెన్నెలవైఖరి వ్యర్థమయ్యె-చె॥ 12
సీ. శుకమ నా వెతఁ జూచి చూడనట్లున్నావు ప్రియుని రమ్మని వేగ పిల్వరాదె
పికమ నావెతఁ జూచి ప్రేమ లేకున్నావు విభునకు నెనరు రా వేఁడరాదె
హంస నావెతఁ జూచి యదె యూరకున్నావు పతిమతిఁ గృప పుట్టఁ బల్కరాదె
తేఁటి నావెతఁ జూచి మాటాడకున్నావు వేగ హరికి విన్నవింపరాదె
గీ. అనుచు బతిమాలుకొనెద నాకై సదాన వైరివేనియుఁ గరుణతో నచటి కిపుడు-చె॥
సీ. కోకిల లవి చాలఁ గూయసాగు నటంచుఁ బజ మున్నతస్థాయిఁ బాడ వెఱతు
చిలుక లాలించినఁ జెలఁగి పల్కు నటంచు నోటఁ దిన్నగ మాట నుడువ వెఱతు
అళులు గన్గొన్న జుమ్మనుచు మ్రోయునటంచు జడమీఁదిపయ్యెద జార్ప వెఱతు
ఇలువెడలినఁ జంద్రుఁ డేర్చి కాయు నటంచు వేఁడివెన్నెల దేఱి చూడ వెఱతు
గీ. వీరికెల్లను నే నింత వెఱచుచున్న వేడ్కలాయెను వెఱపించి వెంబడింప-చెలియ॥14
సీ. అడవిలో నొకవృక్షమై పుట్టఁగావచ్చు బుడమిపై నాఁడుదై పుట్టరాదు
కడుఁబెద్దచట్రాయిగాఁ బుట్టఁగావచ్చుఁ బుడమిపై నాఁడుదై పుట్టరాదు
పక్షులై మృగములై పరఁగఁ బుట్టఁగవచ్చుఁ బుడమిపై నాఁడుదై పుట్టరాదు
పురుషులై పలుమాఱు పొదలి పుట్టఁగవచ్చుఁ బుడమిపై నాఁడుదై పుట్టరాదు
గీ. ఆడుజన్మంబు సకలాపదాలయంబు పురుషుతోఁ గూడియుండనిపుట్టు కేల-చెలియ॥
సీ. ప్రాణేశుకౌఁగిటఁ బాయకుండిననాఁడు దుష్ట నీవి ల్లేడ తునియలయ్యె
మగఁడు నాపైఁ జాల మమత నేలిననాఁడు నీమార్గణము లేడ నీళ్లఁగలిసె
కవగూడి పతి నేను గడు సుఖించెడునాఁడు చెఱుగ నీబల మేడ చెట్లఁ బట్టె
వేఁడుకతో నేను విభుఁడు గూడిననాఁడు దుశుక నీధ్వజ మేడ మడువునఁబడె
గీ. ఓరి మన్మథ నే నొంటి నుండువేళ వేయవద్దనఁగాఁ దూపు లేయఁదగునె-చెలియ॥

సీ. భామల నిట్లేఁచఁబట్టి గదా చంద్ర నీలోఁ గలంకంబు నిలిచిపోయె
తరుణుల యుసు రట్టె తాఁకికదా చంద్ర దిగ్దేశములఁ జెడి తిరుగవలసె
తెఱవల నిట్లు బాధింపఁగాఁగద చంద్ర దినదినంబును గళల్ దీసిపోవు
అబలలు నీరాక కడలఁగాఁగద చంద్ర రేయిఁ జోరుఁడవై చరింపవలసె
గీ. రాజవై స్త్రీలఁ బోరాడ రాదటంచు నెన్ని చెప్పిన మత్సరం బేల మాను-చెలియ॥
సీ. మగువల నేఁచఁగా మారుతనూ చూడు మెపుడు నిల్వక పరుగెత్తవలసె
ఉవిదల బాధింప నో పవనా చూడు మేటిపాములు నిన్ను మ్రింగఁజొచ్చె
కాంతల బాధింపఁగాఁ దెమ్మెరా చూడు మట్టె నీకడుపునఁ బుట్టెఁ గోఁతి
గరితల నుడికింపఁగా సమీరా చూడు బహుదేహములు సొఱఁబడుట లాయె
గీ. ఇన్ని యనుభవ మైన నీ వన్నులపయి జాలిఁగొనవేల విడదొ నైజంబు భళిర-చెలి॥
సీ. తల్లిదండ్రులఁ బాసి దా నొకరింటిలోఁ బెరిఁగినవానికిఁ బ్రేమగలదె
మాటలోఁ దన మేనమామను జంపిన కఠినాత్మునకు నేల కరుణ పుట్టు
జారచోరులు గాంచు జాడల మెలఁగెడు పలుగాకి కిపు డేల భ్రమలు పుట్టు
ఆఁకట నెంగిలి నైన రోయక తిను దుర్బుద్ధి కేలాగు దోఁచు మమత
గీ. ఇట్టివాఁడని మావారి కెఱుక లేక యిచ్చినప్పుడు గుణదోష మెంచనేల-చెలియ॥
సీ. తల్లిదండ్రులయింటఁ దనపొట్ట పూడక గొల్ల డైయె గోవులఁ గోరి కాచె
అంతటనైనఁ బేరాఁకలి దీఱక లీల వెన్నను దొంగిలింప సాగె
కట్టుబట్టలు లేక కాంతలు విడిచిన యంశుకంబులఁ బొంచి యపహరించె
జారుఁడై చోరుఁడై సంచరించుచు గోపికల మొఱఁ దల్లిచేఁ గట్టఁబడియె
గీ. అనుచు నీవల వింటినే యమ్మచెల్ల! మున్నెఱింగిన నేనేల మోసపోదు-చెలియ॥
సీ. సిగ్గింతయును లేక చెల్లెలికై తాను గుంటెనకాఁడైన కొంటె యితఁడు
తన మేనమామను దయ యింతయును లేక ద్రుంచివైచిన గొప్పద్రోహి యితఁడు
జనకునితోఁ బుట్టుఁ జెనక రాదనక యా రాధను బొందిన వ్రాత్యుఁ డితఁడు
కులసతీమణు లింటఁ గోరి చరింపఁగాఁ బరభామలను బొందు పాపి యితఁడు
గీ. అనుచుఁ జెప్పుట నిజమయ్యె నతివలార యిట్టికఠినాత్ముఁ డిఁక నన్ను నేఁచడఁట
సీ. కులగోత్రములు రూపు గుణము మానము లేని వానికి న న్నియ్యవచ్చునఁటె॥
నీటుగఁ బాముపై నిద్రించుమాయల వానికి న న్నియ్యవచ్చునఁటె
యెల్లజోగుల మనం బిల్లుగాఁ దిరిగెడు వానికి నన్నియ్యవచ్చునటె
వావివర్తన బంధువర్గంబు లేనట్టి వానికి న న్నియ్యవచ్చునఁటె
గీ. ఇట్టివానికి మావార లిచ్చినపుడె వడ్లతోఁ దట్ట యెండఁగా వలసివచ్చె-చెలియ॥ 22
సీ. ప్రాణేశుఁ డూరికిఁ బయనమై పోవంగఁ దోడఁబడి యెదురాచుఁ దుమ్మనైతి
అది యెంతపో యని యశ్రద్ధఁజేసెనా పోరానిదినమని బొంకనైతి

నాపైపై మరులున నట కేఁగఁగాఁ జూచి యడ్డమై నిలిచి పోరాడనైతి
కపటమైత్రిని జూపి కదలిపోఁబలఁచెనా పొంచి యేమఱ వెంబడించనైతి
గీ. ఈయుపాయంబు లానాఁడె యెఱిఁగియున్న వెఱ్ఱిదాననె నేనేల విడుతు నతని-చెలి॥
సీ. ప్రాణేశుఁ బాసి నా ప్రాణంబు లుండవు నెలఁత నామేనెట్లు నిలుచునమ్మ
పొత్తునఁనేకాని భుజియింప నొల్లనే యెవ్వఁ డన్న మెటు రుచియించునమ్మ
కౌఁగిలి వదలినఁ గడుఁ దల్లడిల్లుదు నిదుర కంటికి నెట్లు పొదలునమ్మ
అలిగినఁ బలుకరా యని వేఁడుకొందునే యువిద నోమన నెట్టు లోర్చునమ్మ
గీ. రమణనేనేమొబలుచట్టుఱాయిసమ్మ మఱచినావలెబ్రదుక దేమగునయైన-చెలియ॥
సీ. ప్రాణేశుఁ డెచ్చటి పరభూమి నున్నాఁడో యాదిత్యదేవ కాపాడవయ్య
సరసుఁడు వలచి యేసఖిచెంత నున్నాఁడో యుడురాజ పోషించుచుండుమయ్య
వరుఁ డేనెలంత కైవసమున నున్నాఁడో సేవింతుఁ బవన రక్షింపవయ్య
విభుఁ డేవెలందిని విడఁజాలకున్నాఁడో దైవతోత్తములార ప్రోవరయ్య
గీ. అనుచు వేఁడుదు నాతఁ డెందైన లెస్స నున్నదే చాలు నేఁ జూడ కోర్వలేను-చె॥25



## కాంతాలలామ శతకమునుండి

సీ. వలపించరో చెలుల్ వలవరో మగవార లేలనే యీమోడి యెమ్మెలాఁడి
పిలిపించరో చెలుల్ పిలువరో మగవార లేలనే యీమోడి యెమ్మెలాఁడి
దక్కలేదో చెలుల్ దక్కరో మగవార లేలనే యీమోడి యెమ్మెలాఁడి
వేఁడుకోరో చెలుల్ వేఁడరో మగవార లేలనే యీమోడి యెమ్మెలాఁడి
గీ. బాళిఁ జెందిన మగవారిపట్లఁ జెలులు చులకఁగా నెంతురఁటె యిట్లు జలజనేత్రి
అయ్యయో యింత కరుణ లేదాయె నీకుఁ దాళనిచ్చునె ప్రేమ కాంతాలలామ॥
సీ. ఏలనే నేఁ దాళఁజాలనే యింకఁ జాలుఁ జాలునే కోపంబు జలజగంధి
వాదఁటే నెన రింత లేదఁటే మాటాడ రాదఁటే నాతోడ రాజవదన
వద్దఁటే నాచెల్మి వద్దఁటే నేరంబు కద్దఁటే నామీఁద ముద్దుగుమ్మ
మానవే యెంతటిదానవే కౌఁగిలిఁ బూనవే యీవేళఁ బువ్వుఁబోఁడి
గీ. పూలకోలలచే గాసిఁ బొందఁజాల మాటిమాటికి నాపట్ల మర్మ మేల
యేలనే బాల యింక నిట్టి జాలమేల తాళ॥ 27
సీ. ఒఱపైన ముద్దుక్రొమ్మెఱుఁగుకస్తురిచుక్క ఘుమఘుమతావులు గ్రుమ్మరింప
పదివన్నె బంగారు పౌజులకమ్మలు మెఱుఁగుచెక్కుల కాంతి మెఱయుచుండ
బిగిగైకరతు యబ్బినగర్వమున వక్షమలజాఱుపైఁటలో హొసుమీఱ
జిగికావి గుల్కు క్రొంజిగురాకుమోవిపైఁ దెలిడాలునవ్వు వెన్నెలలు గాయ

గీ. సొలపుతో నీవు నాయొద్ద నిలిచినపుడె అఖిలసామ్రాజ్యవైభవ మబ్బినట్లు
తోఁచుచున్నది యేమందుఁ దోయజాక్షి తాళ॥ 28

సీ. వలచి ప్రియము గన్న వారిలో నావలె బలిమిగా వేఁడినవారు లేరు
చెలిమి చేసినయట్టి చెలియల నీవలె వంచన యొనరించువారు లేరు
చాల మచ్చికపడి సతిపతుల్ మనవలె వాదులాడుచు నున్నవారు లేరు
కోరి చెల్మియొనర్చు వారిలో నిటువలెఁ బగఁ బట్టి సాధించువారు లేరు
గీ. కలికి నీయందె యిన్నియుఁ గంటి నేఁడు; నీమనసు నాదు భాగ్యంబు; నేఁటికైన
గారవింపుము దయయుంచి కీరవాణి తాళ॥ 29

సీ. సొలఁపుజూపుల నిన్నుఁ జూచినంతనె చాలు నఖిలసౌభాగ్యంబు లబ్బినట్లు
హాయిగా నొక్క మాటాడినంతనె చాలు ఘనవైభవస్ఫూర్తి గల్గినట్లు
ప్రేమతో నొకముద్దుఁ బెట్టినంతనె చాలు మఱి యింద్రభోగంబు దొరకినట్లు
చెలిమితో నొకసారి గలసినంతనె చాలు నలుబ్రహ్మపదవి యబ్బినట్లు
గీ. చెలియ విను మని యిట్లు నేఁ బల్కినాను మనసు నీ బాకిని ద్రోయక మమత మీఱ
గారవింపుము బిగువు బంగారుగాను తాళ॥ 30

సీ. తరుణిరో కడుసృష్టి తాఁకునో యని యెంచి పొలసి నిన్ జప్పక చూడ వెఱతు
వనిత నీ నెమ్మోము వసివాడునో యని లెస్సగా నినుఁ గౌఁగిలింప వెఱతు
కలికి నీ చెక్కిళ్లు గ్లసిగందునో యని యిక్కిలి మునిపంట నొక్క వెఱతు
పడఁతిరో నీ వెంత బడలుదువో యని పనులు సేయుంగఁ జెప్పంగ వెఱతు
గీ. ఇట్టి నాభావి తెలియని యింతివలెను జాగొనర్చెద వేలనే నీగుణంబు
లింకఁ జాలించి నను దయ నేలికొమ్ము తాళ॥ 31

సీ. దయమీఱఁగాను జెంతకుఁ జేరఁగాఁదీసి చెలిమి రంజిల్ల మచ్చికలు చేసి
గమకించి యంతరంగము తెల్పి మాటాడి యుమ్మోలఁ జేర నమ్మనుచుఁ బిలిచి
వలపు రెట్టింప నవ్వారిగా మది నిచ్చవచ్చిన మెచ్చులు హెచ్చు చూపి
సరిలేనిగతుల నాశలు పెంచి యుబ్బించి కపురంబుఁదావి బాగా యొసంగి
గీ. ఎందు కిటువలె మనసిచ్చి యిప్పుడేమి మనసుదెలియనివిధమున నెనరు దాఁచి
మోసపుచ్చుట న్యాయమా దోసకారి తా॥ 32

సీ. మాపు రే పని వట్టి మాయలు చేసి నన్నలయింప న్యాయమా కలుకలాడి
కాని పోపొమ్మని లేనిమాటలు పల్కి జాగొనరింతురా చంద్రవదన
పదురవద్దని నీవు మొదట నమ్మిక లిచ్చి మఱచుట చెల్లునా మందయాన
నీదాన నే నని నిక్కముగాఁ బల్కి ప్రొద్దువోనిత్తురా ముద్దుగుమ్మ
గీ. ఎందు కిటువలె నేఁచెద విందువదన నీకు ఫల మేమి పల్కవే నేఁటికైన
గౌఁగిటను జేర్చి నన్నేలు కంబుకంఠి తాళనిచ్చునె ప్రేమ కాంతాలలామ॥ 33

సీ. అన్యాయకారి ని న్నాశించినది మొదల్ నిజముగాఁ గంటికి నిదుర రాదు
దోసకారీ నిన్నుఁ దొడరి కన్నది మొద లన్నంబు జిహ్వకు హాయి లేదు
పాతకి నీతోడఁ బల్కినయది మొద లెవరితోఁ బలుకఁగా హితవుగాదు
ద్రోహి నీనమ్మిక లూహించినది మొదల్ నిలిచినచోటనే నిలువరాదు
గీ. కటకటా! యింత భ్రమఁ జెందఁగా నొనర్చి యేల వడిసుళ్లఁ బెట్టెదే యింకనైనఁ
గలదు లేదని పలుకుము కంబుకంఠి తాళ॥ 34

సీ. రేయెల్ల నిద్దుర లేక యున్నందుకుఁ గలకంఠకంఠి నాకనులు సాక్షి
మరుకాకచే స్రుక్కి కరఁగినయందుకు దరళాయతాక్షి నాతనువు సాక్షి
మరులు తాళఁగ లేక పొరలినయందుకుఁ బడఁతి నేఁ బవళించుపాన్పు సాక్షి
ఒంటిగా నినుఁ బాసి యోర్చినయందుకు నీవగ ననయించు నీవె సాక్షి
గీ. వలపుచే ముందు తోఁచక బలిమిగాను నిన్ను మఱి వేఁడికొనుటకు నేనె సాక్షి
సాక్షు లిఁక వేయు నేటికి సారసాక్షి తాళ॥ 35

సీ. ఆటలకైన నీ వలిగియుండినయప్డు గుండె ఝల్లని కొట్టుకొను నదేమొ
పరిహాసమునకైనఁ బలుకకుండినయప్డు మిన్నుపైఁ బడినట్టు లుండు నేమొ
ఊరకయైన మోమోరఁజేసినయప్డు పెల్లు నామది తల్లడిల్లునేమొ
నవ్వులకైనను నొవ్వనాడినయప్డు చెల్లఁబో మై సొమ్మసిల్లు నేమొ
గీ. ఇంతి వలపని సొలపని యెఱుఁగనట్టి నన్ను వలవేసి దక్కించు కిన్నివెతల
కిమ్ముచేసితి వామాట లింక నేల తాళ॥ 36

సీ. వారివీరివితాన నూరకయుండక చెలియ నీమోము చూచినదె తప్పు
మన కేల యని యెంచి మాటలు నియ్యక లేమ నీతోడఁ బల్కినదె తప్పు
పదులయ ట్లుండక పరికించి మెలఁగక ననఁబోణి నిన్నుఁ జేరినదె తప్పు
తగురీతిగా దవ్వుదవ్వులఁ దొలఁగక వనిత నీ పొందు గూడినదె తప్పు
గీ. తప్పు లీరీతి నుండఁగాఁ దరుణి నాదు తప్పులు గణింపవలె నన్నఁ దక్కు వేమి
ధాత వ్రాసినవ్రాఁతకే తప్పుగలదె తాళ॥ 37

సీ. నినుఁ బాసి నిముసంబు నేఁ దాళ నందువే చాన నేఁ డాబాలి కానదేమి
అరగడె రాకున్న నప్పుడె రప్పింతువే కలికి నేఁ డాజాడ కానదేమి
సరసంబులకుఁ బ్రొద్దు చాలదే యందువే కాంత నేఁ డామాట కానదేమి
కనుఱెప్పఁ బెట్టక ననుఁ జూచుచుందువే గరిత నేఁ డాప్రేమ కానదేమి
గీ. ఎవనిపై బాళి జనియించె నిట్లుసేయ నెవఁడు నినుఁగాంచె నీమోహ మెచట మించె
నింక దాఁచక పలుకవే యెమ్మెలాఁడి తాళ॥ 38

సీ. తనివిచెంద దదేమొ తరుణిరో నీమోవి పానకం బెంతయు నానుచున్న
విసువు పుట్ట దదేమొ వెలఁదిరో నీతోడఁగూడి రేఁబవలు మాటాడుచున్న

వెగటుచెందఁ దదేమొ మగువ నీ చెక్కిళ్లు లెన్నిమాఱులు ముద్దు లిచ్చుచున్న
ప్రొద్దు చాల పదేమొ పొలఁతిరో నీదుకౌఁగిల నెంతసేపు సుఖించియున్న
గీ. నీమొగము పోడిమిదొ యలనీరజాక్షు మాయయో యెఱుంగరా దిది తోయజాక్షి
ఇంతమాలిమిఁ జేయరా దెవరికైనఁ దాళ॥ 39

సీ. ఎడఁబాయవంచు ని న్నిచ్ఛగించితిఁ గాని పలుకకుండు వటంచుఁ దలఁచనైతి
వలపు దాఁచవటంచుఁ జెలిమిచేసితిఁగాని యలుకసేతువటంచుఁ దెలియనైతి
విడనాడవంచు నే విశ్వసించితిఁగాని వంచన గావించు టెంచనైతి
నెనరుదానవటంచు నెఱనమ్మితినిగాని యెంచి నీగుణము భావించనైతి
గీ. దూర మెంచక నా సరివారిలోన ఆసదూఱితి నిన్నిఁక దూఱనేల
నన్ను నే ననుకోవలె నళినిగంధి తాళ॥ 40

సీ. ఎందును నీమాట కెదురాడకే నేఁ నాతి నీ మనసు రా నడచితేని
అలిగినవేళ నిన్ బలిమిమై వేఁడుచు నొయ్యనఁ దాంబూల మియ్యనైతి
వలపు మీఱఁగ వాదు సలిపినవేళను నెయ్యముతోఁ జేరి యియ్యనైతి
కన్నులు విచ్చి ని న్ననుఁగొని నీపాటి మగువలు లేరని పొగడలేదా
గీ. మమత దెలియనిదాని చందమున నిట్లు వేఱుసేయఁగ నౌనఁటే కీరవాణి
అరయ కిటు లేఁచ నీకు మర్యాద గాదు తాళ॥ 41

సీ. నాసామిగా నిన్నె నమ్మియున్నా నని చిన్నెలు పచరించి కొన్నినాళ్లు
నీదాననని నమ్మ నిక్కమెంచుమటంచుఁ గూర్చి ప్రియంబునఁ గొన్నినాళ్లు
మననేస్తమునకు సమంబు లే దరసిన వన్నె కాఁడ వటంచుఁ గొన్నినాళ్లు
మేము నీసొమ్మని మెఱమెచ్చులాడుచుఁ గోరిక హెచ్చించి కొన్నినాళ్లు
గీ. ఆశఁ బుట్టింప నిట్టు లహర్నిశంబు మనసు మర్మ మెఱుంగక మసలుకొంటి
మాయ హత్తించి యేతురా తోయజాక్షి తాళనిచ్చునె ప్రేమ కాంతాలలాము

సీ. అవనిలో మగపుట్టు వగుచుఁ బుట్టఁగరాదు పుట్టిన రసికుఁడై పొడమరాదు
పొడమిన నొక్కతెఁ పొందుఁ గోరఁగరాదు కోరిన బాళిచేఁ గొసరరాదు
కొసరిన దయలేని కూటమి కారాదు కూటమి గల్గినఁ గొంకరాదు
కొంకు కల్గిననేమి కూడి వీడఁగరాదు వీడిన మది విడనాడరాదు
గీ. వలచి వలపించుకొనునట్టి వారు లేరొ అయిన నీగుండె జాతితో నట్టివుడు
చేసినాఁడేమొ యెటులోర్తు దోసకారి తాళ॥ 43

సీ. వలచితి నని యెంచి వడిసుళ్లఁ బెట్టెదు మర్యాదఁటే నీకు మందగమన
బలిమిఁ గోరితినంచుఁ జులకగాఁ జూచెదు న్యాయమఁటే నీకు తోయజాక్షి
వేఁడవేఁడగ నన్ను వేఱుగాఁ జూచెదు ఘనమఁటే నీకు బంగారుబొమ్మ
అనుసరించెద నంచు ననుఁ జౌకచేసెదు తగునఁటే నీకిది చిగురుబోణి

గీ. ఇంత యొండైనఁ గలదఁటే యెమ్మెలాఁడి మర్మ మెఱుఁగనిదానవే మంజువాణి
వలదు వల దింక బలుకవే వగలమారి తాళ॥ 44

సీ. వేళ గాదనక నేవేళ నే వచ్చిన హితవుగా నీ మనసిచ్చు మేలు
అలిగి యుండినవేళ బలుమచ్చికలు చేసి వేడుక నను గారవించుమేలు
ఎవ రెంత నానేస్త మెడఁబాపఁ దలఁచిన నందుల కొప్పనియట్టి మేలు
అరనిముసంబు నే సరసఁ జేరకయున్న నప్పుడె రప్పించునట్టి మేలు
గీ. మఱచెద మటన్న వేయుజన్మముల కైన మఱవఁగూడదుగద నీదు మచ్చికలకు
చాలఁ దక్కితి సొక్కితి సారసాక్షి-తాళ॥ 45

సీ. నీవంటి నెఱజాణ నెనరు గావలె నంచు నెన్నాళ్లొ మదిలోన నెంచి యెంచి
వనజాక్షి నీతోడ మనవి చెప్పఁ డటంచు వేమాఱు చెలియల వేఁడుకొంటి
కనులపండువుగ నే నినుఁ గనుంగొనఁ గోరి మొనసి దైవములకు మ్రొక్కుకొంటి
చెలియరో వేగ నీచెంతఁ జేరుటకునై మఱిమఱి నిను బతిమాలుకొంటి
గీ. ఇట్టి నామీఁద జాలి యొక్కింత లేక దినము రేపనుచున్నావు ఘనమ నీకు
గాసిఁబెట్టకు మయ్యయో దోసకారి-తాళ॥ 46

సీ. ఎంత కార్యంబైన నేను గల్గఁగ నీకుఁ జింత యేల యటంచుఁ జెప్పలేదొ
తనువులు రెండుమాత్రముగాని యిద్దఱి ప్రాణంబు లొకటని పల్కలేదొ
ఒక రేమి చెప్పిన నొగ్గుదు నని మదిఁ దలఁపకు మని నీవు పలుకలేదొ
నాజీవములు గల్గునందాక నే నిన్నుఁ బాయనంచును బ్రేమఁ బల్కలేదొ
గీ. అన్ని మఱచియుఁ గడపట నన్ను భళిర పాప మనక మనోవ్యథ పాలు చేసి
మిన్నకున్నావు నీ కిది మేలె చెలియ-తాళ॥ 47

సీ. మగువ నిన్నే కాని మనసులో వేఱొక్క తెఱవఁ దలంచ భూదేవియాన
అతివ నిన్నే కాని యాసతో వేఱొక్క వనితఁ గోరను నభోవాణియాన
సుదతి నిన్నే కాని చూడను వేఱొక్క పడఁతిని భారతీభర్తయాన
పొలఁతి నిన్నే కాని పూనిక వేఱొక్క కలికి నెంచను రమాకాంతయాన
గీ. అబల శివునాన నేఁ గోర నన్యసతుల నొప్పికొను మింక నితర మే నొక్క టెఱుఁగ
భావమందైనఁ దప్ప నీపదములాన-తాళ॥ 48

సీ. నీవంటి జవరాలి నేఁ గోరినందుకు ఫల మేమి గంటినే పద్మగంధి
నిన్ను నే బతిమాలి యెన్ని యున్నందుల కేవాసి వచ్చెనే యెమ్మెలాఁడి
వనిత నీస్నేహంబు వలచియున్నందుల కేరాజ్య మేలితి నిగురుఁబోణి
పడఁతి నిన్నెద నమ్మి పరఁగినందులకు నే నేసుఖం బందితి నిందువదన
గీ. వట్టినేరంబు లెన్నెదు వట్టిప్రియము వట్టిమాటల సర్వదా వాంఛ దీర
దిట్టవేదన లందుచు నిచట నున్నఁ-దాళ॥ 49

సీ. సుజనాగ్నిఁ బడియు నీ మనసియ్యవైతివి కలికి నీమది నెంత గట్టితనమొ
శరణంచు మ్రొక్కియుఁ గరుణించవైతివి కోమలి నీ కెంత గుంఫితంబొ
జాలిఁ గొన్నప్పుడు పాలించవైతివి వనిత నీ కెంత కువాదమొక్కొ
వద్దికి రమ్మని ప్రార్థింపవైతివి రామ నీకెంత చక్రాయితనమొ
గీ. పలుకు లమృతంబు నొలుకు నంగిలి విషంబు ననెడులోకోక్తి నిజమయ్యెనఁట నెయ్యుడు
కలికి కారాని కలగని కలియకున్నఁ-దాళ॥ 50

లావణ్యశతకము నుండి

సీ. తొలకరి మెఱపు నా వెలలేనిజీవరత్నము జున్నుగడ్డ చిత్తరువు మేటి
రామచిల్క యొయారి రాయంచ కండచక్కెరరాశి మేల్మిబంగరుసలాక
మగనమంజరి తియ్య మామిడిపండు కుంకుమపువ్వుబొమ్మ కులుకులకొటారు
కట్టాణిముత్తెము కస్తూరి వీణ ముద్దులగని సింగారములబిడారు
గీ. నెనరుమాటలతీవి పన్నీటివాటి కన్నెలేడి మిటారి యంగజునిచొక్క-
మందుపొడిడబ్బి జాణ నిన్మదిఁ దలంప వశమె శ్రీరామరామ లావణ్యసీమ॥ 51

సీ. మనసెఱుఁగఁగరాదు మాటనిల్కడ లేదు వావివర్తన నహి వలపు సున్న
కనువిచ్చి చూడరు చనవిచ్చి కూడరు నేస్తంబు పూజ్యంబు నెనరు నాస్తి
మర్యాద లెంచరు మన్ననఁ గాంచరు గుణము చక్కన గలుగుటయుఁ గల్ల
కపటంబు మానరు కడువేడ్కఁ బూనరు సత్యమాటలపట్టు జాలిమట్టు
గీ. సాహసము మెండు మనమునఁ జలమునిండు అంగిట విసంబు నాలుకయందుఁ జెయ్యఁ
దనముగదె చేడియల మంచితనము నమ్మ-వశమె॥ 52

సీ. కాలమృత్యువునైనఁ గడకు ద్రోయఁగవచ్చు పురవైరితోనైనఁ బోరవచ్చు
గరళంబు మెక్కి నిగ్రహశక్తి గనవచ్చు నలజవానలము చే నంటవచ్చు
మినుకాడు త్రాఁచుల మెడలఁ ద్రాళ్లిడవచ్చు కాలాంతకునియాజ్ఞ గడవవచ్చు
తనువు గోయఁగ మదిఁ దాళియుండఁగవచ్చు పైమాట లోకలకు పలుకవచ్చు
గీ. అబ్జభవునకు నైన నయ్యారఁడువారి వలపుగొలిపెడి బెళుకుఁజూపులకు వేఁడి
తూపులకు శాంతచిత్తంబుతో సహింప-వశమె॥ 53

సీ వనజాస్య నీదు పావడనైనఁ గానైతి నరసి నీయొడలిపై నొరయుచుందు
శుకవాణి నీదు కంచుకమైనఁ గానైతి వక్షస్థలముపై నివాస ముందు
రమణి నీనత్తుముత్తెము నైనఁ గానైతి ననుదినంబును మోవి నానుచుందు
మదిరాక్షి నీదుపయ్యెద నైనఁ గానైతిఁ గడువేడ్క మేనెల్లఁ గప్పియుందు
గీ. పాతకుం డగుధాత యీ పగిదిఁ బురుష జన్మ మెత్తించె వ్యర్థపుఁజలముఁ బూని
వసుధ నిటువలెనే మగవారి కెన్న-వశమె॥ 54

సీ. తలిదండ్రులైనఁ దూపుల నేయఁజొచ్చె నా మరుఁడు న న్నేరీతిఁ గరుణఁ జూచు
గురుకాంత చెలిమిని గోరిన పాపుండు జాబిల్లి మోములు దోసము దలంచు
పాములు ప్రమింగినప్పటికైనఁ జావని చలువతెమ్మెర కెట్లు జాలి పుట్టు
చిగురాకు దిని కండపొగరెక్కినది గండు కోయిల రొద యేల సేయకుండు
గీ. పరులజోలికిఁ బోని పుష్పములఁ బొడిచి రసము గ్రోలెడి తేఁటి యీరసము నేల
విడుచు నీపయిమరులుతో వ్రేఁగి బ్రదుక వశమె॥ 55

సీ. తరుణి కెక్కడ దృష్టి తాఁకునోయని దాని సొగసు కన్నులనిండఁ జూడ వెఱతు
మిసిమైన నునుమేను కసుగందునని చేతు లెత్తి బిగియఁ గౌఁగిలింప వెఱతు
గోళ్ల తాఁకులను జెక్కిళ్లువాడు నటంచు గట్టిగఁ జేతుల ముట్ట వెఱతు
జిలజిల నమృతంబు చిలుకఁగా దాని చక్కెరమోవి మునిపంటఁ గొఱుక వెఱతు
గీ. గోల భయమందు నిఁక దాళఁజాల ననుచు హాయి గలిగించుకోర్కుల నడఁచుకొందు
దానిసుగుణంబు రూప మింతని వచింప వశమె॥ 56

సీ. చాన నీకెమ్మోవి యానినయది మొదల్ విడియమ్ము నోటికి వెగటు దోఁచు
లేమ నే నినుఁ గౌఁగిలించినయది మొదల్ కసి దీఱదయ్యె నా కరములకును
అతివ నీతో మాట లాడినయది మొదల్ విననొల్ల వేఱొక వనిత పలుకు
చెలియ నీతోఁ బొందు చేసినయది మొదల్ కఱవయ్యె నిదుర నా కన్నులకును
గీ. ప్రేమ నెటు దాఁతు మదికి మం దేమి సేతు నెప్పుడు నినుఁ జూతు నింక నే నెటులు సైతు
బిరుదు నిఁక దీతు మరుని పెన్ బీతు నణఁప వశ॥ 57

సీ. అతివ నే నొకసారి యానిన నీదువా తెఱ తేనె లేమైనఁ దఱఁగి పోనె
తరుణి నే నిసుమంత తాఁకిన నీదు చెక్కిళ్ల నంతటితోనె గీటువడునె
అలుక లేమిటి కని యడిగినఁ బల్కవు పలుకుల యమృతంబు లొలికిపోనె
కడుఁ బ్రేమ నొక్కింత కౌఁగిటఁ జేర్చినఁ గలికి నీ తను వేమి కందిపోనె
గీ. చాన నినుఁ గూర్చువానిపైఁ జలముఁ బూన నాయమా ననవిల్తు బన్నంబె మాన్ప
యింక నైనను ననుఁ బ్రోవవేని బ్రదుక వశమె శ్రీరామరామ లావణ్యసీమ॥ 58

సీ. ఏలనే యింత జాగేలనే తమి నిల్ప జాలనే కరుణ న న్నేలికొనవె
మానవే చల మెంతదానవే కెమ్మోవి నానవే కౌఁగిట నలముకొనవె
నేరమా పల్క బంగారమా నాచోటఁ గ్రూరమా మదిఁ గూర్మి గూర్ప వఁటవె
ఎంచవే కృపను బాలించవే చాల మన్నించవే పగలు చాలించి యిపుడు
గీ. చెఱకుసింగిణిదొరబారిఁ గరము డస్సి వెఱపుతో నిట్లు తానయ్యె వేఁడుకొనినఁ
దెలియవైతివి మనసులో దిగులు దలఁప వశ॥ 59

సీ. మొనపంటఁ గసిదీఱఁగను జుఱుక్కున నొక్కి నొచ్చెనో యనుచుఁ దా నొచ్చికొనును
కిలకిల నవ్వి చెక్కిలి గీఁటి నాసామి కందెనా యని హృది గదియఁ జేయు

ప్రౌఢాయె లెమ్మని గద్దించి పల్కుచుఁ గడుఁ బ్రేమ మెఱయంగఁ గౌఁగిలించు
చాల సొక్కితి వని చయ్యనఁ దనపైఁట చెఱఁగెత్తి నెమ్మోము చెమట లొత్తు
గీ. వెదకిచూచిన నీ పృథివీతలమున నిట్టి నెఱజాణ గలదె యెందేని దాని
వగలు దలఁచిన మనసులో వలపు నిల్పు-వశమె॥ 60

సీ. లేమలపై మితి లేని ప్రాఁతి గన నపకీర్తి దీనత్వ మగడు దిగులు
పసువుతక్కువ మోక్షపదవికిఁ దొలఁగుట నైష్ఠికహీనంబు నవ్వుఁ బాటు
చుట్టపక్కంబులు చులకఁజూచుట గాని విబుధాళి విన్న భవిష్యహాని
మానంబు విడి యవమానంబు నొందుట ధనము గోల్పోవుట తనువు చెడుట
గీ. ఇవియ ఫలములు వసుధపై నేరికైనఁ దగనివల పది కారాదు తరుణి నీదు
కృపను గాంచక మన్మథచపల మడఁప-వశమె॥ 61

తాడిమళ్ల రాజగోపాల శతకమునుండి

సీ. పసులకాపరి యైన పద్మనాభుని కేను బడఁతి నెయ్యుల నైతి బాల్యమునను
ఉట్టిఁ బెట్టిన వెన్న గుట్టుగా మెక్కిన చోరుని కేల నేను సతి నైతి
గడెగడెకును వేసగాఁ డంచుఁ దెలియక వెఱ్ఱిగొల్లని కేల వెలఁది నైతి
అవతారమూర్తి యం చాసనొందితిఁ గాని దైత్యసంహారుఁ డంచుఁ దలఁపనైతి
గీ. అతివ యీవేళ రుక్మిణీపతిని గాంచి విసిగియున్నది రమ్మని వేగిరంబ
తరుణి నీ వేగి యిచటికిఁ దాడిమళ్ల రాజగోపాలుఁ దేఁగదే రాజవదన॥ 62

సీ. సఖియరో యాతని సంప్రదాయంబెల్ల వినవె చెప్పెద నీకు విశదముగను
తనతల్లి గుణములు తర్కించి చూడఁగ పుత్రులఁ గని చంపు పుణ్యశాలి
తనయక్క గుణములు తరమటే యెంచఁగ నైదుగురికి రాణి యైన గరిత
తనయన్న గుణములు తానె యెఱుంగును దున్నుక బ్రతికెడి దుక్కిముచ్చు
గీ. ఇంత బహిరంగ మాతని యింటిగుట్టు కడకుఁ దన కెట్లు సుగుణంబు కలుగునమ్మ

సీ. చెంగల్వకొలనులో శృంగారముగ జలక్రీడ చేడియలతో నాడువాని
సిగ్గులేకను వారిచీర లన్నియుఁ గొని తక్కక పొన్నమా నెక్కువాని
ఎక్కడి చోరకుం డెత్తుక పోయెనో యంచు వ్రేతల నలయించువాని
కొలనులో సిగ్గుచేఁ గొంకెడు వనితల వలువ లిచ్చెద నని వచ్చువాని
గీ. బైటరం డిత్తునని వారి భ్రమలఁ బెట్టి హస్తములు రెండు నెత్తుఁ డంచనెడువానిద॥

సీ. బాణజాలంబులపాలు సేయఁగనేల కాముఁడా నీ రూపు కాలిపోను
చెవులు చీఁదఱగొనఁ జెలఁగి కూయఁగనేల కోకిల నీయిల్లు కూలిపోను
ప్రళయాగ్నిరూప మై పట్టుగా విసరెదు పవనుఁడా నినుఁ ద్రాచుపాము మ్రింగ
వెన్నెల గురియించి వేఁడి సూపఁగ నేల చంద్రుఁడా నీరూపు సమసిపోను
గీ. వలచి వలపించి నాప్రాణవల్లభుండు రాఁడనుచు వీరలందఱు గూడికొనిరి-తరుణి॥65

మల్లికార్జున శతకమునుండి.

సీ. ఎక్క గుఱ్ఱము గద్దె యెద్దు నెక్కెడుగాని యుండుట కిలుగద్దె యొలికిగాని
కట్ట వస్త్రము గద్దె గజచర్మమే గాని పోసఁగఁ గంచము గద్దె ఘట్టె గాని
పెట్ట సొమ్ములు గద్దె పెనుఁబాములే గాని పూయ గంధము గద్దె బూది గాని
పలుకో భువి గద్దె యీశాన్యమే గాని పంచుకో గరి గద్దె కొండె గాని
గీ. జోగివాఁ డౌట తెలియక సుందరాంగి మరులుకొంటివి వినుమమ్మ మందయాన
వనిత నీ వేఁగి శ్రీశైలవాసుఁ డైన మల్లికార్జునుఁ డేఁగదే మధురవాణి॥ 67

సీ. తిరిపెమెత్తుక భువిఁ దిరిగెడువానికి నీ రేడులోకను లేలఁగలిగె
గజచర్మమును మేనఁ గప్పెడువానికిఁ జిలుత బెబ్బులివన్నె చేల గలిగె
పెనుఁబాఁప సొమ్ములు పెట్టెడువానికి నయమైన మణిభూషణములు గలిగె
కొండపైఁ బవళించి యుండెడువానికి మేలైన బంగారు మేడ గలిగె
గీ. కుడువఁ గంచము దివ్యమా కూడుఁ గలిగె కలికిననుఁ బెండ్లియాడంగఁ గులము గలిగె॥

సీ. రమణి నీవక్షస్థలముఁ గాంచి పూచెండ్లు పోఁడిమి చెడి చాల వాడఁబాఱె
తొయ్యలి నీమోముతో సాటిరాలేక కళ చెడి యున్నాఁడు కమలవైరి
వనిత నీమోవితో వైరంబుఁ జేకొని దొండపం డూరక దునిసి పడియె
ఉవిద నీచెక్కుల యుపమాన మొందక మెఱుఁగుటద్దము చాల మించు దప్పె
గీ. అనుచు నీరీతిఁ జతురోక్తు లాడి యాడి యెచటి కేఁగెనో వాఁ డిప్పు డేమి సేతు వనిత॥

సీ. పుట్టుపూర్వము శివు గుట్టెఱుఁగుద మన్నఁ దలిదండ్రు లెవ్వరో తెలియరాదు
కులగోత్రములు రెండు గుఱు తెఱుంగుద మన్న నేజాతివాఁడో రూపింపరాదు
ఎందెందుఁ గలఁడో నే నందు రోయుద మన్న నం దిందుఁ గలఁడు లేఁ డనఁగరాదు
గట్టిగఁ జెంగునఁ గట్టివేయుద మన్న బట్టుగా నెవరికిఁ బట్టరాదు
గీ. ఇంతవాఁ డని మదిని నుతింపరాదు అతనిరూ పెన్న నజునికి నలవి గాదు వనిత॥ 69

చెంగల్వరాయ శతకమునుండి

సీ. రమ్మురమ్మని పిల్చు రాకున్న మనవి చేకొమ్మని నను వేఁడు గొంత సేపు
వేఁడుకొన్నదిగాక వెంబడించుక వచ్చి గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుఁ గొంత సేపు
చేర్చుకొన్నదిగాక చెక్కుటద్దంబులు కొసరి ముద్దులు వెట్టుఁ గొంత సేపు
ముద్దువెట్టుటగాక పోసఁగఁ గస్తూరిగంధమును బూయు నురమునఁ గొంత సేపు
గీ. పూసి మచ్చిక మీఱంగ బుజ్జగించి వింతగా మోదమునుఁ గొల్పుఁ గొంత సేపు
రామ నీ వలచెంగల్వరాయ నిటకుఁ దోడుకొని వేగ రాఁగదే తోయజాక్షి॥ 70

సీ. తుంటవిల్లొక్కటి దొరకెఁగా నీచేత మేటివి ల్లొరకిన మిట్టిపడవె
విరిబాణ మొక్కటి దొరకెఁగా నీచేత దొడ్డశరం బైనఁ ద్రుళ్లిపడవె

తుమ్మెదబలములు దొరకెఁగా నీచేత మేల్బంటులే యైన మిడిసిపడవె
తురగ మొక్కటి చిక్క దొరకెఁగా నీచేత మంచిగుఱ్ఱంబైన మండిపడవె
గీ. రూపహీనుండ వైతివి రూప మున్న బ్రతుకనిత్తువె యువతులఁ బంచబాణ
రామ నీ వలచెంగల్వరాయ నిటకుఁ దోడుకొని వేగ రాఁగదే తోయజాక్షి॥ 71

సీ. పాలు నీరును బోలి పడఁతి నాపతి నేను గూడియుంటిమిగదె కూర్మి గలిగి
కన్ను ఱెప్పయుఁ బోలి కాంతుఁడు నేనును గలసియుంటిమిగదె కాంక్ష మీఱ
పువ్వుఁ దావియుఁ బోలి పురుషుండు నేనును నెనసియుంటిమిగదె యింపు దనర
నూనె నువ్వులుఁ బోలి నా నాయకుఁడు నేను పొందియుంటిమిగదె పొలుపు మెఱయ
గీ. నేఁటి కతఁ డెవ్వడో నాకు నేను నెవతె నతని కగుదునో యేమందు నజునిమాయ-రా॥

సీ. తల ముట్టి యెన్ని బాసలు చేసినంగాని అమ్మమ్మ పురుషుల నమ్మరాదు
అక్కఱకొద్ది మాటాడి పోదురె కాని అమ్మమ్మ పురుషుల నమ్మరాదు
నయగారివగల నానలు వెట్టుదురె కాని అమ్మమ్మ పురుషుల నమ్మరాదు
వట్టిదురాశలు పెట్టి పోదురెగాని అమ్మమ్మ పురుషుల నమ్మరాదు
గీ. నూతనప్రియులే వారి రీతు లెల్ల బుద్బుదంబులు వివరింప బూటకములు-రామ॥73

సీ. ఏలనే యీమోడి యెమ్మెలాఁడిరో నీకుఁ జాలునే కోపంబు చంచలాక్షి
వాదటే నాతోడ వద్దఁటే స్నేహంబు కద్దటే మును పింత కల్లతనము
పద్దఁటే పిలిచినఁ బలుకకుండెద వేమి యౌనఁటే యిటువంటి కానితనము
చలమఁటే యిది నిన్ను వలచిన ఫలమఁటే మేలఁటే నీకును మిణుకులాఁడి
గీ. చాలుఁజాలును వగ లింక జాల మేమె తొలుతఁ జేసిన బాసలు తెలియరావె
ఇంతలో నింత విడనాడ నెంతవింత చతుర విటరాజమోహనా చంద్రవదన॥ 74

సీ. అన్యాయకారి నీయానవాలే యెంచి నలుగురిలోఁ జాల పలుచ నైతి
మటుమాయదారి నీమాటలు నిజమని పగవారిలోపల వెగటుగొంటి
క్రూరాత్మురాల నీకూటమి సత మని యెంచినందుకుఁ జాల కొంచెపడితి
వంచకురాల నీవాసి యెఱుంగక భ్రమచెంది యిన్నాళ్లు భ్రష్టు నైతి
గీ. తెలిసెఁ దెలిసెను నీవగ తేటపడఁగ ఇంతమాయలు గలదాన వీవఁ టంచు
తోఁచదాయెను వగలాఁడి దోసకారి-చతుర॥ 75

## నాయక నాయకీ శతకమునుండి

ఉ. మారుఁడు క్రూరుఁడయ్యె నలమందసమీరుఁడు ఘోరుఁడయ్యెఁ గ
ర్పూరము వీరమయ్యె నలరున్ శుకవారము వైరమయ్యెఁ గం
జారి మదారియయ్యె నిఁక నైన ననుం గరుణించి నాపయిం
గూరిమి మీఱఁ గౌఁగిటను గొబ్బునఁ జేర్పఁగ రార నాయకా॥ 76

చ. వలచితి నిన్ను నేఁ జిఱుతపాయమునాఁడె మనంబులోపలం
దలఁచితి నన్నుఁ దేల్పఁగల దైవముగాఁ దమిగారవంబునం
గొలిచితి రేఁబవళ్లు మదిఁగొంకక నీవిడునట్టియాజ్ఞలో
నిలిచితి నిట్టి నన్నెడయ నీకు హితంబఁటరోరి నాయకా॥ 77

ఉ. నమ్మినదానరా నిను మనమ్ముననిమ్మున నీకునాదు మే
నమ్మినదానరా నను నయమ్మున నొమ్మున నేలకుండినం
గమ్మనివింటిజోదు బలగమ్ములతోఁ దనపూవుటమ్ము పా
ల్గమ్మని కంటగించునలగాసికి నే నెటు లోర్తు నాయకా॥ 78

చం. ఇల మగవారిమాట మదినెంతయు నమ్మఁగ నీటిమూటగాఁ
బలుకుట నిక్కమయ్యెను సుబద్ధములన్నవి సున్నయయ్యె నీ
వలన నిఁ కేమిసేతుఁ జెలువం బటువీస్థలిఁ గాయునట్టి వె
న్నెలయయి యున్నదోసఖుఁడ నెమ్మిననుం గరుణించు నాయకా॥ 79

చం. కడఁకను స్వాతివర్షకణకాంతు వహించిన శుక్తిరీతి నె
క్కుడురతి నాఘనోదయము గోరుమ యూరికభాతి నిచ్చ నె
న్నఁడుఁ గుముదప్రియాగమమునర్మిలిఁ గోరుచకోరమట్లు ని
ల్కడభవదాగమంబునకుఁ గాచితిరా విటరాయ నాయకా॥ 80

చం. మనవి వినంగ రాదఁటర మాటికి వేఁడిన నీమనమ్ములోఁ
గనికర మింతలేదఁటర కాయజసాయక పీడితాత్మనై
తి ననఁగ నీకు వాదఁటర తియ్యని నా నునుమోవి యాన ర
మ్మని పిలువంగఁ జేఁదటర హా రసికాగ్రణిచంద్ర నాయకా॥ 81

చం. పొలఁతికి నొక్కరీతి మదిఁ బూసలలోపలిదారముంబలెన్
మెలఁగు విభుండు గల్గుట సుమీ తొలినోముఫలంబు భాగ్యముం
దలకొని యున్నవారలకుఁ దక్కవలేటికిఁ గల్గు నావలెన్
గలుచఁదనంబు గంటి నిను భావమునన్ నెఱనమ్మి నాయకా॥ 82

చం. పొలుపగుపండుటాకు లుడివోని కడానిపసిండి పూఁతపోఁ
కలును లవంగముల్ వలపు గప్పెడు కప్రపుపల్కులేలకుల్
చలువమిరెంపుగింజలుఁ బసం జెలువొందఁగఁ బైఁడితట్టలన్
వెలయఁగ నించితిన్ గదర వీడె మొనర్తమురార నాయకా॥ 83

చం. కటకట వెన్నవంటిమది గ్రన్నన ఱాయిగఁ జేసికొంటి వి
క్కటికితనమ్ము నాకయి తగం దలకొంటివి నేరమున్న నొ
క్కట ననుఁబట్టి నీజడనుగట్టి ఫెళేలని చెంపగొట్టి పు
క్కిటివిడె మిచ్చి కౌఁగిట బిగించి సుశిక్షితుఁ జేయవే సఖి॥ 84

ఉ. పంకజగంధి నీ పెదవి పానక మానక తాళఁజాల నీ
మంకుతనమ్ము నెమ్మదిని మానక యుండుట నీతిగాదు నీ
వింక రయంబుతో ద్రుత మదీప్సితముం గొనసాగఁ జేసి నీ
కింకరుఁడైన నాపయిని గిన్క వహింపక యేలవే సఖీ॥ 85

చం. కపట మొకింత యేని మదిఁ గల్గదు నీకని నమ్మియుంటినా
కిపుడెఱుఁగంగవచ్చె నిఁక నేటికి మాటలు చాలుఁజాలు నీ
కృప బలమయ్యె నావలపు గెలియొనర్చితి వెట్టులైన నీ
వపరిమితంబులైన సిరు లంది సుఖింపఁగఁ గోరుదున్ సఖీ॥ 86

ఉ. సమ్మతిమీఱి నీ చెలిమి శాశ్వతమంచు మనమ్ములోపలన్
నమ్మితి మున్ను నమ్మ నెలనాగలపైఁ గల కూర్ములెల్లఁ బో
జిమ్మితి నిన్ను నెప్పుడెదఁజేర్చితి నిట్టి ననుం దుటారివై
కమ్మనివింటివాఁడిడెడు గాసికిఁ బాల్పడఁ జేసితే సఖీ॥ 87

ఉ. నవ్వులకాడుమాటల మనమ్మునఁ గిన్కవహించి యూరకే
అవ్వలఁబెట్టఁ జూడకు తిరమ్ముగ నా మొఱలాలకింపవే
చివ్వకుఁగాలుద్రవ్వకువె చేసినతప్పు క్షమింపరాఁదటే
పువ్విలుకానిబారిననుఁ బొక్కఁగఁ జేయుట నాయమే సఖీ॥ 88

ఉ. కంటకవృత్తిఁ దుంటవిలుకాఁడు బలంబులు వెంటనంటఁ బూ
వింటశరంబులూని వెనువెంట ననుం దఱుమంగఁజొచ్చె వా
ల్గంటిరొ యొంటిఁ జిక్కితిని గావవె జంటవహించియున్న న
న్నంటగరాకటంచు మొగ మావలఁద్రిప్పెద వేటికే సఖీ॥ 89

ఉ. అంటిన మేను గందునఁటె యాసపాసంగఁగ మోవిముద్దు నేఁ
గొంటనె తేనె చిందునఁటె కోరికలూరఁగ నీముఖాబ్జముం
గంటనె దృష్టియొందునఁటె గారడమున్ పచరించి సాకెకుం
గొంటుతనంబున న్మరునికోలలఁ దార్పకు తాళనే సఖీ॥ 90

ఉ. నాపలు కాదరింపవు ఘనంబుగఁ బ్రేమము నింప వెంతయుం
గోపము డింప విచ్చఁ గలకోర్కి వచింపవు నాదుచిత్త సం
తాప మడంపవాత్మ ననుతాపముఁబెంపవు వేఁడవేఁడ రా
రాపులుచేసె దింత పొగరానగరా పగరాలవా సఖీ॥ 91

## భర్తృహరి శృంగారశతకమునుండి

గీ. పడఁతి యొక్కదాని విడిచి యించుక యమృతంబులేదు భువి విషంబులేదు
అమృతలతను బోలు ననురాగవతి యైనఁ గాక మెలఁగెనేని గరళవల్లి. 92

గీ. ఒకనితోఁ గూడి భాషింతు రొక్కనరుని జూతురు విలాససంపద సొంపు గులుక
మఱియునొక్కనిఁ దలఁతురు మనసులోనఁ గూర్మిప్రియుఁడెవ్వఁడో ముద్దుగుమ్మలకును.

చ. చెలువపుఁదేట లేనగవుచేతను భావముచేత సిగ్గుచే
నలువగు లీలచేత సుగుణంబులచేఁ గడగంటిచూపుచేఁ
గలహముచేత విందులగు కందువమాటలచే నసూయచేఁ
గెలుచున నెంతవారి వలపింతురు కాంతలు పెక్కుభంగులన్॥ 93

ఉ. తమ్ముల నేలు కన్నులు సుధానిధిఁ బోలు మొగంబు మత్తభృం
గమ్ములఁ గెల్చుకొప్పు కనకద్యుతిమీఱు మెఱుంగు కుంభికుం
భమ్ముల నవ్వువక్షము సెబా సని మెచ్చుకొనంగఁ దేనియల్
చిమ్మెడు ముద్దుఁబల్కులును జేయనిసొమ్ములు సుందరాంగికిన్॥ 95

చ. అతివలఁ జూచి వీ రబల లంచు వచించు మహాకవీంద్రులు
ధ్రుతవిపరీతవాదు లిది దబ్బఱగాదు విలాసినీసమం
చితతరలాక్షిపాతములచే గెలువంబడి రింద్రముఖ్యులున్
ధృతి నటువంటివా రబల లేగతి నైరి తలంచి చూడఁగన్॥ 96

చ. ఉరగము ముట్టినా నరుల కుర్విని వైద్యులు ధర్మశీలురై
గరళము నెక్కుడింతు రధికంబుగ నాయతమేచకోత్పల
స్ఫురణ వహించి వక్రగతిఁ బూనిన మానిని చూపు సోఁకినం
బురుషున కెందు మందు లనువొంపవు పొందరు వైద్యు లెవ్వరున్॥ 97

చ. వనదళవాతము ల్మెసవువారు పరాశర కౌశికాదు లా
ఘనులును సుందరీజనులఁ గన్గొని మోహితచిత్తులైరి హె
చ్చిన ఘృతపాయసాన్నము భుజించెడివారలకున్ మనోజయం
బు సెగడునేని వింధ్యము సముద్రజలంబులఁ దేలియాడదే॥ 98

గీ. పెక్కుదవియ లున్న జక్కవచెలి యున్న రిక్కరాయఁ డున్నఁ జుక్క లున్నఁ
జిన్నిలేడిచూపుచేడియ నెడఁబాయునప్పు డంధకార మయ్యె జగము. 99

గీ. తథ్యము వచింతుఁ బక్షపాతమునఁ గాదు నిఖిలజగములయం దిది నిక్కవంబు
తొయ్యలులకన్న రమ్యవస్తువులు లేవు వారలే కష్టముల కెల్ల గారణములు. 100



రాజమహేంద్రి : 1 వ పేజీ మొదలు 208 వ పేజీవరకు, రాజన్ ప్రెస్ నందున్ను
209 వ పేజీ మొదలు 348 వ పేజీవరకు
శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయడుగారి సరస్వతీ పవర్ ప్రెస్ నందును ముద్రింపఁబడియె.